# MADRAS GOVERNMENT ORIENTAL SERIES

Published Under the Authority
of the
Government of Madras

*General Editor*:
T. CHANDRASEKHARAN, M. A., L. T.,
*Curator, Government Oriental Manuscripts Library, Madras.*

No. L. Vol. IV

# శ్రీ రామాయణము

కట్టా వరదరాజ కృతము.

(యుద్ధకాండము)

TANJORE SARASWATI MAHAL SERIES No. 64.

# SRI RAMAYANAMU

BY

**KATTA VARADARAJU.**

**(YUDDHA KANDA)**

CRITICALLY EDITED WITH INTRODUCTION

BY

**Sri. N. VENKATA RAO, M.A.,**
*Senior Lecturer and Head of the Telugu Department*
*Madras University, Madras.*

---

Published by
Sri S. GOPALAN, B.A., B.L.,
Hony. Secretary for the Administrative Committee
**T. M. S. S. MAHAL LIBRARY, TANJORE.**

1953

**Price Rs. 7/8**

# PREFACE

—:o:—

This publication contains the "YUDDHAKANDA" of KATTA VARADARAJU'S DVIPADA RAMAYANAMU. This is issued in continuation of our prior publications of "BALA," "AYODHYA," "ARANYA," "KISHKINDHA" and "SUNDARA" Kandas. We hope this publication will receive the same appreciation from the public and the press as the prior ones did.

Our thanks are due to the Editor Sri N. Venkata Rao, Head of the Department of Telugu, University of Madras for his valuable services in editing the work and to Sri A. Mahadeva Sastri and Sri V. Sundara Sarma, Telugu Pandits of our Library, for carefully going through the original and preparing a correct copy for the editor.

We are grateful to the Government of Madras for their timely grants that have enabled us to publish this and other valuable manuscripts of this Library. We must thank also the Rathnam Press, Madras for the neatness and despatch with which they have executed the printing of this publication.

Saraswati Mahal, Library,
TANJORE.
11-6-1953.

S. GOPALAN,
*Honorary Secretary,*
**T. M. S. S. M. Library Committee.**

# EDITORIAL NOTE

The present work Yuddhakanda, which forms the fourth volume completes the publication of Ramayanam by Katta Varadaraju of the post-Krishnaraya period in Telugu. This publication is a land mark in the history of Dwipada Kavya Literature in general and Ramayana Literature in particular, and is unique in many respects. This work settles not only the disputed text of Ranganatharamayana published by the Andhara University, but also helps to restore some portions of the text of Tallapaka Annamacharya' a Dwipada Ramayana, which is now considered to be lost. It further gives a fresh impetus for the study of the influence of Vaishnavism, in Telugu and eventually the evolution of Ramayana Literature in Telugu.

My thanks are due to the Government of Madras, and the Telugu Expert Committee for having entrusted to me the heavy responsiblity of editing this voluminous work; to the Syndicate of the Madras University for having kindly permitted me to undertake its editorship. I have to specially thank Sri S. Gopalan, Honorary Secretary, T. M. S. S. M. Library for the very many facilities given to me, and for the assistance rendered by the Library Staff especially the Telugu Pandits in preparing the Press Copy. I must also thnak the Rathnam Press, Madras in this connection, for the excellent manner in which the publication is brought out.

Lastly, the Telugu Literary World is ever indebted to Sri B. Gopala Redddi Garu, the former Finance Minister of the Madras State and the present Pro-Chancellor of the Andhra University, for placing the necessary funds at the disposal of the Tanjore Library, and enabling them to complete the work, as otherwise it would have never seen the light of day in its present form. He evinced a keen interest in the work from the beginning to the end, and watched its progress throughout. I am always, and will ever be grateful to him for having inspired and encouraged me in editing and in bringing to light, this most outstanding work of Ramayana Literature in Telugu.

**N. VENKATA RAO**

*Head of the department of Telugu,*

*University of Madras.*

# పీఠిక

మదరాసు రాష్ట్రీయ ప్రభుత్వమువారి సమాదరణమున తంజావూరి సరస్వతీ మహాలు గ్రంథాలయమువారి పక్షమున ప్రకటిత మగుచున్న కట్టా వరదరాజు ద్విపద రామాయణము నందలి నాలుగవ సంపుటమగు యుద్ధకాండము నేటితో ముగిసినది. దీనితో నా గ్రంథముద్రణము సంపూర్తియైనది. ప్రభుత్వమువారు ప్రకటించిన ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము తెలుఁగు గ్రంథములలో గాని, తంజావూరి సరస్వతీ మహాలు తెలుఁగు గ్రంథములలో గాని దీనిని మించిన గ్రంథము లేదు. ఇది నాలుగు సంపుటములలో వెలువడినది.

| వాని వివరము. | పుటలు |
|---|---|
| మొదటి సంపుటము – బాల అయోధ్యా కాండములు | 687 |
| రెండవ సంపుటము – అరణ్య కిష్కింధా కాండములు | 535 |
| మూడవ సంపుటము – సుందర కాండము | 216 |
| నాలుగవ సంపుటము – యుద్ధకాండము | 544 |
| | 1982 |
| పీఠికాదులు | 128 |
| | 2110 |

సంస్కృత వాల్మీకి రామాయణమున నాఱుకాండలును, నేనూఱు సర్గలును నిరువది నాల్గువేల శ్లోకములు నున్నట్లు వరదరాజే బాలకాండ 32 పుటలో నిట్లు చెప్పియున్నాడు.

" కతలమీఱుచు నాఱుకాండముల్ గాఁగ
జతఁగూర్చి యేనూఱు సర్గముల్ గలుగ

............పదినాల్గు వేలు
సదమల గ్రంథవిస్తరమై యెసంగ
నొనరించి పైకథ లుత్తరకాండ
మునఁజెప్పె వాల్మీకిమునినాథుఁ డపుడు ''

770-776 పంక్తులు

ఇందుత్తరకాండమునకు తెనుగులేదు-తెనుఁగు భాషలో రామాయణ కథా రచన ప్రారంభమైన కాలమునుండి, ఉత్తర కాండము వేఱుగా రచిత మగుచుండెను. ఇరువది నాలుగు వేల శ్లోకములుగల మూలకథ, చతుర్వింశతి గాయత్రీ మహామంత్రవర్ణ సంపుటీకరణ మగుటయే యుత్తర కాండ వేఱుపడుటకు కారణ మని యూహింపవచ్చును. తక్కిన యుత్తర రామాయణ పద్య కృతియు, కాచవిభుడు, విఠలరాజుల ద్విపద యుత్తరకాండమును, పై యభిప్రాయమును బలపఱచుచున్నవి. కడచిన శతాబ్దిలో యథావాల్మీకములగు రామాయణ రచనలు ప్రారంభమైన నాఁటనుండియు నీ పథకము మాఱినది. శ్రీ గోపినాథము వెంకటకవిగారు షట్కాండలు మాత్రమే తెనిగించిరి. ఆ వెనుక శ్రీ వావిలికొలను సుబ్బరావు పంతులుగారును జనమంచి శేషాద్రిశర్మగారును నుత్తరకాండము గూడ నాంధ్రీకరించిరి. శ్రీపాదవారి శ్రీకృష్ణ రామాయణమున గూడ నుత్తరకాండము గలదు.

కేవలము గ్రంథసంఖ్య చేతనేకాక, సాహిత్యదృష్టితో పరిశీలించినచో ప్రభుత్వ ప్రకటితములైన గ్రంథములలో

నీ రామాయణము మిక్కిలి విశిష్టతగలది. ఇది దేశి సాహిత్యమున ప్రధానముగా విలసిల్లిన ద్విపద కవితా శాఖకుఁ జెందినది. దాక్షిణాత్య సాహిత్యములో తెనుగునకు గల ప్రత్యేకతను నిరూపించు రచనలలో ద్విపద యొకటి. పేరు సంస్కృతమైనను, సంస్కృతమున నీ రచన లేదు. ద్రవిడ కర్ణాట భాషలలో లేదు. కన్నడులకు త్రిపద, షట్పద, ప్రియమైన పదచ్ఛందస్సులు. తెనుఁగున నైసర్గికాముష్మిక ద్విపద హేతువుగ నీ ద్విపదను దిద్ది తీర్చిన మహాకవి పాల్కురికి సోమనాథుఁడు. గేయరూపమగు జానపద వాఙ్మయమునుండి, యీ ఛందస్సు నుద్ధరించి, దీనికి మహాకావ్య ప్రతిపత్తి గడించి ద్విపద వాఙ్మయమునకు శ్రీకారము చుట్టినవాఁడు సోమనాథుఁడే! ఆతఁడు రచించిన బసవపురాణ పండితారాధ్య చరిత్రములు ద్విపద వాఙ్మయములో ప్రాథమికములు. ఆ వెనుక రంగనాథ రామాయణము, ఉత్తర కాండమును వెలసినవి. మడికి సింగన భాగవత దశమస్కంధ ద్విపద, గౌరన ద్విపద రచనలు, పిడుపర్తి బసవన ద్విపద రచనలు శ్రీనాథ యుగమునాటివి. ఇందు చాలభాగము వీర శైవమునకుఁ జెందినవి. శ్రీకృష్ణదేవరాయ యుగములో వైష్ణవ మతములో ద్విపద వాఙ్మయమున ద్వితీయ ఘట్టము ప్రారంభమైనది. తాళ్లపాక చిన్నన్న, దోనూరి కోనేరు కవుల ద్విపద రచనలు ప్రకాశించిన కాలమిదియే. ఈ యుగమునకు వెనుక వెలసిన వైష్ణవ ప్రపత్తిగల ద్విపద కావ్యములలోను రామాయణ ద్విపదలలోను నొక ప్రత్యేక విశిష్టత గడించిన దీ వరదరాజు రామాయణము.

వరదరాజు రామాయణమున ద్విపదసంఖ్య లెక్కించిన వాఙ్మయమునందలి ద్విపద కావ్యములలో నిది యగ్రస్థానము వహించును. ద్విపదసంఖ్యా వివరణము.

| | | |
|---|---|---|
| 1. | బాలకాండము | 5846 |
| 2. | అయోధ్యాకాండము | 10738 |
| 3. | ఆరణ్యకాండము | 6518 |
| 4. | కిష్కింధాకాండము | 6248 |
| 5. | సుందరకాండము | 5380 |
| 6. | యుద్ధకాండము | 12410 |
| | | 47140 |

ద్విపద పంక్తులు. అనగా 23170 ద్విపదలు.

దీనినిబట్టి చూడగా వరదరాజకవి మూలమున నున్న 24 వేల శ్లోకములకు నించుమించు సరిగా ద్విపదలను రచించె నని చెప్ప నొప్పును.

రంగనాథ రామాయణము,

వరదరాజు రామాయణము.

వరదరాజు రామాయణ ముద్రణ ప్రారంభము నుండియు నా పీఠికలలో నాంధ్ర విశ్వకళా పరిషత్తువారు ప్రకటించిన రంగనాథ రామాయణమునందలి యనుబంధములలోని ద్విపదలకు వరదరాజు రామాయణమునగల సంవాదములను చూపుచునే యున్నాను, ఈ యుద్ధకాండమున కూడ నట్టివి గలవు. వరదరాజు రామాయణము యుద్ధకాండము 90 పుట.

"నవరత్న కటక మండన మండితంబు
వివిధోర్మికాయుణి విస్ఫుమరాభంబు

నుర్వీతనూజా మృదూపధానంబు
గర్వితాహిత భిదాకాల దండంబు
ఘోరప్రతాప కుంకుమ చర్చితంబు
సారంగమద లేప సంవాసితంబు
నిరత మహాదాన నిపుణ తారకము
ధరణీభరధురీణతా సమంచితము

(2035-2043 పంక్తులు)

రంగనాథ రామాయణము (అనుబంధము)

౧. యుద్ధకాండము 677 పుట.

" నవరత్నకటక మండన మండితంబు
వివిధోర్మికామణి విపుల రావంబు
నుర్వీతనూజా మృదూపధానంబు
గర్వితాహితభిదా కాలదండంబు
ఘోరప్రతాప కుంకుమ చర్చితంబు
సారంగ మదలేప సంవాసితంబు
నిరతమహాదాన నిపుణ తానకము
ధరణీభరణ ధుర్యతాసమంబగుచు

వరదరాజు.

తప్పించుకొనిపాఱె తమ విభీషణుఁడు
చుప్పనాతిని ముక్కు సురియచేఁ గోసి
నాపాపమునఁ బాఱెనపుడు నీమఱఁది
వాపోవుచును జాంబవంతుండు పలిచె

జివ్వఁజాలించి వచ్చిన త్రోవప్రజలు
నవ్వఁగఁ బరువెత్తె నలినాప్తసుతుఁడు.
ఊరక యంగదుం డూడని బాఱె
దారిఁదప్పినఁ బోయెఁ దారుఁడు దీసి
పోక సిల్చి సమీరపుత్రుండు వడియె
మోకాళ్లువిఱిగి రాముని బాయలేక
కుముదుఁడు తలతెగఁగొట్టినఁ బడియె
సమసె మైందుఁడు నీఁగి చనియె నలుండు
నీలుఁడు శరభుఁడు నిలిచిపోరాడి
వ్రాలిరి మేనులు వ్రయ్యలై భువిని
పనసుఁ డెఱింగి దబ్బఱవచ్చె ననుచుఁ
బనసచెట్టును బోలి బ్రమసితానిలిచె
నాలంబులోన గవాక్షుండుఁ గూలెఁ
చేలకయ్యముచేసి శతవలి మడిసె
నెత్తురుఁ గ్రక్కుచు నెగ్గ సుషేణుఁ
డుత్తరంబున ధూమ్రు డుదధి లోఁబడియె
చేయెత్తి మ్రొక్కఁ గూల్చిరి దధిముఖుని
మాయచేఁ గేసరిమై డాసిపోయె
సేతువు చూడవచ్చిన కపులెల్ల
భీతిచే నిల్లాండ్ర బిడ్డలఁ దలఁచి
ముగిసె కార్యంబని మొదలి కొంకులకుఁ
దగఁ దొట్టి పాఱిన దైత్యులు తఱుమ 2952-2971

రంగనాథ రామాయణము (అనుబంధము ౧. పుట 678)

ద్వి. ......వగచుచునుండఁ
దప్పించుకొని పాఱెఁ దా విభీషణుఁడు
చుప్పనాతికి ముక్కుసురియ చేఁ గోయు
నా పాపమునఁ బాఱెనపుడు నీమఱఁది

వాపోవుచును జాంబవంతుండు పఱచె
నూరక యంగదుం డూడంగఁ బాఱె
దారి తప్పఁ బోయెఁ దారుండు భీతి
నీలుఁడు శరభుండు నిలిచిపోరాడి
వ్రాలిరి మేనులు వ్రయ్యలై జగతిఁ
బోక నిల్చి సమీరపుత్రుండు వడియె
మోకాళ్ళు విఱిగి రామునిఁ బాయలేక
నెత్తురుఁ గ్రక్కుచు నేఁగె సుషేణుఁ
డుత్తరంబున ధూమ్రుఁ డుదధిలోఁ బడియె
చేయెత్తి మ్రొక్కఁ గూల్చిరి దధిముఖుని
మాయచేఁ గేసరి మై డాచిపోయె
కుముదుండు తలఁ దెగఁగొట్టినఁ బడియె
సమసె మైందుఁడు వీఁగి చనియె నలుండు
పనసుఁ డెఱింగి దబ్బఱవచ్చె ననుచుఁ
బనసచెట్టునుఁ బోలె బ్రమసి తానిలిచె
నాలంబులోపల నఖిలవీరులును
గూలుటయును జూచి కూడిన భీతిఁ
జివ్వఁ జాలించి వచ్చిన కపులెల్ల
నవ్వంగఁ బఱువెత్తె నలినాప్తసుతుఁడు
సేతువుఁ జూడవచ్చిన కపులెల్ల
భీతిచే నిల్లాండ్రఁ బిడ్డలఁ దలఁచి
ముగిసెఁ గార్యంబని మొదలి కొంకులకుఁ
దగఁగొట్టఁ బాఱిరి దైత్యులు దఱుమ

పగడరాజు.

హీరకిరీటంబు హేమాంబరంబు
గారుత్మతోత్పల గ్రైవేయకంబు
రత్నకుండలములు రాజీవరాగ
నూత్న మంజీర మనోహరాంఘ్రులును
మౌక్తిక తూలికల్ మాణిక్యకవచ
సక్తమైమించు విశాల వక్షంబు
మరకత కేయూర మంజుబాహువులు
నరుణపక్షంబు చంద్రాననాబ్జంబుఁ
గరుణావలోకముల్ కంబు కంధరము
నరుణపల్లవ కోమలాగ్రహస్తములు
దుందుభిస్వనము లత్తుక చాయమేను
మందరమేరు సమానగాత్రంబు
లలితోర్ధ్వపుండ్రలలాట పట్టికయు
సెలవులఁ దేఱెడు చిఱునవ్వుఁ గలిగి
భానుకోటిప్రభా భవ్య తేజమున
నానంద కరమూర్తి నవతరించితివి 4504-4520

రంగనాథ రామాయణము - (అనుబంధము ౧ పుట 679.)

ద్వి. భానుకోటిప్రభాభవ్య తేజమున
నానందకరమూర్తి యమరులు పొగడ
హీర కిరీటంబు హేమాంబరంబు
గారుత్మతోజ్జ్వలగ్రైవేయకంబు

రత్నకుండలములు రాజీవరాగ
నూత్న మంజీరమనోహరాంఘ్రులును
మౌక్తిక మాలికల్ మాణిక్యకవచ
సక్తమై మించు విశాలవక్షంబు
మరకత కేయూర మంజుబాహువులు
నరుణపక్షములు చంద్రాననాబ్జంబు
కరుణావలోకముల్ కంబుకంధరము
నరుణపల్లవ కోమలాగ్రహస్తములు
దుందుభిస్వనము లత్తుకచాయ మేను
మందరమేరు సమానగాత్రంబు
లలితోర్ధ్వపుండ్ర లలాటపట్టికయు
సెలవులఁ దేఱెడు చిఱునవ్వులొలుక

ఇంకను మఱికొన్ని గలవు - విస్తరభీతి నుదాహరింపనైతిని.

పై యుదాహృతులను పరిశీలించిన రంగనాథ రామాయణ ప్రతులలో వరదరాజు రామాయణమునందలి పంక్తులు యథామాతృకముగాఁ జేర్చబడినవని స్పష్టమగుచున్నది. కాబట్టి రంగనాథ రామాయణ పరిష్కర్తలనుబంధములలో చేర్చినవి కొన్ని వరదరాజు రామాయణమునందలి పంక్తులవలె, తాళ్ళపాక అన్నమయ్యగారి రామాయణమునందలి పంక్తులుకూడ చేరినవను నా నిశ్చితాభిప్రాయము నీవఱకే తెలిపియున్నాను. (చూడుఁడు సుందరకాండ పీఠిక పుట 17) ద్విపద రామాయణములు వరదరాజకృతికిముందు వెలసినవి రంగనాథ, అన్నమయ్యల రామాయణములే యైయున్నవి. వానిలో రెండు గ్రంథములనగా రంగనాథ వరదరాజ కృతులు పూర్తిగ మనకు లభ్య

మైనవి కావున మూఁడవ గ్రంథమగు నన్నమయ్య కృతి తాళపత్ర
గ్రంథముల నా మూలాగ్రముగ పరిశోధించిన మనకు లభింప
గలదని చెప్ప నొప్పును. వాఙ్మయ పరిశోధకు లట్టిపనికిఁ గడంగి
నచో నేటి రంగనాథ రామాయణమును గూర్చిన పెక్కు సమ
స్యలు, చిక్కులు విడిపోవుననియు గ్రంథము నిజస్వరూపము,
విశిష్టత తేటపడఁగలదని నాయొక్క దృఢమగు నమ్మకము.

ఈ యుద్ధకాండమందలి రచనకూడ తక్కిన కాండముల
యందువలె జాతివార్తా చమత్కార విలసితమై, సంస్కృ
తాంధ్రపద సమబంధురమై వెలయుచున్నది. రచనారీతి యాది
నుండి యంతమువఱకు నిమ్నోన్నతములుగా లేక నొకేరీతిని
కమ్మచ్చులోని తీగ విధమున సాగినది. రంగనాథ రామాయణ
మున కథా కథనమే ప్రధానముగనున్నది కాని వరదరాజు
రామాయణమున కథా కథనమేకాక కమనీయ కవితారచన
కూడ కలదు. రచనయందు రెండింటికిగల తారతమ్యమును
గ్రహించుటకు సమానమగునొక ఘట్టము నుదాహరించు
చున్నాను.

ఇంద్రజిత్తు ద్వితీయ యుద్ధము

ద్వి. ఆసమయంబున నాదానవుండు
భాసురంబుగఁ దనప్రభఁ గాననీక
ఠూదివినుఁడి దివ్యాస్త్రంబు లేయ
నాదానవుని దెస కగచరులెగసి
యగములు నైవంగ నవిద్రుంచి గుండె
ళగలించి పెకల్చండ్ర నవనిపైగూల్చి

వేగంబు ఱొక్కొక్క విషమబాణమున
నేగురఁ దొమ్మండ్ర నేడ్గుర నేసె
మఱియునుఁ గడిమిమై మర్కటేశ్వరులు
నరయంగ గిరిధరణీజంబులెత్తి
యా యింద్రజిత్తుపై నడరింప నతఁడు
సాయకంబుల వాని చతురుఁడై ద్రుంచి
పదునెనిమిది తీవ్రబాణంబు లేసె
మదమెల్లఁ జెడ గంధమాదనుఁ గడిమి
దీపింప నలుఁ దొమ్మిదిట రూపుమాపె
నేపారమైందుని నేడింట నొంచె
గదిసి పంచకమున గదుఁ బొలియించె
పదియింట భల్లూకపతి మేనుసించె
నూటను హనుమంతునొప్పించి మించె
మూట గవాక్షుని మొగిగాడ నేసె
శరభుని నేడింట శతబలిఁ బదిట
సరి నెన్మిదిట హరు, సన్నాహుమూట
నరుదుగా తక్కిన యఖిల యూథపుల
వరదివ్య శస్త్రాస్త్ర వర్షంబుగురిసి''

ఈ సందర్భమున వరదరాజెంత మనోహరముగా రచియించి యున్నాఁడో చూడుడు.

'అసురేంద్రసుతుఁడు బ్రహ్మాస్త్రప్రభావ
లసమాన తేజోవిలాసియై లాసి
నెఱయించు నొకచోట నీలమేఘములు
గురియించు నొకచోట ఘోరాస్త్రవృష్టి

మలయించు నొకచోట మంటలు పెంపెరలు
పొలయించు నొకచోట భుగభుగ బొగలు
వినుపించు నొకచోట విలునారి మ్రోఁత
కనిపించు నొకచోట కాంచన రథము
చెలఁగించు నొకచోట సింహనాదములు
నెలకొల్పు నొకచోట నేమికాధ్వనులు
నడరించు నొకచోట హయ హేషితములఁ
జడియించు నొకచోట శక్తులు వైచి
విసివించు నొకచోట విలు కేలఁబూని
నసమించు నొకచోట నాకృతిఁ జూపి
యీవేల నెలయించె నింద్రజిత్తుండు" (8009-8024)

ఇచట యింద్రజిత్తుయొక్క యస్త్రవిద్యా నైపుణ్యము చక్కగా ప్రదర్శితమైనది.

నేడు వరదరాజ రామాయణము పూర్తిగా లభ్యమగు చున్నది గాన, సాహిత్య విమర్శకాగ్రేసరులగు విద్వాంసులు, రంగనాథ రామాయణముతోడను, మూలముతోడను, దీనిని పఠించి విమర్శనముల వెలయింతురుగాత !

తక్కినకాండ లందువలెనే నిందును వరదరాజు రచనము మూలానుసరణముగనే యున్నది. నేఁడు భాస్కర రామాయణము, రంగనాథ రామాయణములలో గానవచ్చు కైకసి వృత్తాంతము. సులోచనా వృత్తాంతము, రామేశ్వరమున రామలింగప్రతిష్ఠ మున్నగునవి యీ రామాయణమునఁ గానరావు. వైష్ణవమతము వ్యాపించిన వెనుక రచితమగుట చేతనో,

వరదరాజు వైష్ణవప్రపత్తి గలవాఁడగుట చేతనో శ్రీరాముఁడు రామలింగ ప్రతిష్ట చేయుటకు మారుగా విభీషణునికి శ్రీరంగ శాయి నొసంగెనని యిట్లు చెప్పియున్నాడు.

"చాల చింతిలి విభీ - షణుఁడు పాదముల
వ్రాలి యోదేవ! నీ - వాఁడనై యిచట
నుండు నింతియెకాని - యొండెడకేఁగ
నెందుకు లంకనా - కేల? పోననిన
నెందుచే సీతనిఁ - దృప్తునిఁజేతు
నెందుల ననుబాయఁ - డితఁడని యెంచి
తనమారు తనకుల - ధనము పూర్వమున
మనపుత్రుఁ డిక్ష్వాకు - మనుజేశ్వరుండు
నిలిపిన మాపాలి - నిక్షేపమీావు
కొలువుము లంకకు - గొని పొమ్మటంచు
సజ్జతో శ్రీరంగ - శాయినొసంగ
నజ్జ చేసుక య - మ్మహాను భావుండు
గైకొని లంకకుఁ - గదలి పోవుటయు" 12302-12314

రంగనాథ రామాయణమున రామలింగేశ్వర ప్రతిష్ఠను గూర్చి చెప్పఁబడినదిగాని వైష్ణవమత ప్రతిపాదకమగు పైయంశము చెప్పఁబడలేదు. కావున రంగనాథ రామాయణము కేవల వైష్ణవభక్తిని ప్రకటించుటకు రచితమైనదని ఘంటా పథముగఁ జెప్పలేము. ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారు ప్రక టించిన రంగనాథ రామాయణమునందలి యనుబంధము రెండింటిలో రెండవదానియందు దీక్రింది పంక్తులు గలవు.

ద్వి. అంత విభీషణుఁ డారాముఁజూచి
యెంతయు భక్తితో నిలఁ జాగిమ్రొక్కి

దేవ! యిచ్చటనె మీదివ్య శ్రీపాద
సేవఁ జేయుచునుందుఁ జనఁగ నేనొల్ల
మనుజేశ నామది మఱినిల్వదచట
యనవుడు రఘురాముఁ డతని కిట్లనియె
'ఆరయ మాస్వామి యగుచున్నయట్టి
శ్రీరంగధాము నిచ్చెద నీవుగొమ్ము
పోయి నీవందు నెప్పుడు పూజసేయు
మాయందు భక్తియు మఱువకు మెపుడు
ననుచు శ్రీరంగనాయకు నిచ్చె వేడ్క
ననలొత్త శ్రీరంగనాయకుఁ గొనుచు
జనియె లంకకు.........

842 పుట

పైవానిని పరిశీలింపగా శైవులు శివప్రతిష్ఠ * రాముఁడు చేసెనని చెప్పగా వైష్ణవులు శ్రీరంగనాథుని ప్రతిష్ఠించెనని మూలరామాయణమున నీఘట్టమును ప్రక్షిప్తముచేసిరా యను సందేహము కలుగు చున్నది. ఇందుచేతనే శ్రీరంగ మహాత్మ్యము న రామాయణ కథ ప్రసక్తమగుచున్నది. సంస్కృత రామాయణమునకు గోవిందరాజుల వారు వ్రాసిన విశిష్టాద్వైత పర మగు వ్యాఖ్యగూడ నీని రచనకు దోహదమునొసంగి యుండ వచ్చును.

---

* శివలింగ ప్రతిష్ఠ చేయుటవలన శ్రీరాములవారికి రావణుని చంపినందువలన గల్గిన బ్రహ్మహత్యా దోషము నివారణ మైనదని శైవగ్రంథములు వాకొను చున్నవి. 'అత్రపూర్వం మహాదేవ ప్రతిష్ఠామకరోద్విభుః 'అను వాల్మీకి రచనమే దీనికి మూలము.

వరదరాజురామాయణమున కొన్నిపట్టుల వాల్మీకము నందు లేని కథలుకూడ నున్నవి. అందొకటి. ఇంద్రజిత్తు నాగ పాశములచే బంధించినపుడు నారదుఁ డేతెంచి రాముని స్తుతి యించి నీ వాహనమైన గరుడుని స్మరించినయెడల నాతఁడిచటికి చనుదెంచిన మాత్రన నాగాస్త్రబంధము తొలఁగునని యుపదే శించి నట్లీ రామాయణమున నున్నది. ఇది వాల్మీకమున లేదు. కాని రంగనాథ భాస్కర రామాయణములం దున్నది. మూల మున లేకున్నను వైష్ణవ ప్రపత్తివలన వరదరాజు దీనిని చేర్చి యుండవచ్చును.

వాల్మీకమున ప్రక్షిప్తములైన యీ క్రింది కథాంశములు భాస్కర రంగనాథ రామాయణములలో గానవచ్చుచున్నవి.

లక్ష్మణుఁడు రావణుని శక్తిచే నిహతుఁడై మూర్ఛనొంది యుండ సుషేణు నాజ్ఞచే సంజీవిపర్వతముఁ దెచ్చుటకుఁబోయిన హనుమంతుఁడు మార్గమధ్యమునందు మాయామునియైన కాల నేమి యాశ్రమమును బొడఁగాంచుట, ఆ యాశ్రమము నందున్న సరస్సులో శాపముచే మొసలియై పడియున్న ధాన్యమాలిని జంపి శాపమోక్ష మొనర్చుట మొదలగు కథాంశములును మున్నగు విషయములు,

శుక్రాచార్యోపదేశముచే రావణుఁడు పాతాళహోమ మొనర్చుట—ఇవి వరదరాజు రామాయణమున లేవు.

రావణవధ సమయమున రామునికి విభీషణుడుచేసిన యుప దేశము వాల్మీకమునందు లేదు. ఈ యంశ మధ్యాత్మ రామా యణమునుండి గ్రహింపబడినది. భాస్కర రంగనాథ రామా యణములందిది గలదు.

పై కథా సందర్భములనుపట్టి చూడగా, యథా వాల్మీక మని వరదరాజు వ్రాసినను, తనకు ముందుగానే వెలసిన రామాయణములయందు పై కథలుండుటచేతను నవి ప్రజల యాదరణకుఁ బాత్రములగుట చేతను, నాతఁడు, నే డవాల్మీకములని యనుకొనుచున్నవానిని గూడ తన గ్రంథమునఁ జేర్చెనని యూహింపదగియున్నది. అవి కావ్యమునకు శోభగూర్చినవేగాని, వేఱువిధముగా లేవని పాఠకలోకమున కీవఱకు పరిచితమే.

వరదరాజుయొక్క యాంధ్రీకరణ రీతిని జూపుట కీదిగువ కొన్నిశ్లోకములను వాని ద్విపదలను నొసంగుచున్నాను.

ధృతిప్రవాళః ప్రసహాగ్ర్యపుష్ప స్తపోబలశ్శౌర్యనిబద్ధమూలః
రణేమహాన్ రాక్షసరాజవృక్షః సమ్మర్దితో రాఘవమారుతేన
తేజోవిషాణః కులవంశవంశః కోపప్రసాదాపర గాత్రహస్తః।
ఇక్ష్వాకుసింహావగృహీత దేహస్సుప్తః క్షితౌ రావణగంధహస్తీ
పరాక్రమోత్సాహ విజృంభితార్చిర్నిశ్వాస ధూమస్స్వబల
ప్రతాపః
ప్రతాపవాన్సంయతి రాక్షసాగ్నిర్నిర్వాపితో రామపయోధరేణ

“ధైర్యమ్మునిగురు మొత్తము నసమాన
శౌర్యంబువేరును శారీరబలము
ప్రసవసంపదయుఁ దపశ్శక్తిపేర
నెసగుచేవయుగల్గి నీవనునట్టి
సంపూర్ణ ఫలమహీజము రాముపేరి
ఝంపాసమీరమిచ్చటఁ గూలఁద్రోచె.
క్రోధగాత్రము కాంతగుణతుండ మహిత

యోధ నిర్మథన శౌర్యోరుదంతములు
తపమును దమము మాత్సరశత్రు నిగళ
కపటాసురులు కొలిగడలు వారలుగ
తనరుచీపేరి గంధగజంబుగూలె
జనకజరమణ కేసరి నెదిరించి.
క్రోధనిశ్వాస సంకులధూమ నిర్ని
రోధకమతి శౌర్యరూపహేమములు
బలమును వేఁడిమిఁ బరఁగనీపేర
విలసిల్లు దుస్సహ వీతిహోత్రుండు
చల్లనారెను రామ జలధరనిశిత
భల్లదృష్టిని దైవబలము లేకునికి ”

యుద్ధకాండ (10391 – 10410)

ఛందోవ్యాకరణాంశములు

ఈ ద్విపదకావ్యము చిన్నన్న చెప్పిన ద్విపదలక్షణము ననుసరించి రచితమైనది. ఇందు ప్రాసయతులుగాని, పాదాంతమునందును పద మధ్యమందును విఱుపులుగాని లేవు. ఏపాద కాపాదము విడివడియేయుండును.

ఇందు మూఁడుచోట్ల దీర్ఘ పూర్ణబిందు ప్రాసము- అనగా దీర్ఘముమీఁద నియతముగాఁ గాఁదగిన యర్ధబిందువునకు పూర్ణ బిందువు వచ్చుట. దానితో సిద్ధబిందు శబ్దముల ప్రాస నుపయోగించుపద్ధతి గలదు.

| పుట | పంక్తి | |
|---|---|---|
| 42 | 941 | క్రోంతి కూటువ మూకచేఁ గోలుపంగవట్టి<br>కాంతారమున జనకసుతావరుండు |
| 320 | 7249 | తాండికాండముల నాథర్వణోక్తముగ<br>నేండు నూర్లాహుతులిచ్చి తావేల్చి |
| 378 | 8607 | తోంచెను వానికి దుర్నిమిత్తములు<br>క్రొంచెఁబొఱెడు నిక కొఱగాఁడు వాఁడు |

ఈ ప్రాసము శివకవులయందే యుండుననుట సరికాదు. అహోబలపతి తన కాళిందీకన్యా పరిణయమున కూడ నిట్టి ప్రాసల నుపయోగించినాడు. "కాంతకు మదిఁ బుట్టిన తల పోంతలతో."

ఇంకను యస్వరాజ్యము. జన్వనులు నిట్టి ప్రాసయుగలదు.

మిగిలిన విశేషణముల నిందుతో బొందుపఱచుచున్నాను.

| పుట | పంక్తి | |
|---|---|---|
| 16 | 346 | బళనళంబుల |
| | 47 | ఉక్కళంబుల |
| 19 | 404 | ఱజముఁ గోల్వోక<br>మాలూరఫలములు – కుచముల పోలిక |
| 23 | 510 | యుత్తులఁ దొంపరలాడి |
| 25 | 522 | తెత్తు మాట మాత్రముగాదు మాటమాత్ర<br>మున చూ. నీవాడుట శూలికిన్ మనము<br>వాడుటగాదెత లంపనంబికా అంబికాశతకము |
| 32 | 713 | సైన్యములు – ముత్తిక వేయుక |

| | | |
|---|---|---|
| 42 | 941 | కోంతి కూటువమూరకఁ గొలుపంగ వట్టి కాంతారమున జనక సుతావరుండు (పూర్ణ బిందుప్రాసము) |
| 47 | 106 | కోరికల్ దఱంగ కుక్కుటవృత్తి చేరమించిన నీకుఁ జెల్లకున్నదియె చూ. నిర్వచన-తామ్రచూడా సంగతి నెంగిలి గావించె |
| 53 | 1216 | వట్టిగీరుబున రావణుఁ జూచి |
| 57 | 1813 | హా స్తిగీతలివినుమా |
| 66 | 1504 | చంకదుడ్డు - శరణార్థి |
| 75 | 1718 | గలభిరానేల |
| 82 | 1871 | పాపంబు...తావు - వ - ప - ప్రాస |
| 85 | 1921 | కయ్యంబునకు మీఱితి కాలుద్రవ్వేరు-ద్రవ్వి నారు వ్యవహారికము |
| 91 | 2049 | తానిలఁడయ్యె - తానిలువఁడయ్యె |
| 100 | 2250 | దక్షిణసితము వసించె |
| 102 | 2304 | వాపోవుచున్నవి వరుదుగ - వ్యర్థముగ చూ. కాశీ. వరుజయ్యెం |
| 132 | 2932 | రాముని నిర్భాగ్యురాలవై నీవు - రాగము సంధివడి |
| 144 | 3180 | అతనివల్ల ప్రోవాశించువారు - ప్రోగు అన్నము చూ. ప్రోగుఁబడి పెద్దతికంబు ఉ. హరి |
| 156 | 3458 | మాయియ్యాడు వేల్పుల ముద్దుల గుమ్మలు |

| | | |
|---|---|---|
| 158 | 3506 | పిడమిపై ఱాఁఅలఁబడి - పిడమి - పృథివీ శబ్ద తద్భవము |
| 179 | 3981 | చేఁజేత నన్నుభవించితిరి (చూ, తిక్కన.) చేసేతన్ పృథివీశులందుకొన చేసెన్ (ఇది ప్రాసలోనున్నది) |
| 207 | 4632 | మిన్నున వారిపై మిణుంగురుల్ రాలె మింటను అని యుండవలెను. చూ. విన్నున నేఁగు తారల. (యయాతి) |
| 212 | 4748 | సదమదంబుగను ముష్టాముష్టి పెనఁగి ముష్టాముష్టి యతి నిర్థారకము |
| 220 | 4942 | కోతులపైకంబునవ్వ - పైకంబు - సమూహము |
| 251 | 5640 | తోడితెండన - చేదోయి - దోయి రూపాంతరము |
| | 646 | కంజాయ కెంజాయ - కన్ను శబ్దమునకు సమాసమున బిందువు |
| 254 | 720 | కన్నశవు |
| 259 | 840 | ఆయతించు |
| 266 | 5949 | పుడమికానుపు వల్లభుఁడు |
| 275 | 6275 | పారవేయుదమొక్కపరిగనందటము-(ఒక్కసారిగా నందటము) |
| 281 | 6844 | అస్రముల్ గ్రక్కె - నెత్తురులు |
| | 826 | వలుదవెనున - మేసను- అని యుండఁదగును |
| 299 | 518 | పచ్చినెత్తురుఁ ద్రావి. జాళివట్టుటయు |

| | | |
|---|---|---|
| 290 | 743 | తనకీడు లేదని దలచి కావించు తనకీడు<br>సేతలఁ దరియింపవలసె |
| 320 | 7249 | తాండికాష్టముల నాథర్వణోక్తముగ<br>సేందునూర్లాహుతు నిచ్చితా వేల్చి |
| 346 | 7847 | గరివించినారు రాఘవులు |
| 367 | 8346 | దురములో రావణు చిత్త మెఱుంగనే |
| 378 | 8607 | తోంచెను వానికి దుర్నిమిత్తములు<br>కొంచఁబాతెడునిక గొఱగాఁడువాఁడు |
| 390 | 8890 | యువ్వరాజ్యము మమ్ము నఖిల బాంధవుల<br>జవ్వనులను బాసి చననీకుఁ దగునె |
| 401 | 9150 | వారితో రఘుపతి వచ్చినయట్టి |
| 447 | 10222 | వారతల్ వినిఅల్లైతో సంధించునాగ్రహంబునకు<br>హాల్లోహలంబులై |
| 461 | 515 | తము ? సనాథల జేయఁ – దలఁచి రాఘవుని<br>వనిత సనాథగా వగచి తెచ్చితివి. ఇది తను<br>సనాథను జేయఁదలఁచి యన్న సరిపోవును. |
| 492 | 11222 | నిచ్చకల్యాణముల్ – నిజగృహంబులను<br>పచ్చ తోరణములు పరగ నుండుదురు |
| 503 | 11471 | వనచర ప్రభులకు వహులేరుపఱచి<br>నగరి సంప్రతి కరణంబులచేత మూటికి<br>వగలు నర్తవణ చదువంగ |
| 510 | 11631 | జరుపుచున్నదె కవుసల్య యానగరి |
| 510 | 853 | ఘనమైనయుంబళికను సగఁబాలు |
| 523 | 1205 | వింజమాకిడిన |

581 12112 ఆయుర్విధానకలన
583 170 ఆఁకదువులు
5౮1 ?39 ప్రావుగా చికరాయపట్టంబుగట్టె
12031 చికిలినఖానుదీర్చిన కెంపుఁబోదుల

వరదరాజు కవిత్వమున నుత్తరాంధ్ర కవులయందు సామాన్యములగు, చేతురు - ఎఱంగక - కలెబడి - బిగ్గ కవుంగలించి - కవుసల్య మొదలగు ప్రయోగములన్నియు నగపడుచున్నవి. అట్టివి యతిప్రాసాదులయందు నిబద్ధములగుటచే, వానిని దిద్ద బూనుట యతి సాహసము, ఒకవైపున భాషాలక్షణముయొక్క క్రమ పరిణామమును తెలిసికొనుటకు నిట్టి ప్రయోగము లావశ్యకము లగుచుండగా, వేఱొకవైపున వ్యావహారిక భాషావాదు లిట్టిప్రయోగములను ప్రామాణికములని ప్రదర్శించుచుండఁగా, సీనడుమ సుందరకాండమును నాంగ్లేయభాషలో విమర్శించిన విమర్శకులోకరు, వరదరాజు లాక్షణిక కవి యనియు నిట్టి రూపములను ప్రయోగించి యుండడనియు, నవి దిద్ది సరియగు లాక్షణిక రూపములను సంపాదకులు చూపవలెననియు వ్రాసియున్నారు. మరియు కొన్ని రూపములు 'పొడవు గుబ్బలి" మొదలగునవి, యచ్చుతప్పులనియు, పొడుపుగుబ్బలి సరియైనదనియు కూడ వ్రాసినారు. వానియన్నిటిని విమర్శించుటకు తావులేదు. ఒక్కదానిని మాత్రము విమర్శించుచున్నాను. తెనుగున ధాతువులే విశేష్యములుగా కూడ ప్రయుక్తములగుననియు వానికి ప్రత్యయము చేరునపు డుదంత రూపమును, వేఱు పదము చేరునపుడు నదంతరూపముతోను వెలయుననెడి సూత్రము విమర్శకులకు తెలియలేదు. పొడ+చు పొడుచు - పొడుపు దానికి 'తెంచు' అను ప్రయుక్తమైనప్పుడు పొడతెంచు. ఇట్లే మొల + చు -

మొలచు-మొలుచు మొలతెంచు మొదలగునవి. తక్కినవానికి సమాధానమొసగ బనిలేదు. నేనీ వరదరాజ కృతియందు చూపిన పై ప్రయోగ విశేషము లన్నింటిని కీ. శే. గిడుగు రామమూర్తి పంతులుగారు తమ 'బాలకవి శరణ్యము'న సమర్థించియే యున్నారు. సుందరకాండ విమర్శకు లట్టి ప్రసిద్ధ గ్రంథమునుకూడ చూడక విమర్శించుట శోచనీయము.

రామాయణమును గూర్చినవీన విమర్శన పథకము ననుసరించి కొందఱు విద్వాంసులు విలువగల వ్యాసములను రచియించియున్నారు. వానిలో గొన్నింటి నిందు పేర్కొనుచున్నాను.

1. రామాయణము - రవీంద్రుని వ్యాసమునకుఁ దెనుఁగు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు - భారతి
సం. 5. సం. 10 (అక్టోబరు 1928)
2, రామాయణ చరిత్ర - కీ. శే. పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక 1 సం 23 సం.
3. శ్రీమద్రామాయణము- శ్రీ కొమాండూరి శఠకోపాచార్యులుగారు. రజతోత్సవ సంపుటము 204 - 211 పుటలు
4. రామాయణ విశేషములు కీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారు. విభూతి పత్రిక
5. రామాయణ సుధాలహరి. శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు
6. రంగనాథ రామాయణ పీఠిక. కీ. శే. కట్టమంచి రామలింగారెడ్డిగారు ఆంధ్ర విశ్వకళా పరిషత్ప్రకటితము

ప్రాచీన రీతిగ నీ రామాయణ విశేషములను శ్రీరామావతారతత్త్వమును నీ క్రింద వివరించిన విద్వద్వతంసులు విపులముగాఁ చర్చించియున్నారు - శ్రీరామాయణ తత్త్వమును తెలుసుకొనుటకు మొదట వెలుగుబాటు చూపినది శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారు. వారు తెనుగు లిపిలో, మూలశ్లోక ప్రతిపదార్థ తాత్పర్య, సవిశేష పూర్వకముగా నొక మహా వ్యాఖ్యను పదునైదు సంపుటములలో ప్రకటించిరి. దాని రచయితలు - శ్రీ చదలువాడ సుందరరామ శాస్త్రిగారు సుప్రసిద్ధ సంస్కృతాంధ్ర పండితులు.

ఆ వెనుక వెలువడినవానిలో నెన్నఁదగినవి.

1. శ్రీ వావిలికొలను సుబ్బారావు పంతులు గారి ఆంధ్ర వాల్మీకి రామాయణ పీఠిక. మందరము అను విపుల వ్యాఖ్యానము.

2. శ్రీ జనమంచి శేషాద్రి శర్మగారి ఆంధ్ర రామాయణ పీఠిక శ్రీ రామావతార తత్త్వము.

3. శ్రీ రామాయణ సారోద్ధారము - ములుకుట్ల సరసింహావధాని గారు.

4. ఆశ్చర్య రామాయణము - నలుబది రామాయణముల సారము రామాయణకేసరి లక్ష్మీవఝ్ఝల వేంకటకృష్ణ శాస్త్రి

5. విశోధిత రామాయణము - శ్రీ మోచెర్ల వెంకటేశ్వర్లు మూర్తి గున్నయ్యగారు బి. ఎ. ఇది 1400 పుటలుగల పెద్ద విమర్శన గ్రంథము.

ఇంతటి మహాగ్రంథము పరిష్కరించినపుడును నందును నేకైక ప్రతి నాధారముగ చేసికొనుటచేతను నిందు ముద్రణ స్ఖాలిత్యములు, మొదలగునవి చాలదొరలినవి. దానికి నేను తుంతవ్యుఁడను. ఈ గ్రంథము మొదట ముద్రణభాగ్యమునందు టయేయొక విశేషము. కావున నిందలి దోషములను విసర్జించి, గుణగ్రహణ పారీణులగు నాంధ్ర విద్వన్మహా జనులందఱును గుణములనే గ్రహించి వరదరాజు కవితామృతము గ్రోలుదురుగాక.

ఈ కావ్యము ముద్రణ సాంతమగువఱకును నాకు చేదోడు వాదోడుగానున్న చిరంజీవి శివసుందరేశ్వర రావునకు నా యాశీస్సులు. గ్రంథ ముద్రణమునకు నా కన్నివిధములఁ దోడ్పడిన తంజావూరి పుస్తక భాండాగార గౌరవ కార్యదర్శి శ్రీ యస్. గోపాలన్‌గారికి నా మనఃపూర్వక కృతజ్ఞతాపూర్వక వందనములు. ఈ గ్రంథ ప్రకటనను మనసార నభినందించిన మహనీయులకు, పత్రికా సంపాదకులకు నా నమోవాకములు.

ఈ గ్రంథ ప్రకట నారంభము నుండియు నత్యంతాదరాభిమానములతో నన్ను ప్రోత్సహించిన నాంధ్ర విశ్వకళా పరిషదధ్యక్షు పురోధారులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి ననవరతము గౌరవ పురస్సరముగ సంభావించుచున్నాను.

ఇట్లు విధేయుఁడు
నిడుదవోలు వెంకటరావు, ఎమ్.ఏ.,
మద్రాసు విశ్వవిద్యాలయాంధ్ర
భాషా శాఖాధ్యక్షుఁడు.

మదరాసు.

# విషయానుక్రమణిక



**విషయము** — **పుట**


శ్రీరాముఁడు సీత వృత్తాంతముఁ దెల్పినందులకు హనుమంతు నభినందించుట — 1

సుగ్రీవుఁడు తనబలము నెఱిఁగించి శ్రీరాముని కర్తవ్యమునకుఁ బురికొల్పుట — 4

శ్రీరాముఁడు లంకనుగూర్చి రావణుని సేనావిశేషంబులను గూర్చి హనుమంతునడుగుట — 5

ఆ విశేషములను హనుమంతుఁడు రామున కెఱింగించుట — 6

సుగ్రీవునితో శ్రీరాముఁడు లంకపై వెడలుటకు సైన్యమాయత్తము సేయుమని చెప్పుట — 10

శ్రీరాముఁడు నీలుని వానరసైన్యముల కధిపతిగాఁ జేసి వానర వీరుల నుపసేనాపతులుగాఁ జేయుట — 11

శ్రీరామాదులును నంగదాదులును లంకపైకి వానరసైన్యములతోఁ గదలుట - వానరసైన్య ప్రయాణవర్ణనము — 12

దారిలో లక్ష్మణుఁడు శుభశకునములను గాంచుట — 14

శ్రీరాముఁడు వానరులతో సముద్రపుటొడ్డున నిమ్మైనచోట పాళెము విడియుట — 15

శ్రీరాముఁడు సీతనుగూర్చి విరహమునొందుట — 17

లంకలో రావణాసురుఁడు హనుమంతుఁడు చేసిన పనినిఁ గూర్చి ప్రస్తావించుట — 20

హనుమంతుఁడు చేసిన పనికి ప్రతీకారమొనర్చుటకు నాప్తులతో రావణుఁడు సంప్రతించుట — 21

రాక్షసవీరులు రావణునికి రామునిపైదండెత్తి శిక్షించుటయే మంచి
దని దుర్నీతి బోధించుట 22
ప్రహస్తుని పల్కులు - దుర్ముఖుని దురుక్తులు 25
వజ్రదంష్ట్రుని వాక్యములు 26
కుంభుని కువాశకములు 27
యజ్ఞహానుని యసందర్భపు మాటలు 27
అకంపనుని యనుచితోక్తులు 28
పైవారి మాటలువిని రాక్షసులుచెలరేఁగుట -రావణుఁడు సూక్ష్మ
ముగా వారిమాటలను వినుట 29
విభీషణుఁడు రావణునికి బుద్ధిచెప్పుట 30
రావణుఁడు కొలువువిడిచి వెడలుట-విభీషణుఁడు రావణు నగరికి
బయలుదేఱుట 33
విభీషణుడు రావణునితో హితోక్తులు పల్కుట 35
రావణుఁ డాతని మాటలను పెడచెవినిఁబెట్టి యింటికిఁబొమ్మ
నుట - విభీషణుఁడు వెడలిపోవుట 37
రావణుఁడు కొలువు కూటమునకు వచ్చుట 38
రావణుఁడు ప్రహస్తునకు కోటరక్షణకువలయు సాధన సామగ్రి
సమకూర్చమని యాజ్ఞాపించుట ప్రహస్తుఁడా యాజ్ఞా
ప్రకారము నిర్వహించుట 39
రావణుఁడు కుంభకర్ణునితో ముందుచేయఁగల కార్యమునుఁగూర్చి
సంప్రతించుట 41
కుంభకర్ణుఁడు రావణునికి హితోపదేశపూర్వకముగ నుత్తర
మిచ్చుట 43
రావణునితో మహాపార్శ్వుడు మాటలాడుచు సీతను పొందుమని
చెప్పుట 46
రావణుఁడు పరస్త్రీని బలిమిచేఁ బొందిన తనకు హానికలుగు శాప
వృత్తాంతము చెప్పుట 47

విభీషణుఁడు రావణునితోఁ బలికిన హితోక్తులు 50

విభీషణుఁడు ప్రహస్తునితోఁ జెప్పినమాటలు 52

విభీషణుని మాటలకు నింద్రజిత్తు కోపించి పలుకుట 53

విభీషణుఁ డింద్రజిత్తు మాటలకుఁ బ్రత్యుత్తరమిచ్చుట 55

రావణుఁడు విభీషణుని మాటలకుఁ గోపించి తన కొలువు వెడలి పొమ్మనుట 57

విభీషణుఁ డట్టే వెడలిపోయెదనని చెప్పి వెడలుట 60

విభీషణుఁడు శ్రీరామునివద్దకుఁ బోవుట 62

తన్నుఁ బట్టవచ్చిన కపులతో విభీషణుఁడు తన వృత్తాంతము నెఱింగించుట 63

సుగ్రీవుఁడు విభీషణుని రాకనుగూర్చి శంకించుచు శ్రీరామునితోఁ బ్రసంగించుట 64

శ్రీరాముఁడు విభీషణునిగూర్చి తమతమ యభిప్రాయములను దెల్పుమని చెప్పుట 66

అంగదుఁడు తన యభిప్రాయముఁ జెప్పుట 67

శరభుఁడు తన యభిప్రాయముఁ దెలుపుట - జాంబవంతుఁడు తన యభిప్రాయముఁ దెలుపుట - మైందుఁడు తన యభిప్రాయముఁ దెలుపుట 68

అంజనేయుఁడు శ్రీరామచంద్రునికి సరియగు తన యభిప్రాయము నెఱింగించి విభీషణుని చేకొనుమని చెప్పుట 69

శ్రీరాముఁడు విభీషణుని తోడితెమ్మని వానరుల కాజ్ఞాపించుట 72

సుగ్రీవుఁడు శ్రీరాముని నివారించుట - శ్రీరాముఁడు తన యభిప్రాయము తిరిగి స్పష్టపఱచుట 73

శ్రీరాముఁడు సుగ్రీవునితోఁ దిరిగి విభీషణుని తోడితెమ్మనుట 74

సుగ్రీవుఁడు మఱియొకమాఱు ప్రత్యుత్తరము చెప్పుట 75

శ్రీరాముఁడు సుగ్రీవునితో మాఱుమాటాడకుండ విభీషణునితోడి తెమ్మనిచెప్పుట - శరణాగతుని రక్షించెదనని చెప్పుట 75

సుగ్రీవుఁడు విభీషణుని దీసికొనివచ్చుటకు బయలుదేరుట 78

విభీషణుఁడు శ్రీరాముని సందర్శించుట - విభీషణుఁడు తన వృత్తాంతమునంతయు శ్రీరామునికి నివేదించి శరణాగతుఁడగుట 79

శ్రీరామచంద్రుఁడు విభీషణుని కథయడుగఁగా నాతఁడు శ్రీరాముని కోరికపై రావణుని బలములను దెలుపుట 80

శ్రీరాముఁడు రావణుని జంపి విభీషణునికి లంకారాజ్య పట్టాభిషేకముఁ జేయుదునని ప్రతిజ్ఞ చేయుట 82

హనుమత్సుగ్రీవులతో విభీషణుఁడు వారాశి దాఁటుటకు నుపాయము సముద్రుని ప్రార్థించుటయే యనిచెప్పుట 83

రాముఁడు లక్ష్మణునితోడ హనుమత్సుగ్రీవాది సమస్త వానర సైన్యముతోడను సముద్రతీరముఁజేరి సముద్రుని స్మరించుట 84

రావణుఁడు శ్రీరాముని సైన్యవివరము కనుగొనుటకు శార్దూలునంపుట 84

శార్దూలుఁడు రామసైన్య మపారమని వేగులవారినిఁ బంపి 85
యథార్థము తెలిసికొమ్మని విన్నవించుట

రావణుఁడు శుకుఁడను రాక్షసుని సుగ్రీవునియొద్దకు దూతగాఁబంపుట 86

శుకుఁడు సుగ్రీవునితో రావణుఁడు చెప్పినమాటలు చెప్పుట
సుగ్రీవుఁ డాతని చంపుట కాజ్ఞయిచ్చుట

శుకుఁడు శ్రీరాముని శరణ వేఁడుట-సుగ్రీవునిఁ బ్రత్యుత్తరము కోరుట 87

సుగ్రీవుఁడు రావణునికిఁ జెప్పుమన్న మాటలు 88

అంగదుఁడు కోపించి శుకునిఁ జంపుమన వానరు లాతనిపైఁ బడుట 89

శుక్రుఁడు శ్రీరాముని శరణుఁజొచ్చి లంకకు వెడలిపోవుట 89

శ్రీరాముఁడు సముద్రతీరమున దర్భాస్తరణమునఁ బ్రాయోపవేశము సేయుట 90

సముద్రుఁడు ప్రత్యక్షము కానందులకుఁ గోపించి శ్రీరాముఁ డాతనిపై బ్రహ్మాస్త్రమును బ్రయోగింపఁ బూనుట 91

శ్రీరాముని కోపమునకు దేవమనుష్య లోకములు తల్లడిల్లుట 92

సముద్రుడు శ్రీరామునకుఁ బ్రత్యక్షమై వానర సేనకు దారి యిచ్చెదనని చెప్పుట 94
సముద్రుని కోరికపైని రాముఁడు తాను తొడిగిన యమ్మును నుత్తరదిశపైఁ బ్రయోగించి యందలి బోయలను దునుమాడుట 96
సముద్రుని కోర్కెపై శ్రీరాముఁడు నలుని సేతువుఁగట్ట నాజ్ఞాపించుట 97
నలుఁడు సేతువు కట్టుటకుఁ బ్రారంభించుట 98
సేతునిర్మాణము పూర్తియగుట 99
సుగ్రీవుఁడు శ్రీరామునితో లంకాద్వీపమునకుఁ దరలుటకు సమయమని చెప్పుట 100
శ్రీరాముఁడు వానరులతో మూఁడు యోజనములుదాఁటి యచ్చట నొక వనములో బసచేయుట 101
శ్రీరాముఁడు దారిలో శకునములఁజూచి ఘోరయుద్ధ మగు నని చెప్పుట 102
శ్రీరాముఁడు సుగ్రీవ విభీషణాదులతో లంకా రాజధానిఁ జేరుట 103
శ్రీరాముఁడు లంకముట్టడించుటకు నీలాంగదాది వానరుల నాయా చోటుల నిలుపుట 104
సుగ్రీవుఁడు తామువచ్చిన వృత్తాంతముఁ దెలియఁ జెప్పుమని శుకుని విడిపింప, వాఁడు రావణునివద్దకు వచ్చి చెప్పిన మాటలు 105
శుకుని మాటలకు రావణుఁడిచ్చిన ప్రత్యుత్తరము-రావణుఁడు శుకసారణుల నిరువురను శ్రీరామునియొద్దకు దూతకృత్యమునకుఁ బంపుట 107
శుకసారణులు వానర వేషములతో శ్రీరాముని సైన్య విశేషములు గనుచుండుట 108
విభీషణుఁడు వారిఁ గుఱిఁగి పట్టితెప్పించి శ్రీరాముని ముందరఁ బెట్టుట 109
సారణుఁడు తామువచ్చిన వృత్తాంతము శ్రీరామునికి నివేదించుట ,,

| | |
|---|---|
| శ్రీరాముఁడు రావణునితో యుద్ధమునకు రమ్మనియు నట్లుకానిచో లంకను దగ్ధముచేయుట నిశ్చయమనియుఁ గబురంపుట | 110 |
| శుకసారణులు రావణునివద్దకువచ్చి రాముఁడు చెప్పిన మాటలు చెప్పి రాముని సైన్య మపారమనియు శ్రీరామునికి సీతను సమర్పించుమనియు హితోపదేశము చేయుట | ,, |
| రావణుఁడు శుకసారణులతో నుత్తర గోపురమున కేగుట | 112 |
| సారణుఁడు రావణునికి వానర నాయకుల నెఱుకపఱచుట | 113 |
| అంగదుఁడు | ,, |
| హనుమంతుఁడు | 114 |
| నీలుఁడు | ,, |
| శ్వేతుఁడు | ,, |
| కుముదుఁడు | ,, |
| రంభుఁడు | 115 |
| శరభుఁడు | ,, |
| పనసుఁడు | ,, |
| వినతుఁడు | ,, |
| క్రథనుఁడు | 116 |
| గవయుఁడు | ,, |
| హరుఁడు | ,, |
| ధూమ్రుఁడు | ,, |
| జాంబవంతుఁడు | 117 |
| శ్రుతసన్నాదుఁడు | ,, |
| ప్రహర్షుఁడు | ,, |
| ప్రమాది | ,, |
| గవాక్షుఁడు | 118 |
| కేసరి | ,, |
| శతవలి | 119 |

తక్కిన వానరవీరులు ,,

శుకుని వానరసైన్య వర్ణనము ,,

ఆంజనేయుని వర్ణనము 121

శ్రీరాముని వర్ణనము ,,

లక్ష్మణ వర్ణనము 122

విభీషణ వర్ణనము - సుగ్రీవ వర్ణనము 123

రావణుఁడు శుకసారణులఁ గోపించి పొరలఁ బొమ్మనుట
రావణుఁడు మహోదరునిఁ బిలిచి తగిన వేగులవారినిఁ
బంపి రామసుగ్రీవులయుదంతముఁ గనుఁగొనుమనుట 125

ఆ వేగులవారు సుగ్రీవ సైన్యమునుఁజూచి భయమంది వానరులచేఁ
గొట్టుపడి లంకకువచ్చుట 126

వేగులవారు తాముఁ జూచిన సంగతి రావణునకు విన్నవించుట 127

రావణుఁడు శార్దూలుని వానరుల వృత్తాంతమడుగుట 129

రావణుఁడు విద్యుజ్జిహ్వునితో శ్రీరాముని శిరము సీతవద్దకుఁ
దెమ్మని చెప్పుట 131

విద్యుజ్జిహ్వుఁ డట్లనే రామశిరము నచటనుంచి వెడలుట
రాముఁడు యుద్ధములో జనిపోయె ననియుఁ దన్నేలు
కొమ్మనియు రావణుఁడు సీతతోఁ జెప్పుట 132

రావణుఁడు సీతను నమ్మించుటకొఱకు శ్రీరాముని శిరమును నామె
ముందఱఁ బెట్టించుట 134

సీతయా శిరస్సును కనుఁగొని దుఃఖముచే మూర్ఛిల్లి రామునికొఱకై
శోకించుట 135

సీత రావణునితోడ తన్ను శ్రీరామునితో సహగమనము సేయుట
కాజ్ఞయీయుమని కోరుట 138

ఇంతలో నొక దూత రావణుని సత్వరముగా రమ్మనుట-రావణుఁడు
వెడలినతోడనే శ్రీరాముని శిరము నాతనితో వెడలి
పోవుట - దానిచే సీతమనస్సు శాంతిఁబొందుట 139

సీత రామునిగూర్చి దుఃఖింప సరమ యిది రావణమాయగాని వేఱొండు కాదనిచెప్పి యామె నూరడించుట_సరమ సీతతో యుద్ధభేరి మ్రోగుచున్నదనియు, శ్రీరాముఁడు రావణుని జయించి యామెను తీసుకొనిపోవుననియుఁ జెప్పి సంతోషపఱచుట 140

సీతపంపున సరమ లంకలోనికిఁబోయి యుద్ధసన్నాహముఁగనుఁగొని వచ్చి సీతకు నివేదించుట 143

రావణుఁడు శ్రీరామునిపైకి యుద్ధమునకు వెడలుదునని యాలోచన సేయుట 144

మాల్యవంతుఁడు రావణునికి యుద్ధము వలదని శ్రీరామునికి సీత నిమ్మని హితము చెప్పుట 145

రావణుఁడు మాల్యవంతుని మాటలు పెడచెవినిఁ బెట్టుట 148

రావణుఁడు లంక రక్షణకై నాల్గుదిక్కుల రక్షకుల నియోగించుట 150

శ్రీరాముఁడు లంకనెట్లు సాధించుట యను విషయముఁగూర్చి యాలోచన సేయుట_విభీషణు రావణుఁడు చేసిన ప్రయత్నములను వివరించుట 151

శ్రీరాముఁడు రావణుని ప్రయత్నములకు మాఱు ప్రయత్నములు సేసి సేనానాయకులను నియోగించుట 153

శ్రీరాముఁడు వానరసేనలతో సువేలాచలముపై విడియుట 154

శ్రీరాముఁడు లంకాపుర సౌధమున రావణునిఁ జూచుట 156

సుగ్రీవుఁడు రావణునియొద్దకేఁగి శ్రీరాముని దూతగా వచ్చితినని చెప్పి రావణుని కిరీటముఁ దన్నుట. రావణ సుగ్రీవుల పోరాటము 157

సుగ్రీవుఁడు రావణుఁడు మాయోపాయముచే జయించునని యెఱిఁగి రాముని వద్దకు వచ్చుట 159

శ్రీరాముఁడు సుగ్రీవునితోఁ దానొక్కఁడే రావణునిపైకిఁ బోఁగూడదని హితోపదేశము చేయుట 160

శ్రీరాముఁడు లంకపైకి యుద్ధమునకుఁ బోవుట కుపక్రమించుట 161

వానరసైన్యములు లంకయందు దిగుట-వానర సేనానాయకులు నాలుగు దిక్కులను తమ స్థానములలో నెలవుకొనుట 162

శ్రీరాముఁ డంగదుని రావణుని యొద్దకు రాయబారిగాఁ బంపుట 164

అంగద రాయబారము 166

అంగదుని శిక్షించుటకు రావణుఁడు నలువురు రాక్షసుల నంపుట అంగదుఁడు వారలను జంపుటయే కాక రావణ ప్రాసాద శిఖరమును భగ్నము సేయుట 167

అంగదుఁడు శ్రీరామునియొద్దకు వచ్చుట - సుషేణుఁడు వానరులను యుద్ధమునకుఁ బురికొల్పుట 168

శ్రీరాముఁడు వానరసైన్యమును లంకపైఁ గదనము సేయఁ బురికొల్పుట 169

రావణుఁడు తన బలములనుకూడ యుద్ధమునకుఁ బురికొల్పఁగా వానర రాక్షసులకు సంకుల యుద్ధమగుట 170

ఇరువైపుల వానర రాక్షసనాయకులు ద్వంద యుద్ధము సేయుట 171

సంకుల యుద్ధములో రాక్షసు లోడిపోవుటఁ జూచి ఇంద్రజిత్తు శ్రీరామునిపైకి యుద్ధమునకువెడలి నాగాస్త్రముఁ బ్రయోగించుట 177

ఇంద్రజిత్తు శ్రీరాముని నాగాస్త్రముచే మూర్ఛితుఁ జేసి వానర సైన్యము నట్టహాసముతోఁ దాఁకి లంకకు మఱలుట 178

విభీషణుఁడు సుగ్రీవునికిఁ గర్తవ్యము బోధించి శ్రీరాముని సేదఁ దేర్పుమని చెప్పుట 182

రావణునితో ఇంద్రజిత్తు తన పరాక్రమముచేత శ్రీరాముని మూర్ఛనొందించి వానరసైన్యమును కలతఁబఱచిన విధమును తెలియఁబఱచుట 183

సీతను రావణుఁడు రామ లక్ష్మణులు మూర్ఛనొందిన స్థలమునకుఁ గొని పొమ్మనుట 185

సీత రామ లక్ష్మణులను మృతులుగా భావించి శోకించుట 186
త్రిజట సీత నూరడించుట 190
శ్రీరాముఁడు మూర్ఛ తెలిసి తమ్మునిఁగూర్చి శోకించుట 191
రావణుఁడు సుగ్రీవుని కిష్కింధకుఁ బొమ్మన విభీషణుఁడు
వానరుల నాపి రామునివద్దకు వచ్చుట 194
విభీషణుఁడు నాగపాశ బద్ధుఁడగు శ్రీరామునిఁ జూచి దుఃఖించి
సుగ్రీవుని సమాశ్వాసించుట 196
సుగ్రీవుఁడు సుషేణునితో రాముని కిష్కింధకుఁ గొనిపొమ్మని
చెప్పుట - సుషేణుఁడు చంద్ర ద్రోణ నగమునందలి, విశల్య
సంజీవ కరణులను హనుమంతునిచేఁ దెప్పింపుమని
సుగ్రీవునిఁ బ్రార్థించుట 198
గరుత్మంతుని యాగమనము-శ్రీరాముని నాగపాశములు విడిపోవుట 199
శ్రీరాముఁడు నాగపాశ విముక్తుఁడై గరుత్మంతుని యాకారమును
వర్ణించి యాతని యుదంతమరయుట 201
గరుత్మంతుఁడు తన వృత్తాంతము శ్రీరామున కెఱింగించి యాతఁడు
జయమునొందునని దీవించి యంతర్ధానముఁ జెందుట 202
రావణుని యనుమతిని ప్రహస్తుఁడు పంపిన వేగులవారు వచ్చి రామ
లక్ష్మణులు నాగపాశములు వీడిన యుదంతముఁ జెప్పుట 205
రావణుఁ డదివిని ధూమ్రాక్షుని యుద్ధమునకుఁ బొమ్మనుట
ధూమ్రాక్షుఁడు వెడలి హనుమంతునితో యుద్ధముచేయుట 206
ధూమ్రాక్షుని హనుమంతుఁడు చంపుట 208
రావణుని యాజ్ఞచే వజ్రదంష్ట్రుఁడు యుద్ధమునకు వెడలి యంగదు
నెదుర్కొనుట 209
అంగద వజ్రదంష్ట్రుల యుద్ధము 210
అంగదుఁడు వజ్రదంష్ట్రుని చంపుట 212
అకంపనుఁడు రావణుని నాజ్ఞచే యుద్ధమునకు వెడలుట 213

అకంపనుఁడు హనుమంతునితో యుద్ధమొనర్చుట - హనుమంతుఁడ కంపనునిఁ జంపుట 215

ప్రహస్తుఁడు యుద్ధమునకుఁ వెడలి దుర్నిమిత్తములం గనుట 216

నీలుఁడు ప్రహస్తు నెదుర్కొని యాతనిఁ బొలియించుట 222

రావణుఁడు యుద్ధమునకు వెడలుట 223

విభీషణుఁడు శ్రీరామునకు రాక్షససైన్యమునందలి మహానాయకులఁ గూర్చి రావణునిఁ గూర్చి చెప్పుట-అకంపనుఁడు-ఇంద్రజిత్తు 225

అతికాయుఁడు 226

మహోదరుఁడు ,,

పిశాచుఁడు ,,

త్రిశిరుఁడు ,,

కుంభుఁడు 227

నికుంభుఁడు ,,

నరాంతకుఁడు ,,

రావణాసురుఁడు ,,

రావణుఁ డొక్కఁడే తొలుత యుద్ధసన్నద్ధుఁడగుట-సుగ్రీవుఁడు రావణు నెదుర్కొని మూర్ఛిల్లుట 229

శ్రీరామునాజ్ఞచే రావణునిపైకి వెడలు లక్ష్మణుని కడ్డుపడి హనుమంతుఁడు రావణు నెదుర్కొనుట 230

రావణ హనుమంతుల యుద్ధము 231

హనుమంతుఁడు రావణునితోఁ బోరి మూర్ఛిల్లగా నీలుఁ డెదిరించుట 233

నీలుఁడు రావణుచే మూర్ఛితుఁడగుట 234

లక్ష్మణుఁడు రావణాసురు నెదుర్కొని యుద్ధము సేయుట 235

రావణుఁడు లక్ష్మణునిపై శక్తి ప్రయోగించి మూర్ఛిల్లఁ జేసి తీసికొని పోవుటకుఁ బ్రయత్నించుట - హనుమంతుఁ డడ్డుపడి లక్ష్మణుని రామునియొద్దకుఁ జేర్చుట 238

రామ రావణుల ప్రథమయుద్ధము 239

రావణుఁడు లంకకు మఱలుట 241

రావణుఁడు లంకకు మరలి, దనమంత్రులతోఁ దన పూర్వ శాపములనుఁ దెలుపుట - కుంభకర్ణుని యుద్ధమునకుఁ బంపుటకై యాతని నిద్రనుండి లేపుట కాజ్ఞాపించుట 242

రాక్షసులు కుంభకర్ణుని నిద్రనుండి లేపుటకు వెడలుట 245

నిద్రాముద్రితుఁడైన కుంభకర్ణుని వర్ణన ,,

నిద్రనుండి కుంభకర్ణుని లేపుటకుఁ జేసిన ప్రయత్నములు 247

కుంభకర్ణుఁడు లేచి తన్ను నిద్రనుండి లేపుటకుఁ గారణమడుగుట యూపాక్ష మహోదరులు రావణునివద్ద కాతఁడు వెడలిన కారణము తెలియునని విన్నవించుట - కుంభకర్ణుఁడు రావణుని జూచుటకు బయలుదేరుట 249

కుంభకర్ణునిఁజూచి రావణ సైన్యము భయభ్రాంతముకాఁగా విభీషణుఁడు వారి భయము నివారించుట 251

శ్రీరాముని కోర్కె ననుసరించి విభీషణుఁడు కుంభకర్ణుని పుట్టు పూర్వోత్తరము లెఱింగించుట 252

రావణునివద్దకుఁ గుంభకర్ణుఁడు వచ్చుట - వారి సంభాషణము 256

కుంభకర్ణుఁడు రావణునికి హితబోధ సేయుట 259

రావణు డాహితబోధను పెడచెవినిఁ బెట్టుట ,,

కుంభకర్ణుఁడు తాను రామునిపైకి యుద్ధమునకుఁ బోవుదునని చెప్పుట 262

మహోదరుఁడు కుంభకర్ణునిఁ బదరుట 263

రాముని గెల్చితినని చాటించి, సీతను వంచించి చేకొమ్మని మహోదరుఁడు రావణున కుపాయము చెప్పుట 266

కుంభకర్ణుఁడు మహోదరుని యిచ్ఛకములను నిందించి యుద్ధమునకు సన్నద్ధుఁడగుట 267

రావణుఁడు కుంభకర్ణుని దివ్యాభరణ భూషితునిఁ గావించి యుద్ధమునకుఁ బంపుట 271

| | |
|---|---|
| యుద్ధోన్ముఖుఁడైన కుంభకర్ణునిఁ జూచి వానరులు భయభ్రాంతులై నానా ముఖములఁ జెదరిపోవుట - అంగదుఁడు వారి భయము మాన్పి యుద్ధమునకుఁ బ్రోత్సహించుట | 274 |
| కుంభకర్ణుఁడు మైందద్వివిదాది వానరులను జయించి వీర విహారము సేయుట | 279 |
| వానరు లొక్కుమ్మడిగా కుంభకర్ణునిపైఁ బడి యాతని ధాటి కోర్వలేక శ్రీరాముని శరణుఁ జొచ్చుట | 281 |
| అంగదుఁడు కుంభకర్ణునితో యుద్ధముచేసి మూర్ఛిల్లుట | 283 |
| మూర్ఛ మునిఁగియున్న సుగ్రీవుని కుంభకర్ణుఁడు లంకకుఁ గొనిపోవుట | 285 |
| సుగ్రీవుఁడు మూర్ఛనుండి తేఱికొని కుంభకర్ణుని ముక్కు చెవులు కొఱికి తప్పించుకొని శ్రీరామునిఁ జేరుట | 287 |
| శ్రీరాముఁడు కుంభకర్ణు నెదుర్కొని యుద్ధముచేయుట | 289 |
| శ్రీరామ కుంభకర్ణ సంవాదము | 292 |
| శ్రీరామ కుంభకర్ణుల యుద్ధము | 293 |
| శ్రీరాముఁడు తనపైకి వచ్చు కుంభకర్ణుని తలఁద్రుంచి రావణుని ముందఱఁ బడునట్లు చేయుట | 295 |
| రావణుఁడు కుంభకర్ణుని మృతికై దుఃఖించుట | 297 |
| రావణుని సమాశ్వాసించి త్రిశిరాతికాయ నరాంతక మహోదరాదులు యుద్ధమునకు బయలుదేరుట | 298 |
| వానర రాక్షసుల దొమ్మియుద్ధము | 301 |
| అంగదుఁడు నరాంతకుని సంహరించుట | 303 |
| దేవాంతక త్రిశిర మహోదరుల యుద్ధము - దేవాంతకుని మరణము | 305 |
| మహాపార్శ్వుని మరణము | 306 |
| అతికాయుఁడు యుద్ధమునకు వెడలుట - మత్తుఁడు ధూమ్రునిచే మడియుట | 307 |

ఉన్మత్తుఁడు దధిముఖునిచే హతుఁడగుట 308

యుద్ధమునకు వచ్చు నతికాయునిఁ గూర్చి శ్రీరాముఁడు
విభీషణుని ప్రశ్నించుట 309

విభీషణుఁడు శ్రీరామునకతికాయుని వృత్తాంతము నెఱింగించుట-
అతికాయుని యుద్ధము 311

లక్ష్మణుఁ డతికాయు నెదుర్కొని యధిక్షేపించుట - వారి
సంభాషణము 313

లక్ష్మణాతికాయుల యుద్ధము 314

లక్ష్మణుఁ డతికాయునిపై బ్రహ్మాస్త్రముఁ బ్రయోగించి యాతనిఁ
బరిమార్చుట 316

అతికాయుని మరణమును విని రావణుఁడు విలపించుట 318

ఇంద్రజిత్తు యుద్ధమునకు వెడలుట 319

ఇంద్రజిత్తు రామలక్ష్మణులను మూర్ఛనొందించుట 321

విభీషణుఁడు జాంబవంతుని కర్తవ్య మడుగుట 324

జాంబవంతుఁడు హనుమంతుని సంజీవికరణినిఁ దెచ్చుటకు
నియోగించుట 327

హనుమంతుఁడు సంజీవ పర్వతమును పెకలించి తెచ్చుట - దాని
ప్రభావమువలన రామలక్ష్మణులు మూర్ఛఁ దేఱుట -
వానరులు సుఖు లగుట 329

ఇంద్రజిత్తు రావణునితో తాను రామలక్ష్మణులను జంపితినని
ప్రగల్భములు పలుకుట 332

వానరులు లంకను గాల్చుట - వానర రాక్షసుల సంకులయుద్ధము 333

శోణితాక్ష ప్రజంఘ కుంభ నికుంభ కంపన, యూపాక్షులు యుద్ధ
మునకు వెడలుట 335

అంగదుఁడకంపనునితో యుద్ధముచేసి యాతనిఁ జంపుట 336
శోణితాక్షునితోఁ బోరాటము ,,

ప్రజంఘు యూపాక్షు లంగదుని యడ్డగించుట 337
వానర వీరులు మైందద్వివిదు లంగదునకు సహాయమగుట - ప్రజంఘుడు పరలోకగతుడగుట 338
శోణితాక్ష యూపాక్షులు హతులగుట ,,
కుంభుని యుద్ధము - అతని మరణము 339
హనుమంత నికుంభుల యుద్ధము - నికుంభుఁ డీల్గుట 343
రావణుఁడు రాక్షసవీరుల యుదంతమువిని, మకరాక్షుని యుద్ధమున కనుచుట 345
శ్రీరామ మకరాక్షుల సమరోక్తులు 348
శ్రీరామ మకరాక్షుల యుద్ధము - శ్రీరాముఁడాతనిఁ బొలియించుట 349
రావణుని ప్రేరణచే నింద్రజిత్తు యుద్ధమునకుఁ గదలుట 350
ఇంద్రజిత్తు మింటినుండి తన యస్త్రవిద్యా నైపుణ్యము ప్రదర్శించుట 352
లక్ష్మణుఁ డింద్రజిత్తుపై బ్రహ్మాస్త్రమునుఁ బ్రయోగించుటకు శ్రీరాము ననుజ్ఞ వేఁడుట 354
శ్రీరాముఁ డాతని నివారించుట 355
ఇంద్రజిత్తు మాయాసీతను రథముపైనునిచి యామెతల తెగ వ్రేయుట 356
హనుమంతు డింద్రజిత్తు నడ్డగించుట 358
జాంబవంతుఁడు హనుమంతుఁడును శ్రీరామునికి మాయాసీత వృత్తాంతము నెఱింగించుట 361
శ్రీరాముఁడా వృత్తాంతము నిజమని దుఃఖింప లక్ష్మణుఁ డాతని నోదార్చుట 362
విభీషణుఁడు శ్రీరామునికి నిజస్థితి నెఱింగించి కర్తవ్యమును బోధించుట 367
ఇంద్రజితు చేయు హోమము పూర్తిగాకమునుపే లక్ష్మణుని నింద్రజిత్తుపై పంపుమని విభీషణుఁడు చెప్పుట 368

| | |
|---|---|
| శ్రీరాముడు లక్ష్మణుని నాశీర్వదించి ఇంద్రజిత్తుపై యుద్ధమునకుఁ బంపుట | 370 |
| విభీషణుఁ డింద్రజిత్తునుఁ జంప బ్రోత్సహించుట | 372 |
| ఇంద్రజిత్తు విభీషణుల పరస్పర సంవాదము | 373 |
| లక్ష్మణ ఇంద్రజిత్తుల యుద్ధము | 376 |
| లక్ష్మణుఁ డింద్రజిత్తుని పరలోకగతునిఁ గావించుట | 382 |
| లక్ష్మణ విజయమునకు లోకము హర్షము నొందుట | 386 |
| ఇంద్రజిత్తు మరణమువిని రావణుఁడు దుఃఖించుట | 389 |
| రావణుఁడు సీతను వధింపఁ బోవుట | 391 |
| సుపార్శ్వుడు రావణుని నివారించుట | 393 |
| రావణుని యాప్త పరివారముతో వానరులు యుద్ధముచేయుట | 394 |
| శ్రీరాముఁడు రావణుని పరివారముతో యుద్ధముచేయుట | 396 |
| శ్రీరాముఁడు తన మహాస్త్ర ప్రయోగముఁ జూపి యసంఖ్యాకములగు రావణుని బలములను సంహరించుట | 938 |
| లంకలో రాక్షసస్త్రీలు తమ పరిస్థితినిఁ దలంచుకొని రోదనము సేయుట | 400 |
| రావణుఁడా రోదనధ్వని విని మహోదర మహాపార్శ్వులతో యుద్ధమునకు బయలుదేరుట | 402 |
| రావణుఁడు యుద్ధప్రయాణమున నపశకునములను గనుట | 403 |
| విరూపాక్షుఁడు సుగ్రీవునిచే హతుఁడగుట | 405 |
| సుగ్రీవుఁడు మహోదరునిఁ బరిమార్చుట | 407 |
| మహాపార్శ్వుఁ డంగదునితో యుద్ధమొనర్చి హతుఁడగుట | 408 |
| సుపార్శ్వుని మరణము | 409 |
| రావణుఁడు స్వయముగా యుద్ధముసేయుట | 411 |
| రామలక్ష్మణులు రావణుని నెదిరించి పోరాడుట | ,, |

రావణుడు తనకడ్డువచ్చిన విభీషణునిపై శక్తిఁ బ్రయోగించుట 415
లక్ష్మణుడు విభీషణుని కడ్డుపడుట 416
రావణుఁడు లక్ష్మణునిపై శక్తినిఁ బ్రయోగింప నాతఁడు మూర్ఛిల్లుట ,,
శ్రీరాముఁడు రావణునితో యుద్ధముసేయుట - లక్ష్మణుని
రొమ్మునఁ నాఁటిన శక్తిని పెకలించుటకు వానరులు
ప్రయత్నించి తీయలేకపోవుట 417
శ్రీరాముఁ డాశక్తిని పెకలించి భగ్నముసేయుట 418
శ్రీరాముఁడు లక్ష్మణునిపైఁ బ్రయోగించిన శక్తిని నూడదీసి రావణుని
వధింతునని ప్రతిజ్ఞ చేయుట ,,
లక్ష్మణుఁడు మూర్ఛనుండి తెప్పిఱిల్లకపోవుటఁ జూచి శ్రీరాముఁడు
విలపించుట 421
సుషేణుఁడు శ్రీరాము నోదార్చి, సంజీవకరణినిం దెమ్మని హనుమం
తున కాజ్ఞాపించుట 422
హనుమంతుఁడు తెచ్చిన యౌషధముచే సుషేణుఁడు లక్ష్మణునిఁ
దెప్పిఱిల్లఁజేయుట 424
లక్ష్మణునిఁ జూచి శ్రీరాముఁ డానందమునొందుట ,,
రావణుఁడు శ్రీరామునిపైకి యుద్ధమునకు వచ్చుట 426
శ్రీరాముడు యుద్ధసన్నద్ధుడు కాఁగా, ఇంద్రుడు మాతలితో తన
దివ్య రథమును బంపుట 427
రామరావణ మహాసంగ్రామము. రావణుఁడు మహాశౌర్యమున
విజృంభించుట 428
శ్రీరాముఁడు రావణు నెదుర్కొనుట రావణుఁడు వైచిన శూలము
ఖండించుట 430
రావణుడు చూపిన శౌర్యపరాక్రములకు శ్రీరాముడు మెచ్చుకొనుట 432
రాముని తేజమువలన నొకింత మైమఱచిన రావణుని రథమును
సూతుఁడు మఱల్చుట - రావణుఁడు సూతు వదలించుట 434

సూతుని ప్రత్యుత్తరము 435

సూతుని మాటలకు రావణుఁడు మెచ్చి రామునిపైకి యుద్ధమునకు
సన్నద్ధుఁడగుట 436

శ్రీరామ రావణులు సరిసమానముగా యుద్ధముసేయుట - శ్రీరాము
డలసి రావణుని వధించు నుపాయము జింతించుట 437

అగస్త్యుఁడు శ్రీరామచంద్రునికి, ఆదిత్యహృదయము నుపదేశించుట 439

శ్రీరాముఁ డగస్త్యుని యాదేశానుసారముగ నాదిత్య మంత్రము
జపించుట - సూర్యుఁడు ప్రత్యక్షమై జయమగునని
యాశీర్వదించుట 443

శ్రీరాముఁ డుత్సాహముతో రావణు నెదుర్కొనుట ,,

రామరావణుల యుద్ధము - దేవదానవులు జయాపజయములనుగూర్చి
యాతురతతో నుండుట రావణున కశుభ శకునములు గానఁ
బడుట - వానిని లక్ష్యపెట్టక యాతఁడు యుద్ధము
సాగించుట 445

రావణుడు పరాక్రమించుట చూచి శ్రీరాముఁడు లోకమంతయుఁ
దల్లడిల్లునట్లొక బాణము నాతనిపైఁ బ్రయోగించుట. దేవతలు
శ్రీరామునికి జయమగుగాక యని యాశీర్వదించుట 448

రామబాణము రావణుని మస్తకముల ఖండింపఁగానే వెంటనే యవి
మొలచుట - రాముఁడు వానిని ఖండించుచు రావణునిజంపు
నుపాయ మాలోచించుట 449

మాతలి శ్రీరామునితో బ్రహ్మాస్త్రము ప్రయోగింపుమని చెప్పుట 451

బ్రహ్మాస్త్ర వర్ణనము ,,

శ్రీరాముఁడు బ్రహ్మాస్త్రము ప్రయోగింపగనే బ్రహ్మాండ మంతయుఁ
దల్లడిల్లుట - అది రావణుని వక్షముఁ బగులజేయు నతఁడు విగత
జీవుఁ డగుట 452

రావణుని మరణమునకు లోకము హర్షించుట - వానరసైన్యము

| | |
|---|---|
| నానందము నొందుట | 453 |
| విభీషణుఁడు రావణుని మరణమునుగూర్చి విలపించుట | 455 |
| శ్రీరాముఁడు విభీషణుని నూరడించుట-రావణునికి పరలోకవిధులు నెరవేర్పుమని హెచ్చరించుట | 457 |
| రావణు మృతికి రాణివాసస్త్రీలు శోకించుటట | 459 |
| మండోదరీ విలాపము | 461 |
| సఖులు మండోదరి నూఱడించుట | 467 |
| విభీషణుఁడు రావణుని కంత్యక్రియలు చేయనని చెప్పుట | ,, |
| రాముడు విభీషణుని కట్టిపని తగదని చెప్పుట | ,, |
| విభీషణుఁడు రావణుని కంత్యక్రియ లాచరించుట | 468 |
| శ్రీరాముఁ డింద్రసారథిని వీడ్కొలుపుట | 470 |
| సుగ్రీవు నభినందించుట | ,, |
| విభీషణునికి లంకారాజ్యపట్టముఁ గట్టుట | 471 |
| శ్రీరాముఁ డాంజనేయునితో - సీతాదేవితోఁ దమ జయవృత్తాంతము నెఱిగింపుమని పంపుట | 472 |
| ఆంజనేయుఁ డశోకవనముఁ జేరుట | 473 |
| శ్రీరామ విజయమునకై సీత యానందము ప్రకటించుచు నాంజనేయుని ప్రశంసించుట | 474 |
| ఆంజనేయుఁడు సీతను బాధపెట్టిన రాక్షసకాంతలఁ జంపెదనని చెప్పుట | 475 |
| సీత యాతనిని వారింపుచు శ్రీరాముని జూడఁ గోరెదనని చెప్పుట | ,, |
| శ్రీరామునాజ్ఞచే హనుమంతుఁడు సీతను నలంకరించి రామునియొద్దకుఁ దోడివచ్చుట | 477 |
| సీతనుఁ జూచుటకుఁ గపులును రాక్షసులును త్రోసికొనువచ్చుచుండ విభీషణుఁడు వారి నడ్డగించుట | 480 |
| శ్రీరాముఁ డాతని నివారించుట | ,, |

శ్రీరాముఁడు, రావణునింట నుండుటచే సీత నేలుకొనననియామె శీలమును శంకించుట 482

సీత యామాటలువిని యగ్నిహోత్రముఖమున తన పాతివ్రత్యము నెఱుకపఱచెదనని ప్రతిజ్ఞ చేయుట 484

శ్రీరాముఁ డందుల కియ్యకొనఁగా సీత యగ్నిప్రవేశము సేయుట 486

బ్రహ్మేంద్రాది దేవతలు ప్రత్యక్షమై సీత పాతివ్రత్యము లోకమునకుఁ దెలుపుట 488

బ్రహ్మ శ్రీరాముని తత్త్వమును - మహాత్మ్యమును నెఱుకపఱచుట 490

అగ్నిపరిశుద్ధయగు సీతను బ్రహ్మ శ్రీరామున కర్పించుట 492

శ్రీరాముఁడు సీతను పరిగ్రహించుట ; శివుడు శ్రీరాముని పట్టాభిషిక్తుఁడవు గమ్మని చెప్పుట 494

దశరథ సందర్శనము 495

దశరథుఁడు శ్రీరామునితో, సీతతో లక్ష్మణునితో, వేర్వేరుగా మాటలాడి శ్రీరాముని పట్టాభిషేకము చేసికొమ్మని యంతర్హితుండగుట 495

శ్రీరాముఁ డింద్రుని వరముచే వానరులను బ్రదికించుట 498

వానరులు సంతోషముతో తమతమ నెలవుల కేఁగుట 499

శ్రీరామాదులు సుఖముగనుండుట ,,

శ్రీరాముఁడు విభీషణునితో తా నయోధ్యకు వెడలుటకుఁ బుష్పక విమానముఁ దెచ్చుట కాజ్ఞాపించుట 500

శ్రీరామునాజ్ఞప్రకారము విభీషణుడు పుష్పక విమానము శ్రీరాము నెదుటఁ బెట్టుట 502

శ్రీరాముఁడు వానరులకు బహుమతుల నిప్పించి తా నయోధ్య కేగెదనని చెప్పుట ,,

వానరులు శ్రీరామునితో తామును నయోధ్యకు వచ్చెదమని చెప్పుట 503

శ్రీరాముఁడందుల కంగీకరించి సీతాలక్ష్మణ వానరసహితుఁడై
యయోధ్యాపురి కరుగుట 504

శ్రీరాముఁడు సీతకు పూర్వవృత్తాంతముల నతిఁగించుట 505

మార్గమధ్యమున సీత కోరికపైని సకలవానరుల భార్యలను సుగ్రీవుఁడు
తీసికొనివచ్చుట 507

శ్రీరాముఁడు తిరిగి పూర్వవృత్తాంతములను దెలుపుట 508

అయోధ్యాపుర సందర్శనము 510

భరద్వాజు నాశ్రమంబున శ్రీరాముఁడు దిగి యాతనివలన భరతుని
వృత్తాంతము నెఱుంగుట ,,

భరద్వాజుఁడు దివ్యదృష్టివలన నెఱిఁగి వృత్తాంతము దెల్పి
శ్రీరామునిఁ బ్రశంసించి వరమడుగుమని కోరుట 511

శ్రీరాముఁడు వానరులకు వనములోఁ గావలసిన ఫలహారముల
నొసంగుమనుట - తా నాశ్రమమున విశ్రమించుట 513

శ్రీరాముఁడు హనుమంతునితో తామువచ్చిన వృత్తాంతము గుహ
భరతుల కెఱింగించి భరతుని మనసెటులున్నదనియుఁ గనుఁ
గొనిరమ్మని చెప్పుట 514

హనుమంతుఁడు గుహునితో శ్రీరామునిరాక నెఱింగించుట 515

నందిగ్రామమున మునివృత్తిలోనున్న భరతుని హనుమంతుఁడు
సందర్శించుట 516

హనుమంతుడు భరతునితో రామసందేశము నివేదించుట 517

భరతుఁడు శ్రీరాముని వృత్తాంతము వినఁగనే యత్యానంద భరితుఁడై
హనుమంతుఁ బ్రశంసించి, యాతనివృత్తాంతమడుగుట 519

హనుమంతుఁడు భరతునితో తనఁయుదంత మెల్లను తెలిపి శ్రీరామ
సమాగమ మగునని చెప్పుట 520

భరతుని యానతిని శత్రుఘ్నుఁ డయోధ్య నలంకరింపఁజేసి
కౌసల్యాది రాజమాతలను దోడ్కొనివచ్చుట 522

భరతుఁడు వారందఱితో శ్రీరాముఁ దర్శింప నేగుట 523

శ్రీరామ భరత సమాగమము - భరతుఁడు శ్రీరాముని రాజ్యభారము
వహింపుమని పాదుకలు తోడుకుట 525

శ్రీరాముఁడు వసిష్ఠునికి కౌసల్య మొదలగు రాజమాతలకు మ్రొక్కి
వారి దీవనలు గొనుట 527

భరతు కోరిక ననుసరించి భరతాశ్రమమునకు శ్రీరాముఁడువచ్చి,
పుష్పక విమానమును కుబేరున కనుచుట 528

భరతుఁడు శ్రీరాముని రాజ్యభారము వహింపఁ బ్రార్థించుట 529

శ్రీరాముఁడు భరతుని ప్రార్థన మంగీకరించి, వసిష్ఠానుమతమునఁ
బట్టాభిషేకమునకు నయోధ్యకు నలంకృతుఁడై వెడలుట 531

శ్రీరామ పట్టాభిషేకము 535

శ్రీరాముఁడు బ్రాహ్మణులకు సుగ్రీవ విభీషణాది హితులకు నుపకర
లిచ్చుట - సీతామహాదేవికి తారహార మొసగుట 537

సీత యా తారహారమును హనుమంతున కొసగుట 538

శ్రీరాముఁడు విభీషణుని శ్రీరంగశాయి నొసగి యాతని తన
మారుగాఁ బూజింపుమని యాజ్ఞయిచ్చుట - వానరాదులు
విభీషణునితో తమ తమ నెలవులకు వెడలిపోవుట 539

భరతునికి యువరాజపట్టము గట్టుట 540

శ్రీరామరాజ్యమున సకల ప్రజలు సౌఖ్యమునందుట 541

కాండాంతగద్యము 542

ఫలశ్రుతి ,,

గ్రంథసమాప్తి 544

ఓం తత్సత్

శ్రీరామచంద్రాయనమః.

# తప్పొప్పుల పట్టిక



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 11 | చేఁవిని | చేవిని |
| 2 | 29 | జేనయ్యు | చేనయ్యు |
| 4 | ,, | నెఱిగించి | నెఱిఁగించి |
| ,, | ,, | నకు | నకుఁ |
| ,, | ,, | దిట్ట | దిట |
| 8 | 158 | బడ | దడ |
| ,, | 171 | పదార్థ | పరార్థ |
| ,, | 175 | శ్వర్యయై | శ్వర్యమై |
| 10 | 223 | మూావు | మూాపు |
| 12 | 251 | వానిరు | వానరు |
| 17 | 372 | లెక్క | ఱెక్క |
| ,, | 76 | వీఱడి | వీఱఁడి |
| 21 | 457 | పలుకు | పలుకుఁ |
| ,, | 77 | చేఁనె | చేనె |
| 24 | 538 | తాఁకవ్వ | తాఁగవ్వ |
| 26 | 75 | గది | గద |
| 39 | 881 | నగరిగా | నగరికా |
| 57 | 1296 | చెలి | చెల్మి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 65 | 1501 | తెవచి | తెఱచి |
| 69 | 79 | ధికృతి | ధిక్కృతి |
| 75 | 1720 | శేవధి | సేవధి |
| 128 | 2841 | నాకడి | నాకడ |
| 134 | 2970 | పెంకు | టెంకు |
| 135 | ,, | దుఁఖము | దుఃఖము |
| ,, | 2998 | పొగలు | పొగులు |
| 139 | 3087 | కృతిమ | కృత్రిమ |
| 141 | 3127 | నసురల | నసురుల |
| ,, | 33 | నపుపుడు | నపుడు |
| 143 | 70 | నడిపిందు | నడిపించు |
| 145 | 3226 | శత్రులఁగెలు | శత్రులగెలు |
| 154 | 32118 | కోడలు | కోటలు |
| 158 | 522 | యు-మురీతి | యుగమురీతి |
| 194 | ,, | రావణుఁడు | రాముఁడు |
| 219 | 4920 | పళికె | పలికె |
| 240 | 5379 | విధింప | వధింప |
| ,, | 5402 | సారెధి | సారథి |
| 241 | 418 | నొంచింతి | నొంచితి |
| ,, | 421 | కలిగిన | గలిగిన |
| 284 | 6416 | విభీషణా | విభీష |
| ,, | 17 | దాగ్రజు | ణాగ్రజు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 290 | 573 | నగ్రోళ్లు | నఁగ్రోళ్లు |
| 305 | ౨07 | నక్కోళ్లు | నక్కిళ్లు |
| 311 | 7054 | దప్పినెవ్వ | దప్పియెవ్వ |
| 313 | 05 | వింద్య | వింధ్య |
| 321 | 7217 | యెల్లె | యల్లె |
| ,, | 279 | బేర్కొవి | బేర్కొని |
| 323 | 318 | మీాదు | మీాఱు |
| ,, | 316 | గడ | గడె |
| 325 | 67 | గొాఱవ | గొాఱవు |
| 326 | 410 | పన ? సా | పనసా |
| 27 | 421 | రాఘువు | రాఘువు |
| 28 | 39 | చెవి | చెవి |
| ,, | 48 | లార్చ్బుదా | లార్చ్బుదా |
| 42 | 762 | జెనియలి | జెలియలి |
| 43 | 769 | పడిగ | పడగ |
| 64 | 8287 | వంక | పంక |
| 75 | 549 | మ్మదు | మృదు |
| 80 | 655 | భూంచి | చూంచి |
| 81 | 688 | తోఁఽగ | తోరఁగ |
| 82 | 719 | క్రీడఁలిగ | క్రీడఁగలిగ |
| 97 | 9063 | దాకి | దాఁకి |
| 98 | 78 | కొారవి | కొాఱవి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 400 | 118 | తమ్మున | తమ్ముని |
| 3 | – | రావణు | రావణు |
| 7 | 295 | యుమ్ము | యమ్ము |
| 9 | 341 | అసురా | ఆసురా |
| 411 | – | రాపణు | రావణు |
| 17 | 8 | యొదలో | మెదలో |
| 420 | 9585 | గాదానుఁ | గాఁదాను |
| 422 | 630 | కొదిగె | కొతిగె |
| 441 | 10061 | నకు – చామీా | నకు దివ్య–చామీా |
| 452 | 305 | తెగరె | తెగిరె |
| 460 | 475 | చెదర | చెదరఁ |
| ,, | 476 | చెంగావి | జెంగావి |
| ,, | 494 | భూమిను | భామిను |
| 476 | 879 | దశను | దశము |
| 483 | 11011 | యాడికె | యాడిక |
| 487 | 11113 | తపమ | తపము |
| 491 | 11207 | లక్షి | లక్ష్మి |
| 507 | 560 | వొంటియే | ఒంటియే |
| 509 | 608 | డెదిర్చు | డెదుర్చు |

———:o:———

కట్టావరదరాజకృతమగు

# శ్రీ రామాయణము

## యుద్ధకాండము

———:o:———

శ్రీరాజితశుభాంగ! - చిరగుణసంగ!
హారికృపాపాంగ! - యలమేలుమంగ
భావుక! శతకోటి - భానుసంకాశ!
సేవకాత్మనివేశ - శ్రీవేంకటేశ!
అవధారు! కుశలవు - లారామచంద్రుఁ
డవధరింపంగ రా - మాయణంబెల్ల
వినిపించు తత్కథా - వృత్తాంతమెల్లఁ
గనుపించు నవ్వాలి - కథ యెట్టులనిన

—: శ్రీరాముఁడు సీతావృత్తాంతముఁ దెల్పినందులకు హనుమంతునభినందించుట :—

శ్రీరామచంద్రుఁడా - సీతవృత్తాంత
మా రమణీమణి - యనిన మాటలను 10
హనుమంతుచేఁ విని - యాకులితానంద
మునఁదేలి మానసం - బున వెఱఁగంది

తన తమ్ముఁడును వాలి - తమ్ముఁడంగదుఁడు
ననిలజాదులు విన - నప్పుడిట్లనియె.
"ఈవాయునందనుఁ - డేరీతి దాఁట
నావారిరాశి మ - హాజవశక్తి
నెంతటివాఁడొకో - నెక్కుటిఁబోయి
యింతటి బలుగార్య - మీడేర్చె మఱల!
అమరగంధర్వవి - ద్యాధరాదులకు
నమరునే నీరీతి - నాలంకఁ జొరఁగ? 2()
చొచ్చిన మఱలిరా - సులభమే? కడచి
వచ్చె నింతియకాక - వాయునందనుఁడు!
తనకొక్క యితని యం - తటివాఁడుగలుగ
నినసూను గార్యంబు - లెల్ల నీడేఱె!
తన్నేలినవాఁడు - దలఁపఁగార్యంబు
లన్నియు నీడేర్చు - నతఁడె యుత్తముఁడు
చెప్పిన మాత్రంబు - చేసెద ననుచుఁ
దప్పించుకొన్న య - తఁడు మధ్యముండు
వలనని జేనయ్యు - స్వామికార్యములు
తలఁచక చెఱుచు న - తండధముండు 30
వాయుజుఁడిందులో - వాఁడుగా దొరులు
సేయఁగూడని యాయ - జేయపౌరుషము
చేసి యేలికమాటఁ - జెల్లించి మాట
వాసిగైకొని తమ - వారమైనట్టి
మా మనస్తాపముల్ - మానిచెఁగానఁ
దామించె నుత్తమో - త్తముఁడనినితఁడు!

నాకును లక్ష్మణు - నకు భరతాది
కాకుత్థ్సవంశజే - ఖరులకు నెల్ల
సీతను జూచి వ - చ్చినమహాకార్య
హేతువుచే నావ - హిల్లె సౌఖ్యములు. 40
తప్పనిధర్మంబు - తనకుఁదోడయ్యె
నిప్పు డింతటి పుణ్యుఁ - డిలఁబుట్టుకతన.
చనవిచ్చి మాకింత - సంతోషవార్త
వినఁబల్కి లోకైక - విఖ్యాతిఁ గన్న
యీసమీరకుమారు - నింతగా మెచ్చి
యేసొమ్ము లీనేర్తు - నిపుడున్నయునికి ?
నాచేతనైన న - న్నన వేఱలేదు
లేచి నేఁజేతు నా - లింగనం" బనుచు
నతిశయ బహుమాన - మదిగాన రాముఁ
డతనిఁ గౌఁగిటను నిం - డారంగఁజేర్చి 50
"అనిలకుమార ! యీ - యంబుధి దాఁటి
జనకజఁ గాంచి యి - చ్చటికి వచ్చితివి
నీరధి నీకొక్క - నికె చెల్లెఁగాక
తేఱి చూచెదమన్నఁ - దీఱదన్యులకు !
కపివీరులేడ ? లం - కాద్వీపమేడ ?
యపరిహార్యంబు నా - యాబోధనంబు
నది యేఁదలంచి పా - యని చింతతోడ
మదిఁ గలఁగెద నొక్క - మారు నాతోడ
నిది మార్గమను" మన్న - నీక్షించిరాముఁ
గదిసి సుగ్రీవుఁడు - తక్కంత నిట్లనియె. 60

—: సుగ్రీవుఁడు తనబలము నెఱిగించి శ్రీరాముని కర్తవ్యమునకు బురిగొలుపుట :—

" దేవ ? మీరిపుడు చిం - తిలవేళగాదు
రావణుఁడనుము కా - ర్యంబది యెంత ?
వసుమతీపాలుఁ డ - వ్యవసాయుఁడైన
నసమడింపకయుండు - రహితభూవరులు
పగవాని యునికి యే - ర్పడియును వాని
తెగఁ జూడవలెగాక - దిట్టఁ దప్పఁదగునె ?
ఈయున్నవానరు - లిందఱు దనుజ
మాయావిదూరు లే - మఱవును మఱపు
చేతప్పు వాతప్పు - చెదరును బెదరు
నేతరి నొకరైన - నెఱుఁగ రెన్నడును 70
దాఁపనేమిటికి ? యిం - దఱు నీదుకొఱకు
దాఁపరు ప్రాణముల్ - దావాగ్నియైనఁ
జొచ్చెద మనుచు నెం - చుకయున్నవారు
మెచ్చులందఁగ మెఱ - మెచ్చులుగావు.
దాఁటిపోవఁగ సము - ద్రము వీరలెల్ల
నీటికాలువగ నె - న్నినవారుగారు.
ఉంకింతు కుప్పింతు - రొకదాఁటు చేత
నింకింపవలసిన - నింకఁ జేయుదురు !
గట్టిగా సేతువు - గట్టి పోవుదురు.
గుట్టలు చట్టలు - గుప్పలు వైచి ! 80
మీకే విచార మే - మిటికి ? నీకార్య
మీ కపులకె భార - మీడేర్చుటకును
నారావణునిఁ జంపి - యవనిజంబుచ్చి

యోరామ ! వీరె మీ - కొప్పగింపుదురు
ననువంటి యాప్తుఁడుం - డఁగ నిట్టి వీర
వనచరబలము కై - వశముగానుండ
నిది ఘన మిదికొంచ - మిది నాకు సాధ్య
మిది యసాధ్యముచేత - నిదియగు చేత
యిదిగాదు నాకను - నెన్నిక యేల ?
ఇది చూడు మొకసెల - విచ్చి యుండటను 90
రణకోవిదుఁడ వీవు - రఘువీర ! నీకుఁ
దృణమాత్రుఁడైన దై - తేయ నాయకుఁడు
నెదిరింప నేర్చునే ? - యింద్రాదులైన
కదనంబులోనిల్వఁ - గలరె నీయెదుర ?
అట్టి నీప్రాపున - నగచరులెల్లఁ
జుట్టవేసుక లంక - సుడిసిన యపుడె
రావణుఁ బొరిఁగొని - రఘురామ ! నీదు
దేవి నీఁగలరు సం - దేహమేమిటికి ?
పార్థివు లుత్సాహ - పరులుగాకున్న
వ్యర్థంబులగు వారి - యత్నంబులెల్ల
ధరణీశులేయూరు - తాల్మియేయూరు ?
మఱువు మీచింత దీ - మసముఁగైకొనుము."
అని విని యగుగాక - యని హనుమంతుఁ
గనుఁగొని జానకీ - కాంతుఁడిట్లనియె.

—: శ్రీరాముఁడు లంకనుగూర్చి రావణుని సేనావిశేషంబుల గూర్చి హనుమంతు నడుగుట :—

"తపముచేనైన కో - దండపాండిత్య
నిపుణతచేతనే - నియుఁ గట్టకట్టి

యందుపైనైన నీ - యంబుధిదాటి
కదలిపోవుదము లం - కాగిరిదుర్గ
మది యెట్టులుండు ? సా - లావరులెన్ని ? 110
ఎన్నివాకిళులుండు ? - నెంతంతమూఁక
యున్న దీపురమెట్టు - లుండు ? రావణుని
కైజీతమెంత ? య - గర్తలెట్టుండు ?
వాజివారణరథా - వళి యెంతకలదు ?
ఆకోట సవరణ - యదియెట్లు ? నగరి
వాకిట నడచు ప్ర - వర్తకంబేది ?
వివరింపు" మనరఘు - వీరునిఁ జూచి
పవమానతనయుఁడు - బలికె కేల్మోగిచి.

—: ఆ విశేషములను హనుమంతుఁడు రామున కెఱింగించుట :—

"దేవ ! యాలంక సా - ధించెద మనుచు
దేవాసురలకైన - ద్రిష్టింపరాదు ! 120
చతురంగబలము ల - సంఖ్యముల్ వాటి
మితి యింతయనఁగ నే - మిటికెవ్వఁడెఱుఁగు ?
నవరత్నఖచితమై - న సువర్ణసాల
మవఘళించు విమాన - మార్గములకును !
ఆరసాతలమైన - యాకోటపరిఘ
నీరు నక్రగ్రాహ - నిబిడమైయుండు !
ఆకోట దగుత్రికూ - టాచలాగ్రమున
నాకొండ కగడితమై - వార్ధియమరు

వనదుర్గమచట ను - ర్వర మఱికాన
మనఁజెల్లు గిరిదుర్గ - మదిగాక లేదు 130
జలదుర్గములయందు - సాటి యెక్కడిది ?
జలరాశి నడుమఁ బ్ర - శస్తమై యునికి.
ఆకోట నలుదిక్కు - లందుల నాల్గు
వాకిళ్లు కడు బల - వంతంబులెపుడు.
లంకవారలకు ను - ల్లాసమైనట్టి
వంకదారులను సా - వళ్లును గలిగి
కాంచనస్తంభ సం - గతములైనట్టి
దంచనంబులను గొ - త్తడములచేత
నాళవరులచేత - నట్టళ్లచేత
రాలబల్గుండ్లు ఫి - రంగులచేత 140
జబరు జంగుల బాణ - జాలంబుచేత
నిబిడమైన యాకోట - నిండారియుండు.
అమరాద్రిపై స్వర్గ - మనఁగ నాలంక
యమరుఁ ద్రికూటాద్రి - యగ్రభాగమున
బారులు దీర్పించి - పదియునైదింట
నారావణుండు లం - కావరణంబు
ద్వారభాగముల సౌ - ధములపై నిలిచి
వారు వారల భటా - వళిఁజూచిపోవు
తమకంబుమీఁదట - తాఁ గొలువుండి
యమరారి విభుఁడు మా - సాంతికంబులను 150
దనదుకై జీతమం - తయుఁ జూచి భటుల
మనువులీడేర్చు ఉ - మాశాలియగుచు.
దుర్గమంబులుగ నం - దున కృత్రిమంపు

దుర్గముల్ దేవతా - దురతిసాధ్యములు ?
అందుఁ బట్టునుఁబాఱు - నాపగాశతము
లందు నెచ్చట నోల - లాడ వెన్నడును
పడమటివాకిట - బలుసుక యసుర
బడములు నియుతంబుఁ - దరలక యుండు
దక్షిణాశాముఖ - ద్వారంబునందు
రాక్షస ప్రయుతమే - రాళ్మై కాచు 160
తూరుపు గవనియం - దుల ఘోరదనుజ
వీరార్బుదంబెల్ల - వేళ వసించు
నర్బుద సంఖ్యకు - నసమాన శౌర్య
కర్బురస్తోమంబు - కాచు నెల్లపుడు.
ఉత్తర గోపురం - బుక్కళంబులను
యుత్తనిశాట ప - ద్మములు వసించు
నాలంక నడుచక్కి - నగణితంబుచు
ప్రాలుఁనల్లు గుమార - వర్గమంతయును
జుట్టలపై కమా - చుట్టు నప్పారికిఁ
బెట్టని కోటయైన - పెరుగు శౌర్యములు 170
రథగజతురగప - దార్థంబులొప్పు
పృథుగతి నన్నగ - రీ వీథులందు
దొరలును హితులు మం - త్రులు గల్మిబలిమి
యొరిమల జతఁగూడి - యుందు రందఱును
రావణైశ్వర్యమై - రావణప్రభువు
జేవలఁ గొనఁజాలు - శ్రీరామచంద్ర !
స్వామిముద్రవహించు - సత్తువచేత
దోమలుగాఁగ దై - త్యులనెల్ల ద్రుంచి

లంకఁగాలిచి కొత్త - శమ్ములు ద్రొబ్బి
కొంకక బలుఫిరం - గులు పడఁద్రోచి 180
పూజించుఁ దోమరం - బులు నుగ్గుసేసి
రాజగేహమును స - ర్వము రూపుచెఱచి
యమ్మవారినిఁ జూచి - యంబుధిదాఁటి
మిమ్ము సేవించితి - మిగిలినవేల !
గ్రక్కునఁ బయనమై - కదలి యేరీతి
చక్కగా నటుల యీ - జలరాశి దాఁటి
కపులును మీరు లం - కకుఁ జేరవలయు
నపుడె రావణుమాట - హరువయ్యెననుఁడు !
ఈతారపట్టియు - నీజాంబవంతుఁ
డీతారుఁడును మైందుఁ - డీద్వివిదుండు 190
ఈనలుఁడీగజుఁ - డీ సుషేణుండు
జానకీరమణ! దా - ఁచగనేల మీకు
కోటలతో సౌధ - కూటాలితోడ
ఘోటక రథగజ - కోటులతోడ
రావణాసురునితో - రాక్షసశ్రేణి
తో వారి వెలఁదుల - తో లంకతోడ
నలత్రికూటాద్రి మీ - రానతిచ్చినను
జులకఁగాఁ బెల్లగిం - చుక చేతనుంచి
యిపుడె తేనోపుదు ! - రినసూనుఁ గొలుచు
కపుల సామాన్యులఁ - గా నెన్నవలదు ! 200
పాళెంబులకు నెల్ల - పయనముల్ చెప్పి
వేళంబె లంకపై - విడుతురు గాక !

ఆలస్య మేల ''న్న - హనుమంతుమాట
చాలమెచ్చుచు రామ - చంద్రుఁడిట్లనియె.

—: సుగ్రీవునితో శ్రీరాముఁడు లంకపై వెడలుటకు సైన్య
మాయత్తము సేయుమని చెప్పుట :—

'' వినుము సుగ్రీవ ! యీ - వేళనే కదలి
చనుదము లంక భ - స్మము సేయువాఁడ !
సమరమైన సరాక్ష - సముగా సబాంధ
వముగ ససోదరా - వళిగ సపుత్ర
పౌత్రంబుగా నాదు - బాణజాలములఁ
జిత్రంబుగాఁగఁద్రుం - చెద దశాననుని 210
విసువుతో విషము ద్రా - వినవాని నమృత
రసము ప్రాణము నిల్పి - రక్షించినట్లు
అభిజిన్మహూర్త మా - హావభూమిఁ దనకు
శుభము చేకూర్చు తే - జోలాభ మొదవు
ఉత్తరానక్షత్ర - మొప్పు మాపేర
హత్తియుండదు రేపు - హస్త పైనంబు
నీపగల్ గదలిన - నేపగల్ గెలుతు
నాపగాధిపు దాఁటి - యాపదల్ గడతు.
నీముహూర్తంబున - నేఁగిన మనకు
భూమిజ చేకూడుఁ - బోదము నేడు 220
చూడుము ! కనుపట్టె - శుభశకునములు
వేడుక మదిసంభ - వించె నాకిపుడు
వలకన్ను చలియించె - వలమూపు గదలె
వలనయ్యె వనఘగ - ప్రాతంబు మనకు ! ''

అనునట్టి మాటకు - ననుజుఁడు భాను
తనయుఁడు కడు సమ్మ - దము నొందఁజూచి
నగచరులకుఁ బయ - నములు చెప్పించి
యగణితమతి రాముఁ - డప్పుడిట్లనియె.

—: శ్రీరాముఁడు నీలుని వానరసైన్యముల కధిపతిగాఁ జేసి యితర వానర వీరులనుపసేనాపతులుగా జేయుట :—

" అనలసంభవ ! నీల ! యని మొనల్ దీర్పు
వనచరులకుఁ జన - వాయివి నీవు 230
దళములకును మార్గ - దర్శివై నీవు
ఫలమూలములు గల్గు - పథమున మొదట
జనము దుర్మతులు రా - క్షసులు మార్గములు
చనరాకయుండ మో - సములు సేయుదురు.
చదలంబును దళంబు - సవరణతోడఁ
బదిలంబు గాచుచు - పట్టు లేమఱక
పాళెముల్ దిగుచోట - పయనమై కదలు
వేళ నెచ్చరికతో - వేలంబుఁగాని
పర్వతవన నదీ - భాగంబులందు
సర్వసైన్యంబుల - జతనంబుతోడ 240
డింపుము లేలు ని - ద్రింపకఁ జుట్టు
కంపకోట ఘటించి - కావు మందఱను
గజుని గవాక్షుని - గవయునిఁ బిలిచి
ప్రజలకు మున్నుగాఁ - బంపుము మొనల.
వలపంక ఋషభుఁడు - వచ్చు డావంక
నలగంధమాదను - లరుగు సేనలకు

హనుమంతుపై నేను - నంగదు మీఁదఁ
దన సోదరుఁడు నెక్కి - ధరణీధరారి
చౌదంతి మీఁదను - సార్వభౌమంబు
మీఁదఁ గుబేరుఁడు - మించిన యట్లు 250
సేనల నడుమ వ - చ్చెదము వానిరుల
నానంద మగ్నుల - మై కనుఁగొనుచు.
ఈ వేగదర్శియు - నీ జాంబవంతుఁ
డీవలావల రాఁగ - నీ సుషేణుండు
ముందఱగాఁగ నీ - మువ్వురుఁ గాచి
యుండందుఁ జనువేళ - నండ రాఁగలరు.
వెనుకగా మైందద్వి - విద నల తార
పనసాది వానర - ప్రభువులు గొలువ
రానిమ్ము సుగ్రీవు - రణభేరి మొరయఁ
గానిమ్ము పయనమై - కదలు" మీ వనిన 260
విని భానుతనయుండు - వేడుక నటులఁ
జనుఁడంచుఁ గపుల నా - జ్ఞాపించుటయును

—: శ్రీరామాదులును నంగదాదులును లంకపైకి వానరసైన్యములతోఁ గదలుట - వానరసైన్య ప్రయాణ వర్ణనము :—

అంగదాదులు రాము - నానతి మతులఁ
బొంగుచు ఫాల్గుణ - పూర్వపక్షమున
దక్షిణాముఖముగా - దండెత్తి కదలి
రక్షీణశౌర్య బా - హాదర్పములను
వానరులెల్ల న - ల్వంకల బలిసి
తేనియ లానుచు - తియ్యని పండ్లు

నమలుచుఁ దానె జా - నకిఁ దోడి తెత్తు
సమయింతుఁ బట్టి ద - శగ్రీవు నొకఁడ 270
పోరిలో ననుచు ను - బ్బుచుఁ గేకలిడుచు
పేరెముల్ వారి కు - ప్పించి దాఁటుచును
జనుచోట నీల రి - షభ కుముదాది
వనచరాధిపులు త్రో - వలు గనుపించి
నడవ రాఘవులును - నలినాప్త సుతుఁడు
నడుచక్కిఁ గెలన వా - నరకోటి గొలువ
వచ్చునప్పుడు శత - వలి పదికోట్ల
చిచ్చుల పిడుగులై - చెలఁగు వానరుల
జతఁ గూర్చుకొని తానె - చాలి యాదళముఁ
బ్రతిరక్షఁ గావింపఁ - బొల్పడి నడచె. 280
ఆగూఢ గజపన - సార్కకేసరులు
నూరుకోటుల కపీం - ద్రులు తమ్ముఁ గొలువ
బారుఁదీరుక యొక - పార్శ్వంబునందు
నేరుపాటుగ వచ్చి - రిలయెల్ల నిండి
వారి వెంబడి జాంబ - వత్సుషేణాది
వీరులు తమమూఁక - వెంబడిఁ గొలువ
సుగ్రీవు వెనుక పోఁ - జులు దీర్చి కదలి
రుగ్రాంశుపదధూళి - యుక్కోలు కొనఁగఁ
గనుఁగల్గి సేనాని - గాన నీలుండు
చనుచోఁ బ్రచండుండు - జంభరభసులు 290
దధిముఖుఁ డాదిగాఁ - దనసైన్యపతులఁ
దరి చూచి వెనుక ముం - దఱఁ జదలంబు
కాచుకరాఁ బంపఁ - గనుఁగల్గి వార

లేచాయఁ బురముల - కెడ దూరములుగ
బలముల నడపించి - పల్లెలు నూళ్లు
చెలరేఁగి చిల్లర - సేయంగ నీక
కిముకననకుండ సు - గ్రీవాజ్ఞయందు
సమకట్ట సహ్యాద్రి - చాయఁగాఁ గదలి
పోవ వాయుజ వాయు - పుత్రులమీఁద
రావణుఁ బొలియింప - రామలక్ష్మణులు 300
చనుచోట వలనైన - శకునముల్ చూచి
తనయన్నతో సుమి - త్రా పుత్రుఁడనియె.

—: దారిలో లక్ష్మణుఁడు శుభశకునములను గాంచుట :—

" దేవ ! ప్రకాశించి - దినకరబింబ
మీవేళఁ దెల్లని - యెండలుగాసె !
జనకజాధిప ! బృహ - స్పతిశుక్రు లిప్పు
డనుకూలులైనవా - రతిశుభదృష్టి !
డాసి స ప్తర్షి మం - డలమా ధ్రువునకుఁ
జేసె నిప్పుడు ప్రద - క్షిణ మాకసమున !
మనువంశనృప ! నభో - మణి త్రిశంకుండు
తనపురోహితుఁడు నుఁ - దానుఁ జూపట్టె ! 310
నిరుపద్రవద్యుతి - నీ వంశతార
పరగ విశాఖ శో - భనహేతువగుచు
నసురుల నక్షత్ర - మైన యా మూల
పసయెల్లఁ జెడి ధూమ - పాళితోఁ దగిలి
తారకాసురుని యు - ద్ధంబున దివిజ
వార మెంతయుఁ జెలు - వముఁ గాంచినట్ల

వనచరు లుత్సాహ - వంతులై నారు !
మన గెల్పు రావణు - మరణంబె నిజము !
అవనిజతో నయో - ధ్యాపురిఁ జేరి
యవిరళసౌఖ్యంబు - లందఁ జాలుదువు" 320

—: శ్రీరాముడు సముద్రము దరిఁ జేరుట :—

అని యన్న నూరార్చి - యరుగుచోఁ ద్రోవ
వనజాకరములఁ బా - వన వనంబులను
చరులను గందర - సానుభాగముల
సురసిద్ధచారణ - సుందరీమణుల
శ్రవణమంగళగాన - సంచరద్భ్రమర
నివహంబులను మృగ - నికరంబుచేత
యమరు సహ్యాద్రిఁ బా - యని మలయాద్రి
క్రమియించి యవ్వలఁ - గనుపట్టుచున్న
హేమధాతువుల మ - హేంద్రాచలంబు
రామసౌమిత్రులు - రవికుమారకుఁడు 330
కపులునుఁ జేరి యా - గట్టుపై నెక్కి
యపుడు గన్గొనిరి మ - హాసాగరంబు !
ఆజలనిధిఁ గాంచి - యవనిజాప్రియుఁడు
రాజీవహితకుమా - రకుఁ జూచి పలికె.

—: శ్రీరాముఁడు వానరులతో సముద్రపుటొడ్డున నిమ్మైనచోట పాళెమువిడియుట :—

"రేవగల్గాఁగఁ జే - రితిమివారాశి
క్రేవకుఁ బై నేరి - కినిఁబోవరాదు.

ఏలీలఁ జనవచ్చు - నీవార్ధి మీఁద ?
ఆలోచనంబు సే - యఁగఁజెల్లుమనము !
సేనల విడియింపు - సింధుతీరమున
నీ వగాటవులలో - నిమ్మైనయెడల " 340
ననునంత రఘువీరు - నానతివలన
నినతనూజుఁడు నీలుఁ - డెల్లవానరుల
మూఁడు దిక్కులపాళె - ములువిడియించి
కూడి రాముని రఘు - కుంజరుల్ నడుమ
నెలకొని తగిన వ - నేచరశ్రేణి
బళనళంబుల నుండఁ - బనిచి చూచుట్లు
నుక్కళంబులఁ గపి - వ్యూహంబు నునిచి
యిక్కువల్ గాయంగ - నేర్పాటు సేసి
యున్నచో నారేయి - యుదధి యుప్పొంగి
మిన్నును దిశలాక్ర - మించి తూరుపున 350
నుదయాచలంబుపై - నుదయించు చంద్రు
సదమల చంద్రికా - సంపూర్తి చేత
నుల్లోలభయదమ - హోర్మిమాలికలు
పెల్లుబ్బి జలధర - బృందంబుఁ జెనక
మకరకర్కటమీన - మాలికల్ మింట
మకరకర్కటమీన - మండలిఁ బొదవ
రంగులీనుచు నున్న - రత్నంబు లెగసి
యంగారకాది గ్రహ - హాళితో నెనయ
జలశీకరంబులు - చదలెల్ల నిండి
కలఁగె నీతఘుకు చు - క్కల నల్లుకొనఁగ 360

నిది పయోనిధి నభం - బిదియని యొరుల
యెదలకుఁ దోఁచక - యేకీభవించి
యొప్పు నంబుధికి పె - న్నుద్దియై మొరసె
నప్పుడు వీరము - హాకపి జలధి
వేలంబు మైందద్వి - విదులు రేయెల్ల
నాలుగు జాములు - నాల్గుదిక్కులును
నెచ్చరికలఁగాచు - నెడ రఘువరుఁడు
ముచ్చటఁదీఱఁ ద - మ్మునిఁజూచి పలికె.

—: శ్రీరాముఁడు సీతనుగూర్చి విరహమునొందుట :—

"సీతను జోడువా - సిన తనకింక
నేతీరున భరింప - నెన్నిక గలదు ? 370
సౌమిత్రి ! యేనొక్క - క్షణమైన నోర్వ
నేమి సేయుదు ? లెక్క - లేటికి రావు
జానకి నెడఁబాయు - సంతాపభరము
పై నతిశయమయ్యె - భావంబులోన !
ఎటులున్నదియొ సీత - యెల జవ్వనంబు ?
కటకటా ! వీరిడి - గడతేఱునేమొ ?
నను నెడఁ బాసి మి - న్నక పదినెలలు
చనియెఁగాలంబు మో - సము చేసెఁ దన్ను
నేమి సేయుదు ? "నని - యెడనంత విసరు
సోమరి వలిగాలిఁ - జూచి రాఘవుఁడు 380
"ఓయి ! సమీర ! మా - యుర్విజమీఁద
హా ! యన మలసి య - య్యతివ నెమ్మేని
సంపంగితావి వీ - సరవోవసీక

ముంపుము నామేన - ముంచితివేని
యందుచేఁ గలుగు నం - గాంగసంస్పర్శ
నందిత నిరుపమా - నందమందెదను !
శీతాంశుఁడా ! నీవు - చేరరావయ్య !
సీత నెమ్మోముఁ జూ - చిన నిన్నుఁ జూచి
కన్నులు చల్లనై - కల్యాణిమోముఁ
గన్నకై వడి మేని - కాఁక మానుదును ! 390
విషపాన మొనరించు - విధమునఁ జాల
విషమసాయకుని క్రో - వ్విరులకు లొంగి
'హారామ ! హారామ ! ' - యనిపలవించు
నారామ వెతలెన్నఁ - డారునో యింక
ఈ వియోగము పేరి - యింధనావళుల
నావిచారంబను - నాల్కలేఁ జాఁచు
మదనానలంబు నా - మదిఁబాదుకొనియె
నది యార్పనొక యుపా - యముఁ గానమిపుడు
జలధిఁ జొచ్చినఁ గొంత - చల్లారునేమొ !
తొలఁగ దన్యమునఁ జే - తోజాతవహ్ని ! 400
నీసేమ మీయాంజ - నేయుని చేత
నోసీత ! విని కొంత - యూరడిల్లితిని.
సజలకేదారంబు - సంగడిఁ దనదు
రుజముఁ గోల్పోకఁ బై - రు చెలంగుకరణి
యిరువురము శయించు - నీవసుంధరయె
పరిణామ మిచ్చు నే - పట్టున మనకు.
ఏ వేళ జానకి - యెలనవ్వు మొగము
తావి యానుదుఁ దేఁటి - తామరఁబోలి ?

బడలువానికిఁదావి - పానకంబబ్బు
వడువుగదా సీత - వాతెఱ తనకు ! 410
మాలూరఫలముల - మఱపించు సీత
పాలిండ్లు కెంగేలఁ - బట్టుదు నొక్కొ ?
తనవంటి పతి గల్గి - ధరణిజ యిటుల
దనుజాంగనలు చుట్టుఁ - దను గాచియుండ
ననదయై యుండునే ! - యాయింతి తండ్రి
జనకుఁడు మామ కా - సల్యావరుండు
శారదసమయ ని - శాచంద్రరేఖ
వారిదంబుల నెడ - వాసిన రీతి
దనుజాంగనా నికో - ధము లొనరించి
నను జేరఁ రాఁగ నె - న్నడు జూడఁగలనొ ? 420
జవరాలు కడుపలు - చని మేనిదెపుడు
నవనిజ యిపుడు పే - రాఁకట నలఁగి
యెంత కృశించెనో ? - యెదురుగావచ్చి
యింతి కౌఁగిటఁ జేర్చు - టెన్నఁడో యింక ?
మైలచేల వదల్చి - మణుఁగు ధరించు
పోలిక మదిఁ గోని - పొరలు ఖేదంబు
చాలించి జానకి - సంగరసాబ్ధి
నోలలాడుచు నుందు - నొకొయొక్కనాఁడు ''
అనుచు సంధ్యాదిక్రి - యాకలాపంబు
లనుజనితోఁ గూడి - యారేయిఁ దీర్చి 430
సముచిత గతులచే - సాగరతీర
రమణీయ మహీ రఘు - రాముఁ డున్నంత

—: లంకలో రావణాసురుఁడు హానుమంతుఁడు చేసినపనినిఁ గూర్చి ప్రస్తాపించుట :—

అపుడు లంకాపురి - నాదశాననుఁడు
కుపితాత్ముఁడై తన - కొలువులో నున్న
యతిశౌర్య నిధుల ప్ర - హస్తాదులైన
హితమంత్రులను జూచి - యిట్లని పలికె
" హనుమంతుఁ డొక్కఁడే - యంబుధి దాఁటి
యనిమిషేంద్రుఁడు చూడ - నలవి కానట్టి
తనదు లంకారాజ - ధానిలోఁ జొచ్చి
జనకజతోడ ము - చ్చట మాటలాడి 440
యారకే చనక నా - యుద్యాన కనక
భూరుహావళి సర్వ - మును నేలఁ గూల్చి
వలదని వారింప - వనపాలకులను
బొలియించి ప్రాసాద - ము దుమారుచేసి
మంత్రిసూనులఁ బట్టి - మహిఁ బడఁగొట్టి
మంత్రుల నేవురి - మర్దించి మించి
యక్షకుమారకు - నాలంబులోని
రీక్షించి దానవ - శ్రేణి నడంచి
తోఁకఁ గాలిచి వెళ్లఁ - ద్రోలుఁడటన్న
కాఁకమై కొనక లం - కాపురం బెల్లఁ 450
గాలిచిపోయె రా - ఘవు దూతననియు
నేలిక సుగ్రీవుఁ - డిటు పంపెననియుఁ
జేరి చిల్వోషమును - జేయుచుఁ గోఁతి
యూరెల్ల గాలిచి - యూరకే చనియె
నాలోచనంబు సే - యక కాదు బుద్ధి

శాలులు మీరు వి - చారంబు చేసి
యిందుకు తగుకార్య - మిదియని పలుకు
డందరు నొకనిశ్చ - యార్థ మేర్పఱచి

—: హనుమంతుఁడు చేసినపనికి ప్రతీకార మొనర్చు
టకు నాప్తులతోఁ రావణుఁడు సంప్రతించుట :—

మహిపతు లుత్తమ - మధ్యమాధములు
మహియందుఁ గలరట్టి - మతమేరుపఱతు 460
హితుల నాప్తులఁ బురో - హితుల మంత్రులను
జతఁగూర్చి వారియో - జనలెల్లఁ గాంచి
యందుమీఁదట దైవ - యత్న పూర్వముగ
నందు క్రియా - ఫలం బతఁడె యుత్తముఁడు.
ఒరులఁ గూర్పక తన - యోజనచేత
గరువించి ధర్మార్థ - కార్యముల్ నడుపు
బుధ్యుపాయంబుచేఁ - బోలుచు భూవరుని
మధ్యముఁడని నీతి - మంతులెన్నుదురు
దైవంబు నెన్నక - తనగుణదోష
భావముల్ దలఁపక - పదరి కార్యములు 470
నగ్గలికలఁ జేయు - నధముఁ డటంచు
నెగ్గింపుదురు ధాత్రి - యేలు భూపతిని
యవనీపతుల యట్ల - యాలోచనముల
త్రివిధంబులగు వానిఁ - దెలియంగ వలయు
నందఱితోఁ జేయు - నాలోచనములు
చిందుసేయక వారు - చెప్పినయట్లు
నీతిమార్గములచేఁ - నెఱవేర్చు నదియె

యాతతంబగు నుత్త - మాలోచనంబు
మంత్రులతోడుత - మాటాడి వారి
మంత్రముల్ విడిచి తా - మనసుకు వచ్చి 480
నది నడిపించు మం - త్రాలోచనంబు
మదినెన్న నయవిదుల్ - మధ్యమంబండ్రు
తనకు దోఁచినయట్టి - దారిచే నడతు
నని యెన్నుకొని సేయ - నది యధమంబు
కావున మీరవు - గాములు మతులు
భావించి యిదిసేయఁ - బరగు నటన్న
నది యేనొనర్పుదు - నవనిజ కొఱకు
నుదధి వానరచమూ - వ్యూహంబుఁగూర్చి
యింకించియైనఁ దా - నేరీతి నైన
లంకపైవిడిసి యా - లము సేయఁదలఁచి 490
వచ్చు నీవెంట న - వశ్యంబు రాము
డిచ్చలోఁ దలఁచి మీ - రిందుకుఁ దగిన
కార్య మేకమతంబు - గాఁ బల్కుఁ" డనిన
మర్యాదలేని దు - ర్మదమత్తమతులు

—: రాక్షసవీరులు రావణునికి రామునిపైదండెత్తి శిక్షించుటయే మంచిదని దుర్నీతి బోధించుట :—

దానవ వీరులా - దశముఖుఁ జూచి
నానావిధాలోచ - నముల నిట్లనిరి.
"అసురేంద్ర! దివ్యశ - స్త్రాస్త్రముల్ గలిగి
యసమానధైర్య శౌ - ర్యంబుల మీఱి
నీయంత వాఁడు చిం - తించునే యిట్లు?
దాయలభయము చి - త్తమునఁ గీల్కొలిపి 500

భోగవతీపురం - బున కేఁగి యచట
నాగలోకమున ను - న్న భుజంగ విభుల
వాసుకి ముఖ్యుల - వ్యాళుల గెలిచి
యీసుతో నచటి దై - త్యేంద్రుల నోర్చి
మాయావియైనట్టి - మయునంతవాని
చేయిగాయక జయిం - చి తదీయ సుతను
మండోదరి వరించి - మహనీయ శౌర్య
చండిమంబున దేవ - సంఘంబుఁ దునిమి
కైలాసమున కేఁగి - కలనఁ గుబేరుఁ
దూలించి యక్షులఁ - దొంపరలాడి 510
చలముతో నతని పు - ష్పకము హరించి
యలవోకగాఁగ సం - యమినీపురంబుఁ
జూఱ వట్టించి తే - జోరూఢి మించి
సూరాత్మజునిఁ బోరఁ - జులకగాఁ దఱిమి
మృత్యువునకు నీకు - మృత్యువవగుచు
దైత్యులకెల్ల నా - ధారమై నిలిచి
యధికుండవైన నీ - యంత రాజునకు
నధమ మానవుల భ - యంబేల కలిగె?
వృక్షంబు లుర్విపై - వెలసిన యట్లు
యక్షయ బాహాబ - లైశ్వర్యములను 520
నెందఱెందఱునిందు - నెందెందు నుండ
రందు నేవురిఁబోలు - నవనిజాప్రియుఁడు?
ఇతని మాత్రమునకు - నీవేల నీదు
సుతుఁడున్నవాఁడు ని - ష్ఠుర శౌర్యధనుఁడు!
ఇంద్రజిత్తుండు తా - నీశ్వరుఁ గూర్చి

యాయత నిష్ఠతో - యజ్ఞంబుసేసి
వరము లందినవాఁడు - వాని కట్టెదుర
నరులెంతవారు వా - నరు లెంతవారు!
మనమెల్ల నెఱుఁగమే - మఱచితిరేమొ?
అనుపమ వివిధశ - స్త్రాస్త్ర విమానంబు 530
గజకచ్ఛపము రథ - గ్రామంబు తురగ
భుజగంబు ఖచర బు - ద్బుదమును యక్షు
మకరంబు సిద్ధస - మాజ మండూక
మకలంక పణవ మ - హావిరావంబు
చామర డిండీర - చయము కేతూర్మి
రామణీయకమును - రక్తనీరంబుఁ
గలిగిన దివిజ సం - గ్రామ వారాశి
గలఁచి గాలించి తాఁ - కవ్వపుఁ గొండ
గతినుండి యమృతంబుఁ - గైకొన్నయట్లు
శతముఖుఁ బట్టి దు - ర్జయ శౌర్యుఁడగుచు 540
నీలంక లోపల - నిందఱుఁ జూడ
జాలినొందఁగఁ జెఱ - సాలలోవైవ
దిక్కెవ్వరును లేక - దిగులుచే నుండ
నక్కమలజుఁడు మి - మ్మడిగి ప్రార్థించి
విడిపించుకొనిపోఁడె! - విల్లంది నీదు
కొడుకు నిల్చినమేరు - కోదండుఁడైన
నెదిరింపఁ జాలునే? - యిది యేటిమాట?
ఎదురేలవచ్చె నీ - కెంత వానికిని!"
అనునంతలో నాద - శానను జూచి
యనుచితోక్తులచేఁ బ్ర - హస్తుఁ డిట్లనియె. 550

—: ప్రహస్తుని పలుకులు :—

" సెలవిందు నాకెంత – సేపు ? సుగ్రీవు
తలఁదెచ్చి నీదుముం – దఱ నిప్పుడునుతు !
భూమి యవానరం – బుగఁ జేసికాని
నీముందఱికి వచ్చు – నే ప్రహస్తుండు ?
ఊరెల్లఁ గాలిచి – యొకఁక్రోఁతి పోవ
నూరికే యేమఱి – యుంటి మప్పటికి
ఇంతటిలోన నీ – కేమి కొఱంత ?
ఎంత కొంచెముగాఁగ – నెంచితి మమ్ము !
మనుజులు నాకెంత – మర్కటులెంత ?
దనుజేంద్ర ! మీకు నిం – తవిచారమేల ? 560
ననుఁజూడు " మన దశా – ననుఁ దేఱి చూచి
మొనగాఁడు లేచి దు – ర్ముఖుఁడిట్లు వలికె

—: దుర్ముఖుని దురుక్తులు :—

" దేవర చిత్తంబుఁ – దెలియక పదరి
యీవేళ నేమియు – నన లేక యుంట !
నను నెదురింప నీ – నరులు వానరులు
మనసునఁ దలఁప స – మర్థులు గారు.
ఏనుదాఁజూచి వా – రెందు వాఱినను
పోనీను గందరం – బులు దూరిరేని
పాతాళ బిలములో – పలఁ జొచ్చిరేని
చేతుల తీఁటవో – చెండి వేయుదును ! 570
త్రాటను సుగ్రీవుఁ – దాఁగట్టి తెత్తు
మాటమాత్రముగాదు – మాటమాత్రమున !

అనుమతియే ?" యన్న - నాడులు గఱచి
దను జేంద్రుతో వజ్ర - దంష్ట్రుఁడు వలికె.

—: వజ్రదంష్ట్రుని వాక్యములు :—

గదిచూడు మిదియె రా - ఘవులకువైరి
యిదిగదా కపులకు - నెల్లను మిత్తి !
నాకుఁ గోపముపుట్టె - నా తాళఁజాల
వాకొమ్ము పొమ్మని - వారి మీఁదికిని
యీపరిఘంబుపై - యేఁ దెంపు సేయ
నేపరకుందురే - యింద్రాదులైన 580
గడియలోపల లంకఁ - గాలిచి తోఁక
మెడమీఁద వేసుక - మింటికి నెగసి
యాకోఁతి పరువెత్తె - నని యింతలోన
నీకేవిచారమే - మిటికేను గలుగ ?
నొక్కపెట్టున వారి - నుర్విపాల్ జేసి
యుక్కుతో మరలి రా - నోపుదు నిపుడు !
లంకాధినాథ ! యే - ల ప్రయత్నమింత ?
ఇంక నొక్కయుపాయ - మిచ్చ నెంచితిని
మనుజమూర్తులతోడ - మాయలు నేర్చు
దనుజులఁ గొందఱ - దశరథాత్మజులఁ 590
జేరఁ బంపినవారు - చేతులు మొగిచి
'యోరామ ! భరతుఁడ - యోధ్యాపురంబు
వెడలి సేనలతోడ - విచ్చేసి మిమ్ముఁ
బొడఁగని పోవ ము - నుపుగ మేముగదలి
వచ్చితి' మని కొన్ని - వార్తలాడించి

మచ్చుఁ గప్పింపుచో - మబ్బులనుండి
వానరావళినెల్ల - వధియింతు నంత
దీనులై యెవ్వరు - దిక్కులేకున్న
నాచేత దశరథ - నందనుల్ దగుల
రాచబీరముల నూ - రక యెదుర్పుదురు ! 600
ఆవేళ వారినే - నదటడంగించి
దేవ ! నీఖేదంబుఁ - దీర్చెద" ననినఁ
గుంభకర్ణుని పెద్ద - కొడుకాగ్రహమునఁ
గుంభుఁడను వాఁడు ర - క్షోనాథుఁ బలికె

## —: కుంభుని కువాళకములు :—

"మీరేలఁ గోతుల - మీఁదను నలుగ
నీరావణునిఁగాచి - యీలంకలోన
వసియింపుఁడేఁ బోయి - వనచరావళిని
దెసచెడ నుగ్గాడి - తిత్తులూల్పించి
భానుజాంగదనల - పవనసమీర
సూనుల దశరథ - సుతులను జంపి 610
గెలిచి వచ్చెద "నన్న - గీటుచుఁ బండ్లు
సెలవులు నాకుచు - సెలవునాకనుచు
నాగ్రహంబున యజ్ఞ - హానువనువాఁడు
దగ్రుఁడై తాలేచి - దశకంఠుఁ బలికె.

## —: యజ్ఞహానుని యసందర్భపు మాటలు :—

"ఆలోచనలు మమ్ము - నడిగినచోట
కాలోచితంబైన - కార్య మూహించి

పల్కఁగావలెఁగాక - పనిమాలినట్టి
పల్కులేఁటికి మిమ్ముఁ - బనుచునే యితఁడు ?
ఏఁబోయి కపుల నా - నృపకుమారకులఁ
దాఁబేటి పిల్లలఁ - దార్ష్ట్యనిరీతిఁ 620
పాటిపోవఁగనీక - పట్టుకగ్రమింగి
యూరకవచ్చెద - నొక నిమేషమున !
కైదువ దాల్తునే - కపులపై నిపుడు !
పోదునే చేతులూఁ - పుచు వారికడకు
పనివిందు "నన నకం - పనుఁడు కోపించి
దనుజనాయకుతోఁ - దానిట్టులనియె.

—: అకంపనుని యనుచితోక్తులు :—

" మధుపానముల్ చేసి - మాంసముల్ మేసి
మధురాధరలఁగూడి - మసకంబులాడి
మీరుండవలెఁగాక - మీకేమి చింత ?
పోరాడవచ్చిరే - పురుహూతముఖులు ? 630
నరులఁట ! తోడువా - నరులఁట ! వారు
శరధి దాఁటుదురఁట ! - చాలదే బవిసి
ఇందుకు బుద్ధిని - యేమని మీర
లిందఱి నడుగఁగ - యింతేసి వారు
తాము వోవుదమన్న - తలవంపుగాదె
భూమిపై రక్కస - పుట్టులకెల్ల ?
తనకును త్తరువిందు - తన దళవాయిఁ
బనిచి వారలనెల్ల - బట్టి తెప్పింతు !

కావలసిన మస్త - కములు గొట్టించి
కావళ్లఁ బట్టించి - కపులరాఘవుల 640
పేరు మాపుదు "నన్న - పెటపెటపండ్లు

—: పై వారి మాటలు విని రాక్షసులు చెలరేఁగుట —

కోఱలు మెఱయంగఁ - గొఱకుచు లేచి
మీసముల్ వడివెట్టి - మిడిగ్రుడ్ల వెంట
రానులై నిప్పులు - రాల రోజుచును
కుంతముల్ చిమ్ముచు - గుమిగాఁగ లేచి
పంతంబులాడుచుఁ - బదరి యొండొరుల
మొనసి నికుంభ దు - ర్ముఖులగ్నికేతుఁ
డును గుంభుఁడుఁ బ్రహస్తుఁ - డును నింద్రజిత్తు
యజ్ఞకోపుఁడును మ - హాపార్శ్వధూమ్రు
లజ్ఞానులగు విరూ - పాక్షకంపనులు 650
రుధిరాక్షుఁడు మహోద - రుఁడు రశ్మికేతుఁ
డధికశౌర్యుండు ధూ - మ్రాక్షుఁడు సూర్య
శత్రు సుప్తఘ్న దు - ర్జయ వజ్రదంష్ట్రు
లుత్రిలోచనరుద్రు - లును నాగ్రహించి
పరిఘపట్టిస ధను - ర్బాణాసిముసల
కరులౌచు నతిభయం - కరులౌచు మండి
శూలంబు లార్చుచుఁ - జూచి రావణుఁడు
చాలమెచ్చఁగ నొక - సరణి నిట్లనిరి.

—: రావణుఁడు సూక్ష్మముగా వారిమాటలను వినుట :—

"సూక్ష్మవిచారద - క్షులు సభలేరు
లక్ష్మణసుగ్రీవు -లను రామవిభుని 660

కపులను దెచ్చి లె - క్కగ నెంచి మమ్ము
చపచపఁజేసి యో - జనలు సేసెదరు !
వారేల ? మీరేల ? - వలవదిందొక్కఁ
డేరుపాయగఁబోయి - యెల్లలోకముల
వానరుఁడనియెడు - వాఁడు లేకుండ
జానకీపతిఁ గూడఁ - జంపి వచ్చెదము ?
పనిఁగొమ్ము మమ్ము "ని - పదరిపోఁజూచి
దనుజులు తమలోనె - తారుమల్లాడ
నందఱి పదరోకుం - డన వారివారి
నందందుఁ గూర్చుండ - నభినయింపుచును 670
గరములఁగన్నుల - గ్రందువారించి
సరమాధిపతి విభీ - షణుఁడిట్టు వలికె.

—: విభీషణుఁడు రావణునికి బుద్ధిచెప్పుట :—

"మాను మాగ్రహము సా - మంబు భేదంబు
దానంబు దండంబు - ధరయేలువారు
తగునెడ నడిపింపఁ - దగుఁగాక మొదటఁ
దగునయ్య ! యగ్నివై - ద్యముఁ జేసినటుల
కడపట పూనించు - కార్యంబు మొదట
నడిపింపఁ జెల్లదు - నయమార్గనిధివి !
దైవోపహతుఁడు మ - త్తస్వాంతుఁ డధమ
జీవనుఁడనువానిఁ - జెనక దండింపఁ 680
దగుఁగాక యప్రమ - త్తస్వాంతుఁడగుచుఁ
బగర గెల్చును దైవ - బలమును గలుగు
శ్రీరామచంద్రునిఁ - జెనకి రాఁగలరె ?

యీ రాక్షసులు ? విన - మేవారి కథలు !
జలనిధి దాఁటి ని - శావేళలంకఁ
గలయఁ గన్గొని సీతఁ - గని మాటలాడి
యీపురంబుదహించి - యేఁగినాఁ డొకఁడుఁ
డాపవనతనూజుఁ - డన్నట్టిచోట !
అట్టి వానరకోటు - లాసమై వచ్చి
నట్టి రాఘవు గెల్వ - నగునె యెవ్వరికి !" 690
అని కొల్వులో వారి - నందఱిఁ జూచి
"వినుఁడేల యీ యవి - వేకంబు మీకు ?
ఖరదూషణాదుల - క్రమ మెఱింగియును
మఱమేల రాముని - తోడ నొక్కనికి ?
అది వినియుండి ప్రా - ణాశలు లేక
మదిఁ గ్రొవ్వి మేనులు - మఱచి పల్కెదరు !
రాఘవుఁడేమి నే - రము సేయఁ దెచ్చె
లాఘవవృత్తి ని - లాపుత్రి నితఁడు ?
పరకామినులఁ గోరు - పాపకర్ములకు
దొరకునే కీర్తులు - దురములోఁ జయము ? 700
ఇట్టివానికి ధర్మ - మేడది ! చాల
పట్టుగఁ గాక పా - పంబులకెల్ల !
సీతను మఱల ని - చ్చిన మనకెల్ల
ఖ్యాతియు జయము సౌ - ఖ్యములును గలుగు.
అటులైన బ్రదుకుదు - మాపద లేక
యెటులున్నదియొ కర్మ - మీయన్న చేత ?
రామలక్ష్మణుల నా - రాచదావాగ్ని
భీమమై లంకలోఁ - బెరిగి వీడెల్ల

దహింయింపకటమున్న - ధరణిజ నిచ్చి
బహుకాల ముర్విపై - బ్రదుకుట మేలు 710
వానరసైన్యముల్ - వచ్చి యీపురము
దానవావళి నెందుఁ - దలచూపనీక
ముత్తికవేయక - మునుపు నాసీత
చిత్తంబు చల్లగాఁ - జేయుట మేలు.
ఎందుచేఁ జెడకున్న - యితని యైశ్వర్య
మిందఱితోఁ గూడ - నీ సీతకొఱకు
చెడనేల ?"యని బుద్ధి - చెప్పి 'దూరెల్ల
నాడలోభముకొని మని - యుండుటేమేలు
దొరలకు చెడుబుద్ధి - తోచినఁ దమరు
మఱలించి హితమైన - మార్గంబుఁ దెలిపి 720
మన బ్రదుకులకైన - మందాది సీత
వినకులోత్తమునకు - నిప్పింప మేలు !
ఇచ్చకమ్ములు గాఁగ - నిందఱుఁ బలుక
నిచ్చోట గాదని - యేనన్నమాటఁ
ద్రోయక వినవేని - దోషంబులెల్ల
మాయు నిందఱఁ గూడి - మనుటయేమేలు."
అని వారి నదలించి - యాదశముఖునిఁ
గని విభీషణుఁడు తాఁ - గ్రమ్మఱఁ బలికె.
"ఏలన్న ! చలము నీ - కింగమీఁదనైన
చాలించి క్రమ్మర - జానకీదేవి 730
రామునకిచ్చి ధ - ర్మమును కీర్తియును
సేమంబు సిరులు గాం - చి యొసంగు మీవు
కాదన్న మిథిలేంద్ర - కన్యకారమణ

కోదండ నిర్ముక్త – ఘోరదివ్యాస్త్ర
పటలంబు శారద – పద్మాప్త కిరణ
చటులంబులై క్రొత్త – సొనలఁ దేఱి
యపరంజి గరులతో – నశని జాలంబు
విపులాధరంబుపై – వెసఁ బడినట్లు
నీమేన నాఁటి శో – ణితధార లొలుక
భూమిఁ ద్రెళ్లింప న – ప్పుడు చూడలేని (740)
ఖేదంబుతో నిన్నుఁ – గినిసి యిట్లాడు
నాదు వాక్యములు మ – న్నన వింటివేని
నిన్ను నమ్మినవారు – నీపుత్రపౌత్రు
లన్నదమ్ములు గొల్చి – నట్టివారలును
జావక నోవక – సకల సౌఖ్యముల
నీవెంటఁ గొఱలేక – యీలంకతోడ
మనవచ్చు నీసీత – మనకేల? రాఘ
వున కిమ్ము కుల మీలు – వునుఁ గాచికొమ్ము!
చలము మాను” మటన్నఁ – జయ్యన లేచి
కొలువుదీఱి మనంబు – కొందలంబంద 750
నగరిలోపలికేఁగి – న విభీషణుడు
లగువారు జనిరి ని – జావాసములకు

—: రావణుఁడు కొలువువిడిచి వెడలుట – విభీషణుఁడు రావణు నగరికి బయలుదేఱుట :—

ఆమఱునాఁడు ప్రా – హ్ణంబున లేచి
రామహిత ప్రచా – రత విభీషణుఁడు
కొలువు సింగారమై – కొలకొల యనుచు

బలసి నానాదైత్య - బలము సేవింపఁ
దన యిల్లు వెడలి బృం - దారక పురము
ననువైన రావణు - నగరి మోసలను
పల్లకి డిగి తూర్య - పణవాది రవము
లుల్లసిల్లంగ మ - దోత్కటభద్ర 760
సామజారట్టజ - స్యందనసుభట
ధామమౌ మొదటి యం - తర ముత్తరించి
మధులాజతిలదర్భ - మాషాజ్యకుంభ
దధిపాత్ర కుసుమాక్ష - తసుగంధముఖ్య
హోమపదార్థ ప్ర - యోగ సంపన్న
సామాదినిగమఘో - ష ప్రాజ్యవహ్ని
వేదికానికట ధా - వి బ్రహ్మరాక్ష
సాది హోతలచే ని - రంతరంబైన
రెండవకక్ష్య మీ - టి మణికిరీట
కుండలకేయూర - కుంకుమపంక 770
వివిధాంబరాపార - విభవసమేత
దివిజాహితకుమార - దీర్ఘబాహాగ్ర
ధగధగాయిత హేమ - తరవారినిచయ
యుగపద్విభాపట - లోపేతమైన
యాయంతరము మీటి - యావలి కేఁగి
గాయకవందిమా - గధనుతుల్ చెలఁగ
భద్రాసనాగ్రంబు - పై జగత్త్రితయ
విద్రావణుని దైత్య - విభుని రావణుని
సురలతోఁ గొలువున్న - సుత్రాముఁడనఁగ
నిరుగడఁ దనవార - లెల్ల భజింప 780

నోలగంబున నుండ - నోరగావచ్చి
కేలుమొగిడ్చి తాఁ - గెలనికిఁ జేర
దనుజవరేణ్యుఁడు - తమ్మునిఁ జూచి
తన చెంతనొక్క కం - దనపు గద్దియను
వసియింపుమనిన రా - వణుని యానతిని
దెసలెల్ల భూషణ - దీప్తులు వెలుఁగ
కెలని వారలు లేచి - కేల్మోడ్పఁ దాన
నెలకొని కొలువులో - నినిశాట వరులఁ
దొలఁగిపోఁ బనిచి మం - త్రులుహితుల్ గాని
యలఁతివారలులేని - యట్టిచోఁ గదిసి 790
యేకాంతమున దాన - వేంద్రునితోడ
నీకడాకడవార - లెల్లను వినఁగ
నయవినయములు స - న్మానంబు హితము
ప్రియమునుఁ దోప వి - భీషణుండనియె

—: విభీషణుఁడు రావణునితో హితోక్తులు పలుకుట :—

" సీతను బట్టి తె - చ్చినయది మొదలు
సితిదోషంబుల - నేకముల్ వొడమె!
హోతలు వేల్చుచో - హోమాగ్నులందు
హేతులు గనరాక - యెంతయుమాసె!
యాగశాలలను దే - వాలయంబులను
భోగులెల్లెడ నిండి - బుసఁగొట్టఁ దొడఁగె! 800
హవిరన్నములఁ జీమ - లంటెను! వస్తు
నివహంబులందుల - నిండెఁ గీటములు!

తరిగె నావులపాఁడి ! – ధరణీరుహములఁ
బరిపక్వఫలములు – పరిపాటియయ్యె
జలములు గరుల లో – చనములఁ గురిసె!
తలలతో మేపులె – త్తవు తురంగములు !
కాకఘూకశ్యేన – కంకాది ఖగము
లేకడఁ గూయుచు – నింటింటఁ దిరిగె !
పులుఁగులెచ్చోట ని – ప్పులు గ్రక్కుఁదొడఁగె
నలిగించె నక్కలే – యెడఁ బట్టపగలు 810
ఖరములుష్ట్రములును – గలసి వాపోయె
వరదు లేడ్చెను కోట – వాకిళులందు !
ఇన్నియుత్పాతంబు – లీలంకలోన
నెన్నఁడు లేనివి – యిప్పుడు గలిగె !
అన్న యిందులకు ప్రా – యశ్చిత్త మొకటి
యున్నది మనకేల – యుర్వీతనూజ
క్రమ్మఱ నిమ్ము రా – ఘవునకు నీకు
నిమ్మాట చవిగామి – యెఱుఁగుదునైన
సైరింప లేనుపే – క్షా దోషమునకు
నేరముగాఁగ నె – న్నిన మేలు నీవు 820
నీకు నొక్కని కేల – నీవారికెల్ల
వాకొన్నయట్టి నా – వాక్యంబుగాదు !
చూడుమీ యీమాట – సూచించి నపుడె
యాడనిఁబాడిరి – యొకరితోనొకరు
నీకొల్వులో దార – లెవ్వరేమైన
నాకుఁబోరామి వి – న్నపము చేసితిని

తరువాత నామాట - తలదాఁకి నపుడు
పరితాపమునకుఁ బా - ల్పడక నాబుద్ధి
నాలకించితివేని - యశముఁ గల్గియును
మేలును మదిని న - మ్మి సుఖింపఁ గలము 830
తనమాట విను" మన్న - తమ్ముని మాట
విని మది కోపంబు - వెలువడనీక
కామాంధకారంబు - గరువంబు చలము
నాము కొనంగ ద - శాననుఁ డనియె.

—: రావణుఁ డాతనిమాటలను పెడచెవినిఁబెట్టి యింటికిఁ బొమ్మనుట ; విభీషణుఁడు వెడలిపోవుట :—

" ఎఱిఁగి యెఱింగియు - నెన్నఁడు లేని
వెఱపు చెప్పెదవు వి - వేకంబు తెఱఁగె ?
భయమెక్కడిది నాకు ? - పట్టియేఁ దెచ్చి
చెయిచేతఁ గ్రమ్మఱ - సీతనీఁజాల !
రాముఁడొక్కఁడె యేల - రణభూమిలోన
నామఖవాది దే - వానీక మెల్ల 840
నతని కార్యములఁ దో - డై వచ్చిరేని
క్షితిఁ గూల్తు నిదియేమి - చెప్పెదవీవు ?
చాలు నీబుద్ధులు - చనుమింటి" కనుచుఁ
దేలిపోఁ బలికిన - దిగ్గున లేచి
చనియె వెల్వడి విభీ - షణుఁడందు నిల్వ
మనసు గొల్వక యుగ్ర - మదనాగ్నిచేత
సైరింపలేక ద - శగ్రీవుఁడాప్త

—: రావణుఁడు కొలువుకూటమునకు వచ్చుట :—

చారులచే మంత్రి - జనుల రావించి
కనకరథంబెక్కి - కంచుకశ్రేణి
తనమ్రోల హేమవే - త్రములంది మొరయ 850
మణిమయమేఖలా - మంజీర కటక
రణముల గణికాప - రంపరల్ గొలువ
నరదంబులును గరుల్ - హయములనెక్కి
దొరలు బాంధవులు క్రం - దుక మున్నడువ
ధవళముక్తాత ప - త్రము చామరములు
సవిధభాగముల రా - జసులందిరాఁగ
మయనిర్మితంబు స - మస్తపిశాచ
జయజయధ్వాన వి - స్తరమును నగుచు
వెలసి లంకారాజ - వీథిలో మేరు
తులితమహా సభకు మం - త్రులతోడవచ్చి 860
నవరత్నసింహాస - నమునఁ గూర్చుండి
యవలనీవల నుచి - తాసనంబులను
తగినవారల నుంచు - తఱి విభీషణుఁడు
నిగనిగలీను మ - ణిస్యందనమున
వచ్చి యన్నకు పేరు - వాకొని మ్రొక్కి
యిచ్చిన మణిపీఠి - నిరవు కొన్నంత
శుకుఁడు వెంబడిఁ బ్రహ - స్తుఁడువచ్చి వారు
నొకచక్కి వసియించ - నొడ్డోలగమున
వసువులలో సుప - ర్వస్వామిరీతి
నసమవిభూతిఁ గొ - లువై యున్నయపుడు 870

రావణు వదనంబు – రాక్షస ప్రభులు
భావింపుచును తత్ప – భాసదులందు
నొకరైన మాటాడ – కూరకయుండ
నొకమాట రావణుఁ – డూహించి పలికె.

—: రావణుఁడు ప్రహస్తునకు కోటరక్షణకు వలయు సాధనసామగ్రి సమకూర్చుమని యాజ్ఞాపించుట :—

"రమ్మి ! ప్రహస్త ! పు – రంబును కోట
కొమ్మలు నట్టిల్లు – కొత్తడంబులును
బదిలంబుసేయించి – బలములనుంచి
మొదటను రసవర్గ – ములు విచారించి
యేమఱియుండక – యిప్పుడే సకల
సామగ్రులును వేగ – జతఁగూర్చు" మనిన 880
నతఁడును నగరిగా – ర్యములను గోట
జతనంబు నగరర – క్షణవిధానములు
నొకటను గొదలేక – యుండ నమర్చి
ముకిళిత హస్తుఁడై – ముందఱ నిలిచి

—: ప్రహస్తుఁ డాయాజ్ఞాప్రకారము నిర్వహించుట :—

" అయ్య ! నాతోడ మీ – రానతి యిచ్చు
నయ్యర్థమంతయు – నమరికగాఁగ
నడిపించితి " నటన్న – నరులు వానరులు
జడధి యేక్రియ దాఁట – జాలుదురనుచు
లేని బీరంబుఁ గ – ల్పించుక పలికి
దానవాధిపుఁడు ప్ర – ధానుల కనియె 890

"ధర్మార్థకామత - త్పరులు దుఃఖమును
శర్మంబు నందక - చనదొక్క యెడల
ఖేదంబు మోదంబుఁ - గీడును మేలు
నాదు లాభాలాభ - నానా విధములు
పరిగాఁగ ననుభవిం - చఁగఁ దగులైన
దొరలు గావునఁ దీఱ - దు తొలంగియుండ
ఇన్నాళ్లు మీతోడ - నెఱిఁగించి సేయ
నన్నికార్యములు మే - లైవచ్చె తనకు
దండకాటవిని సీ - తను బట్టితెచ్చి
కండకావరమున - గాసి నొందెదను 900
మయుఁడు నిర్మించిన - మాయయువోలి
చేయిఁ జేసుకున్నది - సీతనామీఁద !
వచ్చు నేఁడాదిన - వశ్యంబు రాముఁ
డిచ్చటికని మది - నెంచి లోఁగాదు
అది యేనెఱింగి యీ - యాస దీఱంగ
కదిమి రెన్నెల్లకు - గడువు పెట్టితిని !
తానింక జనకనం - దనఁ గూడకున్న
మేనఁ బ్రాణములుండ - మేకొన వింక !
అందు కెయ్యది యుపా - యము బుద్ధిమంతు
లందఱు సరిపోయి - నట్లు వాకొనుఁడు 910
మదిలోన నెఱుఁగఁడు - మన కుంభకర్ణుఁ
డిది యతఁడెఱుఁగక - యిఁక నెట్లుదీఱు ?
నిదురింప నేఁడాఱు - నెలలు మేల్కాంచి
యుదయంబుననె కూరు - చున్నాఁడటంచు

వింటిమి పిలిపించి - వినిపింత మింత
కంటె తోఁచదు వేఱె - కార్యంబు తనకు."

—: రావణుఁడు కుంభకర్ణునితో ముందుచేయఁగల కార్యమునుఁ గూర్చి సంప్రతించుట :—

అనుసంత పణవతూ - ర్యాదులు మొరయ
ఘనసత్త్వనిధి కుంభ - కర్ణుఁడు వచ్చి
యంజలిఁ జేసిన - యజ్ఞారి రత్న
మంజుల శోభాస - మగ్రమైనట్టి 920
గద్దియపై నుండ - గా నియమించి
సద్దుమానిన మహా - స్థానంబులోన
నందఱు వినుచుండ - నగ్రసోదరుని
యందు నాదరముంచి - యసురేంద్రుఁడనియె.
"ఎఱుఁగక చేసితి - నే నొక్క-కార్య
మెఱుక సేయక తీఱ - దిప్పుడు నీకు.
రాముని దేవి ధ - రాతనూజాతఁ
గామించి యేదండ - కాటవికేఁగి
వంచించి తెచ్చితి - వనితల కేమి
పంచాస్త్రమాయాప్ర - పంచమారమణి 930
త్రిభువనంబులుఁ జూచి - తిని సీతవంటి
యిభయానఁ గనివిని - యెఱుఁగ మెన్నడును!
ఆసీత మనసీక - యసమాస్త్రు బారిఁ
ద్రోసె నే బలిమి నె - త్తుక వచ్చి యునిచి
మఱల నీనేర్తునే? - మదిలోనఁ దనకు
పరులచే భయము స్వ - ప్నమునందుఁ గలదె?

ఒక వానరుఁడు వచ్చి – యుర్వీతనూజ
నొకకొంత యూరార్చి – యూరెల్లఁ గాల్చి
మఱలి యాసీత సే – మము వినిపింప
తరణిజాదులఁ గీశ – తతిఁ గూడపెట్టి 940
క్రోంతి కూటువమూఁక – గొలుపంగ వట్టి
కాంతారమున జన – కసుతావరుండు
వనధితీరమునకు – వచ్చియున్నాఁడు!
తనపోటునమ్మి సీ – తానిమిత్తముగ
నిటువంటి వారలే – యీవార్ధి దాఁటి
కటకట! మనతోడఁ – గలహించువారు?
పులితోడ నెదురింపఁ – బోయెడి గొఱియ
పొలుపున రాముఁడి – ప్పుడు వచ్చినాఁడు!
తనకేల యిత్తు సీ – తను నన్నుఁబోర
వనచరాశ్రితుఁడెట్లు – వచ్చు లంకకును? 950
అమరేంద్రయమవరు – ణాదులనైన
సమయింతు నరుల పీఁ – చమడంచుటెంత?
అందుపై నీ సహా – యము నాకుఁ గలిగి
యుండ యంచును సీత – నిత్తునే తనకు?
క్రోఁతి చేసిన దుడు – కులు నాదు మదినిఁ
బ్రాఁతగిల్లవుగాన – పై కార్యమునకు
నాలోచనంబు సే – యక తీఱదయ్యె!
కాలోచితంబేది? – కని పల్కు''మనిన
కన్నులఁ జెంగావి – గ్రమ్మఁగోపించి
కన్న యర్థము కుంభ – కర్ణుఁ డిట్లనియె. 960

—: కుంభకర్ణుఁడు రావణునికి హితోపదేశపూర్వకముగ నుత్తరమిచ్చుట :—

" అన్నవు నీవు ని - న్ననరాదు పలుక
కున్నఁ దీఱదు మంచి - యోజనేఁ గంటి
నిను నుండి హెచ్చిన - యీ రాజ్యలక్ష్మి
వెనుక నన్యులచేత - వీడుకోల్గాక
నీకతంబునఁ గుల - నిర్మూలనంబుఁ
గాక యెందును తేలు - గడగానియట్టి
పని సేసితివి ! రాము - భార్య నేమిటికిఁ
గొని తెచ్చితివి దైత్య - కులమెల్ల నణఁప ?
నీవును నీదు మం - త్రిగణంబు మొదట
నీవిధంబని నిశ్చ - యించి కార్యంబు 970
నడిపింప నాలోచ - నంబెట్లు సమసె ?
నుడువు మత్తెఱఁగు ము - న్నుగ నాలకించి
చెప్పెద నాకుఁ దో - చిన యర్థమింత
తప్పు నీయంత యు - త్తముఁడెట్లు చేసె ?
చేసిన కార్యంబుఁ - జేసితి వెంత
మోసంబు దప్ప రా - మునిచేత నీకు
యే మెన్నికకు సీత - నెత్తుకవచ్చి
తామెన్నికనె నిల్పి - మచలుఁడవగుచు !
మమువంటివారితో - మదినున్నయట్టి
క్రమమెల్ల మునుమున్ను - గా వినుపించి 980
యేమిచేసిననది - యీడేరుఁగాక
యీమేర దుడుకుగా - యేఁ గర్తననుచుఁ
బదరి యిచ్చకువచ్చు - పనిసేయు రాజు

తుదిముట్ట నేరఁడెం – దును హానిఁజెందు !
పొందును బహుదుఃఖ – ములు పాత్రభూతు
లందుఁ బెట్టని హవి – రన్నంబులట్ల.
అతని కార్యములు ని – రర్థకంబగుచు
ప్రతిసన్న కామిత – ఫలము నీలేవు !
మును సేయు నర్థముల్ – మును సేయవలయు
వెనుకటి కార్యముల్ – వెనుకఁ గావింపఁ 990
దగుఁగాక క్రమములు – దప్పి కావింప
జగతీశులకు నాత్మ – సౌఖ్యముల్ గలవె ?
ఎదిరి వారల బలం – బెఱిఁగి చేయించు
యదను చూచుకొని రం – ధ్రాన్వేషణములు
గావింతు రంచలు – క్రౌంచరంధ్రములు
భావింపుచును జొరఁ – బాఱు చందమున
నీ విచారము లేక – యెంత కార్యంబుఁ
గావరంబునఁ జేసి – కడచి వచ్చితివి !
విన్నవింపక కాదు – విషమిశ్రమైన
యన్నంబు జీర్ణించి – నట్టి చందమున 1000
రాముఁడు చంపక – రానిచ్చె నిన్ను
నామేర నెంతభా – గ్యంబుఁ జేసితివి !
తలవట్టి చూచుక – తప్పి వచ్చితివి
తలఁకకు మింకమీఁ – దటి కార్యమెంత !
ఏఁగల్గ నీకేల – యింత విచార
మాఁగెద నింద్రాదు – లైన మార్కొనిన
పరిఘంబుఁ జేఁబూని – బవరంబులోన
మెఱుఁగు కోఱలతోడ – మెఱుపులతోడ

జలదంబు పఱతెంచు - చాడ్పునఁ జంప
నలిగి యేఁదెగి వచ్చి - నపుడె మఱ్ఱొక్కనఁగ 1010
మఖవాదులును వేలు - మడుపుమా సమర
ముఖమున నాకు రా - మునిఁ గెల్చుటెంత !
దాడిగిన తూపుచే - దునుమునో తెలియఁ
బడదు రాఘవుని కో - పము సంగరమున !
అవనిజాప్రియుఁడు రెం - డవతూపుఁ దొడుగ
నవకాశమిచ్చుగ - దా యంతలోనఁ
బ్రతినతో నేరక్త - పానంబు సేతు
నతని తమ్మునిఁ బట్టి - యనుమాన మేల
మొనలోన రాఘవా - మోఘాస్త్ర మేను
కనుచాటు చేసి యే - గతినైనఁ దొలఁగి 1020
చంపి వచ్చెద నంత - జనకజ మదిని
ముంపుకొన్నట్టి రా - ముని యాసఁ దీఱి
నినుఁ జేరునప్పుడు - నిరుపమానంద
మునఁ జెందు మేలు రా - మునియెడ భయము ?"
అనుచునుండగ నీల్గు - లావలింతలును
తను నెచ్చరింప ని - ద్రారతుఁడగుచు
గ్రక్కున నాకుంభ - కర్ణుండు లేచి
చక్కఁగా నింటికిఁ - జనిన యవ్వెనుక
సీత యొప్పక యింత - సేయునే యనుచుఁ
జేతోభవానల - శిఖలవెలుఁగుచును 1030
దాలిమి చాలని - దనుజేంద్రుతోడ
బాలిపుట్టగ మహా - పార్శ్వుఁ డిట్లనియె.

—: రావణునితో మహాపార్శ్వుఁడు మాటలాడుచు సీతను
పొందుమని చెప్పుట :—

" దైత్యేయనాథ ! సం - తాపమేమిటికి ?
సీత యొప్పదటంచుఁ - జెప్పెదవేల
చేతిలోఁ జిక్కిన - చెలి బల్మిఁబట్టి
ప్రీతి రమింపక - బేలు పోవుదురె ?
ఇంతులకును సత్య - మేడది తమకు
చెంతలొంగిన మన - సీత యుండుదురు
ప్రియము చెప్పిన చాల - బిగియుదు రెందు
దయవాని నెఱిఁగి చి - త్తంబు దాఁపుదురు 1040
వెతలఁ బెట్టుదురిది - వెలఁదులజాడ
రతికేళిబెనఁగు మా - రక యుండ నేల ?
అడవిలో పెర తేనె - యబ్బినఁ జూచి
విడుచునె గ్రోలక - వీఱిఁడియైన !
అనుభవించెదనని - యాయాస మొంది
పనివడి తెచ్చి నీ - పడకింటిలోన
నునిచి రమింపక - యూరకే తెచ్చి
వనములోఁ బడవైచి - వలచితి ననుచు
గాసిల్లనేల ? యా - కడ నెవ్వరైన
యీసీతకై వహిం - యించుక వచ్చి
తొడికిన నింద్రజి - త్తును గుంభకర్ణు
లెడమిత్తురే ? వారు - నేనునుగూడి
దండింతు మెదిరించి - దశరథాత్మజుని !
ఖండింతు మామీఁద - కపినాయకులను !
ఎల్లలోకంబులు - నేలెదు నిన్ను

'నొల్ల నేనని' యుండ - నోపునే యొకతె!
మనసీదుగాని యా - మగువ నీమీఁద
యనురాగముంచక - యదియేల మాను?
తడయక పగవాని - తలఁద్రొక్కినటులఁ
బుడమిపట్టినిఁ బట్టి - భోగింపుమీవు.　　1060
కోరికల్ తీరంగ - కుక్కుటవృత్తి
చే రమించిన నీకుఁ - జెల్లకున్నదియె?
కూడి రమింపుఁ డా - కోమలి" ననుచు
వేడుక పుట్టింప - విని చాల మెచ్చి
బహుమానమొనరించి - పంక్తి కంధరుఁడు
విహితోక్తులను వాని - వీక్షించి పలికె.

—: రావణుఁడు పరస్త్రీని బలిమిచేపొందిన తనకు హానికలుగు శాపవృత్తాంతము చెప్పుట :—

"ఓయి! మహాపార్శ్వ! - యుచితంబ పలికి
తీ యర్థమిది చాల - హితమయ్యెఁ దనకు
నటులయ్యు నేలయీ - యడ్డి మీకనిన
నిటువిను మామాట - యెఱిఁగింతు నీకు　　1070
వెనుకటి కొకనాఁడు - విశ్వేశుఁడైన
వనజగర్భునిఁ గొలు - వఁ దలంచి యేను
సత్యలోకమునకుఁ - జనుచోట త్రోవ
నత్యంత శృంగార - హారిణియైన
జవరాలు పుంజిక - స్థలి దేవరమణి
పువుదేరుపై మింటఁ - బోవుచున్నడను
నే నరికట్టి మో - హితుఁడనై దానిఁ

బోసీక నిలిపినఁ – బువ్వుఁబోణి వెఱచి
" వలదు రావణ! యేను – వారిజగర్భు
కొలువునకేఁగుదుఁ – గొఱగాదు నన్ను 1080
బలిమి నిరోధించి – పైవ్రాల" ననిన
వలరాజు గాసికో – ర్వక తమకమున
దానితోఁ గ్రీడింపఁ – దరువాత పద్మ
సూనునికడకేఁగఁ – జూచి యయ్యజుఁడు
నలిగిన పువ్వులు – నవరతిక్రీడ
నలసిన నెమ్మేన – నందంబుఁ దఱిగి
వసివాడు నగుమోము – వలపులు జల్లు
కసిగాటు కెమ్మోవి – కళలంటి పెనఁగఁ
జెదరిన మైపూఁత – చెలువొందు నడుము
బ్రిదిలిన చేలయు – బిగువు సన్నులను 1090
పెనఁగొన్న హారముల్ – బిట్టు నిట్టూర్పు
లును జూచి యాత్మనా – లోచనచేసి
" ఈపుంజికస్థల – యేతేరఁ దీనిఁ
బైపాటుగావీడు – పట్టునేయనుచు
నను గనుఁగొని " రావ – ణ! భయంబులేక
తన కొల్వునకు వచ్చు – దాని రానీక
బలిమిఁ బట్టితివి పా – పమువచ్చుననక
పలువిత్త తనకు కో – పము వచ్చునసక!
ఇది మొదలెవ్వతె – నేని మనోజ
మదవికారముననుు – మానంబు లేక 1100
యొడఁబాటు పరువక – యొప్పక నీవు
తొడ్డిఁబడఁ గలసిన – తోడనే నీదు

తలనూఱు వ్రయ్యలై - ధరఁగూలుగాక !
తులువ ! "పోరా యని - త్రోసింపఁ గాన
నాఁడాదిగాఁగ యే - నలినాక్షినైనఁ
గూడఁగ వెఱతు మే - కొనియున్నఁగాని
పరకామినుల బల్మిఁ - బట్టు సౌఖ్యంబు
మఱచియుండునె కాక - మఱి యొక్కఁడైన
కావున నీసీతఁ - గలయంగ రాక
రేవగల్ గాఁగ కా - రియ నొందవలసె !  1110
ధాతకట్టడచే వృ - థాయుంటి గాక
సీతనుబట్టి పూ - జింపఁ దెచ్చితినె ?
మఱలఁ జేరుదు తన - మగనితో ననుచు
ధరణిజ యొఱఁగక - తానున్న దిపుడు
వననిధి సలిలప్ర - వాహ వేగంబు
కనదుగ్రలయ పావ - క ప్రతాపంబు
పవనసంచార నై - భవము నాయందు
నవిరళంబుగ నున్న - వని మానసమున
శ్రీరామచంద్రుఁ డెం - చిన వాఁడుఁగాఁడు !
తీఱునే తనచేత - ద్రిష్టింపఁ దన్ను ?  1120
నిదురించు సింహంబు - నిద్రమేల్కొలుప
దుదిఁబోయి కాలమృ - త్యువుఁ జెనకంగ
నెంచినగతి రాముఁ - డెదిరించి జలధి
యంచున విడిసె నే - మగువాఁడొయింక
మహితవజ్రప్రతి - మంబులై జాగ్ర
దహిసన్నిభంబులౌ - నాత్మీయ విశిఖ
జాలము కొఱవుల - చాడ్పునఁ జూపి

యాలంబులో దంతి - నదలించి తరుము
వేటకాఁడునుబోలి - వేఁటాడి రాము
గేఁటడగింతు సు - గ్రీవాదు లలిగి 1130
వచ్చినరానిమ్ము - వననిధి దాఁటి
యిచ్చోటి కామీఁద - సెఱిఁగెడుఁగాక !
ధనదు పుష్పకము నా - తని చేతి లంక
నని గెల్చి సాధించి - యమరేంద్రుఁ ద్రోలి
యమవరుణాదుల - నాహవకేళిఁ
దెమలంగఁ దఱిమి య - తిప్రతాపమున
రాజిల్లు నాతోడ - రాముఁడు వచ్చి
యాజిసేయునటన్న - హాస్యంబుగాదె ?"
అని బీరములు వల్క - నసురనాయకునిఁ
గనుఁగొని మునుకుంభ - కర్ణుండు వలుకు 1140
మాటలు విని తన - మది నోర్వలేక
చాటువుగా విభీ - షణుఁ డిట్టులనియె.

—: విభీషణుఁడు రావణునితోఁ బలికిన హితోక్తులు :—

" హేమాభగాత్రంబ - హీన భోగంబు
కోమలతరకరాం - గుళులైదు తలలు
మదిలోని క్రోధసా - మగ్రివిషంబు
కొదలేని చిఱునవ్వు - కోఱలుగాఁగఁ
పఱఁగు జానకిపేరి - పాము నేరీతి
వెఱపు నెమ్మదినిఁ బో - విడిచి పట్టితివి !
కపులచే మనదు లం - కాపురిలోన
విపరీత కార్యముల్ - వెలయక మునుపె 1150

సీత నిచ్చిన మేలు - చేకూడు నీదు
చేతఁ జిక్కునె రఘు - శ్రేష్ఠుఁడాలమున ?
రాముఁడు వజ్రసా - ర శిలీముఖముల
నీమేన రక్తమా - నింపక మునుపె
యిమ్ము జానకిని దే - వేంద్రాదులైన
కిమ్మన నేర్తురే - కినియు రాఘవుని ?
ఈకుంభకర్ణుఁడు - నీయింద్రజిత్తు
నీకుంభుఁడు ప్రహ - స్తుఁడీమహోదరుఁడు
నీమహాపార్శ్వుఁడు - నితర రాక్షసులు
రాముని నెదురువా - రా సంగరమున ? 1160
సురసుర చిచ్చులోఁ - జొచ్చిన మిడుత
పరివోతె రాఘవ - బాణాగ్నిలోన
సందఱు గమలిపో - కటమున్న జనక
నందన నిమ్ము ప్రా - ణముఁ గాచికొమ్ము !
పాతాళ బిలములో - పలఁ జొచ్చితేని
సీత నియ్యక నీకు - జీవింపరాదు
నామాట విను " మన్న - నగి ప్రహస్తుండు
సామాన్యమతి విభీ - షణుఁ జూచి పలికె.
"ఏల విభీషణ ! - యింద్రాది సురలు
నాలంబులోన మ - మ్మరికట్టఁ గలరె ? 1170
వెఱపు చెప్పెదు మాకు - విడువుమీమాట
మఱచిపొమ్మిది బుద్ధి - మార్గంబుగాదు
తెచ్చిన జానకిఁ - దిరుగఁ గొల్పోయి
యిచ్చునంతటి కార్య - మేఁటికి వచ్చె ?
సరిపోదు నీదుయో - జన చాలు " నన్న

మఱియుఁ బ్రహస్తుని - మాటలచేత
పెరుగ కోపంబు వి - భీషణుఁ డప్పుడు
దొరలెల్ల వినఁగ చే - తులు చాచి పలికె.

—: విభీషణుఁడు ప్రహస్తునితోఁ జెప్పిన మాటలు :—

"తగునె ప్రహస్త! ప్ర - ధానివై యుండి
మొగమోడి యిచ్చకం - బులు పల్కా నీకు ? 1180
తెప్పలేక పయోధిఁ - దేలి దాటంగ
నొప్పునే ! రాఘవు - నొకఁడు మార్కొనునె ?
మనవంటి నీచుల - మా ? రఘువీరుఁ
జెనకువారము బుద్ధి - చెడెనేమొ నీకు ?
ఆమహారఘుని ది - వ్యాస్త్రసన్నాహ
మేమి యెఱుంగలే - కిటులఁ బ్రేలెదవు !
దేవాంత కేంద్రజి - త్త్రిశిరోతికాయు
లీవు దక్కినవారు - నీరావణుండు
నుడిసినంతటిలోనె - చూర్ణంబుఁ గాక
వెడలి వత్తురె రాము - విశిఖాగ్నిఁ దగిలి ! 1190
క్షితి మేలుఁగీడును - జింతింపలేని
హితశత్రులను మిమ్ము - నీరావణుండు
నమ్మి ప్రాణంబు ల - న్యాయంబుగాఁగ
వమ్ముగా వినుచున్న - వాఁడు మీబుద్ధిఁ
జూచి కాలాహిద - ష్టుని మంత్రవాది
కాచినగతి మహా - గ్రహము సోఁకినను
విడిపించు మాంత్రికు - విధమున రాజు
చెడుబుద్ధిచే నడ - చిన మిమ్మువంటి

యాప్తులు మఱలింప - నగుగాక యిదియు
నాప్తధర్మమె ద్రోహు - లైతిరి మీరు 1200
రామసాగరమగ్ను - రావణు నకట!
యేమిటి కిటులాడి - యిందందుఁ గూడి
మూఁటకట్టులుకట్టి - ముందరఁ ద్రోచి
దాఁటఁ జూచెదరు పా - తకులార! మీరు!
ఇతనికి లంకకు - నెల్ల దైత్యులకు
హితముగా జానకి - నిమ్మంటి మఱల
తన బలంబేది స - త్త్వముఁ గీడు మేలు
మనికియు నునికియు - మది విచారించి
స్వామి హితంబు యో - జనఁజేసి పలుకు
నామంత్రియే మంత్రి - యగుఁగాక యిట్లు 1210
యాడినట్లనె యాడి - యటు చెడుమనఁగ
జాడయే! మీకు తోఁ - చకయె పల్కెదరొ?"
అని యిట్లు చులకఁగా - నాడినయట్టి
పినతండ్రిఁ జూచి కో - పించి తాలేచి
యెట్టులోర్తుననటంచు - నింద్రజిత్తపుడు
వట్టి గీరుబున రా - వణుఁ జూచి పలికె.

—: విభీషణుని మాటలకు నింద్రజిత్తు కోపించి పలుకుట :—

"సరకుసేయక విభీ - షణుఁడు మమ్మెల్ల
పిరికివారల వెఱ - పించిన రీతి
నాడ నీకును హితం - బైన నౌఁగాక
చూడ మాకవి కర్ణ - శూలముల్ గావె! 1220

తేజంబుఁ గలుగు జా - తికిఁ జెప్పనేల ?
ఏజాతివాఁడాడు - నిటువంటిమాట ?
తనబుద్ధినీ వెత్తి - తనము మాపిరికి
తనము రాముని బంటు - తనము నీయెదుర
పదర నీమాటలు - వలదు పొమ్మనక
మదినోర్చి వినఁగ ధ - ర్మమె మాకు నేఁడు
దనుజేంద్రునకు నీకుఁ - దమ్ముఁడై పుట్టి
మనజాతిలో లేని - మాటలీరీతి
నాడ నితని కేమి - యయ్యె శౌర్యమున
నీ డెవ్వ రితనికి - నిట్టులైయుండి 1230
పందతనంబేల - ప్రాపించె నొకని
యందు నీవీటిలో !''- నని మించఁ బలికి
యా విభీషణు మొగం - బటుచూచి తండ్రి
కై వహించుచు దా ను - దగ్రుఁడై పలికె.
" మనలోన నొక కొఱ - మాలినయట్టి
దనుజునకై న సు - త్రామాది సురలు
గజగజ వడకంగఁ - గానవే సురలు ?
భుజముపై గదయేల - పూని యున్నావు ?
మోపుచేటుగ యది - మూలనువైచి
పోపొమ్ము నిలువఁ జం - పును రఘూద్వహుఁడు ! 1240
ఎన్నాళ్లు బ్రదికెద - విటువంటి బ్రదుకు ?
నిన్నుఁగన్నట్టి తం - డ్రిదె కీర్తి !'' యనిన
" ఎఱుఁగవె చెఱసాల - నింద్రునిఁ దెచ్చి
మొర వెట్టుచుండఁగ - మూలవైచుటలు !
చూడవే సురదంతిఁ - జులకగాఁ గదిసి

యీడిచి దాని కొ - మ్మఁ బెకలించి
యందుచేతన మదం - బడచితి దాని
నిందలు నెఱుఁగ నీ - వెందు వోయితివి ?
గాలిఁ గీలినిఁ గొట్టి - కడలిఁ గలంచి
కాలునిందఱమి లో - కత్రితయమున 1250
నీ డెవ్వరును లేక - యేనుండ నన్నుఁ
జూడక మాతండ్రిఁ - జులకగా నాడి
చెల్లించుకొంటివి - సీతకై యింత
పొల్లుపోవునె మాకు - భుజవిక్రమములు ?
తాళితి నేనిట్టి - తప్పు నీవింకఁ
జాలింపు మితర ప్ర - సంగంబు "లనిన
ఆమాటలకు కుపి - తాత్ముఁడై ధైర్య
సామగ్రితో విభీ - షణుఁ డిట్టులనియె.

—: విభీషణుఁ డింద్రజిత్తు మాటలకుఁ బ్రత్యుత్తరమిచ్చుట :—

" రాక్షసాధమ ! విన - రా ! యింద్రజిత్త !
దక్షునిరీతి నిం - దలు వినుచుండ 1260
గుట్టులో నుండక - కుంభంబుమీఁద
పొట్టకై వడి - పొట్టక్రొవ్వునను
మిట్టి మీనై పడి - మీతండ్రి నన్ను
గట్టివాఁడని మెచ్చ - గాఁ ద్రుళ్ళనేల ?
పడుచువాఁడవు రాము - బాణాగ్నిలోనఁ
బడుచున్నవాఁడవు - పదర నేమిటికి ?
ఈ మాటలకు ఫలం - బిప్పుడే యిట్టి
బాములు ననుభవిం - పఁగ వేళ వచ్చె

యిట్టి యాలోచన - యిట నిన్నుఁ గూర్చి
నట్టి యా రావణు - నను దింతెకాని 1270
నిన్ను నెన్నఁగనేల ? - నీవంటి తనయుఁ
డున్న రావణుఁడేల - యోడు రామునకు ?
యమదండమట్లు కా - లాగ్నియుఁ బోలి
యమరేంద్రు వజ్రాయు - ధాకృతి నీకుఁ
దప్పించుకొనరాదు - దశరథరాము
కుప్పెకోలను రొమ్ము - గోరాడు గాని !
సీతను బట్టి తె - చ్చిన యట్ల మఱల
చేతికిచ్చిన నేల - చేకొను నతఁడు ?
పల్లకి నుంచి వెం - బడి దశాననుని
పల్లవాధరలెల్లఁ - బాటించి కొలువ 1280
సకలాంగ దివ్యభూ - షణవతిఁ జేసి
యొకఁడు నీరావణుఁ - డొదుగుచు వోయి
రాముని చరణ సా - రసముల వ్రాలి
'స్వామి ! నాద్రోహంబు - సైరింపు' మనుచు
విన్నవించిన యట్టి - వెనుక నీసీతఁ
గన్నులఁ జూచినఁ - గరుణించు మనల
నింతియె కాని యొం - డే యుపాయములు
చింతించి యితని ర - క్షింప దుర్లభము !
మనమెల్లఁ గలిగియు - మదిమది నుండి
చెనఁటిమై చెడ నుపే - క్షింప ధర్మంబె ? 1290
కొడుకవే ! నీచేతఁ - గులమెల్ల నిపుడె
చెడనున్న దీతనిఁ - జెప్పనేమిటికి ?

హితముఁ బల్కితి "నన్న - యెడ విభీషణుని
నతిమాత్రకోపుఁడై - యనియె రావణుఁడు.

—: రావణుఁడు విభీషణుని మాటలకుఁ గోపించి తనకొలువు
వెడలి పొమ్మనుట :—

" పగవానితోనైన - పాముతోనైన
తగఁ జెలి చేసినఁ - దరియింపవచ్చు!
అనుకూల శత్రుఁడై - నట్టి నీవంటి
యనుజునితోడి స - ఖ్యము సేయరాదు
వేఱె చిచ్చేటికి - వెదకంగ ? జ్ఞాతి
చేరి యుండినఁ జాలు - చెఱచు నానాఁట 1300
దాయలచే నోర్వఁ - దగుగాని యందు
దాయాది గెలువ నెం - తటివాఁడు నేర్చు ?
నడకఁ గల్గినవాని - నయమార్గ రతుని
వడిగలవాని స - ర్వజ్ఞుఁడౌ నతని
కలిమి మించిన వానిఁ - గని యోర్వలేరు
తలమానె జ్ఞాతి చెం - తలఁ జేర్చుకొనఁగ
మేలున కోర్వరు - మెఱమెచ్చు వగలఁ
జాల నమ్మించి మో - సములు సేయుదురు
తాన సాక్షినిగానె ? - తనయన్నయైన
యానరవాహుఁ గీ - టణఁచి త్రోలితివి ! 1310
అన్నదమ్ములు శత్రు - లన రెండు తెఱఁగు
లున్నవే ? క్రియలందు - నొకటింతె కాక !
హస్తిగీతలివి సు - మా యుర్విమీఁద
శస్తమైనది విభీ - షణ ! దాఁచ నేల ?

అనలంబు పాశంబు - నస్త్రముల్ భీతి
వెనుపవు మాకు నీ - భీకరాటవులఁ
గఱులు మాచెంతకుఁ - గదిసి యన్యులకు
దొరకఁ జేయుట జాతి - తోఁబొత్తుగాదు !
ఏనుఁగుల భయంబె - యెప్పుడు మాకు
మానదంచును బల్కె - మదవతుల్ వనుల 1320
తెలిసి రేనియు సజా - తీయభయంబె
బలవంతమగునట్టి - భయమండ్రు బుధులు !
ఎన్న నాప్తులు గల్గు - నెడలఁ గల్గియును
సన్నదమ్ములుగల్గు - నందుకు భయమూ
నీరజాక్షుల కెల్ల - నిలుకడ లేమి
పాఱులక్రిందియ - పరిపాటి జయము
ఫలములుగాఁగ జె - ప్పఁగమున్న వినమె.
తెలివిడియయ్యె నీ - తెఱఁగిట్టి యెడల
ముల్లోకముల గెల్చి - ముగురు వేలుపులు
బల్లిదుండని నన్నుఁ - బాటించి పొగడఁ 1330
జూడఁజాలక యిట్టి - చోఁ జెడఁజూడ
వేడుకనై యింత - విఱుగనాడితివి.
అంటియు తామర - పాకు జలమ్ము
లంటనిగతి యెంత - యాప్తీకరించి
నడిపిన మదిలోన - నాదీదు చెలిమి !
అడుగ నేమిటికి దా - యాది పుట్టునకు ?
తన యిచ్చవచ్చునం - తయు తేనెలాని
వెనుక తుమ్మెద పూవు - విడచినయట్లు

కలకాల మఖిల సౌ - ఖ్యంబులఁ దేలి
తొలఁగఁ జూచితివి బు - ద్ధులు చెప్పి యిపుడు ! 1340
నీమాట గాదన్న - నెపముగా ద్రోహ
మే మెఱుఁగఁగనీక - యిన్నాళ్లు నుండి
యజ్ఞ చూచుకపోవ - నందఱు నన్ని
రజ్జులాడెదవు దు - ర్మార్గుఁడవగుచు !
ఇమ్మన్న సీత నే - నిత్తునో ? పరుల
కొమ్ములు చివ్విన - గొంక నేరుతునా !
మైనపు శూలంబు - మై నాఁట గలదె ?
ఆనరుల్ వానరు - లా నాకు నీడు ?
కరి నీట మునిఁగి యా - కడి కేఁగి దుమ్ము
కరముతో నెత్తి ఘూ - త్కారంబుతోడఁ 1350
దను ముంచుకొనురీతి - తలఁపుదుర్జనుఁడు
కొనసాగనీఁ డియ్య - కొనిన నెయ్యంబు
శరదంబుదములు ఘో - షము లింతెకాని
శరములు వర్షింపఁ - జాలని యట్లు
నీరసాత్మునితోడి - నెయ్యంబు కార్య
కారి గానేరదు............డీరాదు !
ఇట్టివేళలయందు - నీసుతో నిట్టి
పెట్టిమాటలు వల్కి - వెడలిపోవుటకు
నినువంటి కపటాత్ము - నికిఁ జెల్లెఁగాక !
విని యోర్వనేర్తునే - వేఱొక్కఁడైన 1360
నిందనీయుఁ డదేల - నీ శరీరంబు
పందవై వంశనా - పకుఁడవైనావు
చెనఁటివి నిన్నుఁ జూ - చిన గాదు తొలఁగు"

మనుమాట లాడియు - నాడకమున్న
తనచేతిగద భుజాం - తరమునఁ బూని
వినువీథి కెగసిన - వెంబడిగాఁగ
నలువురు మంత్రులు - నాల్గుదిక్కులను
బలిసిరా పోక యం - బరమున నిలిచి
కనికరంబున దశ - కంధరుఁ జూచి
వినయగౌరవములు - వెలయ నిట్లనియె. 1870

—: విభీషణుఁడల్లో వెడలిపోయెదనని చెప్పివెడలుట :—

" దేవ ! యిట్లాడినఁ - దీఱునే మీకు ?
నీవాక్యములు మాన - నీయముల్ మాకు
పూజనీయుఁడ నేను - పుత్రునిమాఱు
రాజవు మీఁద న - గ్రజుఁడవు తనకు
గురుఁడ వేమెఱ రక్ష - కుఁడ వటుగాన
నఱచేసి పెంపు సే - యఁగరాదు నాకు
పోయెద కదలి యి - ప్పుడ మిమ్ముఁ బాసి
యీయెడ వసియింప - నిఁకనేల తనకు ?
తలఁచిన నీయెడ - ధర్మంబు లేదు
చులకని మాటలి - చ్చోఁ నన్నుఁ బలికి 1880
హితమును నహితంబు - నెఱుఁగక పాప
మతిఁ గానలేవైతి - మనుమార్గ మిపుడు.
ఉరక యోఁచిచి యుందు - నుండెద ననుచుఁ
బరికింప మనగఁ గా - ల్వరు క్షణంబైన
తన మేలుగీల్లకు - తగులైనవాఁడు
కనిన యర్థము మేలు - గామించి పలుక

నవివేకి విననొల్లఁ - డటుగాన నీవు
చెవిఁ జేర్పవైతివే - చెప్పినమాట
కాలమెవ్వరి కతి - క్రమణ సేయంగఁ
బోలునే ? నీవునా - బుద్ధు లెన్నుదువె ? 1390
ఇచ్చకమ్ములుగాఁగ - నిప్పుడు మనసు
వచ్చునట్లాడెడు - వారెందు గలరు
కాలోచిత ప్రీతి - గాకున్న మీఁదఁ
జాల హితంబైన - చందంబు వలుకు
వారలందును వేఱు - వారు గల్గినను
వారిబుద్ధులు విను - వారలు లేరు
లేకున్న నీదు మే - లిమి మదిదలఁచి
నాకుఁ దీఱమిని వి - న్నపముఁ జేసితిని
విననొప్ప నామాట - వినవేని మమ్ముఁ
గినిసి పల్మారు ప - ల్కిన నాకు నొప్ప 1400
కాలునివలెఁ ద్రాఁటి - కల్లుకుఁ జిక్కి
యీలనై చెడుచోను - పేక్షింప లేక
యీచిచ్చుఁ జల్లార్ప - నెంచి నీచేత
నీచోక్తు లిపుడు విం - టిని చెవుల్ నాఁట
నేరంబుఁ జూడక - నీవిట్లు వలుకఁ
దీఱెను నీసొమ్ము - దీన ఋణంబు
బలమెంత కల్గిన - బాహువిక్రమముఁ
గలిగిన కాలాను - గతిచేత వాఁడు
నేటిలోపల నున్న - యిసుక తిన్నియకు
పోటియై రూపేది - పొలియక పోఁడు ! 1410

రాఘవామోఘనా - రాచ సంధాన
లాఘవహతిని నే - లను వ్రాలియున్న
నినుఁ జూడలేక యీ - నిర్వేదవేగ
చలిత విషాదంబు - సైరింపలేక
యిట్టిమాటలు కోర్చి - యేను నీతోడ
బుట్టిన పాపంబుఁ - బొందిన కతన
నీమాట గాదన్న - నిల్చి పల్కెదను
స్వామి! యిప్పుడు మీకు - సరిపోక యున్న
తరువాతనైనను - దలఁచి నాబుద్ధి
సరిఁజూచుకొనుము మో - సము వచ్చెననుచుఁ 1420
దలఁపులో నామీఁది - దయ మఱవకుము
వలయుచోటికిఁ బోయి - వచ్చెద నేను
అన్న! యింకిటమీఁద - నైన చిత్తంబు
తిన్నగాఁ జేసి శాం - తి వహింపుమీవు!
ఏలయ్య! జానకి - నిమ్ము రామునకు
మేలందుమెట్లైన - మేలింకమీఁద
నిను గాచికొనుము మ - న్నింపు మీలంక
దనుజులకును ప్రాణ - దానముల్ చేసి
మోదంబుతో సుఖ - మ్మున నుండు" మనుచు
నాదానవేంద్రున - కంజలి చేసి 1430
తన యింటికని వచ్చు - దారి ముహూర్త
మునకు విస్ఫీథి రా - మునిచెంత కరిగి

—: విభీషణుఁడు శ్రీరామునివద్దకుఁ బోపుట :—

నిలిచిన సౌదామి - నీలతా కలిత
జలదమోహనసంగ భూ - షణరుచుల్ వెలుఁగ

నల్లని మేనితో - నడుమింట తమ్మి
నల్లనఁ గనుఁగొంచు - నటునిటు బోక
నచ్చిన మంత్రులు - నలువురు గొలువ
వచ్చి నిల్చినవాని - వాలిసోదరుఁడు
కనుఁగొని కొల్చిన - కపినాయకులను
దనచెంగటికిఁ బిల్చి - తడయక వల్కె 1440
"కంటిరే! యొకఁడు రా - క్షసులతోఁగూడి
మింటి త్రోవను మన - మీఁద దండెత్తి
రావణుఁడనుప ని - ర్భయవృత్తి నుండ
నీవిధంబని మిమ్ము - నెచ్చరింపంగఁ
బిలిచితి" నన వారు - పెల్లుబ్బి గిరులు
శిలలును దరువులు - చేతులనంది
"దేవ! పోనీక మ - ర్దింతుము వాని
నీవేళ సెలవు మా - కిందు పోయెదము!"
అని చిమ్మిరేఁగి మ - ల్లాడుచు నింగిఁ
గనుచు వాలములార్చి - గర్జింపఁ జూచి 2450
యదరక బెదరక - యంజలితోడ
జదలు మ్రోయఁగ విభీ - షణుఁ డిట్టులనియె

—: తన్నుఁ బట్టవచ్చిన కపులతో విభీషణుఁడు తన వృత్తాంతము నెఱింగించుట :—

"కపులార! యేల యా - గ్రహము నామీఁద
కృపఁజూడుఁడే మిమ్ముఁ - గినియ రాలేదు
వారింపఁ దగను రా - వణుని తమ్ముఁడను
పేరు నన్నెపుడు వి - భీషణుఁడండ్రు

ఆజి నొక్కట బోలి - యవనిజ గొంఱకు
నాజటాయువుఁ జంపి - యసుర నాయకుఁడు
వచ్చిన మొదలుగా - వైదేహి నేల
తెచ్చితి ' వలదీ ప - తివ్రతామణిని 1460
మఱల రాముని కిమ్ము - మనుజాడఁ గనుము
కొఱగాదు నీబుద్ధి - కొనసాగ దనుచు
చాటి చెప్పుచు నుందు - చలమిచ్చి కాని
మాటల నన్నవ - మానంబు చేసి
బంటు నాడిన యట్లు - పదువురు వినఁగ
కంటువుట్టఁగఁ బలు - కఁగ నోర్వలేక
తలవాఁచి కొనుచు నా - తని పొత్తుఁ రోసి
కలఁగుచు సర్వలో - కశరణ్యుఁడైన
శరణాగతత్రాణ - సద్ధర్మపరునిఁ
గరుణాపయోధి రా - ఘువవంశ తిలకు 1470
శ్రీరాము చరణరా - జీవముల్ నమ్మి
చేరితి నను మీరు - చేపట్టి కాచి
పొడగనిపించు డి - ప్పుడు నన్ను మీకుఁ
గడప రాదనిన భా - స్కర కుమారుండు
గ్రక్కునఁ జేరి ల - క్ష్మణుఁడు వినంగ
మ్రొక్కి యిత్తెఱఁగు రా - మునకు నిట్లనియె

—: సుగ్రీవుఁడు విభీషణుని రాకనుఁగూర్చి శంకించుచుఁ
శ్రీరామునితోఁ బ్రసంగించుట :—

" ఆలోచనములందు - నందందు మనము
పాళెముల్ డిగియెడు -పట్టులమీఁద

చనియెడుచోట మో - సములు సేయుదురు
దనుజులు మాయావి - ధానకోవిదులు 1480
గాన వీరల నమ్మఁ - గారాదు నేఁడు
దానవుఁడామీఁద - దశకంధరునకు
సోదరుఁడట రాక్ష - సుల నమ్మరాదు!
కాదని యన్నతోఁ - గలహించి యిపుడు
వచ్చినవాఁడట - వానికి హృదయ
మిచ్చి రా నవకాశ - మిచ్చితి మేని
మన మర్మములు వీఁడు - మదిలోన నెఱిఁగి
యనువు చూచుక వైరి - కవకాశ మిచ్చి
కొదవసేయును దన - కును జేతనైనఁ
గదిసి చంపును ద్రోహ - కార్యముల్ సేయ 1490
నజ్జ చూచుకయుండు - నది యేల వీని
రజ్జులు నమ్మంగ - రాదు రాక్షసుల
కపటాత్మకులు చేరఁ - గాదు విద్వేష
మెపుడు నున్నది మన - కీ రాక్షసులకు
నిజముగా విశ్వాస - నీయుఁడు గాఁడు
వృజినాత్మకుఁడు చూడ - వీని రావణుఁడు
వంచనఁ గొలిచిన - వాఁడౌట వేగ
పంచగానోపు చం - పఁగఁ జెల్లదితని
రాఁబోలు భేదకా - ర్యమునకు వీఁడు
తాఁబట్టి చేత గ - దాదండ మితఁడు 1500
దండనోపాయంబు - తలఁచెనో తెవచి
యుండదు వీఁడితో - నొరిమె గారాదు
తరమింత మిప్పుడి - తఁడు ' చంకదుడ్డు

శరణార్థి ' యనునన్న - చందంబు వాఁడు
తనవారిఁ జేపట్టఁ - దగుఁగానివైరు
లనుగూడు వానిఁ జే - ల్లదు చేర్చికొనఁగ
నరిపోవ దీతని - చందంబు నాకు
శరణు వేఁడుదురె రా - క్షసులు మానవులఁ
దలఁచిన పగవాని - తమ్ముని నెట్టుఁ
దలఁచిన చేపట్ట - ధర్మంబుగాదు 1510
అవకాశ మిచ్చిన - నహితుల సమయ
మవుదాఁక నెల్లెన - నడఁగి తారొండె
పట్టి కాకముల గూ - బలు జంపినట్లు
కొట్టి పోవుదు రివి - కొఱగాదు మనకు"
అనుమాటలకు రాముఁ - డంగద పవన
తనయాది వానరో - త్తముల నీక్షించి
వారు వారల మనో - వార్తల నెల్ల
నారయఁ దలఁచి యి - ట్లని యానతిచ్చె

—: శ్రీరాముఁడు విభీషణునిగూర్చి తమతమ యభిప్రాయములను దెలుపుమని చెప్పుట :—

" తగిన యాప్తులతోడ - తనవారితోడ
తగవైన కార్య మెం - తయు విచారించి 1520
నడవఁ జెల్లు విభీష - ణ ప్రసంగముగ
నుడివె మాతోడ భా - ను కుమారకుండు
చెప్పిన మీకుఁ దో - చినయట్టి తెఱఁగు
లొప్పైన చందము - లూహించి" యనిన
నామాటలకు వార - లందఱుఁ గెలనఁ

జేమోడ్చి వినతులై - శ్రీరాముఁజూచి
" దేవ! ప్రాజ్ఞుఁడవు బు - ద్ధివిశారదుఁడవు
భావజ్ఞుఁడవు కృపా - పారంగతుఁడవు
సర్వజ్ఞుఁడవు శౌర్య - శాలివి సకల
నిర్వాహకుఁడవు వ - ర్ణిత చరిత్రుఁడవు 1530
వాసిగాఁ గొలిచిన - వారిగౌరవము
చేసి యిట్లానతి - చ్చితిరింతె కాని
యేమెల్ల మీచిత్త - మెఱిఁగి యుత్తరము
రామ! యొసంగు వా - రమె? నేర్తుమనుచు
వేఁడిన నెఱిఁగిన - విధమునఁ దెలుపు
వాఁడింతె కాక దే - వర సమ్ముఖమున! "
అనుచు నందఱు నన్ని - యాలోచనములు
వినుపింతు మనియుండ - విభుఁడోటఁ జేసి
కమనీయ కాంచనాం - గదుఁ డంగదుండు
సమయోచితక్రియా - సరణి నిట్లనియె 1540

—: అంగదుఁడు తన యభిప్రాయముఁ జెప్పుట :—

" శత్రుపక్షమువాని - సకలయత్నముల
మిత్రునిగాఁగ నే - మించుట గాదు
కార్యాంతరంబులు - గని వానిహృదయ
పర్యాయ మపుడు చే - పట్టుట నీతి
గుణదోషములఁ గనుఁ - గొని దోషరహిత
గుణము గల్గినఁగాని - కూర్చుకోఁ దగదు
పరిహరణీయ మీ - పని" యన్న యపుడు

—: శరభుఁడు తన యభిప్రాయముఁ దెలుపుట :—

శరభుఁడు విని యను - సారిగాఁ బలికె
నీవిభీషణుఁడున్న - యెడకును దగిన
వేగుల వానిని - వెంబడి పనిచి 1550
యతని చందమెఱింగి - యా తరువాత
హితమైన కార్యమూ - హించుట తగవు !
అందక యీతని - నంగీకరించి
సందీయ రాద"న్న - జాంబవంతుండు
మతిమంతుఁడును బుద్ధి - మంతుఁడుగాన
హితమతి రాముని - కిట్లని పలికె

—: జాంబవంతుండు తన యభిప్రాయముఁ దెలుపుట :—

" అయ్య ! నాకును దోఁచు - నాలోచనమున
కియ్యెడ వీని రా - నీయంగఁ దగదు
దనుజుఁడు పగవాని - దండనేయుండి
చనుదెంచినాఁడు వం - చకుఁడుగానోపు 1560
నందుచే చేర నీ - యఁగరాదు క్రియల
ముందఱ వీనిచే - మోసముల్ వచ్చు !
ఎక్కటివాఁడు ? వీఁ - డెందుకు వచ్చె ?
ఇక్కడి కేతేర - యెడరైన చోట ?
మానుఁడీతని " యన్న - మైందుఁడామాట
తానిచ్చగించి సీ - తాకాంతుఁ బలికె

—: మైందుఁడు తన యభిప్రాయముఁ దెలుపుట :—

" ఒకని నెఱుంగక - యుండంగ వీరె
యొకనినా మీఁదట - యొకనిగాఁ బనిచి

యతని యాగతి మన - మడిగింప నొక్క
వితమున నుండునో - వేఱువేఱగునో ? 1570
చెప్పిన చారుల - చేఁ గని కాని
యిప్పుడే వీనిరా - నీయ రాదిటకుఁ
గన్న కార్యము సము - ఖంబున నేను
విన్నవించితి" నన్న - విని కేలుమొగిచి

—: అంజనేయుఁడు శ్రీరామచంద్రునికి సరియగు తన యభిప్రాయము నెఱింగించి విభీషణుని చేకొనుమని చెప్పుట :—

యాలోచనపరుఁడు - నతిశయ బుద్ధి
శాలియు సకలార్థ - సాధకుండైన
యంజనాసుతుఁడు కా - ర్యాకార్యవేది
యంజకఁ జేరి తా - నప్పు డిట్లనియె
"దేవ! యందఱిమాట - ధిక్కృతి చేసి
యేవిన్నపము సేయ - నెంచుట గాదు 1580
మావారిలో బుద్ధి - మంతుండ ననుచు
నేవారి మాటల - కెదురాడ లేదు
పక్షాంతరంబుగాఁ - బలుకకార్యంబు
పక్షీకరించి యేఁ - బలుకుట గాదు
అన్యులవలన కా - ర్యాపేక్షఁ జేసి
యన్యాపదేశంబు - లాడంగలేదు
ఉరకుండరాదని - యొకమాటవంతు
కొలఁకు నాడఁగ నెన్న - కొని పల్కలేదు

నామాట నడిపింప – నాకిందువలన
నీమైఁ బ్రతిష్ఠరా – నెంచంగ లేదు. 1590
ఎఱిఁగి యుండిన యర్థ – మే విన్నవింపఁ
బరఁగుట మదినెంచి – పలికెద నిపుడు
తొలుత నొక్కరి గుణ – దోషముల్ దెలియ
వలయునంచును బల్కె – వాలినందనుఁడు
అది సరిపోదు నా – కన్యులఁ దెచ్చి
యిదిపనిగా నుంచు – నెడగానివాని
గుణదోషములు నెఱుఁ – గుట యెట్లు తెలిసి ?
గుణము గల్గినగాక – కొఱగాని వాని
నొకట నియోగించి – యుంచుట యెట్లు ?
తెకదేరగాని చిం – తింప నీమతము 1600
కాదట్టులుండి నం – గదుమాట శరభుఁ
డాదెసకై చారు – నంపించి యతని
మనసుఁ గన్గొని కాని – మదినమ్మఁ జెల్ల
దనియె గదా ? మన – మడిగించి నపుడె
వంచింప వచ్చిన – వాఁడనై కాక
మంచివాఁడైన తా – మననేల నిచ్చు ॥
తనదు కార్యమునకుఁ – దగినట్టి మాట
లని వారిఁ బొమ్మను – నదియునుం గాక
కారుణ్యనిధి సమ్ము – ఖంబున రాయ
భారముల్ గలనె యీ – పక్షంబు చేత ? 1610
తగదట్టి శరభమ – తంబు తాఁబెద్ద
యగు జాంబవంతుఁడా – యన మాటగాఁగ
నెక్కడనుండి వీఁ – డెక్కడవచ్చె

నిక్కటి కీవేళ - యెడరైన చోట
నసురేంద్రు తమ్ముఁడీ - యనగాన మనకు
పొసఁగదంచును బల్కె - పొసఁగు నిదెట్లు!
అన్నతోఁ గలహించు - నదియె కాలంబు
నిన్నుఁ జేరినవాని - నీని దేశంబు
పగవాని వానిఁ జే - పట్టుట నీతి
యఁగుమర్మకర్మంబు - లరయుట కొఱకు 1620
దానిచే నతని మ - తంబును గాదు
దీనుఁడై శరణఁ బొం - దినవాని మనసు
వేగులవారిచే - విని నడిపింప
బాగని మైందుఁడు - పలికె నెట్లయిన
నమ్మి వచ్చినవాని - నానావిధముల
నెమ్మది శోధింప - ని ఋమించినారు
వీరని తనమది - వేఱుగా నెంచు
నారాక్షసుని నెయ్య - మాతరువాతఁ
జేసియు నెనరు మ - చ్చిక గల్గియుండ
నాసించి వచ్చినాఁ - డట్టి పక్షమున 1630
మదిఁజూడ మైందుని - మతమనిగాదు
తుదిని సిద్ధాంత మిం - దుకు విన్నవింతు
నితనిఁ జూచిన దోఁచ - దింతయుఁ గపట
మతఁడెంత దాఁచిన - నాకృతి చేత
కనుపించు మర్మంబు - గావున వీఁడు
దనుజుఁడౌ నేని యా - తని రాక మనకు
నరసిన దేశకా - లాను గుణంబు
పరికించినాఁడు మీ - పౌరుష క్రియలు

తమ యన్న నేరంబుఁ - దలఁచుక యితఁడు
సమయంబుఁ జూచి రా - జ్యము మీఁది కాంక్ష 1640
వానితో నెడఁబాసి - వారినిఁ జంపి
వానరసామ్రాజ్య - వైభవంబెల్ల
నినకుమారునకు మీ - రిచ్చుటఁజేసి
కనుగల్గి ముందఱ - గా వచ్చినాఁడు
నాకుఁ జూడగ వీని - నమ్మి చేపట్ట
మీకార్యములకు స్వా - మి ! కొఱంత రాదు
హితమని సరిపోవ - నెఱుఁగరె మీరు
మఱి బృహస్పతికి స - మానులౌవారు ?
మీచిత్తమునకెట్లు - మేలయ్యె నదియె
చూచుకొం డితరులఁ - జూపంగనేల ? ” 1650
అనిన సమ్మతినొంది - యవనిజాప్రియుఁడు
తనచెంత వానరో - త్తముల కిట్లనియె

—: శ్రీరాముఁడు విభీషణుని తోడితెమ్మని వానరుల కాజ్ఞాపించుట :—

“ ఎఱుఁగక యడిగితి - నే మిమ్ము ? మీరు
పరమాప్తులును నీతి - పరులును గాన
తలఁచి మీరెల్లహి - తంబె నాకెఱుఁగఁ
బలికితి రదిమీకు - పరమధర్మంబు !
శరణంచు వచ్చిన - శాత్రవునైనఁ
గరుణించి ప్రోతురు - గాక వారెందు
మొదలింటి గుణదోష - ముల మదిఁ జూడ
రిది ధర్మ మిలయేలు - నెల్లరాజులకు ! 1660

కాచితి వీని వే - గమె తోడితెండి
నాచెంత " కన భాను - నందనుఁ డనియె

—: సుగ్రీవుఁడు శ్రీరాముని నివారించుట :—

" అపద పుట్టుచో - నన్నుఁ బోవిడిచి
పాపాత్ముఁడై వాని - పగవారమైన
మనలఁ జేరఁగ వచ్చె - మనకెట్టివాఁడు
తనమనసిచ్చి మీఁ - దట నాప్తుఁడగునె ?
మీకేల ? వీఁడు స్వా - మి ద్రోహి నిట్లు
జేకొన వచ్చు దా - తీర్ణ్యమే " లనిన
నగుమోముతోడ నం - దరు వినుచుండ
మగుడ రాఘవుఁడు ల - క్ష్మణున కిట్లనియె. 1670

—: శ్రీరాముఁడు తనయభిప్రాయము తిరిగి స్పష్టపఱచుట :—

" వినవన్న సౌమిత్రి ! - వేద శాస్త్రార్థ
ఖనియగు నీతిమా - ర్గప్రవర్తకుఁడు
నతిబుద్ధి శాలియు - నైన సుగ్రీవుఁ
డితనిఁ జేరంగరా - నీయఁ రాదనియె
ఆపన్నుఁడును జ్ఞాతి - యగువాఁడు తనకు
నేపాట నజ్జ యూ - హించుక యట్టి
వేళలఁదమవారి - విడిచి యచ్చోటు
మేలొందు నచటనే - మించి చేరుదురు
తగినవాఁడై నట్టి - దాయాదియెంత
తగవుగా నడచిన - ధరయేలువాఁడు 1680

చూచి యోర్వఁగ లేక - చులకఁగాఁ జూడ
నాచోట చేతనా - నతఁడేల యుండు
శత్రుపక్షమువాఁడు - జూడ యేదీని
మైత్రియన్నను వారు - మనమున నొక్క-
జాతివారము గాదు - శాత్రవుఁ డనిమి
యాతని సామ్రాజ్య - మనుభవించుటకు
మనచేతఁ దీఱదా - మతమునఁ జేసి
తనకును గట్టు నా - తని పట్టుమనుచు
నాసించి వచ్చినాఁ - డందుచే నితని
దోసంబు లెన్ననెం - దుకు ? తోడితెండు 1690
రావణుఁ డితనిఁ జే - రఁగనీక తోలఁగి
పోవనాడిన నెందుఁ - బోవక యితఁడు
గెలుతురు వీరని - కృతనిశ్చయతను
జలముతో రాజ్యకాం - క్షుకుఁ జేరుకతన
నుపకారియగుఁగాక - యుపమమె వీని
నపకారి యగుచుఁ బో - మ్మని విడనాడ ?"

—: శ్రీరాముఁడు సుగ్రీవునితో తిరిగి విభీషణునితోడి తెమ్మనుట :—

అని "పోయి సుగ్రీవ ! - యవని యందైన
తనవంటి తనయులు - తండ్రికిఁ గలరు
వలసినచోట నీ - వంటి చుట్టములు
గలరెందు భరతుని - గతిఁ బుట్టినట్టి 1700
తమ్ముఁడు వెదకిన - ధర లేఁడు గాక
తమ్ములకేమి యెం - దఱు లేరు చూడ

దనుజేంద్రునకు వీఁడు - తమ్ముఁడే తప్ప
దనుమానమేల మ - మ్మని వచ్చినాఁడు
తోడితెమ్ము"న విని - తొలుతటియట్ల
కీడాడఁ దలఁచి సు - గ్రీవుఁ డిట్లనియె.

—: సుగ్రీవుఁడు మఱియొకమాఱు ప్రత్యుత్తరము చెప్పుట :—

" అయ్య ! యేమిటికిట్టు - లానతిచ్చెదరు
కయ్యంబునకె వచ్చెఁ - గానోపు వీఁడు
పగ్గెలు వల్కి తాఁ - బరుఁడన వచ్చి
వెగ్గలంబగు మన - వేలంబుఁజూచి 1710
చేరరా వెఱచి యా - చెంగట వీఁడు
కూరిమి కొసరుచుఁ - గొలిచెద ననుచు
మచ్చికగైడు వీఁడు - మాయావిచేత
నిచ్చిన మనలోన - నెవ్వనినైనఁ
దలమానిసినిఁ జంపి - దాఁటి పోవంగఁ
దలఁచినవాఁడు దై - త్యవరుఁడు పనుప
మదిమదినుండి యీ - మానవాశనునిఁ
గదియ రమ్మననేల - గలభిరానేల ?
పోవఁ ద్రోలుదమన్న - పూర్ణకారుణ్య
శేవధియైనట్టి - శ్రీరాముఁ డనియె, 1720

—: శ్రీరాముఁడు సుగ్రీవునితో మాఱుమాటాడకుండ విభీషణునితోడి తెమ్మని చెప్పుట - శరణాగతుని రక్షించెదనని చెప్పుట :—

" పిలుచుక రమ్ము వి - భీషణుఁడేమి
దలఁచిన మనమీఁదఁ - దలఁపగానిమ్ము

తగినవాఁడైనను - దగనివాఁడైన
మిగులఁగలెస్స యే - మిటికాతలంపు ?
యక్షదానవపిశా - చాసుర దేవ
రాక్షసావళితో ధ - రాచక్రమెల్ల
వేళంబుఁ జిటికెన - వ్రేలనఁ గెలువఁ
జాలు నాతో నీ - ప్రసంగముల్ గలవె ?
ఆదిగ నీతివా - క్యము వినలేదె ?
ఈదు వేళల నొక్క - యెఱుకు కారడవి 1730
దీమంబు చెంగపో - తానిఁ బట్టి సందె
జామున నుభయ ప - క్షంబులు విఱిచి
చిక్కంబులోనవై - చి కడింది చలిని
పక్కలు వంచుక - పండ్లురాయంగ
గజగజ వడఁకుచోఁ - గని కపోతంబు
నిజకాంతఁ బురికొన - నేరంబుఁ గాచి
కరుణచే కొఱవి యొ - క్కటి ముక్కుగొనలఁ
గఱకుచు వచ్చి య - క్కడనుంచి చెంతఁ
జిదుగులుఁ గట్టెలుఁ - జేరంగవైచి
యెదురు కట్టున మంట - యిడఁ గిరాతుండు 1740
ఒడలుగాచుక కపో - తోత్తమ ! నేఁడు
కడు డస్సినాఁడు నా - కలిఁ దీర్పుమనినఁ
జిరకీర్తి యాసించి - చిచ్చులో దుమికి
యెఱుకవాఁడు మెసఁగ - నిచ్చె దేహంబు !
గువ్వపుట్టుక బుట్టి - గురుకీర్తిఁ గాంచె
నవ్వారె పిశునులా - నరపాలకులను !
అనృతంబు వెఱపును - నాస్తివాదంబు

దనరు నె రాజనం – దనుల కెంద్రైన ?
కానిమ్ము విమలధీ – కణ్వతనూజుఁ
డైన కండుని గీత – ల ప్రసిద్ధంబె ? 1750
పగవానినైనఁ జే – పట్టుదుఁ గేలు
మొగిడించి వచ్చితా – ముందటనున్న
యప్పుడె తనకోర్కు – లడిగినఁ దీర్తు.
యిప్పటికైన మే – లిమ్మను దృప్తి
శరణంబు వచ్చిన – స్వశరీరమైనఁ
గరుణించి యిత్తురే – కడ మహామహులు
వెఱపుతోనైన వి – విధముని ధర్మ
మెఱుఁగక యైనదా – నెవ్వారలైన
మఱుఁగుఁ జొచ్చినవారి – మహిఁగావరేని
దురితంబులెందుఁ బోఁగ – ముదు రెల్లనాఁడు. 1760
అభయదానము సేయు – నతఁడాచరించు
శుభకర్మములు చాటు – చొచ్చినవాఁడు !
అన్నియుఁ గొనిపోయి – యమరలోకమున
నున్నతపదవుల – నొంది సుఖంబు
గాంచెదనన లేని – కపటాత్ముఁ డెంచి
చూచినఁ బుణ్య య – శోహానిఁ జెందు
ఏనెట్లు శరణన్న – యెడఁ ద్రోవనేర్తు ?
కానక పలికితి – కాకయీమాట
తప్పదీ యఖిల భూ – తములకు వలయు
చొప్పున నభయమి – చ్చుట నావ్రతంబు ! 1770
ఈ విభీషణుఁడు కా – నిమ్ము సుగ్రీవ !
రావణాసురుఁడె తా – రానిమ్ము వేఁడ

నిచ్చితి నభయమే - నిప్పుడే తోడి
తెచ్చి యిందునుపు సం - దియమేల నీకు ?"
అనవిని సుగ్రీవుఁ - డాప్తుఁడై యునికి
చనవుతో శ్రీరామ - చంద్రున కనియె

—: సుగ్రీవుఁడు విభీషణుని తీసికొనివచ్చుటకు బయలుదేరుట :—

" సత్యమెంతయు ధైర్య - శౌర్యాదిగుణములు
లత్యంతమున మీకు - నాభరణములు
స్వామి చిత్తమెఱుంగఁ - జాలక యేను
సామాన్యబుద్ధి నీ - జాడఁ బల్కితిని 1780
అది యేమి యరుదు మీ - యంత కారుణ్య
సదనున కీవిభీ - షణుఁ గాచు టెంత
చేరి నీమఱుఁగుఁ జొ - చ్చినవాఁడు బ్రతుక
నేరఁడె ? యందుక - నేకదా సాక్షి
తనకును గపట మిం - తయుఁ దోఁచలేదు
జననుతుఁడగు విభీ - షణుఁ జూచినను
మంచివాఁడాతఁడు - మామీఁదఁ గరుణ
యుంచినగతి వీని - నూరార్పఁ దగవు
తమయట్ల మీపద - ద్వయములు గొలిచి
సమబుద్ధిఁ గూడి యి - చ్చటనుండుఁ గాక 1790
తోడి తెచ్చెద"నని - తోడనే మొగసి
నీడజోత్తముఁ దెచ్చి - నిర్జరప్రభుని
చెలిమి సేయించిన - చెలువున దైత్య
కులపతి తమ్మునిఁ - గూర్చుకవచ్చి

—: విభీషణుఁడు శ్రీరాముని సందర్శించుట :—

సంధింపఁ జేయ వి – శ్వాసవిధాను
సరిధానమున రామ – చంద్రుని చరణ
నాళీకములపై ప్ర – ణామంబుఁ జేసి
లేలెమ్మనుచును వా – లిసుతుండు వలుక
తన ప్రధానులతోడఁ – దాలేచి ఫాల
మునఁ గరాంబుజములు – ముకుళించి పలికె 1800

—: విభీషణుఁడు తనవృత్తాంతమునంతయు శ్రీరామునికి నివేదించి శరణాగతుఁ డగుట :—

" దేవ ! లంకాపురా – ధీశుఁడై నట్టి
రావణుతమ్ముఁడ – రాక్షసాన్వయుఁడ
పేరుకొందురు నన్ వి – భీషణుఁడనుచు
శ్రీరామ ! నమ్మి వ – చ్చితి నిన్ను నిటకు
మాయన్నచే తన – మనసు రాకున్న
దాయవు పొమ్మని – తనకొల్వులోన
నాడరానట్టివి – యాడి నీమోము
చూడరాదనిన నేఁ – జూడరాదనుచు
నాతని నెడవాసి – యాశ్రితపారి
జాతంబు మాదృశ – జనతాశరణ్య 1810
జనసుతు గారుణ్య – శరధిదాశరథి
నిను నమ్మి వచ్చితి – నీవాఁడ ననుచుఁ
గలిగిన సకలభో – గములు లంకయును
కలవారి నింతులఁ – గన్నబిడ్డలును

యెడవాసి మంత్రులు - నేరును వచ్చి
పొడగంటి మిమ్ము నె - ప్పుడును మీసొమ్ము
నాసొమ్ము మేను ప్రా - ణములును మీకు
దాసుండ నభయ హ - స్తంబు పాలించి
లాలింపుఁడనిన చ - ల్లని చూపు చూచి
చాల వేడుక - రామ - చంద్రుఁ డిట్లనియె 1820
పిలిపించినపుడె వి - భీషణ ! యింక
కలఁగ నేమిటికి ల - క్ష్మణు నట్ల నీవు
నింక నీకు విచార - మేఁటికి నీక
ళంక ఖేదంబు లె - ల్లను దీర్చి కొనుము
రావణాసురుని శౌ - ర్యంబును బలము
నేవిధంబది మాకు - నెఱుఁగంగ వలయు
పేరుకొమ్మనిన వి - భీషణుండపుడు
శ్రీరామచంద్రు నీ - క్షించి యిట్లనియె

—: శ్రీరామచంద్రుఁడు విభీషణుని కథయమీాయఁగా నాతఁడు
శ్రీరాముని కోరికపై రావణుని బలములను దెలుపుట :—

అయ్య ! రావణుఁడు బ్ర - హ్మవరంబు చేత
కయ్యానమూఁడు లో - కములు జయించి 1830
యెదురెవ్వరును లేక - యింద్రుండు యముఁడు
మొదలైన దొరలు పం - పుడు పనుల్ సేయ
గర్వాంధుఁ డగుచు లం - కాపురంబేలు
సర్వాంకపైశ్వర్య - సామగ్రిచేత
మొనగాఁడు పెద్ద త - మ్ముఁడు కుంభకర్ణుఁ

డనువాఁడు సమదగ - జాయుత బలుఁడు.
అతనితో నెదురించి - యనిలోనఁ బోర
గతకాలమునను నె - క్కడ నేనెఱుంగ
నారావణుని మంత్రి - యగు ప్రహస్తుండు
శూరుఁడు కార్యద - క్షుఁడు జయశాలి 1840
బవరంబులో మాని - భద్రుని నోర్చి
దివిజులకును గుండె - దిగులైనవాఁడు
అగణితబద్ధ గో - ధాంగుళిత్రాణుఁ
డగుచు పావకదత్త - మగు రథంబెక్కి
మాయావియై మేఘ - మాలికాచ్ఛన్న
కాయుఁడై చేత సిం - గాణి ధరించి
పిడుగులవంటి కు - ప్పల యంపవాన
జడిగాఁగ గురియుచు - సమరరంగముల
వైరుల మిత్తి రా - వణ సుతుఁడొప్పు
శ్రీరామ! వాఁ డింద్ర - జిత్తనుపేర 1850
భండనంబుల సకం - పనుఁడు మహోద
రుండు సారణుఁడు ధూ - మ్రుఁడు నరాంతకుఁడు
శుకమహాపార్శ్వులు - శూరతచేత
నొకరినైన గణింప - రొక్కరొక్కరుఁడు
ప్రళయాగ్నిసములు ది - క్పాలకనిభులు
కలవారు వారు రా - క్షసనాయకునకు
నాలంకలో దాన - వావళితోడ
నాలంబులోన నిం - ద్రాదుల గెలిచి

యుంజుఁడెవ్వరికి ద - శాననుఁడహిత
భంజనుఁ "డన రామ - భద్రుఁడిట్లనియె 1860

—: శ్రీరాముఁడు రావణునిఁ జంపి విభీషణునికి లంకారాజ్య పట్టాభిషేకముఁ జేయుదునని ప్రతిజ్ఞచేయుట :—

" నీవు వల్కినమాట - నిజమట్టి వాఁడె
రావణుఁడతని శౌ - ర్యంబు నట్టిదియె
యగుఁగాక పుత్రమి - త్రాదులతోడ
జగడంబులో వానిఁ - జంపి యీలంక
నీచేత నేలింతు - నిజముగా జెప్పె
చూచెద బలికిన - వోఁ దప్పరాదు
పలుకులేఁటికి ? నిన్ను - పట్టంబుగట్టి
చలము సాధించక - సాకేతమునకు
నేలపోయెదను పో - యిన రౌరవాది
మూలమౌ ముగురు త - మ్ములఁ జంపినట్టి 1870
పాపంబునకు నోడఁ - బడువాఁడ బ్రహ్మ
తాపు చేరినను పా - తాళ మేఁగినను
శరణని రాకున్నఁ - జాలును వానిఁ
బోరిగొందు సత్యమె - ప్పుడు నాప్రతిజ్ఞ
తప్పదిందుకు నీవు - తనవాఁడవైతి
వెప్పటికిని " శార - నేతెమ్మటనుచు
దిగ్గన పిలిచి యు - తిన్నెహా పరత
బిగ్గి గాఁగిటలోనఁ - బెనిచి చెంగటను
నుచితస్థలంబున - నునిచిన రాము
నుచరిత్రమునకు మె - చ్చులును దేలుచును 1880

—: హనుమత్సుగ్రీవులతో విభీషణుఁడు వారాశి దాఁటుటకు నుపాయము సముద్రుని ప్రార్థించుటయేయని చెప్పుట :—

సంగద సుగ్రీవ - హనుమంతు లతని
చెంగట గూర్చుండి - చెవిచెంతఁ జేరి
"యేకాంతమున వార్ధి - యెట్లు దాఁటుదుము
నీకెట్లు దోఁచె దా - నివచింపు" మనిన
వారలతో దాన - వ ప్రభు తమ్ముఁ
డూరట పుట్టంగ - నొకమాట వలికె.
"జలధినాయకుని ప్ర - సన్నత లేక
తలఁపరా దొరులకు - దాఁటిపోవుటకు
సగరులచేనైన - సాగరుఁడగుట
సగరాన్వయజ్ఞాతి - సంబంధమునను 1890
రాముఁడు చేరి ప్రా - ర్థన చేసెనేని
యామీఁదట ప్రసన్నుఁ - డగు వార్ధిరాజు
యిదిమార్గము" న విని - హితముగా నెంచి
కదిసి సుగ్రీవుఁ డం - గదుఁడు వాయుజుఁడు
రామునితో నీతె - ఱఁగు విన్నవింప
నామాటలకు లక్ష్మ - ణాగ్రజుం డనియె
"ఏకమతంబుగా - నిందఱుఁగూడి
మీకిట్లు దోఁచె సౌ - మిత్రితో మొదట
నాలోచనము చేసి - నట్టి కార్యంబు
వాలాయముగఁ జేయు - వాఁడ" నేననినఁ 1900
గ్రమ్మఱ వారు ల - క్ష్మణుఁడును గూడి
"సమ్మతంబిది విభీ - షణుఁ డన్నమాట

కడలిపై సేతువు - గట్టినఁగాక
కడచి పోవఁగరాదు - కపులతో మనకు
నందుపై మీఁచిత్త - మనిన శ్రీరాముఁ

—: రాముఁడు లక్ష్మణునితోడను హనుమత్సుగ్రీవాది సమస్త వానర సైన్యముతోడను సముద్రతీరముఁజేరి సముద్రుని స్మరించుట :—

దండటితోఁ గూడి - యా వారిరాశి
తీరంబునకుఁ జేరి - తిన్నని నేలఁ
దీక్షింపించినయట్టి - తిన్నె మీఁదటను
పఱచిన దర్భల - పైఁ బవ్వళించి
శరనిధి నాత్మలో - స్మరణంబు చేసి 1910
కరములు మొగిడించి - కదలక యుండె.

—: రావణుఁడు శ్రీరాముని సైన్యవివరము కనుగొనుటకు శార్దూలు నంపుట :—

తరువాత లంకలో - దశకంధరుండు
పరమాప్తుఁడైనట్టి - బంధు శార్దూల
.......................
రావించి "నీవేఁగి - రాముని పాళె
మేవిధంబున నుండు - నెంత బలంబు
చూచి రమ్మ" న వాఁడు - సుగ్రీవ బలస
మీఁచిన కిలకిల - మేదురారవము

విని గుండె ఝల్లన - వేలంబు చూచి
దనుజనాయకుని ముం - దఱ కేలు మొగిచి

—: శార్దూలుఁడు రామసైన్య మపారమని వేగుల వారినిఁ బంపి యథార్థము తెలిసికొమ్మని విన్నవించుట :—

"అయ్య! రెండవవార్ధి - యనఁగ మ్రోయుచును 1920
కయ్యంబులకు మీరి - కాలుదవ్వేరు
కొండలవంటి యీ - కోఁతులఁ జూచి
గుండె తల్లడము నా - కును దీఱదిపుడు
వారలకొలఁది యె - వ్వఁడెఱుంగు నిపుడె
యీరిచి త్రావుదు - రుప్పొంగు జలధి
రామలక్ష్మణులు ఘో - రశరాసబాణ
భీములై లయకాల - భీములో యనఁగ
నున్నారు వారిలో - నొకఁడైనఁ జాలు
నన్నిలోకము లొక్క - యమ్మున గెలువ
నీసీతకొఱకు వా - రేమి సేయుదురో 1930
మోసంబు వచ్చు రా - మునిచేత మీకు
చదరంబు నూఱుమో - జనముల మేరఁ
బదిలంబుగా వారు - పాళెంబు దిరిగి
దబ్బర వచ్చె ముం - దఱ రాక మీరు
గొబ్బున తగినవే - గులవారిఁ బనిచి
మొదట దండోపాయ - మునకైనఁ దెగువ
యది యేల వేర యు - పాయమునైనఁ
గానంగ వలసిన - కార్యంబుఁ జూడఁ
గానగు" నన్న లం - కానాయకుండు

—: రావణుఁడు శుకుఁడను రాక్షసుని సుగ్రీవునియొద్దకు దూతగాఁ బంపుట :—

శుకుఁడను నొకరాక్ష – సునిఁ జేరఁ బిలిచి 1940
" ఒకఁడవు సుగ్రీవుఁ – డున్నెడ కరిగి
నిన్న వచ్చిన రాము – నికిఁ దోడువచ్చి
యన్నదమ్ములమైన – యట్టి మామీఁద
దండెత్తి వత్తురె – తన యాలికొఱకు
కొండంత పగ తాను – కొనుకొన్నవాఁడు.
ఈరాముఁ డతఁడు నీ – కేనాటి చుట్ట
మీరీతి నతని వ – హించుక నీవు
కదలి రానగునే య – కారణ ద్వేష
మదియేల ? మీకు మే – మనోన్యమైన
నడిపించు కొందమా – నరులతోఁ గూడి 1950
కడతేఱనట్టి యీ – కలహ మేమిటికి
నీవొక్కఁడవె కడ – నిలిచిన రాముఁ
డేవగ మాతోడ – నెదిరింపవచ్చు"
నని యిట్లు భేదకా – ర్యము నడిపించి
యినసూనుతోడ నీ – కేరీతి నోఁచె
నాకై వడిని మాట – లాడి రామునకుఁ
గాకుండ సుగ్రీవు – కడకుఁ దీసినను
యేమి వేఁడిన నీకు – నిచ్చెద" నన్న
నామాటలకు వాఁడు – నౌఁగాక యనుచుఁ
జిలుకవేషము పూని – సింధువు మీఁద 1960
చులుకఁగా నెగిరియా – సుగ్రీవుఁడున్న
చాయగా నంతరి – క్షంబున నిలిచి

—: శుకుఁడు సుగ్రీవునితో రావణుఁడు చెప్పిన మాటలు చెప్పుట - సుగ్రీవుఁ డాతనిచంపుట కాజ్ఞయిచ్చుట :—

"దాయాది మీకు మా - దశకంధరుండు
వినుము ఋక్షరజుఁడు - విశ్రవసుండు
మునుపటికన్న ద - మ్ములమేర వారు
కావున మీయన్న - గావలె నిపుడు
రావణాసురుఁడు పో - రానిచుట్టంబు
నతఁడు నీతోమాట - లాడి రమ్మనుచు
నతిశయప్రీతి న - న్ననిచె నీప్రొద్దు"
అని దశాననుఁడాడు - మన్నట్లు వలుక 1970
విని భానుజుఁడు కపి - వీరులఁ బిలిచి
"పోనీక వీనిఁ జం - పుడు పట్టి" యనిన
వానరు లెగరి దు - ర్వారులై కదిసి
మోకాళ్లు మోఁజేతి - ముడుపులఁ బొలిచి
యీకెలు రాలఁగ - నెఱకలు విఱుగఁ
గొట్టి దుమ్ములురేపఁ - గూఁతలు వెట్టి
బిట్టు వాపోవుచు - పేరెలుంగునను

—: శుకుఁడు శ్రీరాముని శరణు వేఁడుట - సుగ్రీవునిఁ బ్రత్యుత్తరము కోరుట :—

కారుణ్యశరధి! రా - ఘవ వంశతిలక!
శ్రీరామచంద్ర! ర - క్షింపవే తండ్రి
దూతమానసుల నెం - దును బట్టి చంప 1980
భూతలాధిపులకుఁ - బోలునే యిటుల
ననుమన్న మాటలే - ననుటింతె కాక

తన యిచ్చ నాడిన - దండింపఁ దగవు
రక్షింపవే యన్న - రఘువీరుఁ "డేల
పక్షిమాత్రుని నింత - బాధింప మీకు
విడిచి పోలుఁ" డటన్న - విడిచిన వాఁడు
జడిసి పాఱక మింటి - చక్కటి నిలిచి
"ఏమంటి సుగ్రీవ! - యేను రావణుని
కేమందు నీచిత్త - మెఱిఁగింపు" మనిన

—: సుగ్రీవుఁడు రావణునికిఁ జెప్పుమన్న మాటలు :—

"తానేడ చుట్టము - తనకును మాకు 1900
నేనాఁటి సంబంధ - మెవ్వఁడు తాను
రామచంద్రునకు శా - త్రవుఁడైన యపుడె
స్వామిహితార్థినై - చంపకమాన.
తప్పదు మేమన్న - దమ్ముల మగుట
నొప్పితి వాలితో - నుద్ది చేసితిని
యతని జంపించిన - యట్లన రాము
శితసాయకములచే - క్షితి గూలఁ జేతు
నినమండలమునకు - నేఁగిన నాక
మునకుఁ బోయిన దిశా - ముఖములఁ జనిన
బాతాళమునఁ జొరఁ - బాఱిన పంక 2000
జాతకపర్ణుల - చాటు చొచ్చినను
జలధిలో డాఁగిన - చననీక పట్టి
చలము మానక రాక్ష - సశ్రేణితోడఁ
దన లంకతోనె పు - త్రకళత్రముగను
దునిమింతు పోవని - త్తునె" యంచు ననుము

రాము క్రీఁగంట నె - ఱ్ఱదనంబు వొడమ
నామేర తనకొక్కఁ - డడ్డంబు వచ్చు
వాఁడొక్కఁడును లేఁడు - వై దేహికొఱకు
నేఁడె వానికి నూఱు - నిండె" బొమ్మనుచు
ననునంతలోపల - నంగదుం డలిగి 2010

—: అంగదుఁడు కోపించి శుకునిఁ జంపుమన
వానరు లాతనిపైఁ బడుట :—

తనుగొల్చు వానరో - త్తములను బిల్చి
వీఁడు చోరుఁడుగాని - వేగులవాఁడు
గాఁడు పోనీయక - కట్టి తెండిటకుఁ
బొడువుఁడు చంపుఁడు - పోనీకుఁ" డనిన
విడివడి యగచర - వీరులుద్ధతిని
బాధింప కపులచే - బాధకుఁ గాక
సాధురక్షకు రామ - చంద్రునిఁజూచి

—: శుకుఁడు శ్రీరాముని శరణుఁజొచ్చి లంకకు
వెడలి పోవుట :—

"అయ్యా! కోఁతులచేతి - కప్పగించి నను
దయ్యాలవలె వీరు - తరుముక వచ్చి
పాఱిపోవఁగనీక - పట్టి చంపెదరు 2020
మీరాన తీయఁగ - మీఱినారాజ్ఞ
తనునాజ్ఞచేసిన - తప్పదు సుమ్ము
జనని గర్భంబునఁ - జనియించి వెనుక
నేఁటి పర్యంతంబు - నేఁ జేసినట్టి

మేటి పాపంబులు – మిముఁ జుట్టుకొనక
యెల్ల ధర్మంబుల – నెఱిఁగిన మీరు
చెల్లరె యిది మఱి – చితిరేల యిపుడు
నను విడిపింపుమ – నాథ శరణ్య!
యనవిని కొట్టకుం – డరికట్ట నేల
పోవనిండను రఘు – పుంగవు నాజ్ఞ 2030
నావానరులు విని – యట్ల సేయుటయుఁ
ద్రాణ మెల్లను జెడి – తన పెట్లుమేనఁ
బ్రాణముల్ డాఁచుక – బడినేఁగు దేర

—: శ్రీరాముఁడు సముద్రతీరమున దర్భాస్తరణమున ప్రాయోపవేశము సేయుట :—

నారామవిభుఁడు ద – ర్భాస్తరణమున
వారధి తా దాఁట – వలసి శయించి
నవరత్న కటక మం – డన సుండితంబు
వివిధోర్మికామణి – విస్ఫురితాభంబు
సుర్వీతనూజా ము – దూపధానంబు
గర్వితాహిత భిదా – కాల దండంబు
ఘోరప్రతాప కుం – కుమ చర్చితంబు 2040
సారంగమదలేప – సంవాసితంబు
నిరత మహాదాన – నిపుణతారకము
ధరణీభరధురీణ – తాసమంచితము
నైన దక్షిణహస్త – మల్లన మలఁచి
తాను తలాడగాఁ – దగ నొత్తగిల్లి
ప్రాయోపవేశన – పరుఁడౌచు నిట్లు

రేయి బగళ్లుగాఁ - ద్రిదినంబు లుండి
మూనాళ్లకును దన - ముందఱవచ్చి
తానిలఁడయ్యె నీ - తటినీవరుండు
సనుచు నాలోచించి - యండనేయున్న 2050
తన సహోదరు సుమి - త్రాపుత్రుఁ బలికె

—: సముద్రుఁడు ప్రత్యక్షము కానందులకుఁ గోపించి శ్రీరాముఁ డాతనిపై బ్రహ్మాస్త్రమును బ్రయోగింపఁ బూనుట :—

" కంటివే లక్ష్మణ ! - కడిమి గర్వంబు
వెంటనేకాని యే - వెంటలోఁ బడదు
తగినవారలయందుఁ - దగుగాక తాల్మి
తగునె దుర్జనుల ముం - దఱఁ బ్రకటింప
శాంతిచే నుండిన - జడులైన యల్పు
లింతయు చేతగా - దితనికి సనుచుఁ
దలఁతురు క్రోధియై - దండించువాని
కలుగు మఱిది సుమీ - యల్పులజాతి
నోరుపుతో నెవ్వ - డుండినఁ గీర్తి 2060
చేరదు జయమును - జేకూఁడిరాదు
మెత్తదనంబుచే - మేలెంచి యిట్టి
మత్తులు చాల దు - ర్మానంబుచేత
నడ్డసేయరు గాన - జలరాశియెల్ల
గొడ్డు పుచ్చెదనాదు - ఘోరబాణములఁ
జూడుము నీర మిం - చుకలేక పెద్ద
బీడయి పోఁజేతు - పెల్లు లెత్తంగ

సర్వంబు గ్రోలక - జలధి దోఁగింప
యౌర్వానలంబె నా - యస్త్రానలంబు.
ఇమ్ము బాణాసన - మిటు లిమ్ము శరము 2070
లెమ్మెలు చేయగా - కితఁడు నాయెదుటఁ
బోగలేని మంట లం - బువులెల్లఁ గ్రోల
నగచరులకుఁ గాలి - నడసేత జలధి."
అని పల్కి కాలాన - లార్చులు కన్నుఁ
గొనలు తీగెలు సాగ - గొబ్బున నలిగి
తమ్ముని చేతి కో - దండంబు వాడి
యమ్ములు సంది రౌ - ద్రాకృతి నిలిచి

## —: శ్రీరాముని కోపమునకు దేవమనుష్య లోకములు తల్లడిల్లుట :—

శరము సంధించిన - జలజల చుక్క
లురులె ధరాచక్ర - ముట్టూతలూఁగె
గడగడ కులగిరుల్ - కదలె నల్దిశలు 2080
తటబాటు వడియె వే - ధకు జాలివుట్టె
పదునాల్గు లోకముల్ - పాతరలాడెఁ
జదికిలఁ బడి దిగ్గ - జములు వాపోయె
నినమండలము మాసె - నింద్రాదులకును
మనికి సందియమయ్యె - 'మామా' యటంచు
నఱచె భూతము లమా - ఘూస్త్రంబు దొడిగి
శరనిధిపై రామ - చంద్రుఁ డేయుటయు
నసలుబ్బి కళకళ - నంబువుల్ దురలి

మెసరమ్యో తుకతుక - నెంతయు నుడికి
మీనముల్ దేలాడె - మిడుకుచు మునివి 2090
తానంబు జలదేవ - తలు నార్తులైరి.
"స్వామి ! యీకోపంబు - సైరింపు" మనుచు
సౌమిత్రిచే మోడ్చి - సభయుఁడై పలికె.
కను చాటుగా నిల్చి - ఖచరులు మింట
"జనకజారమణ ! రో - షము మాను" మనిరి.
అందులఁ దనియక - యరుణారుణార
విందనేత్రుఁడు రఘు - వీరుండు గినిసి
"ఓరి ! సముద్ర ! యిం - కొక తూపుచేత
నీరెల్లఁ గ్రోలించి - నిను బయల్ సేసి
పెనుబాటగాఁగ గ - పిశ్రేణి నెల్ల 2100
దనుజేంద్రు పీటిపై - దాడి పెట్టింతు
పాములుగాములు - భయదగ్రహములు
నీ మీనముల నిన్ను - నిగ్రహింపుదు నె
శైలంబులవశిష్ట - శల్యంబు లనఁగ
నీలోననున్న వ - న్నియు బయల్ పఱతు
నది చూడు మనుచు బ్ర - హ్మాస్త్రంబు నారి
గదియించి చెవిసోఁక - గా దివియుటయు
భుగభుగ పొగలెచ్చె - పొగలకు మునుపె
దిగదిగ మంటల - దిశలెల్లఁ బొదివె
మంటలకును మున్నె - మహినిండఁ గురిసె 2110
మింటనుండి కడింది - మిణుఁగురు జల్లు
జడుల వెంబడి దమి - స్రము ముంచ దాని
బడిన జంఝూనిలా - ర్భటి నివ్వటిల్లె

వాయువు వెంబడి - వచ్చి మేఘములు
మ్రోయుచుఁ బిడుగుల - మొత్తముల్ రాల్చెఁ
బిడుగుల వెంటనే - పెదపెద ఱాలు
వడియె నందులఁ గూలఁ - బడియె వృక్షముల
గ్రహతారకావళి - గతిఁ దప్పె దావ
దహనంబు విశ్వమం - తయు ముంచుకొనియె
భూత హాహాకార - ములునిండె ప్రాణ 2120
జాతంబు చైతన్య - సంగతిమానె
సీతానిమిత్తమై - సృష్టి చీకట్లు
చేతురే యని సుర - శ్రేణి వాపోయె
భయమంది శేషుఁడు - పడగలు వంచె
జయజయధ్వనులాక - సంబెల్ల నిండె
పరికించి యంతయు - పరమకారుణ్య
వరుణాలయుఁడు రఘు - వంశవర్ధనుఁడు
తొడిగి బ్రహ్మాస్త్రంబు - తోడనే పట్టు
విడువక చేకాచి - వీక్షించుచుండ

—: సముద్రుఁడు శ్రీరామునకుఁ బ్రత్యక్షమై వానరసేనకు దారియిచ్చెదనని చెప్పుట :—

ఘోరున కలఁగి యం - బుధి మిన్నుముట్టి 2130
మీరి యోజనము భూ - మి యతిక్రమించి
యెదురుగాఁ బఱతెంచె - నిరుగడ నెల్ల
నదులర్ఘ్య పాద్యాస - నములతో రాఁగ
కుండల కేయూర - కోటీరదివ్య
మండలసదలస - మాన వైడూర్య

శోభావికాసల - త్ఫుల్లు మేన నిగుడ
నాభిముఖ్యముగ బ - ద్ధాంజలి యగుచుఁ
దన నీటిలోఁ దోఁచి - ధరణిని వెడలి
వననిధిరాజు ది - వాకరు మాడ్కిఁ
దేజరిల్లుచు జగ - తీసుతారమణుఁ 2140
బూజించి సన్నుతిం - పుచు నిట్టులనియె.
“పంచభూతములు శ - బ్దముఖత్రిగుణ ప్ర
పంచంబు నెప్పుడు - పాయనిరీతి
కలగుణంబనుచు రా - ఘవవంశతిలక!
తలఁపు మెల్లన యగా - ధత్వంబు దనకు
లోఁతుపాతెఱుఁగఁ జె - ల్లునె నన్నుమీరు
కోఁతుల నడిపింపఁ - గోరుటఁ జేసి
యలిగితి విపుడు నా - యందు నెన్నడును
జలములొక్కెడనైన - స్తంభింపఁ జేయ
మీనిమిత్తముగ నా - మీఁదటఁ దెచ్చి 2150
వానరు లద్రులు - వైచిరేనియును
ముంచక పయిపయి - మోచి యప్పుడు ధ
రించు వాఁడను సేతు - రీతిఁ గట్టినను
ఆకట్ట నేఁదాల్చు - నంతియెకాదు
మీకునై నాలోన - మీనాదికములు
కపులకు చిల్లరఁ - గావింపకుండ
నిపుణత నడిపింప - నెగులొందకనీక
తెప్పకై వడి నీఁటఁ - దేలి యాడంగ
నెప్పటి కాసేతు - వేధరింపుదును.
అదియేల యీసచ - రాచరంబెల్ల 2160

కుదురు దప్పింపగ - గ్గోలుగాఁ బడిన
యానికగా నిల్చి - యానుకయుందు
నేనొకనికి రక్ష - ణీయుఁడగాను
సడ్డసేయను నీకె - శరణంటిగాక
యడ్డమెయ్యది నాయ- హంకారమునకుఁ
జాటింప నాగుట్టు - బయలుసేయంగ
నేఁటికి బ్రహ్మాస్త్ర - మేల పూనితివి
కట్టింపు సేతువు - కపులతో నేఁగి
కట్టింపు మిపుడె లం - కను తోరణంబు
పాలింపు" మనిన న - పారకృపాపి 2170
శాలుఁడై నట్టి కా - సల్యాసుతుండు
దాక్షిణ్యవసతి సీ - తాసహాయుండు
దక్షిణాంబుధి చూచి - తానిట్టులనియె.

—: సముద్రుని కోరికపైని రాముఁడు తానుతొడిగిన
యమ్మును నుత్తరదిశపైఁ బ్రయోగించి యందలి
బోయలను దునుముట :—

" కాచితి నిను నమో - ఘము నాశరంబుఁ
జేచాఁచి తొడిగితి - శింజినిఁ గూర్చి
యూరక పోవునె - యొకటి నీయందు
నేరుపాటుగఁ జూపు - మేసెద "ననిన
అయ్యా ! నాలో నుత్త - రాశనేప్రొద్దు
పయ్యాడి బోయలు - బలిసియున్నారు.
ద్రుమకుల్య మనుచోటఁ - దోయంబులోనె 2180

సమయింపు చున్నారు - జలజంతువులను
వారి నేయుమటన్న - వనధి జూడంగ
శ్రీరామ విభుఁడు వై - చెను మహాస్త్రంబు
నేఁడును నాఁడు నీ - నిశితాస్త్రవరము
గాడిన ధర మరు - కాంతారమయ్యె.
ఆరసాతలముగా - నమ్మ్రు ధరిత్రి
గోరాడుచో వ్రణ - కూపమనంగ
నొకనీటిబుగ్గ పై - కుబికి వేసవుల
నకలుషాంబుప్రవా - హమున జాలెత్తె.
ఆనీరు గ్రోలిన - యావులపాఁడి 2190
హేరాళముగనందు - నెనసియున్నట్టి
వనములంచితఫల - వ్రాతంబుతోడఁ
దనరఁ గావించె నీ - తామనోహరుఁడు.
ఆవేళ వారిధి - యంజలిఁ జేసి
భావికార్యవిచార - పరతనిట్లనియె.

—: సముద్రునికోర్కె పై శ్రీరాముఁడు నలుని సేతువుఁ గట్ట నాజ్ఞాపించుట :—

" అనఘ ప్రస్టకుమారుఁ - డైన యీనలుఁడు
తన తండ్రివరము లెం - తయుఁ గన్నవాఁడు
వారిలోఁ దరుగిరి - వ్రాతంబువైచి
శ్రీరామ! యితరుల - చేఁ గట్టగాఁదు
ఆయన తనతండ్రి - యంతటివాఁడు 2200
సేయు మిట్లని పల్కె - సింధువల్లభుఁడు
తోడ నదృశ్యుఁడై - తొలఁగినభక్తి

తోడ నన్నలుఁడు చే - తులు మోడ్చి పలికె.
"దేవ! కట్టెద నంబు - ధి యనఁగ నెంత
లావరు లైనట్టి - ప్లవగపుంగవులఁ
బనిచి తెప్పింపుఁడు - పర్వతంబులను
వనములు బెకలించి - వడిమీఱ" ననిన

—: నలుఁడు సేతువుకట్టుటకుఁ బ్రారంభించుట :—

దశరథాత్మజు నాజ్ఞ - తలమోచినట్ల
దశదిశాంతరముల - తరులును గిరులు
తలల మోచుక కపీం - ద్ర వ్రాత మెల్ల 2210
నలుఁడందుకొని వైచి - నఁ బయోధిలోన
మున్నుగా భూరుహాం - బులువైచి మీఁదఁ
బన్నిన కైవడి - పర్వతావళులు
పఱచి యందును మిట్టు - పల్లంబు లేక
యఱచేతివలె నుండ - నచ్చొరు పఱచి
మదమేనుఁగులఁ బోలు - మర్కటోత్తములు
పెదపెద కొండలు - పెకలించి తెచ్చి
గుభులు గుభుల్లనఁ - గుప్పించి వ్రేయు
రభసంబుచేత నీ - రములు పెల్లుబ్బి
తుంపరుల్ గగనవీ - థులనాక్రమింప 2220
గుంపులుగట్టి పే - ర్కొని రాముఁ దలఁచి
కప్పు త్రాటను చక్కఁ - గా నూత్రవెట్టి
యొప్పు మీఱఁగ శత - యోజనంబులకుఁ
జాపును పరపు యో - జనదశకంబు
నేపు మీఱఁగ బట్ట - నేర్పాటుచేసి

కోలలచేతను - కొలిచి యందఱును
కోలాహలము సేయు - ఘోషంబు వలన
శరనిధి మ్రోఁతచే - సంవర్తసమయ
శరద గర్జార్భటి - స్మరణంబు వొడమె.

—: సేతునిర్మాణము పూర్తియగుట :—

వానరుల్ గట్టిరి - వారిధి నాఁటి 2230
లోననె పదియు నా - లుగు యోజనములు
మఱునాఁడు గట్టిరి - మనము లుప్పొంగఁ
బరవసంబొప్ప ని - ర్వదియోజనములు
నురుశక్తి నిరువది - యొక్క-యోజనము
శరధి గట్టెను కీశ - చయము మూనాళ్లు.
ఏజాడ తామైయె - యిరువదిరెండు
యోజనంబులు గట్టి - రుదధి నానాళ్ళ
క్రమముతోఁ గడలి య - ర్వదిమూఁడు యోజ
నమునైదవ దివంబు - నకుఁ గట్టిరిట్లు
శతయోజనమును వా - నరపంచకమున 2240
జతనంబుగాఁ గపుల్ - శరధిబంధించి
నలుఁడు సేతువు గట్టి - న తెఱఁగు భాను
కులపావనునకుఁ జే - ర్కొని కపుల్ దెలుప
జలధి సేతువు దోఁచె - చాల నాకాశ
తలమున స్వాతీప - థంబు చందమున
నట్టి యద్భుతకర్మ - మమరులాత్మలను
బుట్టిన వెఱఁగుతోఁ - బొగడిరి చూచి
కపులకు నానంద - కరమయ్యె సేతు

వపుడు విభీషణుం - డనుచరుల్ దాను
సేతువు దక్షిణ - సితము వసించెఁ
బ్రీతితో గద భుజా - పీఠి నమర్చి
తారాంగదానిల - తనయులు వినఁగ
శ్రీరాముఁ జూచి సు - గ్రీవుఁ డిట్లనియె. 2250

—: సుగ్రీవుఁడు శ్రీరామునితో లంకాద్వీపమునకుఁ దరలుటకు సమయమని చెప్పుట :—

"కదలిపోవలయు లం - కా ద్వీపమునకు
నిది వేళ హనుమంతు - నెక్కుఁడు మీరు
నీయంగదుని మీఁద - నెక్కి లక్ష్మణుఁడు
పాయక మీఁదు వెం - బడి వచ్చుగాక"
అనుమాట విని రాముఁ - డట్ల కాకనుచు
మునుపటి వాహనం - బుల మీఁదఁ గదలి
ముందఱగా సౌమి - త్రిను దాను నడచి 2260
కొందఱు వెనక ది - క్కున మహాకపులు
బలుసుక రా నిట్లు - పయనమై సైన్య
కిలకిలార్భటులు ది - గ్విథుల నిండ
నారవంబున నుచ్చి - యంబుధి మొరసి
పూరించు గ్రమోఁత నం - బుజ భవాండంబు
నీరీతి దండెత్తి - యెల్ల వానరులు
భోరునఁ గదల న - ప్పుడు పెచ్చుపెరిగి
"ఇంతమాత్రమునకై - యీ సేతువేల
యంతరిక్షమున - మేమరుదెంతు" మనుచు
గరుడవేగమున నె - క్కలు వచ్చినట్లు 2270

శరనిధిపై జాడ - జనియెడు వారు
ఘోరనక్రగ్రాహ - కోటులు బెదరి
పాఱఁగఁ దమరు చే - బారలు వెట్టి
యొకరికి మెచ్చంగ - నొగరేఁగఁ దలఁచి
యొకమొత్తముగ నీఁదు - చున్న వారలను
కడలిలోఁ దమదు మో - కాళ్లు గన్పట్ట
నడచి వచ్చెదమంచు - నడుచు వారలును
తెప్పలపై నెక్కి - తెడ్లచే జలము
చప్పుడుగాఁ ద్రోసి - చనెడు వారలును
నగుచుండఁ జనుచు సా - యం సమయమున 2280

—: శ్రీరాముఁడు వానరులతో మూఁడుయోజనములు దాఁటి యచ్చట నొకవనములో బససేయుట :—

నగచరావళి యోజ - నత్రితయమున
నిలిచిన దేవతా - నిర్మితి నచట
ఫలమూల కుసుమ సం - పదలను బొదలు
వనమును గన్గొని - వనజాప్త కులుఁడు
వనచరావళిఁ గూడి - వసియించు నంత
దేవతా ఋషులును - దివిజులు మునులు
నావేళ రఘువీరు - నర్చలు చేసి
దీవించి జయము సి - ద్ధించుఁగాకనుచుఁ
బోవుచోట నిమిత్త - ములు జాలఁజూచి
తనమదిలోన నెం - తయు నూహచేసి 2290
జనకజాప్రియుఁడు ల - క్ష్మణున కిట్లనియె.

—: శ్రీరాముఁడు దారిలో శకునములఁజూచి ఘోరయుద్ధ మగునని చెప్పుట :—

" సౌమిత్రి! కంటె ప్ర - చండవాయువులు
భీమమై దశదిశా - బృందంబు వొదివె
గడగడ నూరకే - కంపించె ధరణి
పడియె మహీరుహ - ప్రకంబు పెకలి
కావిరుల్ దిక్కులఁ - గప్పెను సంధ్య
జేవురు చాయఁ గెం - జిగి పాదుకొనియె
తెక్కలు విఱిగి ధ - రిత్రిపైఁబడియె
నక్కడక్కడ వివి - ధాంగజకులము
నినమండలంబులో - నెసఁగి క్రొన్నలుపు 2800
వనజారి చంద్రికా - వైభవంబుడిగి
యసితశోణములైన - యంచులు చుట్టు
నెసఁగె పరీవేష - మెట్టన్నె యుండె
వాపోవుచున్నవి - వరుదుగ వికృత
రూపంబులును నెత్తు - రుం గ్రక్కుకొనుచు
మృగములు కన్నీట - మెలుపులు మాని
మొగములపై నెత్తి - మొరవెట్టఁ బొడఁగె
దనుజుల రీతి కా - దంబినుల్ కండ
లును నెత్తురులును జ - ల్లుగఁ గురియించె
చుక్కలన్నియు రాఁజు - చుఁ బొగల్ గప్పి 2810
యొక్కటఁ దామర - ద్యుతులతోఁ దోఁచె
విలయవేళల నెట్టి - విపరీతకర్మ
ములు పుట్టునాచంద - మున నున్నదిపుడు
రక్కసులకుఁ గపీం - ద్రశ్రేణికెంత

కక్కసంబగు నట్టి - కయ్యమందెదునో
సురవైరులాయుధ - స్తోమంబుచేతఁ
దరుచరావళి నెంత - తరమి నొంపుదురొ
మనవారు గిరులను - ద్రుమాఁకులచేత
దనుజులఁ బోనీక - దండింపఁ గలరొ
మెదడు నెత్తురుచేత - మేదిని యెల్ల 2320
బొదవఁగాఁబడకున్న - భూరియుద్ధమున
నేల తామస మిప్పు - డే కదలుదము
పాళెంబు దరలించి - పైనంబు గమ్ము"
అనుచు వేడుకలేచి - యావలఁ గదలి
చనుచున్నయెడ విభీ - షణుఁడును దాను
వనచరప్రభుఁడెల్ల - వానరుల్ గొలువ
దనుజనాయకురాజ - ధానిపై నడచె

—: శ్రీరాముఁడు సుగ్రీవ విభీషణాదులతో లంకా రాజధానిఁ జేరుట :—

సాంద్రతేజమున రి - క్షములలోఁ బూర్ణ
చంద్రుఁడో యన రామ - చంద్రుఁడుప్పొంగ
కపిసైన్యమెల్ల లం - కాపురిఁ జేరి 2330
విపులకాహాళశంఖ - వీణామృదంగ
భేరీపటహదుందు - భిధ్వనుల్ పురిని
భోరుకలంగ న - ప్పుడు వినఁబడిన
నగచరావళి సింహ - నాదముల్ దిక్కు
లగలఁగ దింపుచో - హనుమంతుమీఁద
నున్నరాఘవుఁడప్పు - రోత్తరద్వార

సన్నుత సాలకాం - చన శిఖరములఁ
దళతళ మెఱయు కే - తనములు చూచి
తలఁపులో నపుడు సీ - తను సంస్మరించి
కాఁదలఁచినయట్టి - కార్యమంగదుని 2240
మీఁద వసించు సౌ - మిత్రి కిట్లనియె.

—: శ్రీరాముఁడు లంకముట్టడించుటకు నీలాంగదాది వానరుల
నాయాచోటుల నిలుపుట :—

"చూచితె చంచల - స్తోమ నవీన
రోచులతోడి కా - ఱు మొగుళ్ల చేత
నొప్పిన యాకాశ - మోయన చుట్టుఁ
గప్పిన తోఁపుల - గదలు టెక్కెములఁ
దనరు నీలంక వీ - తభయాకళంక
మనమిందు డిగియెల్ల - మర్కటాధిపుల
ముట్టడిగా పాళె - ములు దింత "మనుచు
నట్టిచోఁ దమరు వా - హనములు డిగ్గి
పాళెంబునకు మొన - పట్టున దెచ్చి 2350
నీలాంగదుల నుండ - నియమించి వెనుక
వలపలి డాపలి - వంకను వృషభు
నలగంధమాధను - నమరిక చేసి
తాను సౌమిత్రియుఁ - దలఁగడనుండి
భానునందనులను - పడమరనుంచి
వాసి గల్గిన జాంబ - వంతు గవాక్షు
నాసుషేణుని నుంచి - రాసేన నడుమ

సుగ్రీవుఁడాలంక - చుట్టును వాన
రాగ్రణులును తక్క - నందఱడించి
సెలవిచ్చుటయుఁ గపి - సేన వృక్షములు 2360
శిలలు గైకొని కోట - చెంతకుఁ జేర
రాముని యనుమతి - రవికుమారకుఁడు
తాము వచ్చినరాక - దశకంధరునకు
వినుపించుమని శుకు - విడిపించి బ్రదికి
చనుమని పెడతల - చఱచి త్రోయుటయు

—: సుగ్రీవుఁడు తామువచ్చిన వృత్తాంతముఁ దెలియఁజెప్పుమని శుకుని విడిపింప వాఁడు రావణునివద్దకువచ్చి చెప్పిన మాటలు :—

వాఁడును వచ్చి రా - వణుని కట్టెదురఁ
బోఁడిమి చెడి నిల్చు - పోలికఁ జూచి
" ఏమిరా ! శుక ! ఱెక్క - లేఁటికి విఱిగె ?
నామర్కటులు నిన్ను - నరికట్టికొనిరొ
కొట్టిరో పిడికిట - గ్రుద్దిరో విఱిచి 2370
కట్టిరో నలఁగి రాఁ - గారణం బేమి ?
వినుపింపు "మనిన వి - వేకవిహీను
దనుజేంద్రుఁగని శుక - దైత్యుఁడిట్లనియె.
" మారీచు నీమాట - మదినమ్మి పోయి
యారాఘవుని యొక్క - యమ్మునపాలయ్యె
నది యెఱిఁగియు పోయి - నపుడె నామీఁది
కొదవఁగాకేల మీ - కును విన్నవింప

వలసినట్లైతి రా - వణ! సీతనిచ్చి
కులమెల్ల రక్షించు - కొను మింకనైనఁ
గపిసేన కోటల - గ్గల కెక్కి పెక్కు 2380
విపరీతములు సేయు - వెనుకఁ గారాదు
కాకున్న నిప్పుడె - కదలికయ్యమున
నీకుఁ దోఁచినబుద్ధి - నెఱవేర్చికొనుము
బాణబాణాసన - పాణులై బద్ధ
తూణీరులై శౌర్య - దుర్వారులైన
యారామలక్ష్మణు - లదె వచ్చినారు
వారికిఁ దోడుగా - వచ్చె భానుజుఁడు
నీమాట లతనిక - న్నియుఁ దెల్పునట్టి
కామువచ్చె పా - పము సేయుకతన
నేమందు నీతోడ - నినసూనుఁడనుపఁ 2390
దామెన త్రాళ్లచే - తను నంటఁగట్టి
ద్రోహి వీఁడనుచుఁ గోఁ - తులు చంపనలుగ
దేహంబు గుల్లల - తిత్తియై నొగిలి
శరణంటి శ్రీరాము - చరణంబులకును
కరుణించి యందుచేఁ - గాచెఁ బ్రాణములు
విడిపించె నిప్పుడీ - విడిదల నన్ను
నుడువు మింతయు రావ - ణుని కంచుఁబలికి.
వచ్చితి మీయిచ్చ - వారిచ్చ తనకుఁ
జచ్చిన చావయ్యె - సరివారిలోనఁ
జాలు జన్మంబున" - సద్దగాఁ గొనక 1400
హాలామదమున ద - శాననుఁ డనియె.

—: శుకుని మాటలకు రావణుఁడిచ్చిన ప్రత్యుత్తరము :—

“ సంధికార్యము సేయ – శక్రుఁడో లేక
గంధర్వవిభుఁడో రా – ఘవుఁడన నెంత.
ఎఱుఁగవే వెఱతునె – యెవ్వారికైన ?
నరులట ! వారు వా – నరులట ! తోడు
సమరరంగంబున – జ్వాలతోరావ
రమణీయఘోరనా – రాచ మార్తాండ
కిరణంబులను జాన – కీనాథు రక్త
శరములు గ్రోలింతు – శౌర్యసంపదను
కోఱవులఁ జూడిన – కుంజరేంద్రంబు 2410
పఱచిన గతి నాదు – బాణాగ్నిఁ దగిలి
నిలువక పాఱఁగ – నీవె చూచెదవు
కలనిలోఁ గోసల – కన్యకాసుతుని.
ఎవ్వఁడురా నాకు – నెదిరించువాఁడు ?
చివ్వకుఁ దొడరి వ – చ్చిన జగత్త్రయిని

—: రావణుఁడు శుకసారణుల నిరువురను శ్రీరామునియొద్దకు దూతకృత్యమునకుఁ బంపుట :—

చూడుమంతయునని – శుకసారణులను
జోడుగాఁ జనుఁ ”డని – జూచి యిట్లనియె.
“ మీరలు మనలంక – మీఁదికి రాముఁ
డేరీతి వచ్చునో – యీవార్ధి దాఁటి
యిది నాకు సరిపోవ – దిప్పుడే పోయి 2420

కదిసి రాఘవుల యా - కార వైఖరులు
వారి యాయుధములు - వారలవెంటఁ
జేరిన సుగ్రీవు - సేనలు మితము
తమలోన తమరు మం - తనములు బల్కు
క్రమమును గపులయా - కార వైఖరులు
పాళెంబులను మాట - వలుకులవారు
వేలంబు రక్షించు - విధమున మఱల
నేమందురో యట్టి - యెన్నిక యుద్ధ
సామగ్రి మీరెలె - స్సగ విచారించి
రండు పొండ" నిన వా - రలు లంకమీఁద 2430

—: శుకసారణులు వానరవేషములతో శ్రీరాముని సైన్య విశేషములు గనుచుండుట :—

దండు వచ్చినయట్టి - దశరథ సుతుని
వేలంబులో కపి - వేషముల్ దాల్చి
సాలంబులను వన - స్థలముల యందు
నదులందు చరులందు - నగములయందుఁ
బాదలందు దోనలందు - భువియెల్లనిండి
యున్నవారలఁ జేరు - చున్నవారలను
మున్నిటిపై నభం - బున వచ్చువారె
రానున్నవారి స - ర్వముఁ జూచిలెక్క
గానక కడయేని - గానకవారు
వెఱఁగంది యటునిటు - వీక్షింపవారి 2440

—: విభీషణుఁడు వారినెఱిఁగి, పట్టి తెప్పించి శ్రీరాముని ముందఱఁ బెట్టుట :—

నెఱిఁగి విభీషణుఁ - డెంతయు నలిగి
బలిమిఁ జేపట్టుగాఁ - బట్టుక తెచ్చి
నిలిపి సన్నిధి రాము - నికి నిట్టులనియె
" దానవవిభుని దూ - తలు వీరు మనల
సేనలఁ జూడ వ - చ్చినవారి వీరి
నేమి సేయుద " మన్న - నెంతయు వెఱచి
రామునిఁ జూచి సా - రణుఁ డిట్టులనియె

—: సారణుఁడు తామువచ్చిన వృత్తాంతము శ్రీరామునికి నివేదించుట :—

" అయ్య ! రావణుఁ డంపి - నట్టివారలము
కయ్యంబునకు మీరు - కదలి వచ్చుటను
పాళెంబు దిగిన మీ - బలమెల్లఁ జూచి 2450
వేళంబె రమ్మని - వీడుకొల్పుటయు
వచ్చితి మేము దే - వర చిత్త " మనిన
సచ్చరిత్రుఁడు రామ - చంద్రుఁ డాలించి
రమ్మ విభీషణ ! - రాక్షసేశ్వరుఁడు
పొమ్మని పనుప ని - ప్పుడు వచ్చినారు
మనవారినెల్ల క్ర - మంబునఁ జూపి
పనుపు మేఁటికి వీరిఁ - బట్టి తెచ్చితివి ?
చూచిపోవుదు " రటం - చును బల్కి వారిఁ
జూచి శ్రీరాముఁడ - చ్చో నిట్టులనియె

—: శ్రీరాముఁడు రావణునితో యుద్ధమునకురమ్మనియు నట్లు కానిచో లంకను దగ్ధముచేయుట నిశ్చయమనియుఁ గబురంపుట :—

"మావేల మున్నట్టి - మర్యాద యెల్ల 2460
రావణుతోడ స - ర్వము తేటపఱచి
యేపూనికను సీత - నెత్తుకవచ్చి
తాపూనికనె నిల్పు - మాజికి రమ్ము
రావేని తెల్లవా - ఱకమున్నె లంక
మావానరుల చేత - మారు సేయించి
ప్రళయ కాలానల - పటుశిఖాజాల
తులిత మదస్త్ర సం - పటుః శిఖాజ్వాల
దండించువాఁడఁ బు - త్ర కళత్రయుతము
భండనంబున నిన్ను - బ్రహ్మ యొఁగినను
నని మేము వల్కితి - మనుఁడు పొండ" నిన 2470
వినయంబుతో రఘు - వీరునిఁ బొగడి
వారలీవార్త స - ర్వంబును మఱలి

—: శుకసారణులు రావణునివద్దకువచ్చి రాముఁడు చెప్పిన మాటలు చెప్పి వానరసైన్య మపారమనియు శ్రీరామునికి సీతను సమర్పించుమనియు హితోపదేశము సేయుట :—

యారావణునిఁ జూచి - హస్తముల్ మొగిచి
"దనుజేంద్ర! నీవంప - దశరథ సుతునిఁ
గని తోడువచ్చిన - కపి సమూహంబుఁ
గాంచునప్పుడు మమ్ముఁ - గని విభీషణుఁడు

వంచకులని పట్టి - వైదేహిమగని
సన్నిధి నుంచిన - జడియక మేము
నిన్నుఁ జేరఁ గాని రాము - నికిఁ బ్రీతిగాఁగ
" ఈవిభీషణుఁడు మీ - కేమిటి కితఁడు 2480
రావణద్రోహి ధ - ర్మముఁ దప్పినాఁడు.
అన్నదమ్ముల కెడ - లైన విరోధి
నిన్నుఁ జేరినవాఁడు - నీదు హితుండె
వాలినిఁ జంపి యా - వాలిరాజ్యంబు
పాలించ సుగ్రీవుఁ - బట్టంబు గట్టి
చేపట్టి నాఁడని - చేరెను మిమ్ము
కాపట్యమున హిత - కారియే మీకు ?
అన్నకుఁ గానివాఁ - డన్యుల కగునె ?
విన్నవింపక కాదు - వీర లిద్దరును
పలికించిన స్వకార్య - పరులింతె కాక 2490
పరమార్థమగు మీకు - పనులకు రారు"
అనివారిఁ జెదరంగ - నాడితి మేము
దనుజేంద్ర ! యేల వృ - థామచ్ఛరంబు ?
ఊరకే జానకి - నొప్పగించినను
నీరాజ్యమునకును - నీకు మేలొదవుఁ
గాదన్న రామల - క్ష్మణ విభీషణులు
నీదు హానికిఁ గరు - ణింప రల్లముల
నాముద్వరును నేల - యందొక్కరైన
నీమాట యనిన తృ - ణీకరింపుదురు
రామలక్ష్మణుల నో - ర్వఁగ సంగరమున 2500

నీమాత్ర మనసేల - నినువంటి వారు
పదివేలు గూడిన - బవరంబులోన
బ్రదుకలేరు తదీయ - బాణాగ్ని శిఖలఁ
గపులను మేము లె - క్క యొుఁగ మెందు
నపరిమితంబుర్వి - యంతయు వారె
యొుక్కఁడొక్కఁడు కొండ - లున్నట్లు చూడ
నక్కజంబయ్యె ల - యాంతకాకృతులు
వారిలో దొరలు రా - వణ ! యొుక్కొఁడొకఁడె
యేరుపాటుగ వచ్చి - యీలంకఁ జేరి
నిను గెల్వనోపు సం - దియమేల భాను 2510
తనయుఁ డందటికొక్క - తలయైన వాఁడు
కన్న కార్యము హిత - కారుల మగుట
విన్నవించితి " నన్న - విని రావణుండు
మనసులో భయమును - మాటలపొందుఁ

—: రావణుఁడు శుకసారణులతో నుత్తర గోపురద్వారమున కేఁగుట :—

దనర నవ్వుచును దూ - తలఁ జూచి పలికె
" చాలు మీబుద్ధులు - జానకీ విభుని
పాళెముఁ జూచి రాఁ - బనిచితిఁగాక
ననుగొంచ పఱుప మా - నవుని నగ్గింప
వనచరావళిని కై - వారముల్ సేయ
మీకుఁ బనేమి నా - మీఁదట నెదుర 2520
నా కేశుఁడును నెచ్చు - నా కీశులెంత
రామలక్ష్మణులెంత - రండ "నివారు

దామును గూడి యు - త్తర గోపురమునఁ
జేరి యాకసము మో - చిన మీఁదకక్ష్య
ద్వారంబు చెంగటఁ - దాఁగూరుచుండి
క్షితియెల్ల నిండిన - శ్రీరామసేన
మితమెఱుఁగక చూచి - "మీరిందులోన
సుగ్రీవుఁడెవ్వఁడౌ - చ్చోనున్నవాఁడు ?
నిగ్రహానుగ్రహ - నిపుణుఁడై యతని
దళవాయి యెవ్వఁడా - తని పేరదేమి 2530
పలుకుఁడు వానర - ప్రభులెవ్వరిందు ?"
అనిన రావణుఁజూచి - హ స్తంబుఁజాఁచి
చనవు గల్పించుక - సారణుఁడనియె.

—: సారణుఁడు రావణునికి వానర నాయకుల నెఱుక పఱచుట :—

"అల్లవాఁ డినసూనుఁ - డావాలితమ్ముఁ
డెల్లవానరులకు - నేలిక యతఁడు.
అతనికి సేనాని - యై సట్టి నీలుఁ
డతిబలుఁడున్నవాఁ - డల్లదే కనుము.

—: అంగదుఁడు :—

ఆచెంగటను వాల - మార్చుచు నన్నుఁ
జూచినప్పుడె చంపఁ - జూచు కోపమున
నంగదగ్ర్యవేయ - హారాభిరాముఁ 2540
డంగదుఁడున్నవాఁ - డతని వీక్షింపు.

—: హనుమంతుఁడు :—

వాసవుఁ జేరిన - వరుణునిఁ బోలి
యాసమీరకుమారుఁ - డవనిజాప్రియునిఁ
బాయక యాతని - పనిఁబూని వచ్చి
నీయూరుఁ గాలిచి - నిలువక పోయి
యిందఱిఁ దోడుక - యిచటికిఁ దెచ్చి
యందున్నవాఁడల్ల - హనుమంతుఁజూడు.

—: నీలుఁడు :—

పదికోట్ల వానరుల్ - వజ్జలఁ గొల్వ
నెదురుగా లంకపై - దృష్టులు నిలిపి
తానె వారధిఁ గట్టి - దర్పించియున్న 2550
యానీలుఁ జూడు మా - యతభుజాబలుని.

—: శ్వేతుఁడు :—

వెండి కొండయుఁ బోలి - శ్వేతుఁడనంగ
నుండు వానరుఁజూడు - మురుశౌర్యనిధిని
నిలిచి యాసుగ్రీవు - నికిఁ గేలు మొగిచి
తిలకింపుగోమతీ - తీరమీయనది

—: కుముదుఁడు :—

యటుచూడు సంకోచ - కాహ్వాయశైల
కటకనివాసునిఁ - గామసంచారుఁ

గుముదు నితని పది - కోట్లవానరుల
సమసత్త్వులను గూడి - చనుదెంచినాఁడు.

—: రంభుఁడు :—

పదికోట్లమీఁద ము - ప్పదిలక్షలకును 2560
చదలంబుగా నాప్త - సైన్యంబు గొలువ
రంభుఁడు కలహాసం - రంభుఁడై సమద
కుంభీంద్రమటుగనుఁ - గొను మున్నవాఁడు

—: శరభుఁడు :—

మలయసహ్యాచల - మధ్యమగహన
వలయుండు సఖులతో - వనచరోత్తములు
నలుబది గోటులం - దను గొల్వనున్న
బలవంతు శరభునిఁ - బరికించి కనుము.

—: పనసుఁడు :—

భావింప నూటయేఁ - బదికోట్ల కపులు
సేవించి మారట - సింధువుకీతి
మనపేరు నుడివిన - మదిలెక్కఁగొనక 2570
పనసుఁడు వాఁడె కో - పమున నున్నాఁడు.

—: వినతుఁడు :—

అరువది కోటులు - హరులు భజింపఁ
దరుపర్ణములు ఝురో - దకములఁ గ్రోలి

వినతుండు భుజశౌర్య - వినతుండు వాఁడె
కనుఁగొమ్ము లంకనె - క్కటి గెల్వఁదలఁచెఁ
బ్రథనంబుకు నిన్నుఁ - బలిమిఁ జేఉచును

—: గ్రథనుఁడు :—

గ్రథనుఁడు వేనవేల్ - కపులుభజింప
సెలవిమ్మనుచుఁదాను - శ్రీరాముతోడఁ
బలికె నేవినఁగ నీ - పయిఁ గలహింప
బలిమితోఁగపులు డె - బ్బది కోట్లుగొలువఁ 2580

—: గవయుఁడు :—

గలహంబుఁ గోరుచు - గవయుఁడను వాఁడు
చూడుము తనదు పౌఁ - జులు దీర్చిచూచు
వేడుక నున్నాఁడు - విబుధారినాథ !

—: హరుఁడు :—

శతకోటివానర - స్వామియైనట్టి
యతిసత్త్వ నిధివాఁడు - హరుఁడనువాఁడు

—: ధూమ్రుఁడు :—

తిరమైన నర్మదా - తీరంబునందుఁ
బరఁగి యానము ఋక్ష - పర్వతంబేలు
నిల నేడుకోటుల - యెలుఁగులు గొలువ
నలరెఁ జూడుము ధూమ్రుఁ - డా ఋక్షవిభుఁడు.

—: జాంబవంతుఁడు :—

అతని సోదరుఁడు దే - వాసుర సమర 2590
శతముల దానవ - చయము నడంచి
గెలిపించి యింద్రుని - కినిఁ గీర్తిఁ దెచ్చి
వలసి కోరినయట్టి - వరములు గాంచి
యెనుబదికోటుల - యెలుఁగులతోడ
వనధి దాఁటిన జాంబ - వంతు నీక్షింపు.

—: శ్రుతసన్నాదుఁడు :—

సాహసాఢ్యుఁడు శ్రుత - సన్నాదుఁడనఁగ
బాహుశక్తిని దైత్య - పతుల వధించి
దేవాసురులకు సా - ధింపరానట్టి
లావుగల్గిన వాని - లంకేశ! కనుము

—: ప్రహర్షుఁడు :—

దహనుని యందు గం - ధర్వకామినికి 2600
మహనీయ తేజుఁడీ - మర్కటోత్తముఁడు
జనియించినాఁడు యో - జనగాత్రుఁడగుచు
దనుజనాథ! ప్రహర్షుఁ - డలయెత్తి చూడు.

—: ప్రమాది :—

వేయికోటులు కపి - వీరులు గొలువఁ
గాయంబు నరగొండ - గలిగి దేజరిల్ల

సింహనాదముతోను - శీతాచలమున
సింహంబురీతి గ - ర్జింపుచు నున్న
యతఁడు సుమ్ము ప్రమాది - యనువాఁడు లంక
యితని చేమీఁదట - యేమి కాఁగలదొ ?

—: గవాక్షుఁడు :—

చూడు మల్లదె గవా - క్షుని రఘువీర 2610
సూడు దీర్పఁగ లంకఁ - జూచుచున్నాఁడు.

—: కేసరి :—

చుట్టును గొండము - చ్చులు నూటికోట్లు
పట్టిన తనయాప్త - బలముతోఁగూడి
పదధూళి భానుబిం - బముఁ గబళింప
నదె వచ్చె దనుజ నా - యక ! వానివెనుక
సకలనిర్జరమునీ - శ్వర సేవితంబు
సకలరకరత్నమ - యూత్మకూటంబు
సాణీరితమణి వి - పంచికారాగ
రాణాన్వితసుపర్వ - రమణీగణంబు
నంతరాంతరనిజో - ర్ధ్వాధరభాగ 2620
కాంతసమస్తలో - క ప్రపంచంబు
నణిమాదిమాష్టమ - హైశ్వర్యసిద్ధ
మణిమయ కనకవి - మానమానితము
నగునట్టి మేరువు - హాశైలమేలు
జగదేకబలుని కే - సరిఁగనుఁ గొనుము.

—: శతవలి :—

వానరోత్తము లరు - వది వేల కోట్లు
తాను చేచాఁచిన - దారి మెలంగఁ
బ్రతిబలయోధుల - భంగించువాని
శతవలిఁ గనుము రా - క్షస కులాధీశ !

—: తక్కిన వానరవీరులు :—

గజగవయగవాక్ష - గంధమాదనులుం 2630
భుజశౌర్యనిధులు చూ - పుల కంపుతేర
నొక్కొక్కనికిఁ గపి - యోధులు కోట్ల
లెక్కకు పదివేల - లెక్కగాఁ గూర్చి
రామకార్యార్థమై - ప్రాణంబులైనఁ
దా మొల్ల మనుచు నం - దఱు నున్నవారు.
వారిఁ జూడుము నీకు - వారితో రణము
కారాదు మనునాసఁ - గల్గియుండినను."
అను సారణుని మాట - లాలించి శుకుఁడు
దనుజనాయకునిఁ జెం - తకుఁజేరి పలికె.

—: శుకుని వానరసైన్య వర్ణనము :—

"రావణ ! యింకఁ దీ - ఱదు నీకుఁ జలము 2640
కావరంబున నెట్లు - కడతేఱఁ గలవు ?
కపివీరు లున్మత్త - గజములమాడ్కి
విపులగంగాతీర - విటపంబులట్లు
పృథుహైమవతసాల - వృక్షంబులనఁగ

వ్యధితాఘలై చాల - ప్రాలియున్నారు!
దేవదానవులైనఁ - దృణమాత్రులనుచు
భావింపఁ దగువారి - బలవర్గమునకుఁ
గిష్కింధలోన సు - గ్రీవునిఁ గొలిచి
దుష్కరవిహృతు లెం - దులనైన లేక
దేవతాంశముల ధా - త్రిని జనియించి 2650
లావుల కెందుఁ గొ - లందు లేర్పడక
యుండుదు రిరువది - యొక వేలుకోట్లు
పెండియు నందు వే - వేయు శంఖములు
నూఱుబృందములు మం - త్రులు భానుజునకు
వారలలో బల - వంతులన్నిటను
వీరులు నాసత్య - విమలాంశభవులు
వీరలు మైందద్వి - విదులనువారు!
అజునివరంబుచే - నమృతంబుఁ గ్రోలి
యజరామరణవృత్తి - ననమానులగుచు
వీరె లంకకు వేరు - విత్తులై వచ్చి 2660
శ్రీరామునకుఁ బ్రీతి - సేయనున్నారు!
సుముఖుని విముఖునిఁ - జూడుమా చెంత
నమరంగనా మంద - రాకారులగుచు
మృత్యువునకుఁ బుట్టి - మించినయట్టి
యత్యంతబలులు జ - యాకాంక్షులగుచు
బలములు తమ కిరు - వది వేలుకోట్లు
గొలఁదిలో నిన్నుమా - ర్కొన నున్నవారు!

—: ఆంజనేయుని వర్ణనము :—

చూడుము వారిని - చూపెద గేలుసాచి
యాడుచున్నారు వీ - రానులాపములు
కేసరిసుతుఁడు సు - గ్రీవుని హితుఁడు 2670
దాసుఁడు మిగుల సీ - తానాయకునకుఁ
బవనుజుఁ డంజనా - భామినీమణికి
నవతార మందిన - యప్పుడే యెగసి
వినువీథిఁ దామూఁడు - వేల యోజనము
లినుని ఫలంబని - యెంచి పట్టుటకుఁ
జేరిన కులిశంబు - చే నింద్రుఁడలిగి
దారిఁ దప్పకయుండ - దవడపై నఱుక
నందుచే నాతఁడు - హనుమంతుఁడనఁగ
నెందుఁ బ్రసిద్ధికి - నెక్కినవాఁడు !
సీతను జూడవ - చ్చి యశోకవనము 2680
చేతులు తీఁటవోఁ - జీకాకు చేసి
యక్షునిఁ బొరిఁగొని - యనిలోన నెదురు
రాక్షసులను గాల - రాచి నీలంక
చిచ్చువెట్టెను మఱి - చితివె ? వాఁడొకఁడె
వచ్చిన నెదురించు - వారమే మనము ?
వాల మల్లార్చుచు - వాఁడె యున్నాఁడు
కాలునిరీతిఁ జక్కఁ - గఁ జూడు మతని !
అటు చూడుమయ్య ని - శాటాధినాథ !

—: శ్రీరాముని వర్ణనము :—

చటులప్రతాప నై - శ్వానరాభీల
సంగరరంగ భీ - షణదైత్యవీర 2690

పుంగవ నిజభుజా - భుజగభుజంగ
భుజగీ భవన్నాక - పురవధూవార
భజనీయకీర్తి ప్ర - భావానుభావ
మందారమంజరీ - మకరందబిందు
తుందిలేందిందిర - స్తోమసంగీత
కలనాదమేదురా - కాశావకాశ
వలయిత వసుమతీ - వలయమైనట్టి
బ్రహ్మాస్త్రముఖదివ్య - బాణాభిరాము
జిహ్మగోత్తమవిల - సితభుజస్తోము
బరమకల్యాణవై - భవగుణారాము 2700
శరణాగతత్రాణ - సద్ధర్మకాము
దూరీకృత సమస్త - దుర్దోషనాము
నూరీకృతదయాగు - ణోరులలాము
గోమలతరనీల - కువలయశ్యాము
సామాది నృపనీతి - సముదయోద్దాము
సీతాదృగుత్పల - శ్రీకరసోము
దాతృత్వనిస్సీము - దశరథరాముఁ
గనుఁగొంటి రే యిట్టి - కల్యాణచరితు
వనితఁ దేనగునె నీ - వంటి యల్పునకు?
కోపించి తలఁదెగఁ - గొట్టినఁ గొట్టు 2710
మీపాదములు చూడ - కేఁగుటమేలు.

—: లక్ష్మణవర్ణనము :—

ఆరాముఁడావంక - నఖిలభారకుని
వైరిదోర్గర్వస - ర్వస్వహారకుని

ననుదినస్వజన క - ల్యాణకారకుని
దనుతరేతరకీర్తి - తారహారకుని
నసురమారణసమ - తాభిచారకుని
నసమానవిక్రమ - హరకిశోరకుని
దరళవజ్రాంకుర - దంతకోరకుని
దరళతారకసుమి - త్రాకుమారకుని
దేటిచూడుము మన - దెసఁ జూపులునిచి 2720
వీఁడౌ విల్లెక్కు - వెట్టి యున్నాఁడు.

—: విభీషణవర్ణనము :—

ఆరాము వలచాయ - నలఘుభాషణుఁడు
హరిసమస్తగు - ణాత్మభూషణుఁడు
పరవివేకవిశేష - వారితేషణుఁడు
పరశౌర్యవాహినీ - పటలశోషణుఁడు
దారుణకరగదా - దండభీషణుఁడు
చేరికగాఁగ వ - చ్చెను విభీషణుడు
కనుఁగొమ్ము వీరిరు - గడఁగాచియుండ
మనమును నిలిస - మర్థరాఘవుని
తరమి పోరఁగ కబం - ధవిరాధవాలి 2730
ఖరదూషణాదులఁ - గడతేర్చు టెఱిఁగి
పోరఁ జూచిన నీదు - బుద్ధి కేమందు ?
నారాము వెన్నాస - యై యున్నవాఁడు

—:సుగ్రీవవర్ణనము:—

సకలపర్వతకుల - స్వామియై జగము
లకు నెల్ల తానె మూ - లస్తంభమైన

యమరాచలమురీతి - నగచరులెల్ల
సమబుద్ధిఁ దనుఁగొల్వ - శతమన్యుఁడొసఁగు
వాలి దాల్చిన దివ్య - వాసన కనక
మాలికాతారారు - మాకపిరాజ్య
పదవులు రామకృ - పావైభవమున 2740
నొదవ రాఘవుని ప్ర - యోజనం బెల్లఁ
దలమోచి వచ్చిన - తరణి నందనుని
బలవంతు సుగ్రీవుఁ - బరికింపుమీవు.
ఓటమెఱుంగక - యొకనూఱువేల
కోటులు శంఖ శం - ఖులు నూఱువేలు
నొక మహాశంఖులు - నుంకు బృందంబు
నకు మహాబృందంబు - నకు నొకపద్మ
మునకు మహాపద్మ - మునకు ఖర్వ
మునకు మహాఖర్వ - మునకు సముద్ర
మునకు నట్టి సముద్ర - మునకు నవోఘ 2750
మునకు నట్టి మహౌఘ - మునకుఁ దద్బలము
తనపంపు సేయ నిం - దఱితోడ నీకు
పొనసేయవచ్చె రా - మునిఁ జూపఁడతఁడు !
మాకుఁ జూచిన నీకు - మరణంబు నిజము
లేకున్న చోఁబోగి - లెద మజ్జుఁడనుచుఁ
జావనేఁటికి రాముఁ - జానకిఁ గూర్చి
నీవారి ప్రాణముల్ - నిలుపుట మేలు."
అనఁ గపివీరుల - నారఘువీరు
లనుఁ జూచి దూర్వాఁజా - లక దశాననుఁడు

—: రావణుఁడు శుకసారణుల మాటలకుఁ గోపించి వారలఁ దొలఁగి పొమ్మనుట :—

చలము మానక శుక - సారణ వచన 2760
ములు విని వారిమో - ములు చూచి పలికె.
" వేదముల్ చదివి యా - వెంట సంగములు
శోధించి దిశల రా - జులను సాధించి
మహిఁగల్గు సకల ధ - ర్మములు నెఱింగి
బహుకాల మీలంక - పాలించి నేను
కొఱమాలినట్టి మీ - కును గల్గు బుద్ధి
యెఱుఁగనే పగవారి - నెచ్చుగా నెంచి
చులకని మాటయి - చ్చో నన్నునాడి
తలక్రొవ్వినందుకుఁ - దలఁద్రెవ్వ నేతుఁ
గాచితి మిమ్ము ని - క్కడ నిల్వనేల 2770
త్రోచుట చంపినం - దుకు సరిగానఁ
దొలఁగి పొండని మిమ్ముఁ - ద్రోచితి నిచట
నిలిచినఁ దాళక - నిగ్రహింపుదును
పొండన్న" వారలు - పోయిన వెనుక

—: రావణుఁడు మహోదరుని బిలిచి తగిన వేగులవారినిఁబంపి రామసుగ్రీవులయుదంతముఁ గనుఁగొనుమనుట :—

వెండియు వేఱొక్క - వేగులవారిఁ
బిలువ మహోదరుఁ - బిలిచి పంపుటయుఁ
దలఁచినంతనె వాఁడు - తగినవేగరులఁ

జెంతకుఁ దెచ్చినఁ - జేరినవారి
మంతనంబున నొక - మాట నిట్లనియె.
"రామలక్ష్మణుల మే - రలు విభీషణుని 2780
నేమంబు సుగ్రీవు - ని విచారములును
గపుల యాలోచన - క్రమము నిద్రించు
నపుడెచ్చరికల ను - న్నట్టివై ఖరులు
పాళెంబులో మాట - పలుకులు ప్రజల
యేలినవారల - యెడ నోరుములును
నుక్కళమ్మలు గాచి - యున్నవానరుల
యిక్కవలును జూచి - యిపుడెరండ" నుచుఁ

—: ఆవేగులవారు సుగ్రీవసైన్యమునుఁ జూచి భయమంది, వానరులచేఁ గొట్టుపడి లంకకువచ్చుట :—

బనిచిన వారలం - బరమున కెగసి
చని కనకక్ర ప్ర - చ్ఛన్నులై నిలిచి
కపుల మేలిమి చూసి - గజగజవణఁకి 2790
యపరిమితంబౌ భ - యంబుచే నొదిగి
కనుచుండ వారలఁ - గని విభీషణుఁడు
వనచరులకు వారు - వచ్చినజాడ
వినిపింప కపులెల్ల - వెంటాడవెఱచి
వినువీథి నందఱు - విచ్చి పాఱుటయు
నందులో శార్దూలుఁ - డనువాఁడు దగుల
ముందల పట్టుక - మురియఁ దన్నుచును
పీడింపఁ గూ తలు - వెట్టి "నాపాటుఁ

జూడవే నిత్యయ - శోనిధిరామ !
విడిపింపవే !" యన - విని "చాలుఁజాలు 2800
విడుఁ"డంచు జానకీ - విభుఁడానతీయఁ
దనతల్లి కడుపులోఁ - దా మఱలంగ
జనియించి నటులెంచి - చని దశాననుని

—: వేగులవారు తాముచూచిన సంగతి రావణునకు విన్నవించుట :—

సముఖంబుఁజేరి "మో - సమువచ్చె నిపుడు
తము నంపుదురె కోఁతి - దండుపై మీఁదు
లెన్న నమ్మితిమి వా - లినిఁ జంపినట్టి
దుస్సహాతేజుని - తోడి వైరంబు
నీకేల యిటమీఁద - నినుఁగొల్చి చెడఁగ
మాకేల చాలు నీ - మనవిఁకమీఁద
నెటులైనఁ బొమ్మన్న"—"నేమేమి !" యనుచుఁ 2810
దటతటఁ దనగుండె - తల్లడమందఁ
గర్దమంబునఁ జిక్కు - గజము చందమున
శార్దూలుఁ జూచి రా - క్షసనాథుఁ డనియె.
"ఓరి ! శార్దూల ! మో - మోటమి దొరఁగి
యీరీతి నాడదు - రే నన్నెఱింగి
చెనఁటివై తన్ను ముం - చినదె సముద్ర
మనునట్లు కపులచే - నలజడి నొంది
వచ్చితివటుగాన - వాకొంటి వింటి
హెచ్చు గొందులు నీకు - నేమాయె నిపుడు
తెలుపరా కరిగిన - తెఱఁగన్న"నతడు 2820

చలపాదిభ్రమైన ద - శగ్రీవుఁ బలికె
"పోయితిమేము నీ - పొమ్మన్నయట్లు
మాయ వన్నుక నభో - మార్గంబునందు
వారి మెచ్చరికలు - వారి పాళెములు
వారలు నీఁబల్కు - వార్తలుఁ గనుచు
వినుచు నుండఁగఁ దమ్ము - విను వీథిఁజూచి
తన కేల యనక నీ - తమ్ముఁడా వేళ
చెప్పి చూపిన కపుల్ - చెవివట్టి యీడ్చి
గుప్పి తన్నుచునుండఁ - గూఁతలు వెట్టి
కావవే యన్న నా - కరుణాసముద్రుఁ 2830
డావార్త లాలించి - యవనిజాప్రియుఁడు
విడుఁడేల బాధింప - వీని నటన్న
విడిచి రాజ్ఞకువారు - వెఱచి పొమ్మనుచు
నందుచే రాఁగల్గె - బ్రాణాశ వెనుక
ముందరల్ చూచిన - మోస మొందుదును
కపులు బారులు దీర్చి - గారుడవ్యూహ
మిపుడకూర్చుక వచ్చె - నిదె రాఘవుండు
సేతువు గట్టించె - సింధువు మీఁద
సీతను మఱల ని - చ్చిన బ్రదుకుదువు
కాకున్న నిప్పుడే - కలనికి నేఁగు 2840
మాకడి కార్యమీ - వనుభవించెదవు.
ఊరకుండిన కోతు - లుండఁగ నీవు
పురమెల్ల లగ్గలి - ప్రొద్దె వట్టెదును
చుట్టుక యీలంక - చుట్టును జాల
ముట్టడిగా దిగి - మొఱయుచున్నారు.

గడియ తాళ "రటన్న - గలఁగుచు గుట్టు
సడలక మఱల రా - క్షసనాథుఁడనియె.

—: రావణుఁడు శార్దూలుని వానరుల వృత్తాంత మడుగుట :—

" కపులెవ్వరింద - టెక్కడనుండివచ్చి
రపరిమితంబా మ - హాజవశక్తి
వారికెక్కడఁ గల్గె ? - వారల తండ్రు 2850
లారయ నెట్టివా - రది దెల్పుమనిన
రావణుతోఁ గ్రమ్మ - ఱంగ శార్దూలుఁ
డావార్తలకు విన - యమున నిట్లనియె.
" రవికుమారుఁడు ఋక్ష - రజుని తనూజుఁ
డవని నిల్పను గూల్ప - నతనికిఁ జెల్లు
ఘనబాహుబలుఁడు గ - ద్గదతనూజాతుఁ
డనఘుఁడు జాంబవ - దభిదానుఁడతఁడు
వంతుకుఁ దగు జాంబ - వంతునిఁ దమ్ముఁ
డంతకన్నను ధూమ్రుఁ - డంతకనిభుఁడు
వారికి ధర్మదే - వతకుఁ గుమారుఁ 2860
డాశరణుఁడు కడు - నాసించువాఁడు
కేసరికినిఁ గపి - కేసరి తనయుఁ
డాసమీరాత్మజుఁ - డతిసత్త్వశాలి
సోమునికొడుకు పూ - జ్యుఁడు దధిముఖుఁడు
తాము దుర్భరవేగ - దర్పి సుముఖులు
మృత్యువుకొడుకులు - మిగులంగ వీర
కృత్యముల్ వారలు - కే తగునెందు

దళవాయి నీలుఁడు - దహనతనూజుఁ
డలయింద్రు మనుమఁడా - యనఘుఁడంగదుఁడు
ద్వివిదమైందులు బలా - ధికులాశ్వినేయ 2870
భవులు వైవస్వత - భవులల్లవారు
గజగవయగవాక్షు - గంధమాధనులు
రజనీచరేంద్ర ! వా - రల నెన్నఁదరమె ?
అందఱు వీరమ - రాంశ సంభవులు
క్రందుగా కలనికిఁ - గాలుద్రవ్వుదురు
వారితో పదికోట్ల - వనచరోత్తములు
సారనాయకుల వం - శములకై వారు
రామునికిని జగ - త్త్రయి నెవ్వరైన
తామని మార్కొని - తలఁగిపోఁ గలరె ?
దశరథరాజనం - దనులు రాఘవులు 2880
దశకంఠ ! నీకుప - ద్రవము సేయుదురు
మత్తేభసముఁడు ల - క్ష్మణుఁడు కోట్లలను
చిత్తజారాతినిఁ - జీరికిఁ గొనఁడు
జ్యోతిర్ముఖుఁడు సూర్య - సుతుఁడట్టివాఁడె
శ్వేతుఁడు తరుణుని - జ్యేష్ఠపుత్రుండు
హేమకూటుఁడు నలుఁ - డీవార్ధిఁగట్టె
గ్రామణి యావిశ్వ - కర్మనందనుఁడు
వసుపుత్రుఁ డతఁడల్ల - వాఁడు దుర్ధరుఁడు
మగలినఁ బోనీఁడు - మనవారి నెదుర
జయశీలుఁ డతఁడు రా - క్షసనాథ ! నీదు 2890
సయిదోడు మనవిభీ - షణుఁడు తాఁబోయి
తొడిబడ లంకకుఁ - దోరణఁగట్టె

యడిదయాస రఘువీరు - నడుగులు చేరె
లంకామహారాజ్య - లక్ష్మిఁ జేకొన్న
పొంకంబుతోడ ని - ప్పుడె యున్నవాఁడు.
కైకొమ్ము మీఁదటి - కార్యప్రచింత
మాకుఁ దోఁచినయట్టి - మాటఁ దెల్పితిమి."
అనిన శార్దూలుని - యాస్యంబుఁజూచి
దనుజనాయకుఁడు మి - థ్యాబుద్ధిఁ బలికె.
"ఏ నింద్రుఁడంత వాఁ - డెదిరించెనేని 2900
నీనేర జానకి - నీమాట లేల ?
మీరిండ్ల కరుగుఁడీ - మీఁదటికార్య
మేనూపములనైన - నేనె సాధింతు."

—: రావణుఁడు విద్యుజ్జిహ్వునితో శ్రీరాముని శిరము సీత వద్దకుఁ దెమ్మని చెప్పుట :—

అనుచు మంత్రులఁ బంచి - యాత్మీయభవన
మునకేఁగి మానసం - బునఁ జింత సేసి
తాను విద్యుజ్జిహ్వుఁ - దడయక పిల్చి
దానవాధిపుఁ డేక - తమున నిట్లనియె.
"సీతను మనము వం - చించినఁ గాని
చేతికి నేపనుల్ - చేకూడిరావు.
అందుకుఁ దగునుపా - యంబుఁ దలఁచితి 2910
డెందంబులో నిప్పు - డే నీవుపోయి
రాముని మాయాశి - రంబు కోదండ
మా మహితసాయ స - మక్షంబునందు
నేమాట లాడుచో - నిడి కడ కేఁగు

మామీఁదఁ గనుగొంద - మవనిజ తెలుఁగు."
అనివాని నియమించి - యప్పుడే తాను
జనకజ చెంతకుఁ - జనియున్న యంత

—: విద్యుజ్జిహ్వుఁ డట్లనే రామశిరము నచటనుంచి వెడలుట :—

వాఁడు నట్లనె రఘు - వర్యుని శిరము
పోఁడిమి చెడకుండ - పొదువుగఁదెచ్చి
బంటుతనంబున - పరువునవచ్చి 2920
వింటితో నటువెట్టి - వెనుకకుఁ జనినఁ
దలవాంచి యున్న సీ - తనుఁ జూచి దైత్య
కులపతి యపుడె పే - ర్కొని యిట్టులనియె.

—: రాముఁడు యుద్ధములోఁ జనిపోయెననియుఁ దన్నేలు కొమ్మనియు రావణుఁడు సీతతోఁ జెప్పుట :—

" జనకనందన! రామ - చంద్రునిమీఁద
మనసుంచి వడిగల - మగఁడని నమ్మి
యిన్నాళ్లు నడియాస - నెంతయు వేఁడు
కొన్నను మనసీక - గుట్టువెట్టితివి
రాముఁడిప్పుడు సమ - రంబులో నీల్గె
నీమీఁదట విచార - మిఁక నేల నీకు
పడఁతు లెచ్చటనైన - భాగ్యహీనతను 2930
గొడుకుల విధిగతిఁ - గోల్పోయి నటుల
రాముని నిర్భాగ్య - రాలవై నీవు
భీమసంగరములో - బేలుపోయితివి,

యింకఁ జెక్కిటను చె - య్యాడి పోక నేల
లంకామహారాజ్య - లక్ష్మివై నీవు
చలముఁ జాలించి ము - చ్చటదీఱఁ దనకు
వలచి పట్టపురాణి - వాసమవైన
నేల వింతని చాల - నెల్లలోకములు!
చాలింపు మింక వి - చార మేమిటికి?
చచ్చిన రాముఁడు - చలపట్టి మగుడ 2940
వచ్చి మాతో పోరు - వాఁడె నీకొఱకు?
వినవేమొ జగడంబు - వృత్తాంత మెల్ల
వనవీథి బంధించి - వచ్చి రాఘవుఁడు
కపి సేనతోడ లం - కాపురి చుట్టు
నిపుడె పాళెము డిగ్గి - యెంతయు నలసి
యేమఱి నిదురించు - నెడ నస్మదీయ
భీమరాక్షసయోధ - బృందంబు వెడలి
యజ్జ చూపుక ప్రహ - స్తాదులు వాని
పజ్జఁ జని కోఁతి - పాళెంబులోన
నొడలెఱుఁగక నిద్ర - నొందు నీమగని 2950
మెడఁగోసి తెచ్చితి - మింటికే నగిరి
తప్పించుకొని పాఱెఁ - దమవిభీషణుఁడు
చుప్పనాతిని ముక్కు - సురియచేఁ గోసి
నాపాపమునఁ బాఱె - నపుడు నీ మఱఁది
వాపోవుచును జాంబ - వంతుఁడు పఱచెఁ
జివ్వఁజాలించి వ - చ్చిన త్రోవ ప్రజలు
నవ్వఁగఁ బరువెత్తె - నలినాప్తసుతుఁడు.
ఊరక యంగదుం - డూడని బాఁడె

దారిఁ దప్పినఁ బోయెఁ - దారుఁడు దీసి
పోక నిల్చి సమీరి - పుత్రుండు వడిమె. 2960
మోకాళ్లు విఱిగి రా - మునిఁబాయలేక
కుముదుఁడు తలఁదెగఁ - గొట్టినఁ బడియె.
సమసె మైందుఁడు వీఁగి - చనియె నలుండు
నీలుఁడు శరభుఁడు - నిలిచి పోరాడి
వ్రాలిరి మేనులు - వ్రయ్యలై భువిని
పనసుఁ డెఱింగి ద - బ్బర వచ్చెననుచుఁ
బనసచెట్టునుబోలి - భ్రమసి తానిలిచె
నాలంబులోన గ - వాక్షుండు గూలె
చాల కయ్యముసేసి - శతవలి పడిసె.
నెత్తురు గ్రుక్కుచు - నెగ్గ సుషేణుఁ 2970
డుత్తరంబున ధూమ్రుఁ - డుదధిలోఁబడియె.
చేయెత్తి మ్రొక్కుఁ గూ - ల్చిరి దధిముఖుని
మాయచేఁ గేసరి - మై డాచిపోయె
సేతువు చూడవ - చ్చిన కపులెల్ల
భీతిచే నిల్లాండ్ర - బిడ్డలఁ దలఁచి
ముగిసె కార్యంబని - మొదలి పెంకులకుఁ
దగదొట్టి వాఱిన - దైత్యులు తెలుపఁ
జెట్లుకొండలు వట్టి - శ్రీరామసేన
పొల్లైంబు చెడి విచ్చి - పోయిర"టంచు

—: రావణుఁడు సీతను నమ్మించుటకొఱకు శ్రీరాముని శిరమును నామె ముందటఁ బెట్టించుట :—

పలికి విద్యుజ్జిహ్వ - పాలితంబైన 2980

తలఁదెచ్చి సీతముం - దఱ నిలుపుటకు
రావణుఁడుడిగింపు - రమణితోఁ బలుక
నావిధంబున నది - యవనిజకడకుఁ
దలయు విల్లును దెచ్చి - ధరణిపై నుంచి
తొలఁగిపోయిన జగ - ద్ద్రోహి రావణుఁడు
ఇది రాము మస్తకం - బిపుడె కెంధూళిఁ
బొదివి యున్నది శరం - బులు విల్లుఁగనుము
గుఱుతుగాఁ దలయెత్తి - కొసలెల్లఁదీఱఁ
బరికించిచూచి చే - పట్టుము నన్నుఁ
గాఁక దీఱద''టన్న - కల్పితరామ 2990
రాకేందువదన మూ - రామునిభామ

——: సీత యాశిరస్సును కనుఁగొని దుఃఖముచే మూర్ఛిల్లి రామునికొఱకై శోకించుట :——

కనుఁగొని తలవెంట్రు - కల సోయగంబు
తనతండ్రి యొసఁగు నా - దల మానికంబు
పలుచని చెక్కులు - పాటలాధరము
నెలవంక బొమలును - నిడుదకన్నవయు
విల్లునమ్ములుచూచి - విభుఁడెకాఁదలఁచి
త్రెళ్లి ధరిత్రి మూ - ర్ఛిల్లి వే తెలిసి
“ హా ! రామ ! హా ! నాథ”- యని పొగలుచును
వారిజానన సీత - వగల నిట్లనియె.
“ కైకేయి ! నీదు సం - కల్పంబు నీకు 3000
చేకూడె నీవు కొ - ల్చినదె దైవంబు
నోములన్నను నీవు - నోచిన యవియె

నోములు కడతేఱె - ను తపంబు నీకు
నడవుల కేఁటికి - నంపితివమ్మ ?
చెడుఁదుపొండని మేము - చేసినదేమి ?
కడలేని శోకసా - గరములో నిట్లు
పడి యీఁదవలసె తె - ప్పయొకండు లేక
ముచ్చట మున్నీట - మునుఁగుటఁగాక
వచ్చెను తనకిట్టి - వైధవ్యవృత్తి
పతులకై సతులెందు - ప్రాణముల్ విడుతు 3010
రతివకై పతులిట్టు - లగువారు గలరె ?
వానరులే సహా - వాసమా బలగ
మేనె మృత్యువనైతి - నిప్పుడు నీకు
కోదండదీక్షాది - గురుఁడవు శస్త్ర
వేదివి జగదేక - వీరవర్యుఁడవు !
ఏర్చవే గడియలో - నెంచినయడవిఁ
గార్చిచ్చువలె నీవు - ఖరదూషణులను !
తునిమివేయవె విరా - ధుని యంతవాని !
ఘనువాలి నొకకోలఁ - గడతేర్ప లేదె !
అట్టి నీవెక్కడ - యధమరాక్షసులు 4020
చుట్టుక శిరము త్రుం - చుక తెచ్చుటేడ ?
నిద్దుర నీదు కం - టికి రాదటంచు
బద్దిపోయెను మున్ను - పవమానసుతుఁడు
నిదురయె నీదుహా - నికి హేతువయ్యె
నదియె కారణముగా - ననదనేనైతి
నాయురున్నతుఁడ వీ - వనుఁడు భూసురుల
మాయమాటలు చాల - మది నమ్మియుంటి

కటకటా! మాయత్త - కౌసల్య యింక
నెటులీద నేర్చునో - యీ శోకజలధి?
ప్రాణనాయక! ధను - ర్బాణంబు లుభయ 3030
తూణీరములును నీ - దు కరంబులందు
నతిశయిల్లఁగఁ బూజ - లందిన నిప్పు
డితరుల పాలయ్యె - నే కాలగతుల!
పదునాలుగేండులు - ప్రతిన చెల్లించి
తుది నయోధ్యకుఁ బోవు - దు నటంచు నీవు
జనకుని కెఱిఁగించ - స్వారాజ్యమునకుఁ
జనుదురే తోడుక - చనక నన్నునిచి
సత్యసంధుఁడ వగ్ని - సాక్షిగా నన్ను
సత్యంబు సహధర్మ - చారిణివనుచు
నాది వసిష్ఠాదు - లందఱు వినఁగ 3040
నోదేవ! పలికి యి - ట్లొంటిఁ బోవుదురె?
నీచట్ట వట్టి యీ - నీచ రాక్షసుల
నాచుట్టు నుండ నుం - డఁగఁ దగునయ్య?
యాగాది సకల క్రి - యలు దీర్చి రాజ
యోగివై నాతోవి - యోగంబుచేత
మొదట నిద్రాహార - ములకుఁ దొలంగి
పదినెల లిట్లున్న - పరమపుణ్యునకు
దోయజభవుఁడిట్లు - దుర్మరణంబు
సేయునే! యేనేమి - సేయుదు నింక.
ఎవ్వరు వలదన్న - నింతయు వినక 3050
మువ్వురితో వనం - బుల నుండవలసి
వచ్చినదో దేవ! - వశమునఁ దన్ను

ప్రుచ్చిలి తెచ్చె నీ - ములుచ దానవుఁడు.
అమరావతికి నిన్ను - ననిచి సుమిత్ర
తమతల్లి యలర మా - తల్లి శోకింపఁ
బ్రాణముల్ దాఁచుక - పఱచె లక్ష్మణుఁడు
ప్రాణేశ ! యూర్మిళ - భాగ్య సంపదను!
హనుమంతు ననిచిన - యార్తి నంతయును
విని మహావనచర - వీరులఁ గూడి
కడలి బంధించి లం - కాపురిమీఁద 3060
విడిసి కంటికి నిద్ర - వేగించలేక
మోసపోయితిని త - మ్ముని నమ్మి వచ్చి
యాసించి ప్రాణంబు - లతఁడేమి సేయు?
ఒరులు దానము సేయ - నోరువలేక
పరిహరించిన యట్టి - పాపంబుచేత
నిను నెడవాసి పీ - నికిఁ జిక్కి యందు
వెనుక నీతఱిగని - వెతల పాలైతి !"
అని మస్తకము దీసి - యక్కునఁ జేర్చి
తనయూరువుల నుంచి - ధారాళమైన
కన్నీటఁ దోఁపుచు - కరనఖాగ్రములఁ 3070
బెన్నెఱుల్ దువ్వుచుఁ - బ్రియుఁడెకానెంచి

—: సీత రావణునితోడ తన్ను శ్రీరామునితో సహగమ
నము సేయుట కాజ్ఞ యీయుమని కోరుట :—

" ఓరి ! రావణ ! నీకు - నొకపుణ్యమార్గ
మేఱుపాటుగఁ దచ్చి - యిచ్చెద నేను
తలతోడఁ దలయు గా - త్రముల గాత్రంబు

గలయించి తన్ను రా - ఘవుఁ గూర్చి తేని
ననుగమనము సేయు - నపుడు దీవింతు
నిను చిరంజీవివై - నెగులొందకుండ
అనునంతలోనఁ "బ్ర - హస్తుఁడు వంపె

—: ఇంతలోనొక దూత రావణుని
సత్వరముగా రమ్మనుట :—

నినుఁ దోడితెమ్మని - నిలువరాదిచటఁ
బురములో నుత్పాత - ములు చాలఁదోఁచె 3080
పెరిగెఁ గార్యము మిమ్ముఁ - బిలువ మటన్న
వచ్చితి" నను దూత - వచన సంగతికి
రిచ్చలువడి వాఁడు - రివ్వలు విఱిగి

—: రావణుఁడు వెడలినతోడనే శ్రీరాముని శిరమునాతనితో
వెడలిపోవుట - దానిచే సీతమనస్సు శాంతిఁబొందుట :—

దిగులుచే నేమియుఁ - దెలియక మఱలి
మొగము వాడఁగ మంత్రి - ముఖ్యులున్నట్టి
సావడి చేర ని - చ్చట తోడమీఁది
రావణు కృతిమ - రాము శిరంబు
విలునమ్ములు వాని - వెంటనే పోవ
నుల్లంబులో సీత - యుపతాపముడిగి
యూరటఁ గైకొని - యుండె. రావణుఁడు 3090
శూరు నాప్తునిఁ బ్రహ - స్తుని జేరఁ బిలిచి
మనము మూఁకలఁ గూర్చి - మర్కటశ్రేణి
దునిమింత మిపుడు వీ - ఘులఁ జాటఁ బనిచి
పిలిపింపు" మనరణ - భేరి వేయించి

బలములు రావించి - పంక్తికంఠునకు
నామాట వినిపింప - నచ్చట సీత

—: సీత రామునిఁగూర్చి దుఃఖింప సరమ యిదిరావణ మాయగాని వేఱొండుకాదనిచెప్పి యామెనూరడించుట :—

రాముని చరణ సా - రసములు దలఁచి
కన్నీరు రాల్పు లోఁ - గనుఁగొని సరమ
మన్ననఁ జేరి సా - మమున నిట్లనియె.
"ఓయమ్మ! యీతల - యును విల్లు నితని 3100
మాయ యింతియెకాని - మఱియొండుగాదు
శ్రీరామునకుఁ గీడు - సేయ నొక్కరుఁడు
చేరిచేదావాగ్ని - చెదలంటు నమ్మ
రాముఁ గాచిన సుమి - త్రాకుమారకుని
కేమిటికీ భయం - బిటఁ గల్గనేర్చు?
కాకుత్స్థ తిలకుల - కరుణ యొప్పనము
చేకొన్న సుగ్రీవుఁ - జెనకునే రొకఁడు
రామకోదండంబు - ప్రాపున నున్న
సామాన్యులే కపుల్ - శతమఘాదులకు
వారు కీడును వేరు - వారి కీడునకు 3110
నో రామ! యీచింత - నొంద నేమిటికి?

—:సరమ సీతతో యుద్ధభేరి మ్రోఁగుచున్నదనియు శ్రీరాముఁడు రావణునిజయించి యామెను తీసుకొని పోవుననియుఁ జెప్పి సంతోష పఱచుట :—

అదె వినవమ్మ భ - యంకరారావ
విదిత భేరీశంఖ - వీరానకములు

బలవత్తరంబయ్యె – భయము రావణుని
తలఁపులో శ్రీరామ – దళములు జూచి
జతనంబుఁ జేసిరి – స్యందన శ్రేణి
యతనంబుఁ జేసిరా – హవ కర్మమునకుఁ
గనగల్గి వ్రేసిరి – కరులకుఁ ద్రాళ్లు
కనుఁగొంటి బల్లన – కట్టిన హరుల
పోటుదారలు పుర – మ్మునఁ జిమ్మిరేఁగి 3120
పాటక నాదంబు – బారులు గలిగె
భటుల కోలాహలా – ర్భటి మిన్నుముట్టె
నటు చూడు మెత్తిరా – హవ కేతనముల
నాయుధసంపత్తి – నమరెఁ గాల్బలము
మాయమ్మ ! నీకు నే – మము గల్గు దీన
రామచంద్రుఁడు నేల – రావణు సమర
భూమిలో నసురల – పుట్టు లేకుండ
నడఁచి నీతో నయో – ధ్యకుఁ జేరగలఁడు
తొడమీఁద రామచం – ద్రుఁడు గారవింప
ననుభవించెద వీవ – నంత కల్యాణ 3130
మననాతిగానంద – మహిత సౌఖ్యములు.
అప్పుడు మఱువకు – మమ్మ నేనన్న
యిప్పటిమాట నే – నెప్పుడు నీదాన
నిందుండు మఱలి పో – యి ప్రధానవరుల
నందఱఁ బిలిపించి – యాలోచనమునఁ
గయ్యంబె కాని య – క్కఱఁ దీఱదనుచు
నియ్యెడఁ జాటించె – నిదె భేరి మొఱసె
అండజగమన ! నే – డాదిగా నగర

మండోదరీ ముఖ్య – మదవతీమణుల
రోదనధ్వనులు నీ – శ్రుతులు సోకంగ 3140
ఖేదంబు మాను ను – ఖింతువు నీవు.
అమరనాయకునితో – హరిఁగూడి దైత్య
సముదయ......... – చండంబుఁ దోపఁ
దమ్మునితోఁ గూడి – దశకంఠుఁ దునుముఁ
జుమ్ము నామాటఁ బ్రతి – శుద్ధికి నమ్మ
కంచుకంబూడ్చిన – కాలాహి రమణి
సంచనఖేదంబు – సడలింపుమీవు
వానలచే సస్య – వతియైన ధరణి
నానాఁట నలరు వి – న్ననువున నీవు
మదిలో విచారంబు – మాని సంతోష 3150
పదవిలోనిపుడు తె – ప్పలు దేలఁగలవు
చుట్టు వేడెంబు వ – చ్చు తురంగ మునఁగ
గట్టుల దొరకు నే – కట ప్రదక్షిణముఁ
గావించు రవిఁ జూచి – కరము లు మొగిచి
సేవింపు మిష్టార్థ – సిద్ధి గాఁగలదు
మాయమ్మ! నీవు నె – మ్మది నుండు మిపుడె
పోయినీ యనుమాన – ములు నివారింపఁ
జూచి వచ్చెదను య – శోధాము రాము
వాచాలతలు చూపు – వనితను గాను
పోయెద నారయం – బునకు ఖగేంద్ర 3160
వాయువుల్ సరిగారు – వత్తు నీక్షణము
చనుదునే?" యని విభీ – షణు రాణివాస
మనిన మాటలు విని – యవనిజ వలికె

'రామచంద్రునిఁ జూచి - రాఁ దలంచుటలు
నీమదిలోపల - నిజమయ్యెనేని
నంతమాత్రంబు ద - యాశక్తిఁ గలిగె
నంతియె చాలు మా - యావి రావణుఁడు
కపటాత్ముఁ డేమి పో - కలును బోయెడిని?
యిపుడేఁగి యాతని - హృదయంబుఁ జూచి
నడిపింరు సమరస - న్నాహంబుఁ దెలిసి 3170
గడియలో మఱలి యి - క్కడికి రమ్మ" నినఁ
బరమానురాగ సం - భరితయై మొప్పి
సరమ జానకిఁ జూచి - సమ్మతిఁ బలికె

—: సీతపంపున సరమ లంకలోనికిబోయి యుద్ధసన్నాహముఁ గనుగొనివచ్చి సీతకు నివేదించుట :—

"అమ్మ! నీమది రావ - ణాసురు హృదయ
మిమ్మెరయని కని - యేవచ్చు నదియె
హితమగునేని పో - యెద" నని సరమ
యతిరయంబున నేఁగి - యసురనాయకుఁడు
తనప్రధానులఁ గూడి - తాఁ జేయవలయు
పనుకులు కరతలా - మలకంబుగాఁగఁ
గాంచి క్రమ్మఱ వచ్చి - కపటంబుఁ బాసి 3180
సంచరించు సరోజ - సదనయనంగఁ
దనుఁబాసి మిగుల ఖే - దంబుతో నున్న
జనకనందనఁ జేరఁ - జన రామురాణి
లేచి కౌఁగిటఁ జేర్చి - లేమ వచ్చితివె
యీచెంత వసియింపు - మీవ"ని యనుప

నా దేవితో రావ - ణాసురు మఱంద
లాదరంబునఁ గన్న - యర్థ మిట్లనియె
"తల్లి! రావణుఁ గన్న - తల్లియు నతని
వల్ల ప్రోవాశించు - వారుమంత్రులును
సీతనిమ్మని బుద్ధి - చెప్పియు రాము 3190
చేత మున్ననిలోన - శించినయట్టి
ఖరదూషణాదుల - కథలు నీమగఁడు
శరధిఁ గట్టుటయు ని - చ్చటికిఁ జేరుటయు
నుతగుణంబులు నమా - నుష చరిత్రములు
నతనిచే రాక్షస - హానియౌ ననియుఁ
జెప్పిన ధనలోభి - సెలవు సేయంగ
నొప్పనిగతి మోహ - యుక్తుఁడై యతఁడు
నిను రాఘవున కీయ - నేరక జగడ
మునకుఁ బోయెదనని - మూర్ఛించినాఁడు
రావణుఁడనిఁ జచ్చు - రాముఁడు గెలుచు 3200
దేవి! నీమగనిఁ బొం - దెదవు సత్యముగ
నేఁటి తేపటి వాసి - నీకు విచార
మేఁటికి? దనుజేంద్రు - డిట్లున్న యపుడు

—: రావణుఁడు శ్రీరామునిపైకి యుద్ధమునకు వెడలుదు
నని యాలోచన సేయుట :—

నగరోత్తమ సింహ - నాదముల్ కపుల
యగణిత వీరాట్ట - హాసార్భటులును
నెలుఁగుల కిలకిలా - యిత విరావంబు
జలజాప్త సుతసైన్య - శంఖారవంబు

భీషణనిస్సాణ - భేరీ మృదంగ
ఘోషణ విని రామ - కోదండజనిత
శింజినీనిక్వాణ - జీమూతనినద 3210
భంజిత దానవ - బలసంఘులంబుఁ
గాఁగ యాలంక ల - గ్గలకెక్కఁ గపులు
మూఁగునంతట దశ - ముఖుఁడాగ్రహమున
రాముని తెంపును - రణకుతూహలము
సౌమిత్రి కోపంబు - శతపత్ర హితుని
సుతుని ప్రతిజ్ఞలు - శుకునిచే వినిశ
కతమునఁ బైవచ్చు - కార్యమూహించి
యేమియుఁ దెలియక - యుంచుక సేపు
తామానవమునమండి - తనవారితోడఁ
దొరగ పైనము సేయు - దును రఘువీరుఁ 3220
బోరిగొందుఁ గలనికి - ప్పుడె పోవువాఁడ
ననిన రావణు దుర - హంకారమునకు
వనజాక్షి ! యామాల్య - వంతుండు వలికె

—: మాల్యవంతుండు రావణునికి యుద్ధము వలదని శ్రీరామునికి సీతనిమ్మని హితముచెప్పుట :—

'నీతిసంపన్నుఁడు - నిజబుద్ధిశాలి
యై తగురాజు రా - జ్యము చాలఁజేయు
సమయంబు చూచుక - శత్రులఁ గెలుచు
సుమతికిఁ గీర్తివ - చ్చును గెల్పుఁగలదు
పరివారితోడ దు - ర్జయుతోడ సంధి
పరగును దండింపఁ - బడు హీనసత్త్వు
కావున రామునిఁ - గలనిలో నోర్వ 3230

నేవిధంబునవచ్చు - నిట్టి వైదములు
మనుజుని యెడగంటి - మావార నొకడు
దునుమునే యొకతూపు - దొడిగి యెందైన
నారాముడట్లుండె - యగచరుండొకడు
చేరి యిూలంకగా - ల్చినగానవైతె
మన విభీషణుడన్న - మాటలు చెవిని
జొనుపక జేటురా - జూచెదవీవు
వలదు సీతను రఘు - వరునకు నిచ్చి
చలము చాలింపు శా - ర్జవ బుద్ధివగుము
దేవతల్ ఋషులు దై - తేయుని తోడ 3240
రావణు ధునుము నీ - రఘు వీరుడనుచు
జయముగోరెద రంబు - జభవుండు తొలుత
నియమింపడే ధర్మ - నియతి నెల్లులకు.
పాపంబునకు బాలు - పఱుపడే మనల
భూపుత్రికై జెడు - బుద్ధి బూనుదురె ?
పాపంబులెందు జూ - పట్టక పుణ్య
మేపట్టునను మీఱ - కృతయుగంబయ్యె
కలుషంబులేకాని - కల్యాణకర్మ
ములు లేమియీ యుగం - బున కది గుఱుతు
ధర్మముల్ చెఱచి య - ధర్మంబులైన
కర్మంబు లెప్పుడు - గావించుకతన
నీకు హానియు రాము - నికి గెల్పు ననుచు 3250
వాకొంటి మిది దేవ - వాక్య సమ్మతము.
అమరులు ధర్మస - హాయులు మనకు
సమకూడ నేరదు - సమరజయంబు

నీచేత బాధలొం - దిన బ్రహ్మఋషులు
చూచితే యాగము - స్తోమముల్ చదివి
యాగాదు లొనరించు - నందుచే జయము
సాగనీయక దైత్య - జాతిఁ ద్రోలెదరు
దేవదానవులచేఁ - దెగకుండ నజుని
చే వరమీవు గాం - చితిగాక తొలుత
నరులచే భయద వా - నరులచే నీవు 3260
పోరిబోవకుండఁగఁ - బూట యివ్వాఁడు !
అట్టివారలె వచ్చి - యదె కోటచుట్టి
ముట్టడి చేసిరి - ముత్తికగాఁగ
బహుళంబులైన యు - త్పాతముల్ లంక
నహరహంబును గల్గె - నది పుట్టుగాదె
కటు గర్జితముల ర - క్తంబులు గురిసె
నిటుచూడ మేఘంబు - లేనుఁగుల్ హరులుఁ
దొరిగించెఁ గన్నీరు - తునిసె కెక్కెములు
తిరిగె గోమాయు లం - తి పురంబులందు
గంతులతో కాశి - కా విగ్రహములు 3270
రంతులు చేసి పు - రప్రఘాణముల
తుట్టె పూజాద్రవ్య - ములు శునకములు
పుట్టు నావులకు ని - ప్పుడు గర్దభములు
నెలుకలు పిల్లులు - నెలుగులు పాము
లలముకున్నవి మాన - వాళి దైత్యులును
జతగూడియున్నారు - శమనుఁడింటింట
నతిభయంకర విన్న - తాననుఁడగుచు
దండంబుతో బోడి - తలతోడ మెలఁగు

చుండఁ జూచెదరు దై - త్యులు రాత్రులందు
విపరీత రతిఁ బక్షి - వితతి వాపోయె 3280
నివుడించుచే లంక - యేమి కాఁగలదో ?
లంకేశ ! దనుజ కు - లంబు మాంసములు
కంకగృధ్రాదులు - కబళింపఁ గలవు
హితము చెప్పెద సీత - నిమ్ము రాఘవుఁడు
శతపత్ర నేత్రుండు - సందియం బేల ?
ఇట్టి మచ్చరమేల ? - యెందైన నరుఁడు
గట్టునే సేతువు - గా వార్ధి మీఁద ?
సంధికార్యమె మేలు - జానకి నిచ్చి
సంధింపు మా సత్య - సంధు నటంచు
నూరకయున్న మృ - త్యు ప్రేరణమున 3290
నారాయణుఁడు దుర్మ - దాంధుఁడై బిట్టు
నట్టహాసము చేసి - యామాల్యవంతుఁ

—: రావణుఁడు మాల్యవంతుని మాటలు పెడచెవినిఁ బెట్టుట :—

దిట్టుచు " నీకు బు - ద్ధికి నేమివోదు
హితవరివలె నుండి - నీవు శాత్రవుల
మతమువలంబించి - మాటలాడెదవు.
ఒకకోఁతి మఱుఁగున - నొదిగి యిల్లాలి
నొకఁ డెత్తికొని పోవ - నుఱకుండ లేక
యది నిమిత్తముగాఁ బ్రా - ణాశ వోవిడిచి
కదిసి పైఁబడి చావఁ - గా వచ్చినట్టి
రాముని భట్టు మే - రను సన్నుతించి 3300

యేమి లాభంబు నీ - వెందు చెందెదవు ?
ఎల్ల లోకము లేలి - యింద్రుని పురము
కొల్లవట్టించి ది - క్కుల ప్రతాపంబు
నిండించి దివిజుల - నిలుకడల్ చెఱిచి
పుండరీక భవాండ - మున నొక్కఁడైన
నెదిరింపలేని న - న్నిటుల దూషింప
నిదియేల పరిధాన - మిచ్చిరో వారు ?
బందుకట్టిరో నిన్ను - పౌరుషాధికుని
యందుఁ జూపోపక - యన్యులిట్లాడ
బోధించిరో నీకు - బుద్ధి చెల్లించి 3310
తాధాత మదిముది - దప్పి పల్కితివో ?
నేనంచు నెఱుఁగవో - నీకు సజ్ఞాన
మూనెనో సీత నీ - కొక్కరిచేతఁ
బ్రియము చెప్పించెనో ? - పిఱికితనంబు
బయసి మాలింప నీ - పగిది నాడెదవో ?
ఎటులైన నేమి నే - నీఁజాల సీత
నిటువంటి మాటల - కే బెదురుదునె !
కమలంబు బాసిన - కమల గాకొక్క
రమణియె రాముని - రాణివాసంబు
చంపుదు వానర - సహితు సుగ్రీవుఁ 3320
జంపుదు లక్ష్మణ - సహితు రాఘవునిఁ
జచ్చిన నొకనికి - శరణంబు మఱుఁగుఁ
జొచ్చునె రావణా - సురుఁ డేఁటిమాట
తాతవుగావునఁ - దాళితి జలధి

సేతువు గట్టెను - శ్రీరాముఁ డనుచు
నింతమాత్రనె భయ - మేఁటికి మాల్య
వంత! నీకనిన రా - వణుని మాటలకు
నేమియు ననక తా - నింటికిఁ బోయె
నామాల్యవంతుఁడ - నంతరంబునను
తనప్రధానులు దాను - దశకంధరుండు 3330

—: రావణుఁడు లంకరక్షణకై నాల్గుదిక్కుల రక్షకుల నియోగించుట :—

ననఁటి యాలోచనల్ - చేసి పురంబు
జతనంబుఁ గావింప - సకలప్రయత్న
చతురుఁడై తత్పురి - సాలంబుఁ జుట్టఁ
దూర్పువాకిట ప్రహ - స్తుని దక్షిణంపు
తార్పు దిన్నెలమలె - తామహాపార్శ్వ
నేచి యీాపడమర - నింద్ర జిద్దనుజుఁ
జూచి యుత్తరమున - శుకసారణులను
కట్టడఁ జేసి యె - క్కుడనె తానుండు
నట్టి యేర్పాటుతో - నప్పురి నడుమ
రూఢప్రతాపు వి - రూపాక్షు నలఘు 3340
గాఢ బలాఢ్యునిఁ - గట్టడఁ జేసి
యేల శంకయటంచు - కృతకృత్యుఁడైనఁ
బోరికిఁ దానంతి - పురమున కేఁగి
కాలచోదితుఁ డౌట - గానడ సౌఖ్య
భోలుఁడై కామిను - లు గొలువ నుండె.

—: శ్రీరాముఁడు లంక నెట్లు సాధించుటయను విషయముఁ గూర్చి యాలోచన సేయుట :—

ఆవేళ రఘువీరుఁ - డర్కనందనుఁడు
పావని పనసజాం - బవదాంగదులును
నలనీలకుముద మైం - దద్వివిదులును
కలవారలెల్ల నే - కముగాఁగఁ గూడి
"వచ్చితి మొకరీతి - వననిధిఁ దాఁటి 3350
యిచ్చటికి లంక - యింద్రాదులకును
దేటి చూడఁగ రాదు - దీని సాధింప
నేరుపెట్టిదియకో - నెమకంగవలయు"
ననుమాట లాలించి - యసురనాయకుని
యనుజన్ముఁడుచిత వా - క్యముల నిట్లనియె.

—: విభీషణుఁడు రావణుఁడు చేసిన ప్రయత్నమును వివరించుట :—

"శరభుఁడు ప్రముఖుఁడు - సంపాతియనలుఁ
డురు శక్తులప్రధాను - లూహింపఁదనకు
నలువురు పక్షులై - నభముల కెగసి
చులకఁగా నాలంకఁ జొచ్చి - రావణుని
తెఱఁగెల్లఁగని వచ్చి - తెలిపిరిగానఁ 3360
బరికించి వినుఁడేలు - పడ వివరింతు
పూర్వసాలద్వార - మున ప్రహస్తుండు
దుర్వారబలముల - తోనున్నవాఁడు
దక్షిణంబున మహో - దర మహాపార్శ్వ
లక్షణబలశాలు - లై యున్నవార

లద్వందుఁ డింద్రజి - త్తనువాఁడు పశ్చి
మద్వారమున ధైర్య - మహిమ నున్నాఁడు
శతకోట్ల సంఖ్యారా - క్షసులతో దైత్య
పతి యుత్తరద్వార - భవనంబు నందు
నున్నాఁడు బహుళసై - న్యోపేతుఁడధికుఁ 3370
డన్నిట నలవిరూ - పాక్షుఁడన్వాఁడు
సాలమధ్యప్రదే - శమున నున్నాఁడు
చాలు నెంతటికైన - జానకీరమణ!
రథగజ తురగ పే - రభటాళి చాల
పృథుశక్తి శతకోటి - బృందసంఖ్యలను
జతచేసుకొని తారు - సమరసన్నాహ
చతురులై మిగులనె - చ్చరికనున్నారు"
అనివింటి వీరిచే - ననుచు మంత్రులను
జనకజప్రాణేశు - సన్నిధినుంచి
దేవ! కుబేరు సా - ధింపఁగఁ దొల్లి 3380
రావణాసురుఁడు శౌ - ర్య సహితులైన
యరువది లక్ష - యసురులతోడఁ
బరిభవించెఁ గుబేరు - బవరంబులోన
నటుగావున సురాసు - రాసాధ్యుఁడతఁడు
నిటలాక్షుఁడైన వా - ని జయింపలేఁడు
గెలువరాదనలేదు - కీర్తింపలేదు
కలతెఱఁగిది యైనఁ - గానిండు మీరు
రావణునితో బగ - త్రియిశరం బొకటఁ

గావలసినఁ ద్రుంపఁ - గలకార్య నిధివి
యీలంక సాధించు - టెంతమీ''కనిశ 3390
నాలించి రఘువీరుఁ - డతనితోఁ బలికె

—: శ్రీరాముఁడు రావణుని ప్రయత్నములకు మాఱుప్రయత్నములుసేసి సేనానాయకులను నియోగించుట :—

''తూరుపు దెస ప్రహ - స్తునిమీఁద నీలుఁ
డాగాఢ బలుఁడుండి - యని సేయఁగలఁడు
తడయక దక్షిణ - ద్వార యోధులను
గడతేర్చఁగాక యం - గదకుమారుండు
చివ్వకు నయ్యింద్ర - జిత్తుని కోపు
నవ్వాయుజుఁడు పశ్చి - మాశఁ దానుండి
కమలజ వరదాన - గర్వసమేతు
నమర భయంకరు - నఖిలలోకైక
కంటకు నాదశ - కంఠుని చేతి 3400
వింటఁ బుట్టు నమోఘ - విశిఖానలమున
దహియించువాఁడ నా - తమ్ముఁడు కెలన
సహచరుఁడై యుండ - సమరరంగమున
నీయుత్తరపు దిశ - యేనుండ దనుజ
నాయకు దునుము స - న్నాహంబుతోడ
వనజాప్త సుతజాంబ - వద్విభీషణులు
మొనఁజేరి నడుచక్కి - మూఁకఁ ద్రుంపుదురు
వానరు లంటఱు - వానరత్వముల
చేనుండి సమరంబు - సేతురుగాక
మనుజ మూర్తులతోడ - మార్కొనవలవ 3410

దనిలోన నిదియె నా - యాజ్ఞాపనంబు
నీవు నీమంత్రులు - నేను లక్ష్మణుఁడు
నేవేళ నరులమై - యుత్తమాహవము "
అనిపల్కి తాను వే - లాచలంబునకు
జనకజా విభుఁడు ల - క్ష్మణ సహితముగ
మొనసేయు లంకాభి - ముఖముగా నడిచి
దనుజనాయకుని సో - దరున కిట్లనియె

—: శ్రీరాముఁడు వానరసేనలతో సువేలాచలముపై విడియుట :—

" నేఁటికి నగముపై - నిలిచి యీలంక
కోడలు వాకిళ్లు - కొత్తళంబులును
వేడుకఁ గనుఁగొంచు - విడిసి యుందుదము 3420
వీడు బట్టులడించి - వీరవానరుల
రావణుమీఁది యా - గ్రహమెల్లఁ దీర్త
నీవు మెచ్చఁగ జేపె - నిశితాస్త్రములను!"
అనియొక్క సమభూమి - నన్నదమ్ములును
దనుజవానర విభుల్ - తగురీతి నుండఁ
బెడబొబ్బలిడుచుఁ గు - ప్పించుఁగపులు
విడిసి రెల్లెడల సు - వేలాచలమున
నినుఁడ స్తగిరిఁ జేరె - నిరులల్లుకొనియె
వనజారి యుదయించె - వచ్చె వెన్నెలలు
మునిఁగెఁ దామెర కల్వ - మురిపెంబుఁ జూపె! 3430
చనియె జోడెడవాసి - చక్రవాకములు
బాణబాణాసన - పాణియై యుభయ

తూణీర యుగళుఁడై - తోడనే వచ్చి
యన్న చెంగట సుమి - త్రాత్మజుఁడుండె
నన్నెలవున నుండె - యర్కనందనుఁడు
దనుజ వాయుజులు చెం - తనె యుండి రట్టి
మనువంశమణి విన - మర్కటోత్తములు
కిలకిలారావ సం - కీర్ణాట్టహాస
కలకలంబుల లంక - కలగుండు వడియె!
అగచరోత్తములచే - యనుమతుల్ గాంచి 3440
నగములు తరువులు - న్నతభుజాగ్రముల
ధరియించి వానరో - త్తములు లగ్గలకుఁ
బరిగొని లంకపైఁ - బరువులెత్తంగ
నల త్రికూటాద్రి మ - ధ్యప్రదేశమున
నలరొంది శతయోజ - నాయతం బగుచుఁ
బది యోజనంబుల - పటుపుతోఁ జాల
కుదురైన సౌవర్ణ - కూటంబు మీఁద
విలసిల్లి కోటభా - వించి యన్నడుమ
బలువైన వేయిగం - బములచే నమరు
దానవవిభుని సౌ - ధముఁజూచి దనుజ 3450
సైనిక బిరుదధ్వ - జంబులు గాంచి
పూచికాచి ఫలించి - పొదలి మిన్నంది
యాచుట్టు నున్నవ - నాళి వీక్షించి
పురము సింగార మ - బ్బురపాటు వెనుప
ధరణిజా రమణుఁడు - తలఁచు త్తిచూచి

—: శ్రీరాముఁడు లంకాపుర సౌధమున
రావణునిఁ జూచుట :—

యామేడ మీఁదట - నాఱవకక్ష్య
నామటిపొడవౌమ - హాద్వారమునకు
ముఖ్యాడు వేలుపు - ముద్దులగుమ్మ
లొయ్యారములఁ జెంత - నుడిగముల్ సలుపఁ
దలమీఁదఁ బారిజా - తపు విరిదండ 3460
వలపుల మేడకు - వాసనఁగట్టఁ
బూసిన కుంకుమ - పూఁతనీలాచ
లాసక్త సంధ్యారు - ణాభ్రంబు నెనయఁ
పైనున్న బంగరు - పటము క్రొమ్మెఱుఁగు
లానభోమహిభాగ - మల్లుకొనంగ
మణిమయఛ్ఛత్రచా - మరకేతనములు
గణనకెక్కుడుఁగ రా - జసభామలందఁ
జంద్రహాసప్రభా - చకచకల్ పొదన
చంద్రహాసప్రభా - సమితిలో నెనయ
వీణాదిసంగీత - విద్యలనసుర 3470
గాణెలు మదిమెచ్చఁ - గా వినుపింపఁ
గొలువున్న దానవ - కులపతిఁ జూచి
తలయూచి మెచ్చి సీ - తానాయకుండు
కనుఱెప్ప వేయక - కపులును దానుఁ
గనుచుండ రాఘవా - గ్రణి చిత్తమెఱిఁగి
ఆగ్రహోదగ్ర చి - త్తాబ్జుఁడై యెగసి

—: సుగ్రీవుఁడు రావణునియొద్దకేఁగి శ్రీరాముని దూతగా వచ్చితినని చెప్పి రావణుని కిరీటముఁ దన్నుట :—

సుగ్రీవుఁడ సహాయ - శూరత మెఱయ
నాగోపురము మీఁది - కలఁకదాఁటి
రాగాంధుఁడై నట్టి - రావణుఁ జూచి
చులకనఁగాఁగఁ జూ - చుచు వానితోడఁ 3480
గొలువువారలు వినఁ - గోపించి పలికె
సకలలోకములకు - స్వామియౌ రాము
నకుఁ జెలికాఁడ నా - నరలోక పతినిఁ
దపనసూనుఁడను నీ - తానిమిత్తముగ
నిపుడె నిన్నాజ్ఞ సే - యింతువాఁడగుచు
నను నంపె నతనికి - నమ్మికబంటుఁ
గనుము నిన్నిపుడె - కడతేర్తు ననుచు
డాసి యీదల కిరీ - టముఁ దీసి నేల
వ్రేసిపట్టఁగ నేర్పు - మెదకుచుఁ బదరు
వానరనాయకు - వదనంబుఁ జూచి 3490

దానవకుల పాక - దమునుఁ డిట్లనియె

—: రావణసుగ్రీవుల పోరాటము :—

"ఓరోరి! వనచర! - యోడక యిలకుఁ
జేరి నా మకుటంబు - క్షితిఁ బడవైచి
పోయిన నేనేల - పోనిత్తు నిన్ను
మాయింతునని కొట్టి - మహిఁ బడఁద్రోయఁ
గుదికిలఁ బడి లేచి - కుపితుఁడై వాని
పదమున దానవ - పతిఁ దన్నుటయును

నల్లగా సింహాస - నముమీఁదనుండి
డొల్లి తాఁబడ్డపా - టుఁ గనంగలేక 3500
గ్రక్కున లేచి తాఁ - గడకాలు వట్టి
మొక్కళంబున దీసి - మురియవైచుటయుఁ
బుట్టు చెండును బోలి - పుటముబ్బి యెగసి
కొట్టి నెత్తురులు గ్ర - క్కుచు మహిఁ బడఁగ
నాపాటుఁబడి దాన - వాగ్రణియుగ్ర
కోపుఁడై మార్తాండు - కొడుకుఁ గోనీక
పెడచేత వ్రేటున - పిడమిపై మఱలఁ
బడియు వానికిని లోఁ - బడక పయ్యాడి
లాఁగించి ఘడవైవ - లంకేశుఁడంత
వేగిరంబున కపి - వీరునిఁ బట్టి
మోచేతఁ బొడిచిన - మూలుగుచు లేవఁ 3510
జూచుచో మరల ర - క్షో నాయకుండు
పైఁబడి యదిమిన - భానునందనుఁడు
లోఁబడ కెదనుఝు - ల్లున నెత్తురొలుకఁ
బిడుగుతో సరియైన - పిడికిటఁ గొట్టి
పొడిచిన తాఁ దేలి - పోక రావణుఁడు
చొరవకుఁ జొచ్చి వి - జ్జోడు గానీక
పిఱిఁదికిఁ ద్రోయుచుఁ - కౌనఁగ భానుజుఁడు
మెడసందు వేసుక - మిడుగుడు వడఁగ
విడిపించుకొననీక - విక్రమించుటయుఁ
జెయిఁద్రెంచి వానర - శ్రేష్ఠునిఁ బట్టి 3520
పయికొనుటయు దైత్య - పతియును దాను
గండభేరుండయు - మురీతి భయద

శుండాలములమేర - చుట్టును బెనఁగి
మేపాశఁ బిల్లులు - మిగుల గోరాడు
వైపున ధరణిపై - వ్రాలి లేచుచును
గరములు కరములు - కాళ్లును గాళ్లు
శిరమును శిరము నం - చితలీలఁ బెనచి
సరిగాఁగ వ్రాలుచు - సరిగాఁగ మింట
దిరుగుచు సరిగాఁగ - ద్రెళ్లి లేచుచును 3530
ద్రోచి పోరాక నె - త్తురులు పైనిండ
పూఁచిన కింశుక - భూజంబులనఁగ
నిరువురు సరివోరి - యిలమీఁద వ్రాలి
యరగడసేపు మూ - ర్ఛాయత్తులగుచు
నుండి యంతటఁ దెల్వి - నొంది రావణుఁడు
మెండొడ్డి యితని నే - మిటఁ గెల్వరాదు
మాయ కయ్యముఁ జేసి - మాయింతు నని యు
పాయంబుఁ జింతించు - భావంబెఱింగి

—: సుగ్రీవుఁడు, రావణుఁడు మాయోపాయముచే జయించు నని యెఱిఁగి రాముని వద్దకు వచ్చుట :—

మొగిరి పై వ్రాలునో - యితఁడంచు భీతి
మొగమెత్తి చూడంగ - మోసంబుఁ జేసి 3540
పోయెఁ బోయె ననంగఁ - బుడమికి డిగ్గి
చేయిదోయి మొగిడ్చి - చెంతకుఁ జేర
శ్రీరాముఁ డతని మె - చ్చి కవుంగలించె!
వీరవానరకోటి - వినుతించె నపుడు!

చెంతఁ జేరఁగఁ దీసి - శ్రీరాముఁ డధిక
సంతోషమున కపి - స్వామి కిట్లనియె.

—: శ్రీరాముఁడు సుగ్రీవునితోఁ దానొక్కఁడే రావణునిపైకిఁ బోఁగూడదని హితోపదేశము చేయుట :—

" ఓయి ! సుగ్రీవ మా - కొకమాట యెఱుక
సేయక నేపని - సేయఁ బోవుదురె ?
కొంచగాఁడవొ ? కపి - కోటుల నిట్లు
వంచించు నీవు రా - వణుఁ జెనకుదురె ? 3550
అతఁడు త్రిలోక భ - యంకరుఁ డమర
శతములఁ గెల్చిన - సాహసాధిపుఁడు
మనమందఱముఁ గూడి - మార్కొన్న నతని
నని గెల్తుమని నిశ్చ - యము లేని చోట
పోవచ్చునే ప్రాణ - ములు లేని బొంది
కై వడి నుంటి మి - క్కని నిన్నుఁ బాసి
నీకు నచ్చట నొక్క - నెగులయ్యె నేని
మాకేల యీసీత ? - మఱి యున్న వేల ?
ఎందుకు లక్ష్మణుఁ - డెందుకు భరతుఁ
డెందుకు శత్రుఘ్నుఁ - డెందు కయోధ్య ? 3560
అటులైన నానిశ్చ - యము వినుమాత్మ
దిటముగా నెంచిన - తెఱఁగుఁ బల్కెదను
రావణు పుత్రపౌ - త్రకళత్ర యుతము
గావధియించి లం - కా పట్టణంబు
నీవిభీషణునకు - నిచ్చి జానకిని
మావారితోఁ గూర్చి - మన్ననతోడ

భరతు సహోదర్యుకుఁ - బట్టంబుఁ గట్టి
శరచాపములు బొక్కి - సములోనవైచి
ప్రాయోపవేశన - పరుఁడనై యచటఁ
గాయంబు విడనాడఁ - గడకట్టినాఁడ ! 3570
చేరితి వేమెల్ల - సేయు పుణ్యమునఁ
బోరాడ నీవొంటిఁ - బోఁదగునయ్య ? ”
అనుడు గద్గదకంఠుఁ - డగుచు బాష్పములు
జనుక శ్రీరాముఁ జూ - చి కపీంద్రుఁడనియె.
“ సదయాత్మ ! రాణివా - సద్రోహిఁ బంక్తి
వదను నేఁ బాపప్ర - వర్తుని నధము
నెదురెదురునఁ జూచి - యేక్రియ నోర్తుఁ ?
గదిసి చంపఁగ శక్తి - కలిగిన యేను
వానికి లోనగు - వాఁడనే యిట్టు
లానతిత్తురె మీర ” - లని విన్నవించుఁ 3580
గపినాథు మాటలా - కర్ణించి రాముఁ
డపుడు సౌమిత్రిఁ గ - టాక్షించి పలికె.

—: శ్రీరాముఁడు లంకపైకి యుద్ధమునకుఁ బోపుట కుపక్రమించుట :—

“ కావించితిమి సేన - గారుడవ్యూహ
మేవేళ లంకపై - నిలయెల్ల నిండి
యాక్రమించితి మీవ - నాంతముల్ మనము
విక్రమించుటకిది - వేళ యెట్లనినఁ
గపులు రాక్షసులు సం - గ్రామరంగమున
నిపుడు గూలుదురన్న - యెన్నిక వొడమె

చదలెల్ల నిండె ప్ర - చండవాయువులు
కదలెడు కొండలు - కంపించె ధరణి 3590
భానుమండల ర_క్త - పరివేషజనిత
మై నిండె కాలాన - లార్చిర్గణంబు
మృగములెల్లడ విప - రీతస్వరముల
గగనంబుఁ జూచుచు - గడల వాచఱచె
మనుజాశనుల మూడ్కి - మబ్బులు మింటఁ
బెనుధారలుగ ర_క్త - బృందంబుఁ గురిసె
తారకా తేజముల్ - తఱిగెను సంధ్య
గారాని రుచి దోఁచ - కప్పెఁగావిరులు
కంటివే నేఁడెంత - కయ్యమందెడినొ !
వింటి వేడుకఁ దీర్ప - వేళ చేకూడె 3600
నయినట్టులయ్యె ర - మ్మ''ని సువేలాద్రి

—: వానరసైన్యములు లంకయందు దిగుట - వానర సేనా నాయకులు నాలుగు దిక్కులను తమస్థానములలో సెలవుకొనుట :—

పయినుండి వానర - ప్రముఖులతోడ
నవనికి డిగి లంక - కభిముఖుఁ డగుచు
రవివంశమణియైన - రాముఁడు నడువ
సెలవంది వెంటనే - సింహనాదములు
కిలకిలార్భటులు ది - గ్వ్యధుల నిండ
జలజాప్తసుత వాయు - జ సుషేణతార
నలనీలకుముదమైం - దద్వివిదాది

వనచరుల్ తమతమ - వారలతోడ
దనుజులు వీటిపై - దాడివెట్టినను 3610
వరుణపాలితమైన - వారిధి యనఁగ
సురవైరి విభుని తే - జోవైభవమున
నున్న లంకాపురి - యుత్తరద్వార
మన్నదమ్ములు చేరి - యన్యు లిచ్చోట
నిలిచిరా రావణు - ని యజేయమైన
బలముచే సేకరిం - పఁగ తేరటంచు
నెక్కువెట్టిన విండ్లు - నేర్చిన గరుడి
తెక్కుతూపులు నమ - ర్చిన విహంగములు
సవరించి యింతయు - జతనమై కోట
నవరణల్ గనుచు న - చ్చట వసియింపఁ 3620
దూరుపు గవని హ - త్తుకొని నీలుండు
వీరుఁడై మైందద్వి - విదులతోఁ గూడి
దక్షిణంబున నంగ - దకుమారకుండు
లక్షకోటుల కోఁతు - లను గూడి యుండ
దర్పించి పశ్చిమ - ద్వారంబునందు
నార్పులచేత బ్ర - హ్మాండంబు వగుల
హనుమంతుఁడు వసింప - నర్క నందనుఁడు
పనసగవాక్షజాం - బవ దాదులైన
దొరలతోడున చక్కి - దూటుచుగాఁ డగుదు
పరివారమును దాను - బలుసుక యుండె. 3630
రామానుమతి సుమి - త్రాకుమారకుఁడు
చేమోడ్చి కడల ని - ల్చిన మహాకపులు
వాకిట వాకిట - వసియించు దొరల

జోకగా బహుకపి - స్తోమంబు నేర్చి
పదియు నిర్వదియు నేఁ - బదియొకనూఱు
పదినూళ్లు లక్షని - ర్వదివేలుగోటి
గజముల సత్తువఁ - గలవారి దిశల
గజముల లావునుఁ - గలవారి నునిచి
నాలుగోటులు కపీం - ద్రావళి నట్టి
వారల రవిజు క్రే - వలనుండఁ జేసి 3640
యెచ్చరించిన కపు - లెలగోలు జగడ
మిచ్చిన దానవు - లెదిరింపలేక
చీకాకుగా విగ్గి - చెడిపారి కోట
వాకిళ్లు వేసుక - వడఁకుచు నుండ
నప్పుడు రఘువీరుఁ - డవనీశనీతిఁ
దప్పరాదని వాలి - తనయునిఁ బిలిచి

—: శ్రీరాముఁ డంగదుని రావణునియొద్దకు రాయబారిగాఁ బంపుట :—

"రమ్ము తారాకుమా - రక ! నిర్భయమునఁ
బొమ్ము లంకకు నీవు - పోయి రావణుని
యెదురుకట్టున నిల్చి - యేమన్నయట్ల
వదలక యతనితో - వాకొను మచట 3650
వారిజగర్భుని - వరములఁ గ్రొవ్వి
యీరేడు జగముల - నెదురెందు లేక
మునులపై దివిజన - మూహంబు మీఁదఁ
గినిసి ధారుణికెల్లఁ - గీడాచరించి
యందందుఁ గట్టుకొ - న్నట్టి పాపములు

పొందంగ దరివచ్చె - పొమ్ము సీకనుము
ఏ బలంబున సీత - నెత్తుకవచ్చి
తాబలంబున నిల్చి - యని సేయుమనుము
జనకజకై మేను - సగముగా నవిసి
వనులనాపద నొంది - వచ్చిన యేను 3660
మననిత్తునే ? నిన్ను - మారటభాను
తనయుని రీతి ను - త్తరపు వాకిటను
పిలిచితి కలనిలో - నినుఁ బుణ్యలోక
ములకు నొక్కనిమేష - మునఁ బంపఁ దలఁచి
యెగసి ఱెక్కలుదాల్చి - యినమండలంబు
తెగి చొరఁ బారిన - తెగటార్తు ననుము.
పుడమి యరాక్షసం - బుగఁజేయ శరముఁ
దొడుగక మునుపె చే - తులు మొగిడించి
వై దేహిఁ దోకొని - వచ్చితవేని
నీదు ప్రాణంబులు - నిలుచు నప్పటికి 3670
నంతియె కాని లం - కాధిపత్యంబుఁ
జింతఁ జేసిన నిన్నుఁ - జేరదెన్నటికి !
సైఁదోడు మా విభీ - షణుఁ డున్నవాఁడు
నీదు రాజ్యంబు వా - నికిఁ జేరెననుము
పాపాత్ముఁడవని యె - ప్పటికేల యేలు
నీ పుణ్యఫలమెల్ల - నీఁగెఁ [illegible]నుము
పోయి రమ్మ"న రయం - [illegible] మింటికెగసి
కాయుగా రావణా - స్థాని[illegible] పిలిచి
జ్వాలియించు వహ్నియో - జన మంత్రులెల్లఁ
గొలువ సింహాసనా - గ్రమధికా[illegible] 3680

ఫలకంబుపై నున్న - పంక్తికంధరునిఁ
జులకగాఁగని వాలి - సూనుఁ డిట్లనియె.

—: అంగదరాయబారము :—

" ఓరోరి ! రావణ ! - యుత్తుంగభంగ
ఘోరనక్రవ్రాత - ఘూర్ణితాంభోధిఁ
గట్టించు కోసల - కన్యకాసుతుని
పట్టంపు బంట నా - పలుకాదరింపు
మంగదుఁడనువాఁడ - నగచరవంశ
పుంగవుఁడగువాలి - పుత్రుఁడ నిటకుఁ
బనిచె నాస్వామి కో - పము మాని నీవు
జనకజ శ్రీరాము - చంద్రున కిచ్చి 3690
మనుము నాబుద్ధిచే - మారాడితేని
వనజగర్భుఁ డొసంగు - వరముల కేమి
యనియెల్ల నడ్డమే - యసమాన విలయ
పవమానసఖశిఖా - పటలప్రతాప
రామదివ్యాస్త్రప - రంపరాసార
సామగ్రికేల మో - సము నొంద నీకుఁ ?
జేరవచ్చునె యెది - ర్చి నిమేషమైన ?
పారిపో నిచ్చునో - బవరంబులోన ?
నరికట్టఁ దరమౌనొ - యజహరాదులకు ?
మఱుఁగుఁ జొచ్చెద నన - మఱివేఱె కలదొ ! 3700
బలవదీయసమాన - వైరంబు కులము
నిలుపుకొమ్మల మే - నికి నెగ్గుఁ దలఁప ?
నీపట్టణముకు నై - నిలిపి నాస్వామిఁ

చేపట్టి శరణు జొ - చ్చిన విభీషణుని !
నిచ్చెదవే సీత - నీనంటివేని
యిచ్చోట నినుఁజూచి - యేనేల పోదు ?
తగునట్టియాజ్ఞ యిం - దఱితోడ నిన్నుఁ
బగఁదీఱఁ జంపి కో - పముఁ దేర్చిగాక !
అనినఁ గోపించి ద - శాననుఁడాత్మ

—: అంగదుని శిక్షించుటకు రావణుఁడు నలువురు రాక్షసుల నంపుట :—

గినిసి నల్వుర కాల - కింకరోపముల 3710
రక్కసులను బిల్చి - "గ్రక్కున వీని
నుక్కణఁగింపుఁడు - యూరెల్ల ద్రిప్పి
కట్టి కొట్టుఁడటన్న - గదిసి నల్వురనుఁ

—: అంగదుఁడు వారలను జంపుటయేగాక రావణప్రాసాద శిఖరమును భగ్నము సేయుట :—

బట్టఁ జేరినవారిఁ - బట్టి రాఁదిగిచి
సంకసందులవైచి - సడలిపోనీక
యుంకించి యూర్చుచు - నుప్పరం బెగసి
చదలుపై నిలుచుండి - సందిళ్లు వదల
చదిసి రావణు సము - ఖమున దానవులు
నలువురు బడిరి ప్రా - ణంబులు విడిచి.
బలవంతుఁడా వాలి - పట్టి గోపించి 3720
పదఘాతమున వాని - ప్రాసాదశిఖర
మదలించి తాచిన - నది వజ్రహాలిని

హిమశైలకూట మి - ట్లిల గూలునట్లు
తుమురుగా రాలిన - దుర్వారుఁడగుచు
నావాలి సుతుఁడేఁగ - నదియెల్లఁ జూచి
రావణాసురుఁడు తీ - ఱని చింతతోడఁ
దనచావు దశరథా - త్మజుని జయంబు
మనసులో నిజముగా - మతియింపుచుండె.

—: అంగదుఁడు శ్రీరామునివద్దకు వచ్చుట - సుషేణుఁడు వానరులను యుద్ధమునకుఁ బురికొల్పుట :—

అంగదుఁడారాము - నడుగుల వ్రాలి
మంగళాశీర్నుతుల్ - మన్ననలంది 8730
కపులచే పొగడికల్ - గని చెలరేఁగు
నపుడు సుషేణుఁడా - హావదోహలమునఁ
గోటచుట్టును చుట్టు - కొని పేర్చు వెరగు
మీటి వానరుల న - మ్మోయి నెచ్చరించి
మొనవోయి లగ్గల - కెక్కిన దైత్యు
లసముడింపక పట - హములు వ్రేయించి
యెచ్చరిల్లెదు వారు - నెదిరించి యనికి
వచ్చువారును పర - వశులైన వారు
పరువెత్తు వారును - పంతంబులాడి
హరివీరవరులచే - హతులైనవారు 8740
నగుచుండ నీవార్త - లాలించి కినుక
నుగమున వ్రేల రా - ముని వానరులను
పురమెల్ల చుట్టుక - పోరాడు తెఱఁగుఁ
బరికింపఁ దలఁచి యు - ప్పరిగపై నెక్కి

కపుల పెక్కువయు రా - ఘవుల యగ్గలిక
విపరీతములు తన - వీట గల్గుటయు
దశకంధరుఁడు చూచు - తరి గోటమీఁద
దశరథసూనుండు - దశముపై గొలిపి
"అక్కట! సీత యే - మయ్యెనో యట్టి
కక్కసంబున వీని - కావలిందగిలి 3750
యెటుల నున్నదియొ యే - మిటు వచ్చుటెఱిఁగి
కిటుకులు వీఁడు మి - క్కిలి నేర్చునొక్కొ!"
అని తలంపుచు నిట్టి - యాలోచనముల
పనియేమి యైనట్టి - పనిఁ బూనవలయు
నడువుఁ డన్నను కపి - నాయకులెల్లఁ

—: శ్రీరాముఁడు వానరసైన్యమును లంకపైఁ
గదనముసేయఁ బురికొల్పుట :—

బుడమి చలింప నా - ర్పులు నింగి ముట్ట
తరులును గిరులును - తాలిచి మిడుత
పరివోలి యగడిత - పరిపాటి బూడ్చి
కోటమీఁదికి నెక్కి - కొత్తళంబులిచి
పాటనం బొనరించి - పరిఘముల్ గూల్చి 3760
వాకిళ్లు హత్తికా - వలి రాక్షసులను
బోకుండ జంపి త - ల్పులుఁ బొడిసేసి
గోపురంబులు గూల్చి - కోటలు దొబ్బి
యేపు చూపిన లంక - యిట్టట్టుగాఁగ

కుముదుండు ప్రఘసుండు - కోటులసంఖ్య
తమవారితోడ ప్రా - గ్ద్వారంబుఁ జేరి
ముత్తిక చేసిన - మున్నాడి పనసుఁ
డొత్తరిగా కపి - వ్యూహంబుతోడ
శతవలియును దాను - శౌర్యగర్వములు
మితిమీఱఁగా లంక - మీఁదికి నడచి 3770
దక్షిణద్వారంబు - తమరాక్రమింప
నక్షీణబలశాలు - లరువదికోట్లు
కపులలో పడమటఁ - గలసి సుషేణుఁ
డపుడాక్రమించిన - యావనిజాప్రియుఁడు
సౌమిత్రుఁడును విభీ - షణుఁడు సుగ్రీవుఁ
డామున్ను ధూమ్రుఁడా - హావదక్షులగుచుఁ
దమతమవారితోఁ - దమచుట్టుఁగాచి
తమకించి యుత్తర - ద్వారంబు చేరఁ
గదిసియుండిన గజ - గవయగవాక్షు
లదరు లేకుండ సై - న్యముఁ బురికొల్పి 3780
యుందందు మెలగంగ - నంతయుఁజూచి
కొండలంబున దైత్య - కులవజ్రపాణి

—: రావణుఁడు తనబలములనుకూడ యుద్ధమునకుఁ బురికొల్పఁగా వానర రాక్షసులకు సంకుల యుద్ధమగుట :—

సెలవిచ్చుటయు భీమ - సింహనాదములు
విలసిల్లె భేరులు - వీథుల మొరయ
సాలికొక్కెరలతో - జలదముల్ వచ్చు

రీతి శంఖములు బూ - రించి దానవులు
పురికొల్ప శరధియు - ప్పొంగిన లీల
హరియోధులును రాక్ష - సావళి దాకి
లంకలో మిన్ను నే - లయు నేకమైన
పొంకంబుగా సరి - పోరుచు నాఁగి 3790
యిరువాగ కలెబడు - నెడ నేమి జెప్ప
దుర మింగలపువాన - దొరగినట్లుండె!
కోటకొమ్మలమీఁది - ఘోరనిశాట
సాటోపదివ్య శ - స్త్రాస్త్ర ఘాతములఁ
దనులతో గిరులతో - ధరణిపై ద్రెళ్ళి
హరులు మ్రగ్గిన జాడ - యచ్చెరువయ్యె
ఇలనుండి వానరు - లేసిన వృక్ష
ములుచేత కేతనం - బులు చామరములుఁ
బాడిపాడిగాసాల - మున నాశువరలఁ
బడదానవులు వడ్డ - పాటు చూచినను 3800
సరియె దేవాసుర - సమరంబు లట్లు
సరిపోరు నెడ ఘోర - సమరరంగముల
రక్తమేదోమాంస - రాసుల కపులు
నక్తంచరులు దేలి - నాలుగు దిశలఁ
పోరాడ జతకయ్య - ములు సమకట్ట

—: ఇరుపైపుల వానరరాక్షస నాయకులు ద్వంద్వ యుద్ధముచేయుట :—

దారుణగతి సంగ - దకుమారుతోడ
నింద్రజిత్తుఁడు జేసె - నెంతయు సమర

మింద్రాదులకు భీతి - మొదలఁ బైకొనఁగ
సంపాతితోడ ప్ర - జంఘుండు శౌర్య
సంపదఁ బోర నం - జనకుమారకుని 3810
హనుమంతు నెదిరించి - యా జంబుమాలి
పెను కయ్యమొనరింప - పృథివి చలింపఁ
దొడరి మిత్రఘ్నుని - తో విభీషణుఁడు
బెడిదంబుగాఁ జేసె - భీమసంగరము
పోరాడె తెగి సికుం - భునితోడ నీలుఁ
డారూఢబలుఁడా ప్ర - హస్తునితోడ
గినిసి మార్కొనియె సు - గ్రీవుండు దర్ప
మున నగ్నికేతుని - ముందటనాఁగి
యసమయుద్ధము విరూ - పాక్షుండు చేసె
నసముడింపక రాఘ - వాగ్రణి నెదిరి 3820
యడరించె దుర్ముఖుం - డమ్ములు నాల్గు
తొడిబడ రశ్మికే - తుఁడు శక్తివైచె
కదిసి మిత్రఘ్నుండు - గదప్రయోగించె
పొదిలిన యజ్ఞకో - పుఁడు శితాస్త్రముల
దుర్వారుఁడగుచు మైం - దుని వజ్రముష్టి
గర్వించి యెదిరె రా - ఘవుని కట్టెదుర
నరికట్టె ద్వివిదు న - య్యశని ప్రభుండు
విరసించె నలునితో - వీరప్రతపుండు
తొడరె విద్యున్మాలి - తో సుషేణుండు
కడమవారెల్ల నొ - క్కని కొక్కరుండు 3830
దాకొని ద్వంద్వయు - ద్ధము సేయదిశలు
చీకాకుపడ సృష్టి - చీకట్లు గ్రమ్మ

మెదడు రొంపియు శస్త్ర - మీనముల్ పుడమి
గుదిగొన కేశంపు - గుంపు బల్నాచు
చామర ఫేనముల్ - జతగూడఁ బాఱె
నామేర భయదర - క్తాంబు వాహినులు
గడఁద్రిప్పివైచి యం - గదుని నొప్పింపఁ
జెదరక యతఁడింద్ర - జిత్తునిమీఁద
యొక్కసాలమువైచి - యుర్వణంగించె
నక్కజంబగు వాని - హయరథాద్యములఁ 3840
గోపంబుతో ప్రజం - ఘుని శరత్రయిని
బాపురె యనఁగ సం - పాతిపై వేయఁ
గదిసి తోడనె యశ్వ - కర్ణభూజమునఁ
జదియించెను ప్రజంఘు - సంపాతి గెలిచె
ఆ జంబుమాలితా - హనుమంతు మీఁదఁ
దేజంబుతోడ నె - త్తిన చక్రహతిని
యురము నొప్పించిన - నొకకేల నతఁడు
చఱచి వాని సరాక్ష - సంబుగా గూల్చె.
తపనుండు నలునిమీఁ - ద నెదుర్ప నతఁడు
కుపితాత్ముఁడై వాని - గ్రుడ్లు పెకల్చె 3850
తొడరి పైకొని ప్రహ - స్తుని సప్తవర్ణ
మడరించి సుగ్రీవు - నదరంట నేసె
నలువుర దైత్యుల - నాల్గు దూపులను
తల లుత్తరించె సీ - తానాయకుండు
మొనసె మైందుఁడు వజ్ర - ముష్టిని ముష్టి
కినిసి వేసినఁ దల - క్రిందుగాఁ ద్రెళ్లె
ఘోరిలోపల నికుం - భుని సీలుఁడాగి

తేరు నాతని సార - థినినేలఁ గలిపె
పోనీక నళనిప్ర - భుని ద్వివిదుండు
చానేసె సాలవృ - క్షము పెకలించి 3860
కదియు విద్యున్మాలిఁ - గని సుషేణుండు
చదియవైచెను చేతి - శైలంబు చేత
నమరలం దఱిమిన - యమరుల మాడ్కి
బినపోక దనుజుల - పీచంబడంచె.
కపులుత్సహింపంగఁ - గాకుత్థ్స తిలకుఁ
డపు డెచ్చరింప ని - ట్లని సేయువేళ
కాకజంబుక గృధ్ర - కంకాదు లచట
నేకమై తృప్తిన - హించి నేకడలఁ
బుడమిఁద్రెళ్లు కబంధ - ములు మింటికెగసి
పడక యాడుచు నుండె - పక్షులరీతి 3870
పోవక నిలిచియె - ...కు ప్రొద్దుక్రుంగు
లావు చూపుదు మని - లంక రాక్షసులు
నడియానునుంబోర - నపరాహ్ణమైనఁ
బడమటి దిశ గ్రుంకె - భాను మండలము
కదిసె చీకటులు చీ - కటులు వెంబడిని
కదిమి నల్లడ కోట - గవనులు వెడలి
కపులపైఁ బడిరి రా - క్షసు లీశకంఠ
విపులహాలాహల - వీచుల లనంగ
చీకటి జగడంబు - సేయ.........
............దై - తేయుల చేత 3880
చాల నొచ్చియు తెంపు - సడలక తరులు
శైలంబులును బూని - జగడించు నపుడు

పొడువుము పొడువుము - పోకుము పోకు
మడువుము తలఁద్రుంపు - మరికట్ట నిల్పి
ద్రేయుము ద్రింగుము - వెంటాడు మడువు
మేయుము విదలింపు - మెదిరింపు మనెదు
భయదవిలయకాల - ఘనుతులు దైత్య
చయము మెలంగెడు - చాయలెఱింగి
యోధారి నెదురెక్కి - యద్రులు దరులఁ
జేఁదప్పనీక ద్రే - సిన సంగరమునఁ 3890
బొడియయ్యె రథములు - పొరలె నేనుఁగులు
మడిసె తురంగముల్ - మ్రగ్గ కాల్బలము
విరిసె ఖేటకములు - విఱిగె టెక్కెములఁ
దురుమయ్యె కవచముల్ - తునిసె చాపములు
నురుమయ్యె నమ్ములు - నుసియయ్యె పొదులఁ
దఱుచయ్యె మొండెముల్ - తరిగె బీరములు
కలసి నెత్తురునదుల్ - కండలునిండె
చెలరేఁగె భూతముల్ - చెడిపాఱె మూఁక
లావేళ సురవైరు - లార్వురు సమర
కోవిదు లెదురేచి -కోతులం దఱిమి 3900
మేమరువులయందు - మిఱుమిట్లుఁ గొలిపి
హేమరత్నప్రభ - లెసఁగె శైలములు
నోషధిలతలచే - నొప్పెడు రీతి
భీషణాకారులై - పెరిగి పైరాఁగ
నావెలుంగులచేత - నగచరు లెఱిఁగి
చావులకును దప్పి - జడిసి పాఱుటయు
నాఱమ్ములను రాముఁ - డార్వురి తలలు

ధారుణిఁ బడవైచి - తనవారిఁ గాచె
నంతట వానరు - లంత కాకృతులు
పంతంబుతో దైత్య - బలములం దఱుమ 3910
దనుజయోధులెదిర్చి - తలపడిపోరఁ
బెను గయ్యమపుడయ్యె - బెగడె లోకములు
చెట్టులుం గట్టులు - చేతులం బూని
పట్టినట్లన కపి - ప్రముఖులు ప్రగ్గఁ
గరములం బట్టిన - కరవాల ముసల
పరిఘాదులను దైత్య - బలమెల్ల జదియఁ
బడుగుఁ బేకయునుగాఁ - బడి యిరువాగు
మడియునప్పుడు మహీ - మండలంబొప్పె
ఆశ్రిత పూజాస - మర్పిత ప్రసవ
మిశ్రయావాహిని - మించినమాడ్కి 3920
న త్తరి రామసా - యక పరంపరలు
చి త్తజల్లుగ ముంప - చెదరి రాక్షసులు
తెమలఁ బారినచో నె - దిర్చి దర్పమున
యమశత్రుఁడనఁగ మ - హాపార్శ్వుఁ డనఁగ
సారణవజ్రదం - ష్ట్రి శుకప్రమాథి
దారుణభుజ మహో - దర మహాకాయ
యూపాక్షులనఁగ న - త్యుద్ధతి రఁశిత
చాపులై తూపులు - సంధించి మించి
కపులఁ ద్రోలుచును రా - ఘవుఁడేఁడి వెండి
యిపుడె చంపుదమని - యెదిరించిరాఁగ 3930
ఘనదివ్యబాణలా - ఘవుఁడు రాఘవుఁడు
కనుగొన విలుగుణ - క్వాణనంబుఁ జేసి

యులుగులు మంటల - సంధకారంబుఁ
దొలఁగించి క్రొవ్వాఁడి - తూపులు దొడిగి
యున్నింట నందటి - నదరంట నేయ
వెన్నిచ్చి కోఁతులు - వెంటాడి తఱుమఁ
బాఱిరి విఱిఁగిరి - పరువెత్తి రనుచుఁ
గేలి రాలను రువ్వఁ - గేడించుటయును
కపులచే తమవారు - గాటిలం జూచి

—: సంకుల యుద్ధములో రాక్షసు లోడిపోవుటఁజూచి ఇంద్రజిత్తు శ్రీరామునిపైకి యుద్ధమునకు వెడలి నాగాస్త్రముఁ బ్రయోగించుట :—

అపు డింద్రజిత్తు భ - యంకరాకృతిని 3940
నట్టహాసము త్రికూ - టాద్రికందరపు
బట్టుల బట్టీక - బదులు మ్రోయింప
నంగదచే తన - యురదంబు వోవ
నింగికి నెగసి కం - టిని కంటిననుచుఁ
బిడుగుల కెనయైన - భీకరాస్త్రములు
పెడతలనుంగాడి - పిఱుఁదల వెడల
వానరప్రభుల నొ - వ్వఁగనేసి మబ్బు
లోన మైడాచి యా - లోచన నేసి
దాను నాగాస్త్ర సం - ధానంబు చేతఁ
గాని రాఘవుల నొ - క్కట గెల్వరాదు 3950
తొడిగెద ననువేళ - తోయదసరణి
నెడగాఁగ వసియించి - యింద్రాది సురలు
నిక్కి గన్గొనుచు వా - ని నెఱుంగ నీక

"యక్కట నేడు ద్రో - హాపు చింతఁ దలఁచె
నందుచే రఘువీరు - లభయులై యార్తి
నొందకుందురుగాక - నొక కీడు లేక
జయమొందుదురుగాక - సమరోర్వి" ననుచు
జయపూర్వక స్తుతుల్ - సలుపుచు నుండ
బ్రహ్మాదు లదరంగ - బలువింటఁ దొడిగి
జిహ్మగా జిహ్మగ - శ్రేణి నేయుటయు 3960
నవి వచ్చి వేత్ర్వర - యన్నదమ్ములును
జవసత్త్వములు మాయ - సడలంక నీక
సంధుల బిగియించి - చాల నొప్పించి
బంధించి వసుమతిఁ - బడవైచు నపుడు
చైతన్యకళమాసి - సమరంబు మఱచి
చేతియమ్ములు విల్లు - క్షితిఁ బడవైచి
యిరువురు బడియుండు - నెడ జాపునకును
సరియైన మూర్ఛచే - జనకజాప్రియుఁడు
గాజువాఱఁగ మేను - కన్నులు మూసి
తేజంబుమాసి యం - తే నూర్పు వెడలి 3970
యున్నెడ సౌమిత్రి - యును వాయుసుతుఁడు
విన్నబాటుల చాల- విలపింపుచుండె.

—: ఇంద్రజిత్తు శ్రీరాముని నాగాస్త్రముచే మూర్ఛితునిఁజేసి వానరసైన్యము నట్టహాసముతోఁ దాఁకి లంకకుమఱలుట :—

పనసనుషేణ సం - పాతిమైందాది
వనచరుల్ పదువు ర - వార్య రోషముల
గిరితరు సాధనాం - కితకరులగుచు

సురశక్తి నభమున - కోకయింత నెగిసి
యట్టహాసము జ్వాల - తారావ మెచటఁ
బుట్టె నచ్చటికి గుం - పుగ నెదురెక్క
దానవరాజనంద - నుఁడు నిశాత
నానావిధాస్త్ర స - న్నాహంబుచేత 3980
మొగములు వగుల నె - మ్ములు నొగులంగఁ
బగిలి పాఱఁగ ధాత్రి - పైఁ బడనేసి
యాయింద్రజిత్తు వీ - రాట్టహాసంబు
సేయుచు నెగ్గించి - శ్రీరాముఁ బలికె
"అని యేల మీకు రా - జాధములార!
నను మార్కొనఁగ లేఁడు - నాకేశుఁడైన
నింద్రునిఁ జెఱసాల - నిడిన యజేయుఁ
డింద్రజిత్తను మాట - నెఱుఁగరే మీరు
దైవంబు పెడతేప - దశకంఠుఁ జెనకి
యీవానరులు గూడి - యిటకు జేరితిరి. 3990
చేఁజేత ననుభవిం - చితిరి తత్ఫలము
మీ జనకజ యిఁక - మీఁద నెట్లగునె
యేల వచ్చితిరని - యెకసక్కెమాడి
వోలవేయుదు శర - వ్యూహంబు చేతఁ
దనువులు జర్ఝరి - తములుగాఁ జేసి
పెనురక్తధారలు - పృథివీధరముల
బిలముల ఝురములు - బ్బ్రసవించులీల
వెలువడి ప్రవహింప - విబుధులు బెదర
నున్నట్టిచోఁ గపి - యోధులు ధరణిఁ
దన్నుఱుంగక వ్రాలు - దశరథాత్మజునిఁ 4000

గనుఁగొని బ్రతకడ - కా నిశ్చయించి
తనువెఱింగిన సుమి - త్రాపుత్త్రుఁగూడి
వగచునప్పుడు దైత్య - వరు సహోదరుఁడు
పగవాని తెఱఁగాత్మ - భావించి చూచి
కటకట! సకలలో - కములొక్కటైన
నెటువలె నెదురింతు - రిటువంటి వాని
మించె గార్యంబని - మిగిలిన నాలు
గంచుల నున్న మ - హా వానరులను
నంగద జాంబవ - దాదులం గూర్చి
యంగదుతో రాఘు - వాగ్రణి కడకు 4010
మెల్ల మెల్లన వచ్చి - మేదిని మీఁద
విల్లునమ్ములు కడ - వేసినవారి
యినవంశమణుల న - హీన సాహసుల
ననఘుల వీరశ - య్యాశయానులను
బుసకొట్ట పన్నగం - బుల బోలియూర్పు
లెసగెడు వారి స - హిష్ణు మూర్తులను
బరమపుణ్యుల నాగ - పాశ సంవృతుల
శరణాగతత్రాణ - సద్ధర్మపరుల
రామసౌమిత్రుల - రవికుమారకుఁడు
తామున్నుగాఁబిఱుం - దన వచ్చిచేర 4020
వీరెల్ల వినుచుండ - వివిధారులుబ్బఁ
జేర రండన యింద్ర - జిత్తుఁ డిట్లనియె
"ఈ రాముఁడాజి న - నేక రాక్షసుల
నారాచముల ద్రుంచి - నాఁడను వార్త
నెపముగా నాహార - నిద్రలు మానె

నిపుడు మజ్జనకుఁడ - య్యైన కులోత్తమునిఁ
బడనేసితిని తండ్రి - పగఁ దీర్చనట్టి
కొడుకేల యని నిరం - కుశ విక్రమమున
సీరాజులనుఁగాంచి - యేనేయునాగ
ఘోర పాశములూఁడ్వఁ - గుంభినిమీఁద 4030
నజహారాదులకైన - నలవియే సమర
విజయంబు గైకొని - విమత శౌర్యంబు
శరదంబు దంబుల - చ్ఛాయ వ్యర్థముగఁ
బరిభవించితి తండ్రి - పాలికేఁగెదను.
ఎచ్చరించెద వీరి - నిపుడని వాఁడి
చిచ్చఱమ్ములు గొన్ని - శింజినిఁ గూర్చి
శరభు నేనిట నాఱు - శరముల రిషభు
హారఁ దొమ్మిదింట గ - వాక్షుని మూఁట
వాలిసూనుని జాంబ - వంతు నాఱింట
గాలిపట్టిఁబదింట - గవయు నేడింట 4040
గంధమాదను రెంట - గజుని పదింట
మైందు మూఁటను తారు - మార్గణత్రయిని
రవిసూను నేడింట - రావణానుజునిఁ
గవతూపులను నీలుఁ - గాండాష్టకమున
నలునాఱిటను జిక్కె - న ప్లవంగ వరుల
వలుద తూపుల నేల - వ్రాలంగ నేసి
యురవడించిన దైత్యు - లోహో! విలాస
భరితులై యసురేంద్రు - పట్టినిఁ బొగడఁ
గ్రమ్మరి తాను లం - కాపురంబునకుఁ
దుమ్ముగా నింద్రజి - త్తుఁడు ప్రవేశించె. 4050

భానుసూను రఘుప్ర - వరులనుఁ జూచి
దీనుఁడై యెంతయు - దిగులుచేఁ బొదల
నాలీల గడవారు - నడలంగ చింతఁ
జాలింపుఁడని విభీ - షణుఁ డిట్టులనియె.

—: విభీషణుఁడు సుగ్రీవునికిఁ గర్తవ్యము బోధించి శ్రీరాముని సేదఁ దేర్పుమని చెప్పుట :—

" ఆపదల్ వచ్చిన - యపు డోర్పువలయుఁ
గాపురంబులు సేయఁ - గలవె యాపదలు.
ఈ రాఘవుల కెందు - నేమి కొఱంత ?
వీరికై మన కేల - విలపింప నింత ?
ధైర్యశాలుల కసా - ధ్యము లెందు లేదు
కార్యవేళల నిట్లు - కను చెదరుదురె ? 4060
అవనిపై ధార్మికు - లగువారి కెందు
నవమాన మపజయం - బది యేల కలుగు?
కీశేశ ! యందఱి - కినిఁ దెల్పి తెచ్చి
దాశరథులను సే - దలుఁ దేర్పు మీవు
మరణ ఖేదములకు - మర్యాదగలదె ?
సరియువి దేహా నా - శనములో కతన
బ్రదికింపు మీ రఘు - పతిని కార్యంబు
వదలక మిమువంటి - వారిఁ జేపట్టి
కాకుత్థ్సతిలకులఁ - గడ తేర్ప నీతి
గాక యేమరుదురె ? - కపిరాజవీవు 4070
చూడుమీ శ్రీరాము - సుందరాస్యమున
వీడినయదిగాదు - విమలతేజంబు

చెదరిన మూఁకలఁ - జెదరగాఁ దిగిచి
బెదరు దీర్పుము రణ - భేరి వేయించి
వీరలీలోఁ గను - విచ్చి చూచినను
దీటును మనల యా - ర్తి సుఖంబుఁగల్గు
వంపు దింపులకు నీ - వానరుల్ రాక
గుంపు గుంపుగ గు - గుజల బోయెదరు
పొంగెల్లఁ జెడి బేలు - పోయెను మూఁక
చెంగి పాఱిన మఱి - చేకూర్పరాదు. 4080
ఇంతలో నొకకూఁత - లెగసిన నెల్లు
చింతసేసిన మరి - సెలకట్టఁబోదు.
వెఱుఁగు చూపెను మన - వేలంబు దనుజు
లెఱిఁగి రేనియు నిర్వ - హించుకోసిరు
భారకుండగు నీవు - ప్రజల చేకూర్చి
యీరాముఁ బోషింపు - మొడ్డైన చోటు
వాడిన పూవులా - వలవై చురీతి
పీడఁ జేయుము కపి - వీరులభయము ”
అనుచు సుగ్రీవుతో - నా ప్తధర్మంబుఁ
గనిపించి పలుకుచుఁ - గలసియున్నంత 4090

—: రావణునితో నింద్రజిత్తు తన పరాక్రమముచేత శ్రీరాముని మూర్ఛనొందించి వానర సైన్యమును కలఁతపఱచిన విధమును తెలియఁబఱచుట :—

నాయింద్ర జిత్తుండు - నసు రేంద్రుఁ జేరఁ
బోయి సాఁగిలిమ్రొక్కి - భుజములు వొంగ
“ దేవ ! రాఘవుఁ జంపి - తిని లక్ష్మణుండు

చావువాఁడయ్యె నా - శరములచేతఁ
గపులెల్ల బడిరి సం - గ్రామంబులోనఁ
దపియింపుచును నీ ప్ర - తాపంబుచేత ''
ననిన దిగ్గున లేచి - యాత్మనందనునిఁ
దన మనసార నెం - తయు కౌఁగలించి
''జగడ మెట్లయ్యె రా - జన్యులకెట్లు
తెగటార్చితివి ? తాన - దిక్కయి వచ్చె 4100
సుగ్రీవుఁడేమయ్యె ? - శూరులు వాన
రాగ్రణు లేరీతి- నణఁగి రందఱును ?
తేట తెల్లంబుగాఁ - దెలుపు మింకొక్క
మాటు నాలోని యు - మ్మలికంబుఁ దీఱ ''
అన నింద్రజిత్తుఁ డా - యసురేంద్రుఁ జూచి
వినయపూర్వకముగా - వెండియుఁ బలికె.
'' నాశరంబులచేత - నాశంబు నొంది
దాశరథు లని బం - ధనములఁ బొంది
పడియున్నవారు నీ - పాదంబులాన
నుడువుదు నేబొంకు - నోరాడి యేను 4110
గెలిచి వచ్చితి నన్ను - కీర్తించి కొడుకు
తలమూరుకొని బాష్ప - ధార దోఁపుచును
నోరు నిండార స - న్నుతి చేసి శుభవి
చారుఁడై తను పున - ర్జాతుగాఁ దలఁచి
కొడుకు మై నిమురుచుఁ - గోఁతులపాటు
లడుగుచు రావణుం - డటులున్నయంత.
శ్రీరాము చుట్టు వ - సించి రక్షించు
వీర వానరకోటి - వేలంబులోనఁ

దృణము చలింపదై - తేయులటంచు
గణుతించి ఝల్లనఁ - గలఁగఁ బాఱుచును 4120
బబ్బరింపుచు సేతు - పద్ధతి పట్టి
దొబ్బు దొబ్బులుఁగాఁగఁ - ద్రోచి ప్రోవుచును
దబ్బరయని దొరల్ - తము గానకుండ
నుబ్బు వుట్టిన మల్లి - జుణిఁగి చేరుచును
పోటరులై నగం - బులు చేతఁ బట్టి
దాఁటుచుదారు ముం - దఱ మెలంగుచును
నంగదనలనీల - హనుమంతులున్న
సంగడి నందఱు - జతఁగూడి యుండ
నాసమయంబున - నసురనాయకుఁడు
చేసి మన్నన లింద్ర - జిత్తునిం బనిచి 4130

—: సీతను రావణుఁడు రామలక్ష్మణులు మూర్ఛనొందిన స్థలమునకుఁ గొనిపొమ్మనుట :—

కామాంధుఁడై యశో - కవనంబుఁ గాచు
భామలం బిలిపించి - "పణఁతుకలార !
ఇన్నాళ్లు తమ రాముఁ - డిచటికి వచ్చి
నన్ను జయించి మా - నము గాచుననుచు
నడియాసచే సీత - యటు నిటు గాక
చెడియున్న యదియింద్ర - జిత్తుని చేతఁ
దమవారు పెనుఁబాప - త్రాళ్ళచేఁ దగిలి
యనిఁ బడి యున్నవా - రది మీఁదుపోయి
జనకజ కెఱిఁగించి - సరగ పుష్పకముఁ
గొనిపోయి యందుపైఁ - గోమలి నుంచి 4140

యంతయుఁ జూపి రం - డని త్రిజటాది
కాంతలతోఁ బల్కఁ - గ్రక్కున వారు
వైదేహితోడ నీ - వార్త యేర్పఱచి
యాదేవి మణి పుష్ప - కారూఢఁ జేసి
కలని చాయకు వచ్చి - కనుపట్టువోట
నిలిచి సీతకు రాము - ని తెఱంగుఁ జూప
నావేళ లంకలో - నందఱు నెఱుఁగ
రావణాసురుఁడు తూ - ర్యములు మ్రోయించి
మొన భేరి యుందందు - మొనయించి విజయ
మనుచు లంకాపురి - నన్ని వీథులను 4150
గై సేయఁ బనుప రా - క్షసుల చెల్వంబు
గాసిచే కపులున్న - క్రమమెంచి సీత

—: సీత రామలక్ష్మణులను మృత్యులుగా భావించి శోకించుట :—

శరతల్పముల యాత్మ - సాహస క్రియల
మఱచి బాణాసన - మార్గణావళులు
తూణీర కవచముల్ - దొఱఁగి మేనులను
ప్రాణంబు లునికి యే - ర్పడనీక త్రెళ్లి
మహినున్న ప్రాణేశు - మఱఁదినిఁ జూచి
గ్రహము సోఁకినయట్లు - కళవళింపుచును
మృతి నొందినారని - మేదినీ తనయ
యతిశయ ఖేదలో - లాత్మయై పలికె 4160
"ఓయార్య పుత్రు లి - ట్లుందురే తన్ను
డాయలపాల్జేసి - తగవు పోనాడి

మహీసురల్ దీర్ఘ సు - మంగలి యనుచు
బహువిధంబుల నన్నుఁ - బలుకుదు రెపుడు
వర్ణిత గుణపుత్ర - వతియని చూచి
నిర్ణయింపుదురు గా - ని వచింపరిట్లు
వారెల్లరు నసత్య - వాదులై యెఱుఁగ
నేరక యావి నమ్మి - నిజమని యుందు
నాదు కన్యాలక్ష - ణంబులు చూచి
వైదేహి రమణుఁడ - ధ్వరములు సేయ 4170
దీక్షితురాలౌచు - దీనులఁ బ్రోచు
పక్షంబుతో నను - పలుకు లేమయ్యె ?
భాగ్యరేఖలు చూచి - పట్టాభిషిక్త
యోగ్య యీసీత ప్రి - యుండును దాను
కలిత సామ్రాజ్య సౌ - ఖ్యంబులఁ దేలి
విలసిల్లు ననుమాట - విఫలమై పోయె
వీరపత్నియనంగ - వినియుందుఁ గాని
వీఱిడి యిల్లాల - వినియున్కి లేదు
లక్షణంబులు విఫ - లతను వైధవ్య
లక్షణంబులకు నా - లయములై మించె 4180
జతఁగూడి సోగలౌ - సన్న వెంట్రుకల
నతినీలమగు వేణి - యందంబుఁ జూచి
ముడివాటు లేక మో - మున రేకవాఱి
యెడమిచ్చి కనుబొమ్మ - యిక్కువల్ చూచి
బెఱువులై నేకమై - పలుచనై రోమ
ఘటితంబు గాని జం - ఘాద్వయిఁ జూచి
చాలంగ మెఱుఁగెక్కి - సన్నమై కదిసి

ధాళధళ్యము లీను - దంతాళిఁ జూచి
కదిసి క్రొమ్మొగ్గలతోఁ - గవకూడి పొదలు
కొదమ చన్నుల మెఱుం - గులు తేరిచూచి 4190
కాసారమును బోలి - గంభీరమగుచు
భాసిల్లు నాభి సౌ - భాగ్యంబుఁ జూచి
గిటగిటనై పిడి - కిటికి లోనగుచు
దిటలేని లేఁగౌనుఁ - దీవియుఁ జూచి
తళతళ వెలుఁగు కుం - దనపు ఱేకులను
దలపించు చెక్కుటద్దంబులు చూచి
తులిత సితాసిత - ద్యుతులతో నెనయుఁ
గలువఱేకులవంటి - కన్నులఁ జూచి
తిలకింపఁ బగడంపు - తీవెను బోలు
పలుచని యధర బిం - బము కెంపుఁ జూచి 4200
లలితమృణాళ వి - లాసంబులగుచు
విలసిల్లు బాహుల - విభవంబుఁ జూచి
చిగురాకులను గేరి - సింగార మగుచుఁ
బొగడొందు కెంగేలి - పొంకంబుఁ జూచి
యిలనంటి కెందమ్మి - యెమ్మెఁ బోఁడిమ్మి
పలుచని కోమల - పదములు చూచి
ముద్దియ సార్వభౌ - ముని రాణి యగుచుఁ
బెద్దగాలంబులు - ప్రియుఁడును దాను
చల్లగా మనునన్న - సాముద్రికోక్తి
పొల్లుగా నినుఁబాసి - పొక్కంగ వలసె! 4210
వారుణ పావక - వాయువ్య రౌద్ర
నారాయణ బ్రహ్మ - నామకాస్త్రములు

నీకేమి లేవయ్యె - నేనాగపాశ
మేకై పడినిఁ గట్టె - నిటువంటి మిమ్ము
మఱచితో ప్రాణేశ ! - మారేయుటకును
మఱపించెనో నిన్ను - మాయరక్కసుఁడు
మొగులు చాటున నుండి - మోసంబుచేసి
తెగివీఁడు మిమ్ము వ - ధించె నెక్కటిని
దిక్కెవ్వరింక నా - తెఱఁగిట్టి ములుచ
రక్కసుల్ మిగుల నా - ఱడినిఁ బెట్టుదురు 4220
నానిమిత్తముగ వా - నరసేనఁ గూర్చి
యీనీరనిధి మీర - లిపుడు బంధించి
లంకపై విడియు టె - ల్లను వ్యర్థమయ్యెఁ
గొంకక విధిప్రతి - కూలమౌ కతన
నెంతవారైన ని - న్నెదిరించరేని
యంతకు వీటికి - నరుగుటేకాక
నిను గెల్చునట్టి వా - ని జగత్త్రయమున
వినవంశతిలక ! యూ - హింప రెవ్వరును
కొడుకు లిర్వురు తన - కోడలు నవని
యడవుల పదునాలు - గబ్దముల్ దీర్చి
మఱలి వత్తురటంచు - మనరాక కెదురు
పరికించి చూచుచు - భరతుని క్రింద
నొదిగెడు కౌసల్య - కూరటలేక
తుది నిట్టులైనయం - దుకుఁ గలంగెదను
వెడలుచున్నది నీదు - వెంట బ్రాణంబు
లొడలిలో నిక నేల - యుండు నీక్షణము
పడి మెద మహినన్ను - వట్టుక కాచి 4230

విఱువ రీరక్కస- వెలఁదులు తన్ను
క్రోధంబుతో లంక - కను జొరి యొరులు
సాధింపరాని రా - క్షస వంశ మెల్ల 4240
నొకమాటలో కోప - హుత వహార్చులకు
నొకరునిఁ జిక్కక - యుండ నర్పించి
యాకోపవహ్నిలో - నాత్మదేహంబు
నీకుఁ బ్రీతిగనిత్తు - నీయాన నిజము.
ఇంక శోకింప నా - కేల ”యటంచుఁ
బంకజానన సీత - పలవింపుచుండ
నామాటలన్నియు - నాలించి త్రిజట
భూమిజతోఁ బల్కె - బుజ్జగింపుచును

—: త్రిజట సీత నూరడించుట :—

“ తల్లి ! యీరీతి కోం - దలమందనేల
చల్లగా మను నీదు - స్వామి రాఘవుఁడు. 4250
అతని కొక్కకొఱంత - యదియేల కలుగు
హితముగాఁగఁ బ్రమాణ - మేవచించెదను
రాముని కొకలైన - రామ ! యీ కపుల
మోములందు వికాస - ములు గల్గియున్న
దొరపడ్డచోటు కోఁ - తులమూఁక యింత
యొరిమలో నుప్పొంగి - యుండ నెక్కడిది ?
అదిగాక నీపతి - ప్రాణంబుతోడ
పొదలడేనియు నిది - పుణ్యపుష్పకము
ధరియించునే నిన్ను ? - తరుణి యిట్లగుట
నెఱిఁగి యుండుదు గాన - యిటుఁబల్కవలసె 4260

సేనాధిపతులు నో - చ్చిన నావికుండు
లేనట్టి యోడ చ - లించు చందమున
దనుజసైన్యంబులో - దళకర్తలేక
వినుతాంగి ! గనుగొమ్ము - విఱియంబాఱెడును
కపులెల్ల నుత్సాహ - కలితులై చూడు
మిపుడున్నవారు మీ - రేల శోకింప
నమ్ముము కల్ల నె - న్నఁడు నేను బలుక
కొమ్మ సత్యముగఁ జే - కొనుము నామాట
రామలక్ష్మణులు సు - రస్వామికైన
సేమనవచ్చు నీ - వెఱుఁగకున్నావె 4270
మృతలక్షణంబు లే - మియు రామునందు
నతివ చూచినఁగాన - మనుమాన మేల ? ''
అనిన రామునిఁ జూచి - యంజలిఁజేసి
తనతోడ హితము లెం - తయుఁ బల్కు త్రిజట
మాటలు నమ్మి యా - మగువకుఁ బ్రియము
నాఁటుకొనంగ మ - న్నన మాటలాడఁ
గదలి యప్పుడె యశో - క వనంబుఁ జేరి
మొదలింటి రీతి రా - ముని దలంపుచును
దనుఁజుట్టు దనుజకాం - తలు గాచియుండ
వనజాక్షి యాసీత - వసియించునంత. 4280

—: శ్రీరాముఁడు మూర్ఛ తెలిసి తమ్మునిఁగూర్చి శోకించుట :—

తరణిజ వాయునం - దన వాలితనయ
శరణసుషేణ కే - సరి నలనీల
పనసగవాక్ష జాం - బవదాదులైన

వనచరుల్ తనచుట్టు - వగలచేఁ బొగులఁ
జింతలెల్లను దీఱఁ - శ్రీరామవిభుఁడు
కొంతసేపునకుఁ గ - న్గోనలుఁ దెఱచి
తనవారిఁ బడినట్టి - తమ్మునిఁ జూచి
తనపాటు దలఁపక - దశరథాత్మజుఁడు
కెలన నున్నట్టి సు - గ్రీవముఖ్యులను
దెలియంగఁ జూచి చిం - తిలుచు నిట్లనియె. 4290

" అకట! లక్ష్మణుఁడు నా - గాస్త్ర ఘాతముల
నొకట మేనెఱుఁగక - యున్నట్టివాఁడు
బ్రదుకలేఁడితఁడేల - బ్రతుకింక తనకు
నదియుకాదిఁక జన - కాత్మజ యేల
తమ్మునితో నయో - ధ్యకుఁ బోదుననుచు
నమ్మియుండితిని జా - నకిని సాధించి
తనవెంట నలనాఁడు - దండకాటవికి
జనకజతోఁ గూడి - సౌమిత్రి వచ్చి
యిద్దఱితోఁ బాసి - యింక నేనేమి
బుద్ధి యెంచుక రణం - బున కియ్యకొందు 4300
యేవంక నేఁగిన - నెట్టిచోనైనఁ
గావలసినవారి - గణియింపవచ్చు
జనకనందనఁబోలు - సతియు లక్ష్మణున
కెనవచ్చు తమ్ముండు - నెచ్చోట లేరు.
ఇమ్మేనితోడ నే - నేఁగియయోధ్య
తమ్ములతోడను - తల్లులతోడ
నేమందు నితనికై - నీమఁ బ్రాణములు
నాయుండఱ నితండు - నాగపాశములఁ

గట్టులు పడియుండఁ - గనియును బ్రాణ
మెట్టు నిల్పుదు మేన - నిఁక క్షణంబైన  4310
తేపు మాపులు కుర - రీనివహంబు
వాపోవుగతి శోక - వశ్యయై సుమిత్ర
పలవింప నదివిని - ప్రాణముల్ దాల్పఁ
గలనె నాకొఱకు ల - క్ష్మణుఁ డిట్టులయ్యె
సీతని వెంటనే - నేఁగుదు నిపుడు
మాతండ్రిగాఁగ ల - క్ష్మణుఁ దలంపుదును.
ఈపాటు చూచియు - నిటులోర్చి యున్న
పాపాత్మునకు నాకుఁ - బరలోక మెద్ది?’’
అని ‘‘ఓయి! లక్ష్మణ - యలసిన వేళ
నను సేదఁదేర్చి మ - న్ననఁ బ్రోతు వీవు.  4320
ఇపుడేల పల్కవే - యెంత పిల్చినను
కపటాత్ముఁడని నన్ను - కడకుఁ ద్రోచితివా?’’
అని ‘‘కంటిరే! తమ్ము - నస్త్రాద్రి చేరు
వనజ బాంధవు రీతి - వైరులం దునిమి
యలసినగతి నమ - రావని యందు
బలగర్వముల మాసి - పడియున్నవాఁడు.
నాడు దురాలోచ - నంబుల చేత
నీదెస వాటిల్లె - నెట్టివానికిని
యలసత గనుపించఁ - డప్రియ వచన
ములు పల్కఁ డెపుడు చే - మొగిడించి నిలుచు  4330
నేనూరు బలుదూపు - లేక కాలమునఁ
బూను వింటను రయం - బుగ వైరిమీఁదఁ
గరలాఘవంబున - గార్తవీర్యునకు

సరిమీఱు వాఁడు ల - క్ష్మణుఁ బాయఁగలనె ?
ఏల సంగర మింక - నిటుమీఁద లంక
యేలెడు రావణుఁ - డీ విభీషణుని
పట్టంబుఁ గట్టి చే - పట్టిన మాట
పట్టు దబ్బరయయ్యె - ప్రతినఁ దప్పితిని

—: రావణుఁడు సుగ్రీవుని కిష్కింధకుఁ బొమ్మనఁ విభీషణుఁడు వానరులనాపి రామునివద్దకు వచ్చుట :—

ఓయి ! భానుజ ! మమ్ము - నురగ పాశములఁ
జేయాడ కుండంగ - క్షితిఁ బడ వైచి    4340
యీవార్తతోఁ బోయి - యింద్రజిత్తుండు
రావణునకుఁ దెల్ప - రణభూమి కతఁడు
రాకేలయుండు తా - రాకుమారకుఁడు
నీకుఁ దోడుగ నాంజ - నేయునిం గూడి
సేతువు జాడ కి - ష్కింధకుఁ బొమ్ము !
నీతోడఁగూడి య - నేక నాయకులు
వచ్చి మాకొఱకునై - వనరాశిఁ గట్టి
యిచ్చోటఁ జేసిర - నేక కార్యములు
దైవయత్నంబు ముం - దఱ నితరంబు
లేవియుఁ గొనసాఁగ - వేమి సేయుదును ?    4350
చేరిపల్కినమాట - చెల్లించుకొంటి
వీరీతి నైన నీ - వేమి సేయుదువు ?"
అనిపల్కి "కపులార ! - యరమర లేక
తనవెంట వచ్చి యం - దఱును మాకొఱకు
మేనులు దాఁపక - మీరు మీచేత

నైన యంతయు స - హాయతలు జేసితిరి.
ఇటమీఁద మా దుర - దృష్ట మిట్లైనఁ
గటకటంబడి మీఁదు - గాఁగలదేమి ?
పొందు మీమీదేశ - ములకు నిచ్చోట
నుండు టేమిటి" కని - యుపచరింపుటయుఁ 4860
గన్నీరు రాలంగఁ - గపులెల్లఁ జాల
విన్నఁ బాటున రఘు - వీరునిఁ గాంచి
వలదన్నఁ దొలఁగిపో - వను గాళ్లురాక
కలఁగుచు నుండఁగ - గదఁగేలఁ బూని
యచ్చటచ్చటి వాన - రావళి నెల్ల
నెచ్చరింపుచు చాయ - నేతేఱఁ జూచి
యదెవచ్చె నింద్రజి - త్తని కపులెల్లఁ
జెదరి మున్ వచ్చిన - సేతువు జాడ
బరువిడ నిలుఁడని - భానుజుండరిగి
మఱలించి రామల - క్ష్మణుల సన్నిధికిఁ 4870
జేరి యంగదుఁ జూచి - "సేనలేమిటికిఁ
బాఱెడు వీరికి - భయమేల ?" యనిన
నతఁడు "రాఘవులు నా - గాస్త్రపాశముల
క్షితిమీఁదఁ బడుట వీ - క్షించుట" యనిన
"అది యేటిమాట ని - శాటుఁ డొక్కరుఁడు
గదవూని మనమీఁదఁ - గదలి రాఁజూచి
విచ్చి పోయెదనన్న - విని యంత చేర
వచ్చి రాత్రించర - వల్లభానుజుఁడు
పలుకరించుటయుఁ ద - ప్పని జాంబవంతుఁ
బిలిచి తెల్విడి జేసి - పేర్వేరఁ జేరి 4880

యుండఱు నీవార్త - యాలకించంగ
మండలించి భయంబు - మాన్చి మఱల్చి

—: విభీషణుఁడు నాగపాశబద్ధుఁడగు శ్రీరామునిఁజూచి దుఃఖించి సుగ్రీవుని సమాశ్వాసించుట :—

శ్రీరాము చెంత ని - ల్చిన విభీషణుఁడు
చేరి శిలీముఖ - శ్రేణిమై నాఁట
గాయంబులందు ర - క్తంబులు దొరుగ
నాయత నాగపా - శావృతులగుచుఁ
గనుమోడ్చి పడియున్న - కాకుత్థ్సవంశ
వనజ బాంధవుల రా - వణ సహోదరుఁడు
కాంచి కన్నులనీరుఁ - గార శోకించి
యంచల నిల్చి చే - లాంచలంబునను 4390
మేనిండు రక్తముల్ - మెల్లనే యద్ది
చేనీట నేత్రరా - జీవముల్ తుడిచి
" అక్కట! యట్టిమ - హాను భావులను
దెక్కలి దాఁకె శో - ధించె దైవంబు
మాయన్న తనయుండు - మాయావి వీరి
నీయవస్థల ముంచె - నేమన వచ్చు?
రాముఁడీ లంకాధి - రాజ్యంబుఁ దనకు
నేమించె ననినమ్మి - నిజమని యుండి
తన యదృష్టంబుచే - తన రాఘవులకు
ననిలోనఁ దిఱని - యాపదవచ్చె 4400
చెల్లించుకొనియె తాఁ - జేసిన ప్రతిన
బల్లిదుండైనట్టి - పంక్తికంధరుఁడు

నతని కోరికలెల్ల - ననుకూలమయ్యె
ప్రతిపక్ష మణఁగె దా - పాపకర్ముఁడను
తనకేది దిక్కని" - తపియింపుచుండ
గని వాలితమ్ముఁడుఁ - గౌఁగిటఁజేర్చి
కన్నీరు దుడిచి గ - ద్గద కంఠుఁడగుచు
విన్నవానరులెల్ల - వినుతించఁ బలికె
"ఇంతయేఁటికి నీకు - నేమిటఁ గొఱఁత
చింతిల్ల మనకేల - శ్రీరాముఁ జూచి 4410
జానకీ రమణుఁడు - సహియించె గాక
యీ నాగపాశంబు - లివియేమి సేయు!
ఇదె సేదఁదేఱెడు - నినుఁ దుదయింపఁ
గదనంబులో దశ - కంధరుఁ దునిమి
యీలంక నీకిచ్చి - యిల పత్నిఁగూడి
యేల నున్నాఁడు మ - హీచక్రమెల్ల
మనవంటి వారల - మనసులఁ జూడఁ
గనుమూసి యున్నాఁడు - గాక రాఘవుఁడు!
దొడిగిన యొకకోలఁ - దునుమఁడే యులిగి
గడియలో మూఁడులో - కములు చూర్ణముగ 4420
రాఘవామోఘ నా - రాచ ధారలకు
మేఘంబు లడ్డమే - మేఘముల్ మఱుఁగు
చేసి నిల్చిన యింద్ర - జిత్తునిఁ దునుమఁ
గోసలేంద్రునకు నె - క్కుడు ప్రయోజనమె!
ఏమి చింతించెనో - యిటులున్నవాఁడు
రాముఁ డీమీఁద స - ర్వము నెఱింగెదవు."

అని చెలికాని న్గా - రార్చి సుషేణు
గనుఁగొని యా రుమా - కాంతుఁ డిట్లనియె.

—: సుగ్రీవుఁడు సుషేణునితో రాముని కిష్కింధకుఁ గొని పొమ్మనిచెప్పుట :—

" కలనిలోఁ బడిన రా - ఘవుని గాత్రములు
నలఁగఁగానీక యం - దలములో నుంచి 4430
యెత్తించుకొని యేఁగు - మీవు కిష్కింధ
కిత్తరి కపివీరు - లేనునుఁ గూడి
రావణుఁ జంపియా - రాజ్యాధిపత్య
మీవిభీషణునకు - నిచ్చి వచ్చెదను.
పంతమాడిన యట్లు - పలుకు చెల్లింతు
నింత వైదేహినే - నిత్తు రామునకు
బోయలఁ బిలిపించు - పొమ్ము " న్న నతఁడు
చేయిమోడ్చి వనాట - శేఖరుఁ బలికె

—: సుషేణుఁడు చంద్రద్రోణ నగమునందలి, విశల్యసంజీవ కరణులను హనుమంతునిచేఁ దెప్పింపుమని సుగ్రీవునిఁ బ్రార్థించుట :—

" తొల్లి సురాసురో - ద్ధుర సమరముల
బల్లిదులగు దైత్య - పతులచే మడియు 4440
సురలను బ్రతికింప - సురలోక గురుఁడు
వరమతియైన ధ - న్వంతరిచేత
విని మున్ను మథియించు - వేళ నాక్షీర
వనరాశి నౌషధ - వ్రాతంబు వొడమ

దాచియున్నట్టి చం - ద్రద్రోణ నగస
మీచీన కటక స - మీపంబులందుఁ
గరమొప్పిన విశల్య - కరణి సంజీవ
కరణులఁ దెప్పించి - కాచె వేల్పులను.
ఆ యౌషధంబు లీ - హనుమంతుఁ బనిచి
యాయన వెంట మ - హావానరులను 4450
పనససంపాతులఁ - బనిఁగొమ్ము క్షీర
వనధి కావన మెల్ల - వారెఱుంగుదురు
సాధించి యౌషధా - చలమువహౌషధులు
శోధించి యంజనా - సుతుఁడుఁ దేనోపు
నందు చేతను మన - యాపదల్ దీఱి
కందుము రామల - క్ష్మణుల సేమములు
నితరులచేఁ దీఱ - దీపని యన్న
నతని మాటలు విని - యర్క నందనుఁడు
హనుమంతుఁ బిల్చి యా - యర్థ మేర్పఱచి
చనుము నీవని పల్క - సమయంబు నందు 4460

—: గరుత్మంతుని యాగమనము - శ్రీరాముని నాగపాశములు పడిపోవుట :—

ఘోరున సురదుందు - భులతోడఁ గూడి
యారావ మొకటి మి - న్నంతయు నిండె
నామహాధ్వని వెంట - నతుల ప్రచండ
భీమవాయువు మేఘ - బృందంబుఁ దరిమె
నావాయువులచే మ - హాంభోధి యూర్మ
ళీవలావలగాఁగ - నెదమిచ్చి తొలఁగె

నాతొలకులఁ దోచు - నహుల రాక్షసులు
పాతాళబిలములోఁ - బడి మాటు గొనిరి.
అంతట నుదిత నూ - ర్యానలరోచి
మంతుఁడై యాగరు - త్మంతుండు వచ్చి 4470
సాక్షాత్కరించిన - సమయంబునందు
రక్షోధి వరకుమా - రక వినిర్దిష్ట
పన్నగాయత మహా - పాశముల్ చెదరి
కన్నత్రోవలఁ బారెఁ - గనుమాయ మగుచుఁ
గట్లూడి నంత రా - ఘవుల యంగములు
కొట్లుబ్బసము గాని - కొంత దెప్పిరిన
దివ్య తేజోమూర్తి - దీనమందారు
నవ్యయు ఛందోమ - యస్వరూపకుని
వేదాంగు వేదాంత - వేద్యు నక్షరుని
నాదిపురుషు సహ - స్రార్క సంకాశు 4480
వైనతేయుని గాంచి - వనచరులెల్ల
మానసంబున భీతి - మట్టుమీఱంగ
నందఱుఁ బరువిడ - నండజస్వామి
కుందనంబుల నిగ్గుఁ - గురియు ఱెక్కలను
రామలక్ష్మణుల గా - త్రంబులు నిముర
నామున్న వారి గా - యములెల్ల మానె
సుఖనిద్రలు దొరంగి - చూచిన యట్ల
సుఖులౌచు దశరథ - సుతులు కన్దెఱచి
మున్నటికన్న మో - ములు వికాసంబు
వన్నె మేనులును దై - వారి యిర్వురును 4490

ద్విగుణిత జవసత్త్వ - తేజప్రతాప
జగదభినుత మూర్తి - శాలులై యెసఁగఁ
గరములచేత రా - ఘవులఁ దానెత్తి
గరుడుండు నిండారఁ - గౌఁగిటఁ జేర్చి
గారవించుటయును - ఖగరాజు మోము
శ్రీరామచంద్రుఁడీ - క్షించి యిట్లనియె.

—: శ్రీరాముఁడు నాగపాశవిముక్తుఁడై గరుత్మంతుని యాకార
మును వర్ణించి యాతని యుదంతమరయుట :—

" మీ రెవ్వరయ్య ? య - మేయ కారుణ్య
నీరాకరులు నేఁడు - నీరాకచూడ
మాతండ్రి దశరథ - మండలాధీశు
మాతాత మనువంశ - మణియైన యజునిఁ 4500
గనుఁగొన్న యంతటి - కన్న సంతోష
మినుమడించెను మమ్ము - నింద్రజిత్తుండు
బంధించు నీనాగ - పాశముల్ ప్రాణ
బంధుఁడవై వచ్చి - పరిహరించితివి
హీరకిరీటంబు - హేమాంబరంబు
గారుత్మతోత్పల - గ్రైవేయకంబు
రత్నకుండలములు - రాజీవరాగ
నూత్నమంజీరమ - నోహరాంఘ్రులును
మౌక్తిక తూలికల్ - మాణిక్య కవచ
సక్తమై మించు వి - శాల వక్షంబు 4510
మరకతకేయూర - మంజుబాహువులు
నరుణపక్షములు చం - ద్రాననాబ్జంబుఁ

గరుణావలోకముల్ - కంబు కంధరము
నరుణపల్లవ కోమ - లాగ్ర హస్తములు
దుందుభిస్వనము ల - త్తుకచాయ మేను
మందర మేరు స - మానగాత్రంబు
లలితోర్ధ్వపుండ్ర ల - లాటపట్టికయు
సెలవులఁ దేఱెడు - చిఱునవ్వు గలిగి
భానుకోటి ప్రభా - భవ్య తేజమున
నానందకరమూర్తి - నవతరించితివి. 4520
యీదివ్యపురుషుఁడ - వెవ్వండ"వనిన
వేదాంగుఁ డారఘు - వీరునకనియె.

—: గరుత్మంతుఁడు తనవృత్తాంతము శ్రీరామునకెఱింగించి, యాతఁడు జయమునొందునని దీవించి యంతర్ధానముఁ జెందుట :—

"రామ! యేనీకు పో - రాని యాప్తుఁడను
సేమంబుఁ గోరిన - చెలికాఁడ నెపుడు
వైనతేయుఁడను రా - వణకుమారకుఁడు
హీన బుద్ధిని మిమ్ము - హీన పాశములఁ
గట్టి జయించి లం - కకుఁ బోయినట్టి
పట్టున నివి వచ్చి - పరిహరింపంగ
నజహరీంద్రాదుల - కైన దుర్లభము
భజియించి యేను మీ - బంటనై యునికి 4530
నిదె నా మనంబులో - నెఱిఁగి వచ్చితిని
యుదయాచల ప్రాంత - మునికి నాకెపుడు
రాక్షసుల్ మాయాప - రాయణుల్ సమర

దక్షులు వారు యు - ద్ధములు సేయుచును
వంచనోపాయులై - వర్తింతురెఱుఁగ
రించుకయును మీర - లెద కపటములు.
ఎచ్చరిక మెలంగి - యేరీతి మోస
పుచ్చఁ జూచిన బేలు - పోవక యుండి
జయమందుమని రామ - చంద్రుని మఱలఁ
బ్రియముతోఁ గౌఁగిటఁ - బెనచి లాలించి 4540
పగవానినైనఁ జే - పట్టి రక్షించు
జగదేక కారుణ్య - శాలివి నీవు
శాంతమూర్తివి సత్య - సంధుండ విహితు
లెంతవారైన ని - న్నెదిరింపలేరు.
రావణుఁడెంత శ - రంబొక్కటేర్చి
కావలసిన ద్రుంపఁ - గలవు విశ్వంబు
నాతోడి చెలిమి గో - న్నాళ్లకుమాటు
సేతువుగాని నీ - చిత్తంబులోనఁ
బ్రకటంబు సేయక - పనుపుము నన్ను
నా కెఱుంగక యుండ - యుచితంబెఱిఁగి 4550
యామీఁద దెలిసెద - నంతయు రాజ
సామాన్యబుద్ధి యి - చ్చట నున్కి హితము
పరమధార్మికుఁడ వీ - పంక్తికంధరుని
శిరములు రాక్షస - శ్రేణులతోడ
నఱికి వైచెదవు జా - నకిఁగూడి నీవు
మఱలి యయోధ్య నే - మములు గాంచెదవు
వలసిన యప్పుడే - వచ్చి నీవేమి
దలఁచిన యేన సా - ధకుఁడఁగాఁగలను

పోయివచ్చెద నను - పుము వార్ధి భయద
సాయక శ్రీరామ - చంద్ర! నీవాఁడ" 4560
అని ప్రదక్షిణముగా - నంజలితోడ
నినుమాఱు తిరిగి తా - నిరుగేలుసాఁచి
క్రమ్మర మనసారఁ - గౌఁగిటఁ జేర్చి
నెమ్మోముఁ జూచి మ - న్నించి దీవించి
కపులెల్ల జూడంగ - ఖగరాజు మింటి
కపుడు రెక్కలతోడి - యమరాద్రి యనఁగ
రివ్వన నెగరి య - దృశ్యుఁడై చనిన
నవ్వేళ నలుగడ - నగచరోత్తములు
రావణానుజుఁడు చే - రఁగ వచ్చి తమదు
భావంబులో నాగ - పాశబంధములు 4570
వదలి బోఁడగ పుప్పు - వంతులఁబోలి
సదమల మూర్తులై - సమరయత్నంబు
సేయు రాఘవుల సే - క్షించి యుప్పొంగి
కాయముల్ కొండల - గతి వెచ్చు పెరుగ
వాలంబు లార్చుచు - వారిదధ్వనులఁ
బోలు నార్పులు పెడ - బొబ్బలు నిగుడ
గిరులును తరువు లం - కించి యాలంక
తిరువవారుక తొంటి - తెఱఁగున బలిసి
కాహాళపణవ శం - ఖమృదంగ నినద
మాహారిదంతంబు - లల్లికొనంగ 4580
ముత్తికగాఁ దిగి - ముక్కాకచేసి
హత్తివాకిళులెల్ల - నాక్రమించుటయు

—: రావణుని యనుమతిని ప్రహస్తుఁడు పంపినవేగులవారువచ్చి రామలక్ష్మణులు నాగపాశములు వీడినయుదంతము చెప్పుట :—

నాసద్దు విని రావణా - సురుఁడులికి
మోసంబు వచ్చె రా - ముని కొక్కటైనఁ
గపుల కీయగ్గలి - కలు రావుగాన
విపరీత మది నీవు - వేగులచేతఁ
జూపింపుమని ప్రహ - స్తునిఁ జూచి పలుకఁ
జాపల్యమున వేగఁ - జని దైత్యమంత్రి
తగినచారులఁ బిల్చి - దశరథాత్మజులు
తెగి పడ్డ సమరవీ - థికి మీరు పోయి 4590
వారి చందంబు స - ర్వముఁ జూచి మఱలి
యీరేయి రండన్న - నేఁగి వారలును
నచ్చటి వృత్తాంత - మరసి యాక్షణమె
వచ్చి దశానను - వదనంబుఁ జూచి
"దేవ! బల్ నిగళముల్ - ద్రెంచుక మదము
తో విహరించు సిం - ధురములో యనఁగ
నాగపాశ నిబంధ - నమ్ములు దొలఁగి
జాగరూకత రామ - సౌమిత్రులెలమి
నున్నవార"న దిగు - లొంది యామాట
విన్నయప్పుడు మోము - వెలవెలఁబాఱ 4600
నిఁకనేటి మాట యా - యింద్రుఁడు నేను
నొకనాడు సరిఁబడ - యుద్ధంబుచేసి
యతనిచేఁ దగిలిన - యప్పుడు గాచె
నితనిచే నున్నయ - హీనపాశములు
నాచెఱ విడిపించి - నాఁడింద్రుఁ బట్టి

చేచేతఁ దానింద్ర - జిత్తుండు దెచ్చె
నతనికి వరదత్త - మైన యస్త్రౌఘ
మతులంబు విడిపింప - నజునిచేఁగాదు.
అజుని పౌత్రుని గెల్చి - రని విన్నయపుడె
విజయ మేడదియో వి - వేకించి చూడ 4610
నిదియె ప్రమాణ మే - నెదిరి యోడుటకుఁ
గదనంబులోన రా - ఘవుని గెల్చుటకు"

—: రావణుఁడదివిని ధూమ్రాక్షుని యుద్ధమునకుఁ బొమ్మనుట :—

అని విచారించి ధూ - మ్రాక్షునిఁ బిలిచి
యనికేఁగు మీవు బొ - మ్మని పంచుటయును
జేమోడ్చి మఱి - యిల్లుచేరక సమర
సామగ్రితోడ ని - స్సాణముల్ మొరయ
పటహభేరీశంఖ - పణవాదికములు
భటకోటి కలకలా - ర్భటి నింగి ముట్ట
కాంచనమణిభాండ - కలిత ఖరోష్ట్రి
కాంచిత రథమెక్కి - యసిగదాముసల 4620
ధనురస్త్రములఁ దాల్చి - దనుజసైన్యంబు
తనవెంటఁ గొలువ ను - త్కట కోప శాత
తామ్రాక్షుఁడగుచుఁ బ్ర - ధానులు దాను

—: ధూమ్రాక్షుఁడువెడలి హనుమంతునితో యుద్ధము చేయుట :—

ధూమ్రాక్షుఁడాహవ - దుర్వారలీల
పడమటివాకిట - బలములు దాను

నెడలివానరులెల్ల - విరియఁ బాఱంగ
రామదివ్యాస్త్ర సం - రక్షితులైన
యామర్కటులఁ దోలి - హనుమంతుమీఁద
చేరరా నాతని - సిడముపై వ్రాలె
గారు కూఁతలనంత - గ్రద్దలుద్ధతినిఁ 4630
గొన్నిమబ్బులు పిడు - గుల వానగురిసె
మిన్నున వారిపై - మిణుఁగురుల్ వ్రాలె
నిండగ వర్షించె - నెత్తురు జల్లు
మొండెంబు లాసేన - ముందఱఁ బడియె
నవి సడ్డసేయక - యలఘువర్గమునఁ
బవననందను మూఁక - పైఁదేరుఁ ద్రోలఁ
గపులు మహీరుహ - గ్రావముల్ దాల్చి
కుపితాత్ములగుచు ను - క్కులుగాఁ గవిసి
దనుజ వీరుల దాఁకి - తమచేత నున్న
మునుపటి సాధన - మ్ములు సెలవైన 4640
పిడికిళ్ళ గుద్దియుఁ - బెరికి మోకాళ్ళఁ
బొడిచియుఁ గోఱల - బోరల చించి
పడద్రోఁచియును వాల - పాశవల్లరుల
మెడలంట జుట్టి భూ - మినిఁ బడనీడ్చి
బిరబిర ద్రిప్పియా - భీలసత్త్వమున
శరధిలో వైచియుఁ - జరణఘాతముల
గులగులల్గాఁ దన్ని - కుంభినివైచి
పాలియునప్పుడు కపుల్ - భుజశక్తిఁ జూపఁ
గరవాల ముసల ము - ద్గర భిండివాల
శరకుంత తోమర - శక్తులచేతఁ 4650

గపుల నొప్పించి సం - గ్రామరంగంబు
నిపుణులకును వర్ణ - నీయమై మించె.
వింటి యల్లెలమ్రోఁత - వీణారవంబు
నంటుగా హుంకర - ణములు తాళముల
సెలవుగా నుప్పొంగు - సింహనాదములు
విలసిల్లు నాలాప - విభవంబు గాఁగ
దట్టించు పలుకులు - తప్పెటల్ గాఁగ
నట్టిచో గీతశా - స్త్రాను కారముగ
విలసిల్లు ధూమ్రాక్షు - విశిఖపాతములు
గలగుండు వడికపుల్ - కలఁగిపాఱుటయుఁ 4660
దనవారి నొంచు దై - త్యశ్రేణిఁ దఱిమి

—: ధూమ్రాక్షుని హనుమంతుఁడు చంపుట :—

హనుమంతుఁ డొక్కడు - హత్తైలమెత్తి
యదలించివ్రేయు ధూ - మ్రాక్షుండు పుడమి
కలఁగ గుప్పించియు - కడకు దాఁటుటయు
సారథితో రథ్య - సమితితో రథము
ధారుణిఁ గలసినఁ - దాపోక నిలిచి
గదవూని మిగులనా - గ్రహముతోఁ దనకు
నెదిరింప గిరిశృంగ - మెత్తి వాయుజుఁడు
వ్రేసిన నది దైత్య - వీరుని మకుట
భాసమానంబైన - భయద మస్తకముఁ 4670
జదియించి మహిఁగూల్చ - సమసినవానిఁ
గదనంబులోఁ జూచి - కడమ రాక్షసులు

పవమానతనయు మా - ర్వడలేక తిరిగి
జవమునఁ బరువిడ - జయశాలి యగుచుఁ
దనవారిఁ బశ్చిమ - ద్వారమానించి
తనివోని సమరయ - త్నమున నున్నంత
హతశేష దానవు - లసురేంద్రుఁ జూచి
హతుఁడయ్యె ధూమ్రాక్షుఁ - డని పల్కుటయును

—: రావణుని యాజ్ఞచే వజ్రదంష్ట్రుఁడు యుద్ధమునకు వెడలి యంగదు నెదుర్కొనుట :—

వజ్రముఖామర - వ్రాతదుర్జయుని
వజ్రదంష్ట్రుని నాహ - వజయాభిరతుని 4680
రమ్మని నీవేఁగి - రాముని నతని
తమ్ముని గోఁతులం - దఱిమి జయించి
మఱికాని లంకకు - మఱలకు మనుచు
నెఱిఁగించి యుదుగర - లిచ్చి పొమ్మనినఁ
గాలకాలుని రీతి - కలహంబులకును
గాలుద్రువ్వుచు నుండుఁ - గాన వాఁడలిగి
తనదు రాక్షసుల సం - దఱ బారుదీర్చి
కనఁగన వెలుఁగు బం - గరుతేరుఁ దేర
వలవచ్చి తానెక్కి - వైడూర్యవర్మ
కలితుఁడై మ్రోల హే - గ్గాళెలు మొఱయ 4690
దర్పించి దక్షిణ - ద్వారంబు వెడలి
యార్పులచేత బ్ర - హ్మాండమ్ము వగులఁ
దనవారితో సంగ - ద కుమారుమీఁదఁ
గినిసి మార్కొనువేళ - కీడెచ్చరించు

నవశకునములు గో - రంతయు మదినిఁ
దవులనీయక విధి - తను బెడతేఁపఁ
గనిపించు కొనుటయుఁ - గపు లెదిరించి
దనుజులసేనపై - ధరనగావళులు
వ్రేసిన దానవ - వీరులు గినిసి
ప్రాసతోమరకుంత - బాణపాతముల 4700
వనచరులను ద్రుంపు - వారివీరికిని
బెను గయ్యా మంటిన - పిఱుఁదీక పోరఁ
గపులు శిలాతరు - గ్రావాళితోడ
విపులపైఁ బడ దైత్య - వీరులమీఁద
ధవళాతపత్ర కే - తన ధనురస్త్ర
నివహాకోటీరమ - ణీ భూషణముల
రాక్షసుల్ గూలిన - రణభూమి యపుడు
లక్షింప తిలతండు - లన్యాయమగుచు
శారదసమయని - శానభోలక్ష్మి
మేరఁ జూపఱకెల్ల - మెచ్చొదవించె. 4710
కపుల తేజమునకుఁ - గాక రాక్షసులుఁ
దపియించుటయు వజ్ర - దంష్ట్రుండు గినిసి
విల్లు మోపెట్టుచు - వెండి యంగదుఁడు
త్రుళ్లడగింతు కోఁ - తులఁ ద్రోలుటెంత
యన విని కపిసేన - నదరకుండనుచుఁ

## — అంగద వజ్రదంష్ట్రుల యుద్ధము :—

గనకమౌళి మయూరాం - గదుఁ డంగదుండు
అద్దిరా ! యితని బా - హా టోపమనుచుఁ

బెద్దకొండయుగల్చి - పెకలించివైవ
యది తేలివచ్చి మి - న్నంతయు నిండి
కదియరా దనుజుండు - కాండత్రయమునఁ 4720
బొడి చేసి యావాలి - పుత్త్రుని మేను
పిడుగులవంటి య - భేద్య బాణముల
నెత్తురు జొత్తిల - నిండ వర్షింపఁ
జిత్తంబులోన మె - చ్చి తదీయమైన
భుజశౌర్య మహిమముల్ - బొగడుచు నుండ
రజనీచరుండు శౌ - ర్యంబ వార్యముగ
నంగదు మొనకు తో - డై వచ్చి యెదుర
సంగర నిపుణుల - సమద వానరుల
మొనసి యిర్వదియొక్క - మొనలవానరులఁ
దునిమి లక్షునొక్క - దొరమైన కపులు 4730
నెనబండ్రు నిలఁబడ - నేసిన వాలి
తనయుఁడుద్ధతి వజ్ర - దంష్ట్రుపై గినిసి
వేఱొక్కకొండ బ - ల్విడి నేయ నతఁడు
తేరుపై నుండక - దిగ్గున దుమికి
తొలఁగిన నరదంబు - తో నది వడిఁ
దలఁగిపోవక గదా - దండంబు త్రిప్పి
యంగదు పేరెద - యదరంట వేయ
చెంగక వానర - సింహశాబకము
దానవాధిపుఁ గర - తలముచేఁ గడల
వానరుల్ వొగడ బ - ల్విడి గొట్టుటయును 4740
నాపెట్టు వడియు మ - హానిశాచరుఁడు
కోపంబుతోఁదార - కొడుకుతో నెదిరి

యిరువురు సరిపోరు - నెడ మల్ల చఱచి
పిఱుదీకవడి గండ - భేరుండయుగము
పోరాడుగతి వారు - భూరిసత్త్వములు
ఘోరసంగరము మి - క్కుటముగాఁ జేయఁ

——: అంగదుఁడు వజ్రదంష్ట్రినిఁజంపుట :——

గదిసి పోరుచు బుధాం - గారకులట్ల
సదమదంబుగను ము - ష్టా ముష్టి పెనఁగి
యన్యోన్య జయకాంక్షు - లై యప్రమాణ
మన్యులై పోరుచు - మహిని వ్రాలుచును 5750
లేచుచునుండ వా - లితనూజు నురము
మోచేతఁ బొడిచిన - మోకరింపుచును
పెట్టుబడ్డ మహాహి - పెక్కువతార
పట్టియొక్క నగంబు - పట్టిరాఁజూచి
యరిగెయుఁ గత్తియు - నందుకవాఁడు
దురదురవచ్చి స - త్తువకొద్ది నేయఁ
జెట్టునైచినఁ గత్తి - చేనది దునుమ
నట్టిచో నలిగి మ -హాసత్త్వశాలి
వాలిసూనుఁడు దాన - వకరాగ్ర హేతి
చేలాగుచే తన - చేత నంకించి 4760
దారిగా నలవజ్ర - దంష్ట్రిని శిరము
ఘోరాజిఁ బడ తెగఁ - గొట్టె యార్పుటయు
వానరులావెంట - వచ్చినయట్టి
దానవావళి నెల్లఁ - దరిమి చంపుటయుఁ

జావుకు దప్పి రా - క్షసుఁ డొక్కరుండు
రావణుఁ జేరి స - ర్వము విన్నవింప

—: అకంపనుఁడు రావణునాజ్ఞచే యుద్ధమునకు వెడలుట :—

"ఎక్కడివానరు - లీపాటి పోటు
రక్కసులను జంపి - రామకార్యంబుఁ
జేకూర్చుటెక్కడ - చింతించిచూడ ?
ఏకైవడి జయింతు - నెవ్వానిఁ బిలిచి 4770
పంపుదు" నని "యకం - పనుఁ డున్నవాఁడు
చంపింతు రామల - క్ష్మణుల కోఁతులను
తామసించక తమ - దైత్యులఁగూడి
రాముని పైఁ బంపి - రమ్ము నీ"వనుచు
దళవాయితోఁ బల్క - దశకంఠునాజ్ఞఁ
దలమోచిపోయి యం - పయు నెఱిఁగింప
నాయకంపనుఁడు మ - హారథంబెక్కి
యాయతబాణబా - ణాసనావళులు
ధరియించి సేనముం - దఱ నెచ్చరించి
పురికొల్పి యాహవం - బునకు నేతేర 3780
నెడమ కన్నదిరె నీ - రెలుగు వాటిల్లెఁ
బడియెఁ గేతన మశు - భమ్ములు దోఁచె
దుర్నిమిత్తంబులు - దోఁచిన చావు
నిర్ణయించుక వాఁడు - నిశ్శంకవృత్తిఁ
గలనికి నడచిన - కపులు రాక్షసులు
తలపడి ఘోరయు - ద్ధము సేయునపుడు
చిమ్మచీకటి గ్రమ్మె - సేనల రవళి

దుమ్మున్మపై నెగసి గో - ధోవివరంబు
నిండిన నిరువాగు - నిబిడ రజప్ర
కాండంబులో కండ్లుఁ - గానక భ్రమసి 4790
గవులను గవుల రా - క్షసుల రాక్షసులు
నపుడు చంపుచు నట్ట - హాసముల్ సేయ
నదియును వినసీక - యపుడు ప్రచండ
పవమానములునా న - భమునాక్రమించె
నితర రేతరము వోక - నిందునందునను
జతగాఁగ నెత్తురుల్ - జగతిపైఁ గురియ
గాలిచేఁ గొంత ర - క్తంబులు గొంత
తేలియు నడఁగియు - తిమిరముల్ విరియఁ
బెంధూళియడఁగిన - పెడబొబ్బలిడుచు
నంధత మాని గ - ర్వాంధులై కినిసి 4800
వానరులును దైత్య - వరులును కపులు
దానవులకు భుజా - దర్పముల్ మెఱసె
చంపునప్పుడు రాక్ష - సస్వామిచేతఁ
బంపుపూనిన యకం - పనుఁడాగ్రహమున
నమ్ములవానచే - నగచరశ్రేణి
ముమ్మరంబంతయు - మొనఁదప్ప నేయ
ప్రీలిన కపులభా - వించిప్రతాప
శాలులై నలరభ - సకుముదమైంద
కపియూథ వరచతు - ష్కము వానిమీఁద
విపులాధరంబులు - వృక్షముల్వైచి 4810
వెంటవచ్చిన దైత్య - వీరులనెల్ల
కంటించి చంపుచుఁ - బైకొనుటయును

జచ్చినతనవారి - జగడంబుఁ జూచి
రిచ్చపాటున నల్వు - రిని విలోకించి
పటుతరసమిదకం - పనుఁడకంపనుఁడు
కటములు గదల ను - త్కట శౌర్యుఁడగుచుఁ
దనసారథినిఁ జూచి - " తతిమీరి కపులు
దనుజులనెల్ల ర - థంబు వోనిమ్ము
ఆమూఁకపై "నన్న - నతఁడట్లసేయ
భీమబాణాసనా - భీల నిర్ముక్త 4820
సాయకనిబిడ వ - ర్షంబుచేఁ గపుల

—: అకంపనుఁడు హనుమంతునితో యుద్ధమొనర్చుట
హనుమంతుఁడకంపనునిఁ జంపుట :—

మాయించుటయు హను - మంతుఁడు జూచి
బలుగొండ యొకటి చేఁ - బట్టి కల్పాంత
జలజాప్తసుతుని యో - జను మిన్నుముట్ట
పైపై నిరా నకం - పనుఁ డర్ధచంద్ర
రోపంబుచే తన - రూపంబుగాఁగఁ
జేనున్న శైలంబు - చిద్రుపలై రాలఁ
గానేయుటయుఁ బ్లవం - గ దివాకరుండు
గ్రక్కున నొక్కయశ్వ - కర్ణభూరుహము
రక్కసులకు కాళ - రాత్రియనంగఁ 4830
పెకలించికొని బిం - బిరఁద్రిప్పికొనుచు
నొకనిఁ బోనీక పై - త్యాల పీఁచమడంచి
తనమీఁద రాఁగ నిం - తయు లెక్కగొనక
పెను దూపులను గాడ్పు - బిడ్డలనిమేన

జొత్తు పాపనుబోలఁ - జూపర మెచ్చ
నెత్తురులను ముంప - నివ్వెఱగంది
పట్టినచెట్టుచే - పరియలువారఁ
గొట్టె వానిశిరంబు - కుంభినిఁగూల
నాయకంపనుని పా - టమరులు చూచి
చేయెత్తి జయజయా - శీర్నుతుల్ సేయ 4840
రామసౌమిత్రులు - రవికుమారకుఁడు
ప్రేమతోఁ బొగడ వి - భీషణుండెదురు
వచ్చి కౌఁగిటఁ జేర్ప - వాయునందనుఁడు
హెచ్చైన గెలుపుతో - నిచట నున్నంత.

—: ప్రహస్తుఁడు యుద్ధమునకు వెడలి దుర్నిమిత్తములం గనుట :—

బల్లిదుండగు నకం - పను చావు భీతిఁ
దల్లడిల్లుచుఁ బాఱి - దనుజేంద్రుతోడ
హతశేషు లెఱిఁగింప - నదివిని క్రోధ
మతిశయింపుచును ద - శాననుండలిగి
తగినట్టి పడవాళ్ళఁ - దనకోడ పదిల
మగునట్టి వృత్తాంత - మగయంగఁబనిచి 4850
కొలువు సావడికి న - ల్గురు సతుల్ వెంట
గొలువఁ దావచ్చి సి - గ్గున తెంపు మఱచి
దళవాయి పెద్దప్ర - ధానుఁ డాప్తుండు
కులవృద్ధుఁడును నీతి - కోవిదుఁడైన
సురకంటకుని ప్రహ - స్తునిఁజూచి కాల
మరికట్టుకొనిన ద - శాననుం డనియె

"బలి వామనునికి లోఁ - బడిన చందమున
బలవంతుఁడగు నకం - పనుఁడు వాయుజుని
కెదిరించి పోరిలో - నీల్గిన యప్పుడె
కొదవ దైత్యులును గ్రమ - గ్గుట నిక్కువంబ 4560
యైన నేఁబూనిన - యట్టికార్యంబు
మానుదునే యభి - మానంబు మాని ?
ఏనొండె నీవొండె - యింద్రజిత్తుండు
తానొండె నా పెద - తమ్ముఁడొండేని
కలనికిఁ బోవలెఁ - గాక యన్యులకుఁ
దలచూపరాదు నీ - తాకాంతు నెదుర
నానాట హితుఁడవై - నామేలుగీళ్ళ
లోనైన వాఁడవై - లోకంబులందు
నెనలేని మగఁటిమి - నెసఁగిన నీవె
చనుటొప్పు వానర - సమితిఁ ద్రుంపుటకు 4870
నెవ్వానిఁ బనిచిన - నేఁగుటేకాని
చివ్వకుఁ బోయి వ - చ్చినవాఁడు లేఁడు.
నీవైనఁ గెలిచి రా - నేర్తువు నిన్ను
దేవతలైన నె - దిర్చి పోలేరు
పోవంటివేని త - ప్పునె విధివిహిత
మైనయర్థంబు నీ - వని కేఁగితేని
యచ్చటి విజయంబు - నపజయంబొకరి
యిచ్చరాదది నిశ్చ - యింపంగ రాదు
చాలంగ మదిని యో - జనచేసి నీవు
నేలీల సరిపోయె - నిదికార్య మనుము 488

సూచింపుమనఁ బ్రహ - స్తుఁడు దశాననునిఁ
జూచి విచారించి - శుక్రుండు మున్ను
పామరుఁడగు వృష - పర్వునితోడ
సామోక్తులాడిన - జాడ నిట్లనియె
" అయ్య! నీసొమ్ము క - లంత కాలమును
నెయ్యంబున భుజించి - నేర్చిన మేము
జగడంబునకుఁ బోవఁ - జావకమాన
నగునె యిప్పుడు నిశ్చ - యంబైన యదియె
నెన్నఁడు జానకి - నియ్య నేననుచుఁ
బిన్నపెద్దన్నవి - భీషణుతోడఁ 4890
బలికితివో నాఁడె - బ్రతుకులమీఁదఁ
గలయాశ యెంతయుఁ - గడకుఁ ద్రోచితిమి.
నీకునై పుత్రుల - నెలఁతలఁ బాసి
పోకార్చెదము ప్రాణ - ములు సంగరమునఁ
జెప్పిన యంతయుఁ - జెల్లింతు ననుచు
నప్పుడె తనసైన్య - మంతయు నటకుఁ
బిలిపించి ప్రస్థాన - భేరి వేయించి
సలలిత దివ్యభూ - షణములు దాల్చి
హోమకార్యాదికం - బుర్వీసురాలి
యామున్నె కావించి - యాశీర్వదించి
యక్షతలిడ నంది - యాదల నుంచి
రాక్షసేంద్రుఁడు వంప - రణకౌతుకమున
ననుకూల మతికుంభ - హనుమహానాదు
లన సమున్నతుఁడు న - రాంతకుఁడనఁగ
నలుగురు మంత్రులు - నలుగడఁగాచి

కొలువఁ బ్రహ - స్తుండు కోట వెళ్లుటయు
సమభూమి నురక య - శ్వంబులు మ్రొగ్గె
తెమలి చేనున్న హే - తి ధరిత్రిఁ బడియె
సారథి తరుటు మో - సము చేయివదలె
చేరువగాఁగ వ - చ్చెను జంబుకములు 4916
నంజుఁడు మెసవు నం - డజములు దిరిగెఁ
గెంజాయ గవిసె నిం - గి నకారణముగఁ
బుడమి నుల్కాజాల - ములు రాలె మిగుల
చెడునిమిత్తములు మిం - చెను రాక్షసులను
పాటించి చూడక - ప్రాగ్ద్వారరత్న
హాటకమయ కవా - టావళి గడచి
ధనువు మ్రోయించుచుఁ - దనమీఁద నడచు
దనుజనాయకుని ప్ర - ధాని నీక్షించి
యెవ్వఁడు వీఁడన్న - యెడ విభీషణుఁడు
దవ్వులఁజూచి చెం - తకుఁ జేరి పలికె. 4920
"దేవ! ప్రహస్తుఁ డా - దిత్య దుర్జయుఁడు
రావణుమంత్రి ధై - ర్యవివేకశాలి
రావణుబలము స - ర్వము రెండుపాళ్లు
భావింప నీతని - బలమొక్కపాలు
నై యుండు లంకలో - నమరులు వీని
కయ్యంబునకు తలం - కని వారు లేరు
బలవంతుఁ" డనునంత - పర్వతవృక్ష
ములుదాల్చి వనచర - ముఖ్యులందఱును
నెదురుగాఁ బరువెత్తు - నెడ రాక్షసులకుఁ
గదనంబు వారితోఁ - గడు ప్రేఁకమయ్యె. 4930

—: ప్రహస్తుని యుద్ధ నైపుణ్యము :—

ఇరువాగు జగడించి - యిందు నందులను
సరిబాలుగా నీల్గు - సమయంబు నందుఁ
గోపంబున నరాంత - కుఁడు వనచరుల
నేపు మాయఁగఁ జంపి - యెదిరించి రాఁగ
కొండయొక్కటి కేలఁ - గొని ద్వివిదుండు
దండపూనికి నిల్చి - దర్పించి వేయ
నదిమీఁదఁ బడి యవ - యవము లన్నియును
జదిసి యేర్పడరాక - సమసిపోఁజూచి
దుర్ముఖుఁడనెడు కోఁ - తులరాజు సమర
దుర్ముఖుని సమున్న - తుని నెదిరించి 4940
యొకచెట్టునే వ్రేయ - నొక్క పెట్టునను
పకపక కోఁతుల - పైకంబు నవ్వఁ
దలక్రిందుగాఁబడి - దైత్యులుబెదర
విలవిలఁ దన్నుక - విడిచె ప్రాణములు.
వంతులకై జాంబ - వంతుఁడు గినిసి
యంతకు బోలి మ - హానాదు మీఁద
గిరిశృంగ మగలించి - కెరలి వేయుటయు
సిరముపైఁ బడి వాఁడు - క్షితిమీఁద ద్రెళ్ళె.
తారుండు విక్రమో - దారుఁడై దీర్చి
యారూఢబలు కుంభ - హనుబోవనీక 4950
పట్టుక ధరణిపైఁ - బడవైచి మడత
వెట్టి వాని గళంబు - పెళ్లున విఱిచె
నపుడు ప్రహస్తుఁ డా - యతదీర్ఘవహస్తుఁ
డపరిమితాత్మ మా - యా ప్రశస్తుండు

దారుణాస్త్రయు క్తో - దండదండమున
నారి సారించి బా - ణములు పూరించి
కపులపై లయకాల - కాలుఁడో యనఁగఁ
గృపలేక వధియింప - కీశపుంగవులు
పుడమిఁ ద్రెళ్లిలి రక్త - పూరంబు చాల
జడిగొని గురియ రా - క్షసుల నెత్తురులు 4960
నేకమై ప్రవహింప - నిరువాగు మూఁక
చీకాకుగా మడి - సిన జూడనయ్యె
పడియున్న వానరుల్ - పర్వతంబులుగఁ
బడగలు పాముల - పడగలుగాఁగఁ
దెగిన రక్కసులు ధా - త్రీరుహంబులుగఁ
బగులు తేరులు మహా - ప్లవములుగాఁగఁ
దొరగినయట్టి నె - త్తురులు నీరముగఁ
బరిపాటి మేదంబు - బలురొంపిగాఁగఁ
బుండరీకంబులు - పుండరీకముల
కండలు విరియు చెం - గలువలుగాఁగ 4970
జత వెల్ల జల్లుల - చాలు ఫేనములు
జతగూడు కేశముల్ - శైవాలములుగ
మేటిపెక్కెములు తాం - బేటి గుంపులుగ
గాటపుటమ్ములు - గండుమీల్ గాఁగ
నెత్తురుటేరులు - నీరాకరంబు
పొత్తుగూడిన రణం - బున యోధవరులు
రోఁదుచు మేనుల - రుధిరముల్ నిండ
నీఁదు నాడుచుఁ బోరు - నెడ తేఱిచూచి

రావణుమంత్రి శ - రప్రకాండముల
లావులుచెడ కపు - లను మర్కమార్చ 4980

—:నీలుఁడు ప్రహస్తునెదుర్కొని యాతనిఁ బొలియించుట:—

వనచరులకు దళ - వాయి నీలుండు
కనుగెంపుఁగదుర నొ - క్కఁడు నెదురెక్కి
జగడింప నస్త్రవ - ర్షంబులు ముంచి
దగదొట్ట శోణిత - ధారలో ముంచి
శూరత్వమున ప్రహ - స్తుఁడు పచారింప
శ్రీరామభటుఁడొక్క - చెట్టుచేఁ గొటికి
యదలించి వ్రేయ ప్ర - హస్తుని తేరు
చిదురుపలై విల్లు - సిడమును విఱిఁగి
సారథి చచ్చి య - శ్వంబులు మడిసి
రారాని దురవస్థ - ప్రాప్తమౌటయును 4990
నిలమీఁదఁబడి లేచి - మొదలోని దిటము
చలము నగ్గలికయు - శౌర్యంబుమీఱ
గదకేలఁ గైకొని - గద్దించి నీలు
నెదురొమ్మును మొగమ్ము - నెమ్ములు విఱుగ
మోదుటయును గాత్ర - మున గదాహతిని
మోదులుగట్టు రా - మునిబంటు గినిసి
వానలో జడియక - వచ్చు నాబోఁతు
పూనిక నీలుఁడ - ప్పుడు చెట్టుచేతఁ
గొట్టిన నదిలెక్కఁ - గొనక ప్రహస్తుఁ
డట్టహాసముచేసి - యసురనాయకునిఁ 5000

జెనకు వృత్రాసురు - చెలువున చేతి
పెనుగదచే నొసల్ - బెట్టు గొట్టుటయు
గాలిచే సాలంబు- గదలు చందమునఁ
జాల గంపించి యె - చ్చరిక నేమఱక
చట్టు కేలఁ బెకల్చి - సారించి వ్రేయఁ
గొట్టుచేఁబడి గుట్ట - గొంకు బడ్డట్లు
నలినలియై వాఁడు - నలినాప్తసుతునిఁ
గొలువఁ బోవుటయు ర - క్షో వీరభటులు
నీలుఁడు తెగి చంప - నిలువక జలము
వేలంబు నగఁబోవు - విధమునఁ జెదరి 5010
పారి రావణున కీపా - ట్లెల్లఁ దెలుప
వారి మాటలకు రా - వణుఁడు చింతించి
పై కార్యమునకు ను - పాయాంతరంబు
లేక తపించి జా - లినిఁ బొందునంత
నానీలు శౌర్యము - హాంబుధి యిట్లు
జానకీపతి విభీ - షణ రవితనయ
సౌమిత్రి ముఖ్యులు - సంతోషమందఁ
జేమోఁగిడించి ని - ల్చిన నీలుఁజూచి
కపులెల్ల నుత్సాహ - కలితులై పొగడి
యపరిమితానందులై - యున్నయంత. 5020

—: రావణుఁడు యుద్ధమునకు వెడలుట :—

అచట రావణుఁడు రౌ - ద్రాకృతిచేత
నచలుఁడై "యోర! ప్ర - హస్తుఁడిన్నాళ్లు

నింద్రాదులను గెల్చు - నిప్పుడు రామ
చంద్రునిచే నప - జయము పాలయ్యె
నటువంటి మంత్రి లే - నట్టి యీరాజ్య
మెటుఁబోయె నేమి యే - నేడిక మీఁద
వోవుదు రాముఁ జం - పుదుఁ గపులెల్లఁ
జావకుందురె నాదు - శరములచేత ?"
అని తలంచుక లేచి - యాప్తులైనట్టి
దనుజనాయకులు ప్ర - ధానులుఁ గొలువ 5030
విజయభేరీశంఖ - వీరానకముల
గజగజ ధరణి యా - కంపంబు నొంద
మందరశైలోప - మానమైనట్టి
స్యందనం బెక్కి భూ - షణరుచుల్ నిగుడఁ
జతురంగ బలముల - సంఖ్యముల్ గాఁగ
జతగూడి వెంటరా - సారథితోడఁ
బౌరుషంబులు చాలఁ - బలుకుచుఁ బోయి
వారలు నుత్తర - ద్వారంబు వెడలి
దండి వారుల సము - ద్రము వెల్లివిరియు
మెండున డెగి తమ - మీఁద రాఁజూచి 5040
కపులు భీతిఁ దలంకఁ - గాకుత్స్థతిలకుఁ
డప్పుడా విభీషణు - నండకుఁ బిల్చి
"యెవ్వఁడీ వచ్చు న - హీన బలాఢ్యుఁ
డెవ్వార లీదార - లిందఱుఁ గూడి
వచ్చెద"రన రఘు - వర్యునిఁ జూచి
సచ్చరిత్రుఁడు విభీ - షణుఁ డిట్లువలికె

—: విభీషణుఁడు శ్రీరామునకు రాక్షససైన్యమునందలి మహానాయకులఁగూర్చి రావణునిఁగూర్చి చెప్పుట :—

### 1. అకంపనుఁడు

" అయ్యా ! యేనుఁగు బారు - లన్నియుఁ దనదు
కయ్యంబునకు నానఁ - గా సమకట్టి
గొప్పయేనుఁగుమీఁద - కుంభముల్ చేత
నప్పళింపుచు గుంకు - మాలేపనంబు 5050
పైనున్న చెంగావి - పటము కెంజాయ
తోఁ నెనయంగ వ - ర్తుల లోచనములు
నిప్పులు రాలంగ - నిజబిరుదంబు
లుప్పతిలఁగ బట్టు - లుభయపార్శ్వములఁ
దనవిజయాంక ప - ద్యంబులు చదువ
వినుచు ముందఱ వచ్చు - వీఁడకంపనుఁడు.

### 2. ఇంద్రజిత్తు

పంచానన ధ్వజపట - పటాత్కార
సంచలద్దశదిశా - చక్రుఁడై వెనుకఁ
గోఱలు మదదంతి - కొమ్ములంబోడఁ
బోరామి సేయఁ జూ - పునమంటలెగయఁ 5060
కోటీరకుండల - గురురత్నరుచుల
హాటకగర్భాండ - మలమి కొనంగఁ
దేరిపై దమతండ్రి - దృష్టిమార్గమున
శూరత మనమీఁదఁ - జూపంగవచ్చె
నింద్రుని చెఱసాల - నిడిన గర్వమున
నింద్రజిత్తనెడి వీఁ - డితఁడు గన్గొనుము.

### 3. అతికాయుఁడు

విల్లింద్రధనువుతో - వీఁడు జోడాడ
నల్లె మీటుచు నట్ట - హాసంబుతోడ
నతికాయ విజితాంజ - నాచలుఁడైన
యతికాయుఁ డావచ్చు - నతనిఁ జూచితివె. 5070

### 4. మహోదరుఁడు

తాను సింగాణిపైఁ - దాల్చిన ఘంట
లేనుఁగు ఘంటలు - నేకమై మొరయ
దారుణతరమహో - దర మహోదరుఁడు
శ్రీరామ ! వాఁడె వ - చ్చెను విలోకింపు.

### 5. పిశాచుఁడు

పిడుగుకై వడి మేనఁ - బుట్టినయట్టి
తొడవులు మెఱువుల - తో వియ్యమందఁ
దురికి తురంగంబు - దుమికించుకొనుచు
సురమాయజల్లు లం - చుల నెగయంగ
గబునితోడఁ గుళాయి - కశమూఁడనిక
యుబుకుచు కట్టెర - లోహోయనంగ 5080
నతిశయధారావి - హారియైవచ్చె
నతనిఁ జూడు పి - శాచుఁ డనువాఁడు దేవ !

### 6. త్రిశిరుఁడు

వృషభవాహనురీతి - వినుమోచి వచ్చు
వృషభంబుపై నెక్కి - విలు కేలఁ బూని

యమ్మేర్చి పట్టుక - యదె త్రిశిరుండు
కమ్మకవచ్చె రా - ఘవ ! చూడు మతని.

7. కుంభుఁడు

కాకోదరధ్వజ - ఘంటికారావ
మూకీకృతసుపర్వ - ముఖ్యుఁడితండు
శూలమార్పుచు వచ్చెఁ - జూడుము జాన
కీలోల ! కుంభు స - కిల్బిషారంభు. 5090

8. నికుంభుఁడు

పరిఘంబు చేఁబూని - పలలాశులైన
దొరలెల్ల వీనిచేఁ - దోడాస వడఁగ
సింజిని మొరయ వ - చ్చెను నికుంభుండు
కంజాప్తకులదీప! - కనుఁగొమ్ము వీని.

—: నరాంతకుఁడు :—

శరచాపముద్గర - శక్తిత్రిశూల
కరవాల తూణీర - కవచముల్ గలుగ
రథమ్ముపై రణమనో - రథముతో వచ్చె
పృథుశక్తి దానవ - బృందంబుఁ గొలువ
దశకంఠునకు వీఁడు - దక్షిణభుజము
దశరథరాజనం - దన ! నరాంతకుఁడు. 5100

9. రావణాసురుఁడు

శరభవరాహాంకే - సరి మహిషోష్ట్ర
హరిగజవృషభ వృ - కాననులైన
దానవయోధులు - తనచుట్టుఁ గొలువ

మేనిచాయలు నీల - మేఘముల్ నెఱప
మణిమయకుండల - మకరకేయూర
రణితనూపురవిభా - రాశి మిన్నులను
లాలితసూత్న్నశ - లాకలతోఁడఁ
ప్రాలేయకిరణ బిం - బము డంబు మాపు
ధవళాతపత్రంబు - తపనీయదండ
మవు చామరద్వీత - యము విరాజిల్ల 5110
దివ్యాస్త్రకోదండ - దీప్తులు వెలయ
దివ్యులు తనుజూచి - దిగులుచే నొదుగ
సంహికేయధ్వజ - స్యందనం బెక్కి
సింహశౌర్యుఁడు వింధ్య - శిఖరిగాత్రుండు
నై వచ్చువాఁడె మా - యన్న యతండె
రావణాసురుఁడు శ్రీ - రామ ! వీక్షింపు
దనుజేంద్రుతో మోపుఁ - దల కయ్యమబ్బ
మన"కన్న పరమాప్తు - మాటలాలించి
వెఱగులోఁ గను దెప్ప - ప్రేయక చూచి
ధరణిజారమణుఁ డా - తనికి నిట్లనియె. 5120
" సురగరుడోరగ - సుఁసిద్ధసాధ్య
నరులందు విన్నక - న్నమహామహులను
నింతటివాఁడు లేఁ - డేఁ జేయుపుణ్య
మెంత యోకాని నేఁ - డితనిఁ జూచితిని
సీతను వీఁడు తె - చ్చిన నిమిత్తముగ
చేతో విషాదంబుచే - నలంగెదను.
ఆకోప మీరావ - ణాసురు మీఁద
నీకుపహతంబుగా - నిశితబాణములఁ

జూపుదుననుచు న - ర్చులు నిగుడంగ
రోపంబులంది యా - రోపితోద్దండ 5130
కోదండపాణియై - కోసలరమణుఁ
డాదండ తనతమ్ముఁ - డట్లన యుండ

—: రావణుఁడొక్కఁడే తొలుత యుద్ధ సన్నద్ధుఁడగుట :—

నెదురింప సీదాస ॥ వేంద్రుఁ డెచ్చరిక
వదలక తానిందు - వచ్చినయపుడె
లంకలో కపులు చి - ల్లర సేతు రనుచుఁ
గొంకి యందఱు గనుఁ - గొని మీర లెల్ల
మనకోటలోన నే - మఱక వాకిళ్ళ
దనుజుల నునిచి సీ - తారక్షణమునఁ
గనుగల్గియుండుఁ డీ - కపులరాఘవులఁ
దునిమి వచ్చెదను మీ - తోడల యనుచు 5140
నందఱ మఱలంగ - ననిచి యొక్కరుఁడు
స్యందనంబురవడి - సారథనడపఁ

—: సుగ్రీవుఁడు రావణు నెదుర్కొని మూర్ఛిల్లుట :—

గలనికి రాఁజూచి - కమలాప్త సుతుఁడు
బలుగొండ యొకటి చేఁ - బట్టి యెదిర్చి
వేయఁ జేరిననొక - విశిఖంబుఁ గొడిగి
యాయద్రి శకలంబు - లై పడనేసి
వేఱె యమ్మొక్కటి - వింట సంధించి
యారావణుఁడు వేయ - నాయమ్ము వచ్చి

నాయమ్ము నాటిన - యపుడు కుమార
సాయక నిహతిఁ గ్రాం - చ నగంబురీతి 5150
హాయని కూయుచు - నురముపై వలుద
గాయమ్ముచేత న - ర్కసుతుఁడు వడిన
శతబలి గజగవా - క్షసుషేణవాలి
సుతతారగవయాది - శూరవానరులు
నగములు నగములం - దఱుఁ బూని యెదిరి
జగడింపఁజూచి రా - క్షసనాయకుండు
నొక్కొక్క తూపుచే - నొక్కరొక్కరుని
లెక్కగా ధరణిఁ గూ - లించినఁ జూచి
శరచాపహస్తుఁడై - జానకీప్రియుఁడు
దురమున కేఁగఁ జే - దోయి మొగిడ్చి 5160
మఱుగుగా నిలిచి ల - క్ష్మణుఁ డన్నతోడ
చరణాబ్జముల వ్రాలి - సమ్మతిఁ బలికె.

—: శ్రీరాము నాజ్ఞచే రావణునిపైకి వెడలు లక్ష్మణుని
కడ్డుపడి హనుమంతుఁడు రావణునెదుర్కొనుట :—

" దేవ! మీారేల పై - తేయేంద్రు నెదిరి
కావరంబడఁగించి - కలన జయింతు
సెలవిండు మీాయాజ్ఞ - చేఁగాని వాని
తలఁ ద్రెవ్వనేయక - తాళి వచ్చితిని "
అన ననుగ్రహబుద్ధి - నవనిజాప్రియుఁడు
మనసులో నటుల స - మ్మతమంది యతని
నాలింగనము జేసి - " యులఁతినిఁ బోవఁ
డాలంబులోన - నింద్రాదులకైన 5170

పీఁడజేయుఁడు ధను - ర్వేదపారగుఁడు
వేఁడిమిఁ జూప నీ - వేళఁ బైకొనియెఁ
దగినట్టి దివ్యసా - ధనములచేత
జగడింపు మెఱిఁగి యె - చ్చరికతోననుచుఁ
బనిచిన వెంటయుఁ - బ్రణమిల్లి లేచి
యని సేయ సన్నద్ధుఁ - డై నడచుటయు
నడ్డంబుగావచ్చి - యాసమై గాలి
బిడ్డండు దనమేను - వెంచి కుప్పించి

—: రావణ హనుమంతుల యుద్ధము :—

రావణు నెదిరించి - "రాక్షసనాథ!
ఏ వచ్చినాఁడ ని - న్నెదిరించి గెలువ 5180
వెఱచిన వేల్పుల - వెంటాడినట్ల
హరివీరులను గెల్తు - మనుమాట వలదు
నాచేత నీకు ప్రా - ణభయంబె కాని
త్రోచిపోవంగ శ - క్యుండవుగావు.
ఎఱుఁగవే తలఁచుకో - మ్మాపు"నన్నినన
సురవైరి యంజనా - సుతున కిట్లనియె
"ఎఱుఁగుదు రోరి! నీ - వెంత నన్నెదురఁ
దరమెనీకెంత స - త్వంబున్నఁగాని
యుద్ధంబులో నిరా - యుధుఁ జంపరాము
సిద్ధంబుగాన నా - చెయి చూఁడుమిపుడు 5190
ఒకపెట్టుచేత ని - న్నుర్వపాఁజేసి
వికటించు రాము - నావెనుకఁ ద్రుంపుదును"
అన "నోరి! రాత్రించ - రాధమ! నీదు

తనయు నక్షాసురు - దండించు నపుడు
నిదుర వోతినో కాక - నీవు నాఁడేమి
మదిరామదంబుచే - మఱచితో మేను
నా పెట్టుపడిన వె - న్కకు మొదలంగ
నోపవు నీచేతి - యురవడియెల్లఁ
జూచితి యీ మీఁదఁ - జూచెదవిపుడు
చాఁచిన నాభుజా - స్తంభ విక్రమము" 5200
అనునంత నరచేత - హనుమంతు గ్రేయ
కను తేలగిలవైచి - కళవళింపుచును
గ్రక్కునఁదెలిసి రా - ఘవకింకరుండు
మొక్కసంబున తన - ముష్టిఘాతమున
నురముపైఁ బొడిచిన - నుర్వ్యాగ్నిఁగాంపఁ
దెరలి కంపించు ధా - త్రీధరంబనఁగ
గడగడవణఁకి రా - క్షసనాయకుండు
గడియకుఁ దెలిసి యా - గ్రహ ముదగ్రమున
" మేలు వాయుజ ! నిన్ను - మెచ్చితి నింత
చాలదె నీభుజా - శక్తిఁ జూచితిని 5210
నాయంతవాని వా - నరుఁడవై యుండి
కాయంబు గడగడ - కంపించుపాటి
సత్త్వవ చూపితి - చనుము పోకున్నఁ
జత్తు వాత్మీయభు - జాప్రహారమున"
అనుమాట విని రావ - ణాసురుఁజూచి
కినుక నిట్లనిపల్కె - కేసరిసుతుండు
" మెఱమెప్పులకు నేల - మెచ్చెదునాదు
కరముష్టి నీదు వ - క్షముఁ బొడిచియును

మఱిల బ్రాణములతో - మాటాడినపుడె
పరిహాస మియ్యని - పలుకు లేమిటికి 5220
నగ్గింపనేల బా - హాశక్తి దనదు
సిగ్గయ్యె నిన్ను మె - చ్చితి నోర్చినపుడె"
అనవిని యాదాన - వాగ్రణి యలిగి
హనుమంతు హనువుపై - నఱచేత వ్రేయ
నాకొట్టుచే భూమి - నవశుఁడై యతఁడు
మోకరించుక వ్రాలి - మూర్ఛిల్లుటయును

—: హనుమంతుఁడు రావణునితోఁబోరి మూర్ఛిల్లఁగా నీలుఁడెదిరించుట —

నీలుఁడెదిర్చి కం - టినికంటి వనుచు
సాలంబు వ్రేయ రా - క్షసనాయకుండు
శరముచేఁ దునిమిన - శైలంబు నీలుఁ
డురుశక్తిచేఁబూని - యొక్కండు నెదుర 5230
నంతలోఁ దెలివొంది - యాంజనేయుండు
పంతంబు విడువక - పంక్తికంధరుని
కనుఁగొని "ఓయి! రా - క్షసనాథ తనకు
నని సేయ రాదు నీ - వన్యునితోడ
నెదిరించి పోరాడ - నెడనంచుఁ బలుక
నది మది నెంచక - యసురనాయకుఁడు
నీలుఁడెత్తిన కొండ - నిమిష మాత్రమున
వాలంపుఁ గోలచే - వ్రయ్యలు చేసి
చూచి వానరులెల్ల - సోద్యంబు నందఁ
బూచిన కింశుక - భూరుహంబనఁగ 5240

నెత్తురు లతనిమ్మై - నిండ బాణములు
చిత్తజల్లుగ నేయఁ - జెదరక యతఁడు
మాయాబలంబుచే - మారట కొండ
చాయఁ బెంచిన మేను - సన్నంబు చేసి
కొంచపు రూపు గై - కొని మింటి కెగసి
ప్రాంచలంబున రఘు - ప్రవరులు వొగడ
దనుజేంద్రు రథము కే - తనముపై వ్రాలి
కనుచాటుగా భుజా - గ్రంబుల దుమికి
వింటికొపున కెక్కి - విబుధారి వరుని
కంటికి తన నిలు - కడఁ గానరీక 5250
తలమీఁద చంగున - దాఁటి కిరీట
మిల దొల్లఁగాఁ దన్ని - యెత్తిన శరముఁ
జేత నందుకొని త్రుం - చి శిరోధి తనదు
శాతనఖాళి జ - ర్జరితముల్ చేసి
వెనుకపాటుని నిల్చి - వెన్నుపైఁ గఱచి
కనుబ్రామాలనుండి మొ - గంబున కెగసి
చీకాకు పఱచి వి - చిత్ర లాఘవము
లాకీశవర్యులౌ - ననిమెచ్చి వొగడఁ
గేడించి మగఁడ బె - క్కేమునకుఁ బ్రాకి
వ్రీడ నొందించిన - విసివి రావణుఁడు 5260

—: నీలుఁడు రావణుచే మూర్ఛితుఁడగుట :—

"చిత్రయుద్ధము వీఁడు - చేసె నౌరౌర
మాత్రాధికము నీలు - మహిమం" బటంచు
గుఱుతుగా బెక్కేపుఁ - గొననుండఁ జూచి

శిరమెత్తి పావక - జిహ్వాగ్రం బేర్చి
తొడిగి "మాయావి కోఁ - తులలోన వీఁడు
జదియించె నన్ను మో - సము చేసి" యనుచు
సంధించి వ్రేసిన - చనుమఱ నాఁటి
గంధమాదనముఖ్య - కపికోటి యెడల
యమరులకెల్ల హా - హాకార మెసఁగ
భ్రమణంబుతో వచ్చి - పడియె నుర్వరను 5270
ననలుఁడు తనతండ్రి - యగుట నానీలుఁ
డనలాస్త్రనిహతిచేఁ - బ్రాణముల్ వోక
పడియున్న దానవ - పతి వింట శరముఁ
దొడిగి కోఁతులనెల్లఁ - ద్రోఁలుచు రాఁగ
శరచాప హస్తుఁడై - సౌమిత్రి యెదిరి
గరువంబు మగఁటిమి - గనుపించఁ బలికె

—:లక్ష్మణుఁడు రావణాసురునెదుర్కొని యుద్ధముసేయుట:—

"రావణ! యీ వాన - ర శ్రేణి నేల
చావనేసెద విది - శౌర్యంబు తెఱఁగె?
నామీఁద నెదిరించి - న నెఱుంగవచ్చు
నీమార్గణాసార - నిపుణత్వ" మన్న 5280
మాటయు జ్యాలతా - మహితారవంబు
నూటిగా వీనులఁ - జుఱుకు పుట్టింప
దానవపతి సుమి - త్రాపుత్రుఁ జూచి
లేనవ్వు సెలవిగి - లించి యిట్లనియె
"పూని యేఁ జేసిన - పుణ్యంబు కతనఁ
గానిపించితివి నా - కన్నుల యెదుర

బంటవై నిలువుము - పాఱక నన్ను
వింటివో లేదో యే - వెంటఁ గీర్తింప
రావణాసురు సుమి - త్రాకుమారకుఁడు
తావచ్చి యెదిరి యు - ద్ధము చేసెననుచుఁ 5290
బొగడికల్ గనసీవు - పోటరివోలె
తెగి నిల్చినప్పుడె - తెలిసె నందఱికి
మంచి బంట్రౌతు ధ - ర్మమువాఁడవౌదు
వెంచిరప్పుడె నిన్ను - నెఱిఁగితి నేను
తోడుగు" మమ్మని పల్కు - తోనె సుమిత్ర
కొడుకు రావణునిఁగ - న్గొని యిట్టులనియె
"ఎల్లరుఁ బొగడఁగ - నెఱుఁగమే నిన్ను
చెల్లరే విల్లు నీ - చేతనుఁ గలిగి
యాయుధపాణి నే - నై యెదిరింప
మాయన్న సాక్షియై - మనలఁ గన్గొనఁగ 5300
నిప్పుడు గాక యిం - కెన్నటి కన్న
దెప్పటి నిశౌర్య - మెఱుఁగ వచ్చితిని
సీతను ముచ్చిలిం - చిన నాఁడె తెలిసె
వాతింట జూపాటు - వార్తలేమిటికి
బంటవౌదువు నిల్చి - బవరంబుఁ జేసి
కంటికి నిద్దురఁ - గనుపింపు మఱల"
అనిన నాగ్రహముతో - నసురనాయకుఁడుఁ
గనఁగన కాలాగ్ని - కణములు రాల్చు
తూపులైదును రెండు - తొడిగి లక్ష్మణుని
ఛాపొమ్మనుచు నేయ - శరము లేడింట 5310

నవి నడుమనె త్రుంప - నసురేంద్రుఁ డలిగి
వివిధాస్త్రకోటులు - వెన్నెల్లఁ బొదువ
వేసిన నవి యెల్ల - విశిఖ లాఘవము
రాసి కెక్కఁగ సుమి - త్రా కుమారకుఁడు
వారింప శౌర్యదు - ర్వారుఁడై దేవ
తారి ముఖ్యుండు బ్ర - హ్మావరంబు చేతఁ
గన్నట్టి యొకమహా - కాండంబుఁ దొడిగి
మిన్నుల నెఱమంట - మీఱ నేయుటయు
నదివచ్చి వానరు - లాహాయనంగ
నుదురు నాఁటుటయుఁ గ - న్నులుమూసి భ్రమసి 5320
తోడనె తెప్పిరి - దుర్వారశక్తి
చూడుమంచు నమోఘ - సునిశితాస్త్రమున
దనుజేంద్రు చేతికో - దండంబు రెండు
తునియలుగా నేసి - తూపులుమూఁటఁ
జనుమఱ నాటించి - శరపరంపరలఁ
దనువెల్ల జర్జరి - తంబు సేయుటయు
విలయకాలాంతకు - విధమున దైత్య
కులపతి శక్తిఁ గై - కొని యాగ్రహించి
సురలెల్లఁ బెగడ నా - సురకోటి వొగడ
హరివీరులకు భీతి - యాత్మల నిగుడ 5330
వేసిన యది చండ - విలయమార్తాండ
భాసురకిరణ ప్ర - భారాశి యగుచు
నెన్నని దుష్ఫల - నేసినఁ బోక
యన్నింటి భ్రమించుచు - నరికట్టులేక
వచ్చి యాసౌమిత్రి - వామ వక్షమునఁ

గ్రుచ్చక యొకపిడు - గును బోలి పడిన
యందుచే మూర్ఛిల్లి - యతనిఁ ద్రెళ్లుటయుఁ
దుందుడుకునఁ దేరుఁ - ద్రోలుక చేరె
లంకాధినాథుండు - లక్ష్మణు నెత్త
నుంకించరాగాఁక - యూరక పెనఁగి 5340
కైలాస మందరా - గములు వెకల్పఁ
జాలిన తనదు దో - శ్శక్తి యంతయును
సౌమిత్రి వైష్ణవ - శక్తిచేఁ బొలిసి
యేమియుఁ గొలఁగాని - యెడ నెడదూరి

—:రావణుఁడు లక్ష్మణుని పై శక్తి ప్రయోగించి మూర్ఛిల్లఁజేసి తీసికొని పోవుటకుఁ బ్రయత్నించుట - హనుమంతుఁడడ్డుపడి లక్ష్మణుని రాముని యొద్దకుఁ జేర్చుట :—

యడ్డంబుగా వచ్చి - హనుమంతుఁ డలుక
రొడ్డపెట్టసురేంద్రు - రొమ్ముపైఁ బొడువఁ
గుట్టూర్పులిచ్చి మూ - ర్ఛుచును మూల్గుచునుఁ
జుట్టుకవడి నోట - చొంగలు వడియఁ
జెవులన ముక్కునఁ - జిల్లున రక్త
నివహంబు కాల్వలై - నిండిపాఱంగ 5350
నరదంబుపై వ్రాల - నపుడు లక్ష్మణునిఁ
గరువలిపట్టి డ - గ్గరి జేరి మ్రొక్కి
కేవలాత్మీయ భ - క్తి స్నేహ వినయ
భావముల్ గానుపిం - పఁగ లేవనెత్తి
మూపుపైనునిచి రా - ముని సమీపమున
నాపుణ్యనిధి నుంచు - నాసమయమున

నూడి పేరెదనాఁటి - యున్నయాశక్తి
చూడగ రావణా - సురునిఁ జేరుటయుఁ
దెలివిడి వైష్ణవ - తేజంబు కతన
కలిగెను మగుడ ల - క్ష్మణ కుమారునకు. 5360
రావణుఁడపుడు మూ - ర్ఛఁ దొరంగి తేరు
పై విల్లునమ్ములు - బట్టి నిల్చుటయు
భ్రుకుటీ కరాళాస్య - పుష్కరుం డగుచుఁ
జికిలి నిగ్గులుదేరు - చిలుకుటమ్మొర్చి
నారి మ్రోయింపుచు - నడతేరఁ జూచి
శ్రీరాము చెంతకుఁ - జేరి వాయుజుఁడు

—: రామ రావణుల ప్రథమ యుద్ధము :—

"అరదంబు మీఁద ద - శాస్యుఁడున్నాఁడు
ధరణిపై నిలిచి యు - ద్ధము సేయనేల
దేవ ! నాభుజ - పీఠిఁ దిరముగానుండి
రావణాసురునిఁ బో - రజయింపుఁ డిపుడు. 5370
ఆరోహణము సేయు - మన వైనతేయు
నారాయణుం డెక్కి - న తెఱఁగు మీఁదఁ
బవమాన తనయాంస - భాగంబు మీఁద
రవివంశ మణియైన - రాఘవుండెక్కి
బలిమీఁద నడచు శ్రీ - పతివోలి దనుజ
కులనాథుపై నదు - ర్కొని యిట్లనియె
"రావణ ! నీవు ధ - రాపుత్రిఁ బొంచి
కావరంబున మమ్ముఁ - గానంగనీక

తెచ్చిన నిన్ను వి - ధింపఁగ నిటకు
వచ్చితి మొదట నీ - వారైన యట్టి 5380
దానవులను చతు - ర్దశ సహస్రములఁ
బూని జనస్థాన - మున మహూర్తమున
ఖరదూషణులతోడ - ఖండించువార్త
యెఱిఁగిన నినుదైవ - మిట వట్టి తెచ్చె
పోక నిల్వము కాక - పోయితి వేని
నీకు నడ్డంబుగా - నిల్చి కాచుటకు
హరిహయ బ్రహ్మన - లార్క శంకరుల
తరమె మదీయుశో - దండ దివ్యాస్త్ర
నైపుణి నీదుమా - నంబు ప్రాణములు
నాపోశనింపఁగా - నాశించె నిపుడు 5390
ననిలోన పుత్రపౌ - త్రాదులతోడ
నిను ద్రుంతు ననుచుఁ బూ - నితి నేప్రతిజ్ఞ
యెందువోయెదవు పో - యినఁ బోవనీను
కందువుగాక ల - క్ష్మణు నేయుఫలము"
అను మాటలోనె ద - శాస్యుండు ఘోర
వినిశిత బాణముల్ - వింట సంధించి
పవమాన తనయునిపై - నాటఁనేయ
జవసత్త్వ వేగతే - జంబులు మిగుల
నవనికి యినుమడియై - రాముఁ దాల్చి
జతనంబుగా నిల్వ - శరపరంపరలఁ 5400
దేరుచెక్కలు చేసి - తేజీల దునిమి
సారథిఁ జంపి ద - శగ్రీవు నురము
సరిగట్టి దొరదివ్య - శరముచే నేసి

సరకు సేయక నర్ధ - చంద్రబాణమున
దనుజేంద్రు మకుటంబు - ధరణి దొర్లించి
జనకజా రమణుండు - శౌర్యంబుఁ జూపఁ
దలవీడి తనయాయు - ధంబులు మఱచి
యిలఁ బడి లేచి ము - న్నింద్రుండు గినిసి
కులిశంబుచే నేయఁ - గొంచెపు నొవ్విఁ
దెలియక యురుదు ర్దై - తేయ నాయకుఁడు 5410
తన వ్రేటుచే దీప్తిఁ - దఱిగిన దాఁచు
వనజాప్తుఁడన విష - వ్రయుమైన జిక్కు-
చక్రికై వడిని తే - జము లేని దనుజ
చక్రేశుతో రామ - చంద్రుఁ డిట్లనియె.

—: రావణుఁడు లంకకు మఱలుట :—

"దానవనాథ ! నా - తమ్ముని నఖిల
వానరప్రభుల నీ - వాలు దూపులను
నొప్పించి జగడించి - నొంచితి గానఁ
దప్పనేటికి జావు - తనచేత నీకు
నిలువకు మిచట మ - న్నించితి నిన్ను
తొలఁగి లంకకుఁ బోయి - తోడుగా నీకుఁ 5420
కలిగిన బంధువ - ర్గము నెల్లఁ గూర్చి
కలనికి రమ్ము చే - కాచితి నిపుడు.
ఱేపు చూచెద వధ - రితశతమన్యు
చాప మామకశరా - సన జాయమాన
కనకపుంఖోజ్జ్వల - కాండప్రకాండ
కనదురుజ్వాలన శి - ఖాసమావలన

భస్మీకృతనిశాట - బలమహాటవిని
విస్మయంబున నిల్వ - వేళగాదనిన
సిగ్గును రోషంబు - చేcగామి కినుక
యగ్గలంబుగc గపు - లదరించి తఱుమc 5430
దలవాంచికొని లంక - దనుజనాయకుcడు
వెలవెల నగుచు ప్ర - వేశంబు చేసె.
తగిన యూథపథములc - దగురీతి కపుల
నెగులు దీర్పించి మ - న్నించి రాఘవుcడు
సకలభూతములకు - సంతోష మొదవ
నకలంక తేజుcడై - యలరుచున్నంత.

—: రావణుcడు లంకకుమఱలి, తన మంత్రులతోc దన పూర్వశాపములను దెలుపుట - కుంభకర్ణుని యుద్ధమునకుc బంపుటకై యాతని నిద్రనుండి లేపుట కాజ్ఞాపించుట :—

ఆలంకలోన ద - శాననుండాత్మ
జాలి నొందుచును కే - సరి వట్టి విడుచు
కరిపోల్కి గరుడుని - గాసిచేc గలcగు
నురగంబుమాడ్కి భ - యోపేతుcడగుచు 5440
దాశరథుల బ్రహ్మ - దండ కాండప్ర
కాశనూత్నతటిన్నికాశ - దివ్యాస్త్ర
పాతముల్ దలcపుచు - పంచాస్యపీఠిc
జేత చెక్కిలిc జేర్చి - చింతనొందుచును
తన యాప్తులైన మం - త్రసహాస్యవిదుల
దనుజనాథులc జూచి - తానిట్టులనియె.
“ఆజిలో నింద్రాదు - లైన దేవతల

నేజన్న మెత్తిన - యిన్నినాళ్ళకును
జీటికి సడ్డ సే - సినవాఁడ గాను
శ్రీరాముఁ డొకమాని - సి యనఁగనెంత 5450
నోడఁడే యితఁడు న - న్ను పరాభవించె
సూడిఁ ద్రిప్పెడు జాష - శోధించికాన
నాతపంబెల్ల మి - న్నక వ్యర్థమయ్యె
ధాత జెప్పినమాట - తలఁదాకె నిపుడు
మనుజులచే గల్గు - మరణంబటంచు
ననియె పూర్వమున నేఁ - డది సరివచ్చె
దేవగంధర్వదై - తేయ పన్నగుల
చే వధలేకుండఁ - జేసితి తపము
జనమాత్రులను గణిం - చని దోష మెల్లఁ
గనిపించె మనువంశ - కర్తయైనట్టి 5460
యనరణ్యుఁడనెడు మ - హారాజు తొల్లి
తనవంశమునఁ బుట్టి - దశరథవిభుని
సుతుఁడు రాముఁడు - పుత్రసోదరబంధు
యుతముగ నినుఁ జంపు - నుర్వి జన్మించి
నన్నట్టిమాట య - థార్థమై యిప్పు
డున్నది తనచేత - నుల్లంబు నొచ్చి.
ఆది బతివ్రత - యైన లతాంగి
వేగవతీనామ - విఖ్యాత తాను
పుడమి జన్మాంతరం - బున జనియించి
కొడుకులతో బంధు - కోటులతోడఁ 5470
జంపుదు నిన్నని - శపథంబు సేసె
చాంపేయగంధి యా - సాధ్వితావచ్చి

యీసీతమైపుట్టె - నిదిగాక నంది
చేసిన శపథంబు - చేకూడె నిపుడు
వనధికన్యకయైన - వనజాక్షి రంభ
పరిభవంబంది శా - ప మొసంగె తనకు
నట్టిశాపమును శై - లాత్మజ దిట్టు
తిట్టును నేఁడు వొం - దెను దైవగతిని.
ఇపుడైనదేమి యే - యే ప్రయత్నములఁ
గపులు చేరఁగ నవ - కాశంబులేక 5480
పదిలమైయుండుఁ డీ - పట్టున మఱలఁ
గదనంబునకు కుంభ - కర్ణుండుగాని
యితరుని బంపరా - దింట నిద్రాభి
రతుఁడై నిరస్తకా - ర్యభరంబుతోడ
నున్నవాఁడీవేళ - యూరటగాక
యున్నచేపని కింక - నొకనాఁటి కతఁడు
నెవ్వరెచ్చట బోయి - రేమి యటంచు
నివ్వలవ్వలిమాట - లేమియు వినక
యుండునె వీఁడు తా - నుండియు లేక
యుండియు నాపాలి - కొక్కరూపయ్యె. 5490
పనిచెడి బ్రహ్మశా - పంబుచే నెపుడు
తననిద్దురయెకాని - తలఁపఁ డేమియును
పొందు తోతెందు గొ - బ్బున మేలు కొలిపి
భండనంబున కేను - బనిచెద నతని
బలిమిని లేపుఁడా - బలవంతుఁడైన
గెలుచు భూమీశులఁ - గీశుల నదిరి

—: రాక్షసులు కుంభకర్ణుని నిద్రనుండి లేపుటకు వెడలుట :—

అని పంచుటయును దై - త్యశ్రేణివచ్చి
యనుపమ గంధమా - ల్యాంబరావళులు
నీరు మజ్జిగలు వ - న్నె రెళసీల్లు
సారాయికుండలుఁ - జక్కెరచట్లు 5500
కల్లుబిందెలు పాన - కంబులు చెఱకు
బిల్లలు మీఁగడ - పెరుగు కజ్జములు
నంజుడుల్ నించు బా - నలు లేఁతతాటి
ముంజెలు సుడిగొళ్లు - మొదలైనయట్టి
దాహోపశమన స - ద్రవ్యంబు లతని
గేహంబులోన గ్రి - క్కిఱియ నమర్చి
వచ్చి నేత్తురుల దో - బ్బలుఁ గొబ్బెరలను
దెచ్చి యాతని సమ - దృష్టి నమర్చి
యెటుచూడ యోజనం - బిరవైనయట్టి
పటువజ్రమయమైన - పడకింటిలోనఁ 5510

—: నిద్రాముద్రితుఁడైన కుంభకర్ణుని వర్ణన :—

గన్నుమోడ్చిన కుంభ - కర్ణునిఁజూచి
మున్నాడ దైత్యస - మూహమంతయును
నెగనూర్పు వెంబడి - నిలు చొరఁబాఱి
డిగనూర్పులను వాకి - టికి వెళ్లివచ్చి
గాలిచే నొగడాకు - గమివోలి శక్తి
చాలక తమయిచ్చఁ - జనచేతగాక
సుడిగొంచు సందుల - జుణిగియొక్కొక్కఁ

ఊడము చేసుక వెన్క - యిరువులనుండె
పాతాళగహ్వరో - పమమైన వర్త
లాతతవివృత భ - యంకరాననము 5520
గిరిగుహాయుగళంబుఁ - గేరుచు వేడి
కరువలి గల నాసి - కావివరములు
పెద్దకాటుక కొండ - పెక్కువ నినుప
ముద్దను మీఱు న - మోఘ కాయంబు
వంకరలగుచు ధా - వళ్యంబు మించి
సంకులఁ గేరు ని - శాతదంష్ట్రలను
దొనదొన నీఁగలు - తుట్టెలుగట్టఁ
బెనుగంపు కడనింపు - పెదవులజోడు
నేనుఁగు తుండంబు - లెంతలేదనఁగ
జానుల మీఱంగఁ - జాలు బాహువులు 5530
నంకిలుసేయు పే - రాఁకట గ్రుస్సి
యింకిన చెరువుతో - నెసవచ్చుగడుపు
పరపులై వజ్రని - భంబులై మిగుల
గరవాడి నెసఁగు న - ఖప్రకాండములు
చలపట్టి దీవుల - జరుముక గ్రమ్మింగఁ
గలగాంచి కూయిడు - కలవరింపులును
వట్టిక వాడి ద - బ్బనముల రీతిఁ
బొట్ట మీఁదట నిట్ట - పొడుచు రోమములు
కుండలకేయూర - కోటీరరత్న
మండనంబుల నస - మాన తేజంబుఁ 5540
గలిగిన యాకుంభ - కర్ణుని లేపఁ

—: నిద్రనుండి కుంభకర్ణుని లేపుటకుఁ జేసిన ప్రయత్నములు :—

దలఁచి పేరునఁ బిల్చి - దానవులెల్ల
భేరీపణవదుందు - భి మృదంగశంఖ
భూరిరావముతోడ - బొబ్బలువెట్టి
పిడికిళ్ళచే గ్రుద్ది - పెద్దరోకళ్ళఁ
బొడిచి గదాశూల - ముల ముద్గరముల
దండించి రొమ్ముమీఁ - దను పెద్దరాళ్లు
గుండులు బడవైచి - గోళ్లలోపలను
యినుపకండ్లును గొట్టి - యిటుకలు వేచి
తనువు నిండఁగఁబోసి - దానవులెల్ల 5550
ముకుగోళ్లలో సీస - ములు గాచిపోసి
తెకతెక నంజుళ్లుఁ - దెరలించి వంచి
చెవులగూబలు గఱ - చి వెడందవాతఁ
బొగలేని చింతని - ప్పులు దెచ్చి నించి
గొడ్డండ్లచే గండ - గొడ్డండ్లచేత
గడ్డపారలచేత - గండ్లుగా నఱికి
పడనిపాటులనెల్లఁ - బడ పదియేను
గడియలకును కుంభ - కర్ణుండు నిల్చి
వాసుకి తక్షక - వ్యాళులమాడ్కి
భాసిల్లు తన మహా - బాహులుచాఁచి 5560
యవనీధరమహా గు - హలనుండి వెడలు
పవనంబు లనఁగ ని - బ్బరముగా నూర్చి
యంతట నొక్కమా - టావలించుటయు
దుంతలఁదెచ్చి పైఁ - ద్రోలి త్రొక్కించి
లొటిపిట గుఱ్ఱంబు - లును వేసడముల

నిటునటు దానవు - లెక్కిమట్టించి
పదివేలగజముల - బారుగాఁ దెచ్చి
యెదమీఁద నెక్కించి - యిలియఁ ద్రొక్కించి
కొమ్ము కత్తుల పెద్ద - గుప్పించి వెడలి
రొమ్ముపై వెయ్యితే - రులు వాఱఁద్రోలి 5570
మీసంబులను తల - మీఁది వెంట్రుకలు
దూసిరా కోటిదై - త్యులు వట్టి యీడ్వ

—: కుంభకర్ణుఁడు లేచి, తన్ను నిద్రనుండి లేపుటకుఁ
గారణమడుగుట :—

నొయ్యన తెలివొంది - యొత్తగిల్లుటయుఁ
జయ్యన భీతి రా - క్షసులెల్లఁ దొలఁగి
బెడబెడ బరువెత్తి - బెదరి ద్వారంబుఁ
గడచి దాఁగిన కుంభ - కర్ణుండు లేచి
కారుచిచ్చులమంట - కన్నులవెంట
మీఱంగ నెరి నవో - న్మేషాంతరమునఁ
బందులు గోటియు లాఁ - బసరముల్ పెద్ద
బిందెల నల్లాలు - పేర్పులఁ గల్లు 5580
కడమవడ్డనము నొ - క్కటిఁ జిక్కనీక
తోడఁబడ మ్రింగి యం - దున సేదఁదేఱి
యాసీనుఁడగువేళ - యరసి యొండొరులు
చేసన్న సేయుచుఁ - జేరంగవెఱచి
తొంగి చూచుచు నుండ - దోషాచరేంద్రుఁ
డింగితం బెఱిఁగి "మీ - కేల భయంబు
రండ"న వచ్చి వా - రలు కేలుమొగుప

దండకుం బిల్చి "యిం - దఱు గూడి నన్ను
నిదురలేపఁగనేల ? - నేఁడు రాజునకు
గొదవలు లేక చే - కొన్నాఁడె సుఖము ? 5590
మీకు నెల్లను సేమ - మే ? బంధుకోటి
యేకీడుఁబొరయక - యెసఁగి యున్నదియె ?
యేమైన గలిగిన - నెఱిఁగింపుఁ డిపుడె
నామీఁది భారమం - తయుఁ జక్కఁజేయఁ
గడమ యాఁకలి దీర్చి - కాని మాయన్న
కడకు రానొల్ల నిక్క - డ నుండె చనుదు
బలిమిని మేల్కొల్పఁ - బనియేమి ? సీత
వలన నిప్పుడు చేటు - వచ్చెనో మీకు ?
లేకున్న నేఁటికి - లేపుదు రదియు
వాకొనుఁ"డనుచు రా - వణసోదరుండు 5600

—: యూపాక్షమహోదరులు రావణునివద్ద కాతఁడు వెడలిన కారణము తెలియుననని విన్నవించుట. కుంభకర్ణుఁడు రావణునిఁ జూచుటకు బయలుదేరుట :—

నన్నమాటలకు యూ - పాక్షుండు చేరి
విన్నవించెదనని - వినతుఁడై పలికె.
"అయ్య ! మిమ్మెఱిఁగిన - యమరులు మమ్ము
చెయ్యెత్తి చూప నో - చ్చిన నోరఁ బలుక
నేరుతురో ? కంటి - నెరసునుఁబోలి
తీఱదు నరునిచే - దిగులు మాకిపుడు
నొకచేతి చేసైన - యుత్పాతమెల్లఁ
బ్రకటంబు నేవిన్న - పము సేయవలదు

కొలువులో రాజుమా - కునుఁ దెల్పెఁగాన
గలిగెను విపరీత - కార్యముల్ దాన 5610
నేమిచెప్పెద"నన్న - యెడ కుంభకర్ణుఁ
డామాటలోనె యా - పాతకుతోఁ బలికె.
"పోయినయపుడె పం - పును రాక్షసేంద్రుఁ
డాయన్నతోడ మా - టాడంగరాదు.
ఎప్పుడైననేమి నే - నేఁగి రాఘవునిఁ
గపులనుఁ జంపి ర - క్తంబులు గ్రోలి
మఱికాని రానిట్టి - మాటలు వినియు
దొరమోహము పోయి చూ - తునె చేతనయ్యు ?
పగదీర్చి మఱికాని - పట్టణంబునకు
మగుడ నొల్ల"నటన్న - మాటలాలించి 5620
కోపమెంతయు దెచ్చు - కొని మహోదరుఁడు
యాపాతకుఁ దలమని - యోడక పలికె.
"అదియేఁటిమాట ? మీ - యన్నదెందంబు
పదను చూచుక కాని - పదరంగఁ దగునె ?
ఇంత కొంచెపు పని - యే నీవుపోయి
పంతమాడినయట్లు - పగఁదీర్చ మఱల ?
చెప్పిన కార్యంబుఁ - జేసినయనకుఁ
దప్పులే దామీఁద - దైవయత్నంబు
పదరక కాఁగల - పనులేల తప్పు ?
తుదిగన్న కార్యంబె - తోఁచెను మీకుఁ 5630
బిలువనంపినఁ బోయి - పిలిపించినట్టి
తలఁపువెంబడిఁ జేయఁ - దగు"నంచుఁ బలుకఁ
జాడలఁ బిలిచి " యీ - క్షణమునఁ బోయి

మీఁద దశాస్యు స - మీపంబుఁ జేరి
కుంభునితోఁ దెల్పి - కుంభిని చేత
కుంభకర్ణుఁడు మేలు - కొన్నాఁడటంచు
వినిపింపుఁడన వారు - వేగంబె పోయి
దనుజేంద్రునకుఁ దెల్ప - దశకంధరుండు
తోడి తెండన వాఁడు - తోడనే వచ్చి
చేదోయి మొగిచి వ - చ్చిన మాటఁ దెల్ప 5640
నజధేను శశవరా - హ వృషాదికములు
భుజియించి మైరేయ - మున దృప్తినొంది
గట్టిన దిశలు వ్ర - క్కలుగఁ ద్రేఁచుచును
కొట్టు మ్రింగినయట్టి - కుత్తుక బంటి
నంజుడు దిని పయ - నంబయి చూడ్కి
గంజాయ కెంజాయ - గ్రమ్మ సిల్వెడలి
చూచినచో నెల్ల - సురవిమానములు
బూచిఁ గన్నట్ల త - ప్పుడు ద్రోవఁ బఱవఁ
గోటకొండల - గురురుచుల్ మింటి
బాటల దివిటీల - బాఱులై వెలుఁగఁ 5650

—:కుంభకర్ణునిఁ జూచి వానరసైన్యము భయభ్రాంతముకాఁగా, విభీషణుఁడు వారిభయము నివారించుట :—

గోటలోఁ బోవుచో - గోఁతులా బయట
సూటగాఁ జూచి వ - చ్చుచునున్న బోకట
నడగొండ యిందు ముం - దఱ నిల్చె నేల
నడఁగిపోవఁగ నేల - యని దిగుల్ వుట్టి
చచ్చినవారు మూ - ర్ఛల నొందువారు

విచ్చి పాఱెడువారు – వెతనొందువారు
రాముని మఱుఁగు చే – రఁగ నేఁగువారు
సౌమిత్రి చాటుకుఁ – జనియెడువారు
నగుచుండ రఘువీరుఁ – డమ్ములు విల్లు
తెగువతో సవరించి – దిటవూని నిలిచి 5660
నడ్డచేయని విభీ – షణుఁ జూచి దిగులు
పడ్డవానరులఁ దే – ర్పఁగ నిట్టులనియె.
" ఇదియేమి మిన్నెల్ల – నేకమై దిశలు
బొదువుక యొక మహా – భూతంబు నడచె!
ఆదిఁ ద్రివిక్రముఁ – డైన వామనుని
కీదేహ ముద్దిమై – యీడు రాఁబోలు
విబుధాచలము బోయె – వింధ్యపర్వతము
సొబగిట్టులుండునో – చూడుము నాఁడు
నీ మహాభూత మూ – హింపఁగ నిలయు
భీముఁడో యముఁడో రా – పింపు"మిట్లనుచు 5670
నని పల్కు జానకీ – ప్రాణేశుఁ జూచి
దనుజనాయకుని సో – దరుఁడిట్లు పలికె.

—: శ్రీరామునికోర్కె నను సరించి, విభీషణుఁడు కుంభకర్ణుని పుట్టు పూర్వోత్తరము లెఱింగించుట :—

" అయ్య! యీతఁడు రావ – ణానుజుఁడెచ్చు
కయ్యముల్ గెలిచి చే – కన్నట్టివాఁడు.
అమరేంద్రు నోడించి – యనలుని గెలిచి
శమనుఁ బోఁదఱిమి రా – క్షసనాథుఁ దోలి
వరుణుఁ గీటడఁగించి – వాయువుఁ దూల్చి

నరవాహనుఁ దెమల్చి - నగధన్వ నోర్చి
ముల్లోకముల కయ్య - ముల నెదిరించు
బల్లిదుఁగానని - బలవంతుఁ డితఁడు 5680
పుట్టిన యప్పుడె - భూతకోటులను
పట్టి మ్రింగుచును ప్ర - పంచమంతయును
బాడు సేయుటయు సు - పర్వులు మునులుఁ
గూడి జీవుల నెల్ల - కుంభకర్ణుండు
చంపి పోకడపెట్టు - చందంబు దెలుప
గుంపుగా దిక్పాల - కులను వేల్పులను
కూరుచుకొని వజ్రి - కుంభకర్ణునకు
బారు వెట్టిన నావ - పావకురీతి
నందఱేఁ జుట్టుక - యందరంటఁ గొట్టి
చిందరవందర - చేసిన దిరిగి 5690
సెలకట్ట నేరక - జేజేలువాఱ
నెలిదంతేఁ బుఱికొల్పి - విబుధనాయకుఁడు
సతగొట్టివైచిన - సరకుగాఁ గొనక
నితఁడు చౌదంతి కొ - మ్మొలదూడువోలె
పెఱికి దానవె కొట్టి - పిఱితీసి కూసి
విఱుగుడు చూపిన - వేల్పులగజము
నది యజ్జగాఁ బోరె - యమరనాయకుఁడు
నదియాదిగా నెందు - నరికట్టలేక
జీవహింస యితండు - సేయుచునుండ
నావేల్పుదొర వోయి - యజునకు మ్రొక్కి 5700
యింతయు వినిపింప - నెఱిఁగి పద్మజుఁడు
చెంతకు దానవ - శ్రేణి రావింపఁ

గూడినవారిలోఁ - గుంభకర్ణుండు
చూడ ధాతకు జాల - సోద్యమాటయును
దిగులొంది "యౌరౌర! - దినకున్న వీఁడు
జగమెల్ల యెంత మో - సము వచ్చె దనకు
మృత్యువు నైనను - మ్రింగును వీని
యత్యంతబలము లో - కాతీత" మనుచుఁ
గనుఁగొని "యోరోరి! - ఘటకర్ణ నిన్నుఁ
దన సృష్టియెల్ల ము - థ్యగ మ్రింగు మనుచుఁ 5710
జూపి యిచ్చెనొ పుల - స్త్యుఁడు నిన్ను గాంచి
శాపు దేవతలకు - బ్రతుకేడదింక
చావక యుండియుఁ - జచ్చినవాని
కైవడి బడుము లో - క హితంబుగాఁగ"
అనుటయు వానికి - నావలింతలును
పెనునిద్రలును బుట్టె - పెద్ద నిద్దురను
నప్పుడె యందుండి - యవనిపైఁ బడిన
"తప్పు సైరింపవే - తండ్రి నీవ"నుచు
నీరావణుఁడు వోయి - యెడ్చి తచ్చరణ
నీరజంబుల వ్రాలి - నిలిచె కేల్మొగిచి 5720
"పైరుచేసిన చెట్టు - ఫలమందుచోట
నూరక తెగగొట్ట - నుచితంబె నీకు
నెన్నని నేరంబు - లేము చేసినను
గన్నతివున తాళఁ - గావలెఁగాక
మీరాజ్ఞ చేసిన - మిమ్ముఁ గాదనఁగఁ
దీఱునే యొరులచే - దీనమందార!
అలిగిన మీమాట - కన్యథాత్వంబుఁ

గలుగ నేరదు గానఁ - గడతేర్పు వీని
ప్రేమతో సోదర - భిక్ష యొసంగి
నామీఁద గలుగు మ - న్నన తేటపడఁగ 5730
వీనికి నిట్టి దీ - వృత్తం బటంచు
నానతిం"డన్న ద - శాననుఁ జూచి
యాలోచనము చేసి - యపుడు న త్తమ్మి
చూలి రావణు మోముఁ - జూచి యిట్లనియె.
" నిదురించు వాఁడాఱు - నెలలంత లేచి
యుదయాస్తమయ రాత్రు - లొకదినంబయ్యె
జాగరూకతను స్వే - చ్ఛావిహారమున
భూగోళమెల్ల న - ద్భుత నేగుఁడనుచుఁ
జరియించి యుద్ధమె - చ్చట లేక వహ్ని
దరికొన్నరీతి నం - దఱను భ్రమింగుచును 5740
మెలఁగెడు బొమ్మన్న" - మేలయ్యెననుచుఁ
దలఁచి లంకకు వచ్చె - దశకంధరుండు
అట్టివాఁ డీతఁడీ - యనతోడ నెదుర
నెట్టివానికిఁ దీఱ - దేనెఱుంగుదును.
అందుకు దగినట్లు - లయ్యెడు నిపుడు
ముందరిగాఁ గపి - ముఖ్యులు చూచి
కలఁగఁబాఱుట నీతి - గాదు గావునను
పిలిపించుఁడ"నుచు వి - భీషణుండనిన
రాముఁడు నీలుని - రమ్మని పిలిచి
" యీమర్కటోత్తము - లేల పాఱెదరు ? 5750
నిలువరింపు"మటన్న - నీలుండు కపులఁ
గలయ గూర్చుక తొంటి - గతిఁ బురికొల్పి

నలనీలకుముదమైం - దద్వివిదాదు
లలఘుసత్త్వులు ప్రమాఁకు - లద్రులుఁ బూని
యదరెల్లఁదీటి క - య్యమునకుఁ బదర
నెదురు చూచుచునుండు - నెడలంకలోనఁ

—: రావణునివద్దకుఁ గుంభకర్ణుఁడువచ్చుట-
వారిసంభాషణము :—

దన తనుచ్ఛాయ కా - దంబిను లీనఁ
బెనుగోర చకచకల్ - బెనుపఁ జంద్రికలు
కన్నుల నంగార - కణములు రాల
మిన్నుల తొడవులు - మేన రాణింపఁ 5760
గాదంబినీమాలి - కలలోన దూరు
నాదిత్యుఁడోయన - నరిది తేజమున
శాతమన్యవశిలా - స్థగిత సౌధాంత
రాతతద్వారంబు - లందంద దాఁటి
పరమకళ్యాణ పు - ష్పకముపై సౌఖ్య
కరమైన సింగంపు - గద్దియమీఁద
యాసీనుఁడై యున్న - యన్నకు వినతి
చేసిన దిగ్గున - సింహాసనంబు
డిగ్గి సోదరుని నిం - డిన భక్తితోడ
బిగ్గ కౌఁగిటఁజేర్చి - ప్రీతివుట్టించి 5770
చెంత నమర్చిన - సింహాసనమున
మంతుకెక్కిన తన - మంత్రులు మెచ్చ
వసియింపఁ జేసిన - వనజసంభవుని
దెసఁ గూరుచుండిన - దేవేంద్రు రీతి

నాసీనుఁడై తమ - యన్న చిత్తంబు
గాసి దీఱఁగ కుంభ - కర్ణుఁ డిట్లనియె.
" ఏలయ్య ! నన్ను మీ - రిప్పటి నిద్ర
మేలుకొల్పితిరి ? యే - మి గొఱంతవచ్చె ?
ఇంతటి యాపద - యెయ్యది పలుకుఁ
డెంతటి పనికైన - నేనున్నవాఁడఁ
బూను నిద్రాభంగ - మునకైన యట్టి
మానుదే రోషంబు - మా తురమీఁదఁ
గనిపింతు"నన దశ - కంధరుండలిగి
కనలు పుట్టఁగఁ గుంభ - కర్ణున కనియె.
" తోఁడబుడ నన్ను ని - ద్రార లేపిరనుచు
ముడిబొమతో రోష - మున నన్నుఁజూచి
తెగలేక యిట్లాడి - తివి గాక నీవు
తగవును ధర్మంబుఁ - దలఁపవింతయును
వెనకటి కొకకోఁతి - వీడెల్లఁ గాల్చి
చనియె నన్నట్టి ప్ర - సంగంబు నీవు
విన్నావెకాదె ? యీ - వెనుక రాఘవుఁడు
మున్నీరుఁగట్టి త - మ్ముఁడుఁదాను వచ్చి
కపిసేనఁ గూర్చి లం - కాపురంబెల్ల
నిపుడు ముట్టికి చేసి - హెచ్చియున్నారు.
అంతియెకాదు నే - నంపినఁ బోయి
మంత్రులు దొరలును - మడిసిరాలమున
లంకయుఁ జెడి దైత్యు - లకు హానివచ్చె
యింక నే తెఱఁగని - యెన్నికపుట్టి

5780

5790

యాలోచనలు సేయు - నట్టిచో నిన్ను
మేలుకొల్పుట నేర - మే యెంచిచూడ 5800
చెడువేళ నిద్ర చూ - చితి వింతెకాని
కడతేఱు టెట్లని - కననైతి వీవు.
ఇంతటి యాపద - నే నొందుచోట
నింతటి తమ్ముఁడ - వీవు గల్గియును
నున్నాఁడ నేనని - యూరటఁ జేసి
నన్నుఁ దేర్పక యవ - నయముఁ బల్కితివి
ఎన్నఁడు నాకిది - యిట్టిది యనుచు
నిన్ను నేఁబనిగొంటి - నే కయ్యములకు
నాచేతఁ దీఱకు - న్నను నీమనంబుఁ
జూచి పైకార్యంబుఁ - జూచెద ననుచుఁ 5810
బిలువ నంపితి నీవు - పెడమొగంబైన
నిలుతురే యెదిరించి - నిర్జరప్రభులు
నన్ను నీలంకయు - నావారి నిపుడు
మన్నించి కావ స - మర్థుఁడే యొకఁడు ?
నీకెఱిఁగించు నిం - తియకాని యువ
మాకేల నీకు స - న్మతమైన యట్లు
నడపించి నాదుప్రా - ణములు రక్షించి
కడతేఱుపుము శర - త్కా-దంబినులను
విరియించు పవమాన - విధమునఁ గపులఁ
బొరిఁగొని దశరథ - పుత్రులఁ దునిమి 5820
రమ్మని" పలికిన - రావణుఁజూచి
క్రమ్మఱ నాకుంభ - కర్ణుఁ డిట్లనియె.

—: కుంభకర్ణుఁడు రావణునికి హితబోధసేయుట :—

" దేవ ! యేనాఁడు మం - త్రిశ్రేణితోడ
నీవిధంబగు కార్య - మెఱిఁగించుచోట
నాప్తులై తగువార - లాడినమాట
యాఁ స్వీకరించని - యప్పుడే వచ్చె
నీపాటు నేఁడు నీ - వెఱిఁగితి వేమొ
యాపూర్వమున నిశ్చి - తార్థ మింతయును
దగినట్టివారి మం - త్రంబుల రాక
తగని కార్యములు య - త్నముసేయు కతన 5830
ముందఱ గానక - మూర్ఖుఁడవైన
యందుచే నీఫలం - బనుభవించెదవు.
కాలానుగుణమైన - క్రమములో నడవఁ
బోలు గాకహామికం - బూనిన పనుల
నిట్టి పాటొదవ దే - యీరీతి మెలఁగు
నిట్టివాఁడ నయాన - యజ్ఞుఁడుఁగాఁడు.
ఇది దేశ మిదికాల - మిది సేఁత యనుచు
మదిఁ దలంపకఁ దాను - మదినెంచినట్లు
సేయు నాతని పనుల్ - చెడు మత్తచిత్తుఁ
డాయతించిన హావి - రన్నంబు నట్ల 5840
నవని నుత్తమమధ్య - మాధమకర్మ
నివహాముల్ సేయఁ బూ - నిన యట్టివాఁడు
నారంభమున నుపా - యమునందు మీఁదఁ
బూరుషద్రవ్య వి - స్ఫురణయు దేశ

కాలవిభాగవై - ఖరి కార్యసిద్ధి
తేలని యాపత్ప్రతీ - కారమునఁగ
నైదును నెఱిఁగి కా - ర్యము సేయు దొరకు
రాదెన్నటికి విచా - రము దానవేంద్ర !
అందుమీఁదటను ధ - ర్మార్థకామములు
పొందు చిత్తమున తే - పును పగల్ మాపు 5850
నేమఱక తదీయ - హితమతి నుండు
భూమీశ్వరుఁడు సౌఖ్య - మున నిలయేలు.
హితుల యాలోచన - లెఱిఁగి సామాది
చతురుపాయక్రియా - చతురుఁడై తనకు
హితుఁడైనగతి డెంద - మీయక మీఁద
నతి దుఃఖహేతువు - లైన మంత్రములు
బోధించువాని నా - ప్తుండుఁ గాఁడనుచు
శోధించి పరిహరిం - చుట రాజనీతి.
నిలుకడ చాలని - నృపుని రంధ్రములఁ
దెలిసి గెల్తురు విరో - ధిక్షమాపతులు 5860
క్రౌంచరంధ్రము లంచ - గమికి చోటిచ్చు
నంచున తనగుట్టు - శాత్రవులకును
గనుపించ నడచినఁ - గడతేఱ లేఁడు
దనుజవంశవతంస ! - ధరయేలురాజు.
ఎఱుఁగు దన్నియును నీ - వెఱిఁగియు సీతఁ
బరిహరింపక యున్కి - పాపంబుఁగాదె ?
ఇపుడు దప్పిన దేమి - యిటమీఁదనైన
చపలత్వ ముడిగి రా - క్షసవంశమెల్ల

రక్షించి మనకును - బ్రదుకునుపాయ
మీక్షించు మిదనీకు - హిత" మని పలుకఁ 5870
గన్నులెఱ్ఱఁగఁజేసి - ఘటకర్ణుఁ జూచి
మన్ననమాని దు - ర్మాని యిట్లనియె.

—: రావణుఁ డాహితబోధను పెడచెవినిఁ బెట్టుట :—

"బుద్ధులుఁదెలుప నా - ప్తులు మాకులేక
నిద్దుర మాన్పించి - నిన్నుఁ బిల్చితిమె ?
బ్రాహ్మణుండవె - చాలు బదివేలు వచ్చె
బ్రహ్మదేవుండు - నీపాలనున్నాఁడు
నిద్రవోవఁగఁబొమ్ము - నీకిటమీఁద
భద్రమయ్యెడు రామ - భద్రునిచేతఁ
దమ్ముఁడున్నాఁడని - తలఁచి నేనిన్ను
నమ్మి యూశించి జా - నకిని దెచ్చితిని 5880
తెచ్చినవెనుక సా - ధించుట యొకటి
చచ్చుటొక్కటిగాక - చనునె యన్యములు ?
పోరుకుఁబొమ్మన్నఁ - బోరుకుఁగాక
పోరామి గల్పించి - బుద్ధిచెప్పెదవు
మును విభీషణుఁడు రా - మునిఁ జేరినట్లఁ
జన జూచితేమొ దో - షంబుఁ గల్పించి
భయముఁగల్గిన మాఱు - వల్కక నీకు
జయమైనయట్టి యో - జనల బొమ్మ"నిన
యాగ్రహోదగ్రుఁడై - యాకుంభకర్ణుఁ
డగ్రజు జూచి కా - ర్యము మాని పలికె. 5890

—: కుంభకర్ణుఁడు తాను రామునిపైకి యుద్ధమునకుఁ బోవుదునని చెప్పుట —

దనుజేంద్ర! నీదు చి - త్తమెఱుంగఁదలఁచి
యనవలసినమాట - లంటినిఁగాక
యీకార్యమెవ్వారి - దిది యెంతలేదు
నాకసాధ్యము గల్గు - నా? జగత్రయిని
కేల శూలంబునేఁ - గీలించి యనికి
శైలంబు నడయాడు - జాడ నేతేర
నాకేశుఁ డెదిరించు - నా? కీశులెంత?
వాకొననేల దే - వర చిత్తమెఱుఁగు
బరిచేత కైదువఁ - బట్టుకపోయి
దురములో నెదురు కోఁ - తుల జుట్టచుట్టి 5900
మట్టి మాఁల్గాడి పై - మాఁరొత్కన్నవారిఁ
బట్టుక మ్రింగి కో - పముఁ దీర్చువాఁడ
ముందఱగాఁగ రా -ముని తలఁ ద్రుంచి
నిందించితివి గాన - నీ సముఖమున
నుంచెద సుగ్రీవు - నొక కొండదెచ్చి
యుంచిన గతి సమ - రోర్విలో గెల్చి
పట్టంబు నాసించి - పగవానిఁ గూడి
నట్టి విభీషణు - నడియాస దీర్చి
కడమవానరుల ల - క్ష్మణుని బోనీక
కడికొక్కఁడుగ మ్రింగి - గట్టునఁ ద్రేఁచి
మఱికాని యూరకే - మఱలియే నెట్లు
పురికి రానేర్తు పం - పుము సెలవిచ్చి
కడలేని నిద్ర నాఁ - కలి పెచ్చుపెరుగఁ

బడియుండి యిపుడు లే - పఁగ లేచివచ్చి
కానన్గో నాదు - ఘాతికి నేమి
యైన నంచు విచార - మందెడు తనకుఁ
గపులన నేల లో - కము నెల్ల మ్రింగి
నపుడైనఁ దీఱదీ - యాఁకలిచిచ్చు
నీచేత నైనట్లు - నెమ్మదినుండు 5920
సీతను నీవు లోఁ - జేసుక మధుమ
దాతిశయానంద - మనుభవింపుచును
సుఖయింపు మటుఁ - గాక చూచినకార్య
ముఖము వమ్మైన రా - మునిచేత నీవు
తనతరువాత పు - త్రకళత్రసహిత
మనిలోన రాము బా - ణాగ్నిలోపలను
పడిపొమ్ము నీవని" - పలికిన వేఁడ
దడమెత్తి యా మహో - దరుఁ డిట్టులనియె.

—: మహోదరుఁడు కుంభకర్ణునిఁ బదఱుట :—

" కంటి మిప్పుడు కుంభ - కర్ణుని తలఁపు
వింటిమినీ యవి - వేక వాక్యములు 5930
పడుచువాఁడవు - గాన పలికితి వింత
తడవు నేలికఁజూచి - తాళితి నేను
జవ్వనంబున బుద్ధి - చాలక పొట్ట
క్రొవ్వున నెచ్చు త - క్కువమాటలాడి
దక్కించుకొంటివి - తమ్ముఁడ ననుచు
వెక్కసపడఁడయ్యె - విని దశాననుఁడు
బుద్ధికి నేమి మో - పుదు వే మెఱింగి

నుద్దులాడెదవు ర - క్షోనాథు నెదురఁ
గాలముల్ గన్నట్టి - గౌరవబుద్ధి
నాలించు దశకంఠుఁ - డల్పుఁడే నీకు ? 5940
పగవారిబల మాత్మ - బల మెఱుంగకయె
తెగుదురె యిటువంటి - ధీవిశారదులు.
ఎవ్వరిబలము నీ - వెఱుఁగుదు విట్లు
నవ్వఁబాటుగఁ బల్క - న సహింపఁగలమె ?
అవివేకికాన ధ - ర్మార్థకామములు
చవి నీవెఱుంగఁ బ్ర - సక్తి యెక్కడిది ?
ఏమియును నెఱుఁగ - వెంత మూఢుఁడవు
నీమాట చెవిఁ జేర్చు - నే దైత్యవిభుఁడు
పుణ్యకర్మలఁ జేయఁ - బొందు సౌఖ్యంబు
పుణ్యేతరములైనఁ - బొరయు ఖేదంబు 5950
నని పల్కితివిగదా - యది సరిపోదు
మనసునకింక నా - మత మాలకింపు.
తగిన కర్మముల ఖే - దంబు మోదంబు
నగుఁ గాని కర్మంబు - లాచరించినను
మేలు గీడును గల్గు - మితమిది యనుచు
నేలత్యదృష్టి నూ - హించి పల్కితివి ?
అందుచేఁ గర్మంబు - లవ్యవస్థితము
లెందొక్కటను భవ్య - మిహపరంపరల
నట్టి కర్మములు వ్య - యప్రయాసములు
పట్టుగావున నిల్వఁ - బలుకంగరాదు 5960
కావున నిదియాను - కాదిది యనుచు
రావణు నెదుర నే - రక పల్కితీవు

జానకీదేవి వం - చనతోడఁ దెచ్చి
నానాసుఖోచితా - నందవై ఖరుల
ననుభవించి రమింతు - నని దెచ్చుకొన్న
దనుజనాయకుని య - త్నంబు మీవంటి
సకలబాంధవులకు - సరిపోవు నీకు
నొకనికిఁ గాకున్న - నొచ్చుమెవ్వరిది ?
అది యెట్టులుండె నీ - వన్నట్టిమాట
ఘనుల నెవ్వరికి స - మ్మతమైన యదియె. 5970
ఒంటిగా నని కేఁగి - యొక సాధనంబు
నంటక సుగ్రీవ - హనుమదాదులను
కపులనందఱఁ జంపి - కాకుత్థ్సవంశ
నృపుల తలల్ ద్రెంచి - నీ సముఖమున
నుంచెద నంటివి - యొకమాట చాలు
మంచివాఁడవు నీదె - మగతనంబైన
రాముఁడు నినువంటి - రాక్షసాధములఁ
జేవిల్లు కైకొన్న - చిటికమాత్రమున
మఱలి రానిచ్చునే - మనవంటివారి
దురములో నెందఱఁ - ద్రుంపఁడీవఱకు 5980
నీపాటి పోటజ్జ - నేరక నిన్ను
లేపఁ బుచ్చెను మమ్ము - లేఖారివరుఁడు.
అంతలో పోటరి - నైతి విం తేసి
పంతంబులాడి ద - బ్బరకాఁడవైతి
కోపించు సింగపుఁ - గొదమయో నిద్ర
లేపిన గెరలు వ్యా - ళివరుండొ కాక
వొడికిన కాలమృ - త్యువొ యనఁజాలు

పుడమికానుపువల్ల - భుని శాటేఁబడిన
తిరిగి రామునుమాట - తెల్లమెల్లరకు
నెఱుఁగకంటివొ దైవ - మిట్లాడుమనెనొ 5990
లంకేశు నెదిరింపు - లకు భీతినొందఁ
గొంకనీపేరన్న - గొందులకేఁగ
నింద్రదానలార్కథ - నేశులీరామ
చంద్రుండు దనుజనా - శనదండధరుఁడు
కావున నీమాటగా - దని"త్రోచి
దానవేంద్రుని మహో - దరుఁ డిట్లువలికె.

—: రాముని గెల్చితినని చాటించి, సీతనువంచించి చేకొమ్మని మహోదరుఁడు, రావణున కుపాయముచెప్పుట :—

" అవనిజమనకు లో - నగు నుపాయంబుఁ
దవిలి యున్నాళ్లు చిం - తన చేసిచేసి
తెలిసితి నొక్కబు - ద్ధి యదెట్టులన్నఁ
గలను సేయఁగఁ గుంభ - కర్ణుని వెంట 6000
తాను సంపాతి వి - తర్దనుల్ దనుజ
సేనానియైన ద్వి - జిహ్వుండు గూడి
పోయి శక్తికొలంది - పోరాడి రామ
సాయకంబులచేతఁ - జావుఁదప్పినను
రామనామాంకితా - స్త్రప్రహారముల
నేము నీముందఱ - కేతేరఁజూచి
భేరి మ్రోయించి క - ప్పినకట్లు వర్గ
మీరానిదైన నీ - విచ్చి మమ్మెల్ల

శ్రీరాముఁ గెలిచి వ - చ్చిరి వీరటంచు
వారణస్కంధాది - వాసులఁ జేసి 6010
కాదని యనక లం - కారాజధాని
వీదుల శేఁగించి - పసఁగ బాటించి
యీవార్త వెలయింప - నింతులచేత
పావని సీత నే - ర్పాటుగా వినిన
వెనుక మీరచటికి - విచ్చేసి కొన్ని
యనునయోక్తులు వల్క - నడియాసవిడిచి
తనకెవ్వరైన మీఁ - దట దిక్కు లేమి
జనకజ మనసు దాఁ - చక నిన్నుఁ జేరు
నీయుపాయము చేసి - తేని కార్యంబు
సేయకయె జయంబు - చేకూడునీకు 6020
నీనీతి నడచిన - యిల నేలు రాజు
హానిఁ బొందకయె జ - యఖ్యాతులొందు"
అని మహోదరుఁ డాడ - నామాటలెల్ల
విని కుంభకర్ణుఁ డా - విబుధారి వలికె.

—: కుంభకర్ణుఁడు మహోదరుని యిచ్చకములను నిందించి,
యుద్ధమునకు సన్నద్ధుఁడగుట :—

"వట్టిమాటలు వల్క - వాఁడనె నన్ను
నెట్టివట్టున నొక - యించుకయైన
నోరపారలు గట్టి - మోవంచనలకు
నేరుతునో యేల - నిష్ఠురంబింత ?
శరదంబు శారద - సమయంబులందు
నురుములెగాని యు - ల్లోదకంబైనఁ 6030

దనకు లేనట్టి చం - దమునఁ బ్రల్లదము
లనుచుండు చేతగా - నట్టి దుర్మదుఁడు
సేయు నాత్మశ్లాఘ - చెడనాడుచుండు
దాయల నధమ వ - ర్తన మించువాఁడు
హితుఁడ గావున వెన్క - నిట్లన మీకు
హితమైన కార్యంబు - లెఱిఁగించువారు
లేరని యెంచి మే - లిమికిఁ గీడునకుఁ
బోరానియట్టి తోఁ - బుట్టువుఁ గాన
నొకమాట వలికితి - నుల్లంబునందు
నిఁకమీఁద మఱచి బో - మ్మానంట లేదు 6040
విను మొక్కటి నిశాట - వీరాగ్రగణ్య !
యని కేఁగు శ్రీరాము - నగచరావళినిఁ
జంపి తదీయ మాం - సముల రక్తముల
సంపూర్ణకామత - జఠరాగ్నియార్తు
నీమదిలోనున్న - నెగులెల్లఁ దీర్తు
నేమ మందుము నన్ను - సెలవిచ్చి పంచి
యనిలోన నడచు వృ - త్తాంత మంతయును
వినకపోనరు గదా - వేగుల వలనఁ
జూడు మంతయు"నని - చులకఁగా దలఁచి
యాడు మహోదరు - నదలించి పలికె. 6050
"దొరకు నిచ్చకముగాఁ - దొడిఁబడ నన్ను
నెఱిఁగియు నెఱుఁగక - యిట్టులాడితివి.
మొదటఁ జుట్టమువౌట - ముదిమదిఁదప్పి
యెదురువారలఁ జూడ - కేమి వల్కినను
నెంత లేదనియుంటి - యీరావణునకు

సంతోషమైనదె - చాలు నాకనుచు
నాడినట్లన యాడి - యనుకూలురైన
జూడఁ జూపుదు హిత - శాత్రవులైన
మిమువంటివారి న - మ్మి దశాననుండు
సమసిపోవుట కేల - సందియంబింక 6060
యిచ్చకమ్ములు వల్కి - యేవేళ లేని
మచ్చికల్ చేసి ప - ల్మాఱు బోధించి
లంకాపురం బన్య - లకు కైవసముగఁ
గంకణంబులు చేతఁ - గట్టుక పూని
కడ తేర్చినట్టి మీ - కతన రావణుఁడు
చెడిపోయె నూర్జిత - శ్రీలు నేనాఁడె
నమ్మినవారి మా - నంబు ప్రాణములు
వమ్మయ్యె చెడియె నై - శ్వర్యమంతయును
యినుముతో గూడిన - యింగలంబునకుఁ
బెనుదాకటులవాట్లు - బెడిదమైనట్లు 6070
యీరావణునిఁ జేరు - నెల్లరాక్షసులు
తీఱనియార్తి నొం - దిరి మీరుఁ గలుగఁ
జెడినచో గతజల - సేతు బంధనము
పెడమాటలును బది - వేలు నేమిటికి ?
కలని కేఁగెదను రా - ఘవులఁ ద్రుంచెదను
వలసిన గతి మీరు - వర్తింపుఁ"డనుచుఁ
గోపించి పలికినఁ - గుంభకర్ణునకు
నాపన్నుఁడైన ద - శాననుండనియె
"నీకు సమానుఁడె - నిర్జరప్రభుఁడు

దాకొన్న నీమహా - పరుఁడన నెంత! 6080
జగడంబుమాట యె - చ్చటనైన వినిన
మొగమున వినము రా -ముని భీతివలనఁ
దా వెఱచినవాఁడు - తనయట్లు తలఁచు
నావలివారల - నతఁడేమి లెక్క
పందమాటలు నీవు - పాటింపకుండ
నందుకు ననుజూచి - యంతయు నోర్చి
కలనికిఁ బొమ్ము రా - ఘవులను గెలిచి
కులము రక్షించి మా - కు హితంబుఁ జేసి
మాయన్న పోయిర - మ్మా! యన్నమాట
కాయన్నకు విభీష - ణాగ్రజుండనియె. 6090
"ఒంటిగా నేఁగెద - నొక రాక్షసుండు
వెంట రానేల మీ - వెంట రానిమ్ము
సడ్డసేయుదునె దా - శరథులు నాకు
నడ్డమే వానరు - లన నెంతగలరు?
అరచేతిలోనను - నందఱం బెట్టి
నురిమి శోణితవాహి - నులు వాఱఁబిడిచి
యామాంసములు దిని - యందలి నెత్తు
రామెతగా ద్రావి - యట్టహాసంబు
నీదు వీనులు సోఁక - నిష్ఠురసింహ
నాదమహాండంబు - నకు మిక్కుటముగఁ 6100
గావింతు"నను కుంభ - కర్ణుని మాట
రావణుఁ డాలించి - రమ్మఁబలికె.

—: రావణుఁడు కుంభకర్ణుని దివ్యాభరణ భూషితునిఁ గావించి యుద్ధమునకుఁ బంపుట :—

" తమ్ముఁడ! యెంటియు - ద్ధము నీకునేల?
చిమ్మ రేఁగకపోదు - శ్రీరాము సేన
వానరుల్ నఖదంత - వాల ఘాతముల
చేనొంతు రెక్కటిఁ - జిక్కితివేని
తోడుకుఁబోక యెం - దుకు వీరుఁ దనకుఁ
గూడివత్తురు నిన్నుఁ - గొలిచి రాక్షసులు
కాలుఁడయోమయ - గదవూనినట్లు
శూలంబు చేనము - ర్చ్యక నీవు పోయి 6110
గెలిచి రమ్మ"నుచు సాఁ - గిలి మ్రొక్కి లేచి
నిలిచిన తనతమ్ము - నిం గౌఁగలించి
తన మెడనున్నట్టి - తాలియు నఱుత
కనకసూత్రముతోడి - కంఠమాలికయుఁ
గరముల మేఁగవు - కడియముల్ చెవుల
గురువిభారాసులౌ - కుండలంబులను
కట్టిన వ్రేళ్ళ యుం - గరములు తాను
పెట్టుకిరీటంబుఁ - బీతాంబరంబు
తొడవులన్నియుఁ దీసి - దొడిగిచ్చినట్లు
తొడిగించె తానె సై - దోడు నెమ్మేన 6120
లలితేంద్రనీలజా - లముల చెక్కడపు
మొలత్రాడు తనదు త - మ్ముని కటిఁబూన్ప
నందు నిర్మధ్యమా - నాంభోధిమధ్య
మందరాచలదృశ్య - మానాసమాన
వాసుకినామక - వ్యాళోపమాన

భాసమానతఁ జూడఁ - బరగె నత్తొడవు
నవరత్నమయమగు క - నత్కనకాత్మ
కవచంబు దానవా - గ్రణిఁ దొడిగింప
జొడెందు లేకయు - జొడువాఁడయ్యె!
జూడ దానవరాజ - సోదరాగ్రజుఁడు. 6130
నడమేరువును బోలి - నవరత్నరుచుల
తొడవుల వీతిహో - త్రుఁడు నిల్చినటుల
గంధపుష్పాదియు - క్తము వైరిర క్త
గంధాన్వితము పావ - కజ్వాలికోగ్ర
శాతోగ్రమలఘు కాం - చన పట్టబంధ
నీత మమూల్యము - ణీ సరాన్వితము
కాలాయసమయ ప్ర - కాండమరాతి
బాలికామకరికా - పత్రాసహంబు
సంతతామరరాజ - సంగ్రామవిజయ
వంతంబులైన శ్రొ - వ్వాఁడి శూలంబుఁ 6140
గేలనందుక యిది - కిష్కింధయేలు
వాలిసోదరునకు - వైరి లక్ష్మణుని
పాలికి మిత్రియ - పార వానరుల
జాలి యంగదు మన - శ్శల్యంబు పవన
తనయు మీఁదికి కాల - దండంబు సీత
పెనిమిటి కురుమని - పిడుగు సంగ్రామ
రంగంబులో కాళ - రాత్రి దైతేయ
పుంగవులకు జయం - బునుఁ గూర్చు లక్ష్మి
చూడుమేఁగెద నను - చును బ్రబణమిల్లి
జోడుగా నతని గ్రు - చ్చుక కౌఁగలించి 6150

పొమ్మని దీవింపఁ – బౌర ప్రదక్షి
ణమ్ముగా వచ్చి దా – నవనాథు మొగము
మఱలంగఁ జూచుచు – మఱలి కన్గొనుచు
దొరలు బాంధవులు మం – త్రులు భటుల్ గొలువ
రాజమార్గంబున – ఱామేడ లెక్కి
రాజీవగంధులా రా – వణానుజునిఁ
బువ్వులసరులచేఁ – బొదివిన నతఁడు
నవ్వుమోమున వాహ – నము లేకనడచి
శతధనుర్మాన వి – శాలత పొడవు
శతపట్క సాయకా – సనతన్మై పెంచి 6160
నానామృగాననుల్ – నానావిధంబు
లైన వాహనముల – నాశలఁ గొలువ
నుత్తరద్వార సా – లోపరిఁ జేరు
నుత్తుంగ భుజుఁ – బులస్త్యోద్భవాత్మజునిఁ
గాంచి భీ.....................
మించుగఁ జెదరి భూ – మి చలింపఁ బఱవ
ధవళముక్తాత ప – త్రము చామరములు
సవిధభాగముల రా – క్షసులంది కొలువఁ
గుంభకర్ణుఁడు దైత్య – కోటి నీక్షించి
యంభోదగర్జమ – హోర్భటిఁ బలికె. 6170
" అల్లదే కపుల సై – న్యము గనుపట్టె
నల్లనై పుడమి యం – తయు నేఁడు మీకు
వనచరులో పోరు – వారు నాతోడ
మనవీట నుద్యాన – మార్గంబులందు
వేఁడుకల్ చెల్లింప – విహరింపఁగాఁగ

నేఁడు తానెదిరింప - నిలువ దీమూఁక
రామలక్ష్మణు లెదు - రా ? క్రౌంచగాండ్లఁ
దాము చంపితిమని - దర్పముప్పొంగ
బాణబాణాసన - పాణులై సితకృ
పాణులై యొక శల - భంబుల రీతి 6180
నాకోప దవదహ - న శిఖాముఖములఁ
జాకుండ యేమి యౌ - జనసేయ గలరొ
చూతమంతయు" నను - చు మహాట్టహాస
మాతరి బ్రహ్మాండ - మవియఁ జేయుటయుఁ
కపిసైన్య మంతయు - గజగజ వడఁకి
యప్పుడు మూర్ఛాక్రాంత - మై పడియున్నఁ
బ్రళయకాలమునాఁటి - భానుజరీతి
కలని వేడుక కుంభ - కర్ణుండు రాఁగఁ

—: యుద్ధోన్ముఖుఁడైన కుంభకర్ణునిఁజూచి వానరులు భయభ్రాంతులై నానాముఖములఁ జెదరిపోవుట. అంగదుఁడు వారిభయము మాన్పి యుద్ధమునకుఁ బ్రోత్సహించుట :—

కపులెల్ల భీతిచేఁ - గన్న గోతిగను
తెపతెప గుండెలు - దిగులుచే నడర 6190
మింటిపై నెగిరి భూ - మిని గుంపుచెదరి
కంటకంబులఁ బడి - కానలకేఁగి
సేతువు బడి బాతి - సింధువుఁజొచ్చి
గాతంబులను దూరి - కపులందుఁ జేరి
చెట్లులపై నెక్కి - చేయెత్తి మొక్కి-

గుట్టల కెగఁబ్రాఁటి - గుహాలలో దూరి
తడగాళ్లువడి నిల్చి - దగదొట్టి యలసి
పడినపాటులనుండి - బలిమాలుచుండ
నదిచూచి యంగదుం - డంగదతోడఁ
జెదఱఁబాఱిన తన - సేనల నిలిపి 6200
గజగవాక్షసుషేణ - గంధమాదన వి
రజనీలరిషభ తా - ర ప్రముఖులను
పేరుపేరను బిల్చి - "పెద్దలుమీరు
పౌరుషాఢ్యులు ధైర్య - పరులు ధీనిధులు
నుత్తమకులజాతు - లురుసత్త్వనిధులు
మత్తమాతంగోప - మానావఘనులు
వేడబంబులు చూపి - విఱిగిపాఱంగ
జాడయే మనల వం - శంబులకెల్ల
నపకీర్తి వచ్చె మా - యావులు వారు
కపటాత్మకులు వీఁడు - కల్లరాక్షసుఁడు 6210
దారుయుతాత్మ యం - త్ర స్వరూపంబొ
తీరుచు చర్మభ - స్త్రికయొ యీయసుర
వినలేదె వె............ప్రాజ్ఞ...
.........................సులకు
రాకుండ నరికట్టి - రాలను రువ్వి
చీకాకుగాఁజేసి - చించి మర్దించి
పాఱవేయుద మొక్క - పరిగ యందఱము
గోరాడుదము మద - కుంభులరీతి
తగునె భానుజునకుఁ - దలవంపుచేసి
మగతనంబునుమాని - మనములనమ్మి 6220

వచ్చిన రాము భా - వముఁ జిన్నఁబుచ్చి
యిచ్చటి దైత్యుల - కెసమిచ్చి పాఱ"
అనునంత నవ్వాన - రాధిపులెల్ల
వనచరావళిఁ దమ - వారలఁ గూడి
యొక్క మొత్తంబుగా - నుర్వీజములును
పెక్కు కొండలుపట్టి - పెడబొబ్బలిడుచుఁ
గలెబడి యాకుంభ - కర్ణునిమీఁదఁ
బలుకొండఁ బూజించు - ప్రసవంబులట్లు
వేసిన నవియెల్ల - విదిలించికొనుచు
వీనమంతయును నొ - ప్పియుఁ గొంకు లేక 6230
మరకటంబున హరి - మసలినయట్లు
చరముక గ్రుంగుచుఁ - జప్పరింపుచును
చొరఁబారి నేలవే - సుక కాలరాచి
నురుముచు రెండుక - న్నుల నిప్పులురులఁ
దెఱచిన నోరు నె - త్తిన బాహువులును
చరిమి కోఁతులఁ జంపు - చరణముల్ గలిగి
కొండ వొర్లినయట్లఁ - గుంభకర్ణుండు
చెండుచు రాఁ గపి - శ్రేణి భీతిల్లి
"కొయ్యసేత యటంచుఁ - గోఁతులఁ దేల్చి
కొయ్యసేఁతల వాలి - కొడుకు బోధించి 6240
నమ్మించి తెచ్చి యం - దఱఁ జంపె మనల
దొమ్మ కయ్యము కాలి - దుమ్మ వీనికిని
యెఱుఁగక వచ్చితి - మెల్ల వానరుల
నుసుమాడ కుంభక - ర్ణుండఁట వీఁడు

వీని పాతను బడి - వెఱ్ఱిబుద్ధులకుఁ
జానేల ?" యనుచుఁ గీ - శప్రాతమొల్ల
మొదలింటిగతి నన్ని - ముఖములఁ బఱవఁ
గదిసి పోనీక యం - గదుఁ డిట్టులనియె.
"కపులందు పైపారుఁ - గన్నట్టివార
లపకీర్తి గోడరే - మనవచ్చు మిమ్ము ? 6250
ఇండ్లుచేరిన మిమ్ము - వీక్షించి యచట
పెండ్లాలు బిడ్డలు - పెరిమె సేయుదురె ?
ఎగ్గుసిగ్గులుమాని - యింతప్రాణములు
బిగ్గ బట్టుకపోయి - పెక్కుకాలములు
మననేర్తురే ? పుట్టు - కారణంబు నచట
వనజగర్భుఁడు వ్రాసె - .........
.............ణములు - పైమోచి యింత
యనుమానములు మాని - యని సేయనోడి
పరువెత్తి యిండ్లలో - పలఁబడి వ్రాలిసి
నరకకూపముల ని - న్నక పడనేల ? 6260
రామచంద్రుని ముంద - అను నిల్చి మనకు
స్వామియైనట్టి భా - స్కర కుమారునకు
మాటవాసి గడించి - మనచేతనైన
పా.....................నెదిరి
చచ్చినఁ గల్గును - స్వర్గలోకంబు
రచ్చల కెక్కువా - రల బంటతనము
కడమవారికికూడఁ - గలుగు నేలికను
విడిచి వచ్చినవాఁడు - వీఁడని పలుకఁ

దలవంచుక మెలంగ - తగవె పోనేల?
నిలుపుఁడు పిఱికివా - ని శరీరమేల? 6270
పౌరుషంబులు మున్ను - పలికెడువారు
మేరయే పఱువిడ - మీరనిలోన ? "
అన విని వారంద - ఱంగదుఁ జూచి
యని కోడిపాఱుచు - నప్పుడిట్లనిరి.
" నిలు నిలు మనిపల్క - నీకేల? మమ్ము
తెలియవే ప్రాణముల్ - తీపౌను కాదా !
ఎక్కడి రణము మీ - రేఁటికి రాముఁ
డెక్కడ బోయిన - నేమి మాకేల ?
దయ్యమువలె వీఁడు - తఱుముక ప్రింగ
వెయ్యేన నెదిరింప - వెఱతుము మేము 6280
మాటవాసి యదెల్ల - మంటిపాలయ్యొ
చాటిచెప్పెదమింకఁ - జాలు మీకొలువు
మీతండ్రితోడు న - మ్మించకు పాప
జాతి చావోట్టుగా - సములు వెట్టెదవె ?
ఇపుడు దప్పినఁజాలు - నిటమీఁదఁ దమకు
నపకీర్తియైన నే - మైన నౌఁగాక
మఱలి రామునుమాట - మాత్రమే వాని
తిరిగి చూచినయంతఁ - దీఱు ప్రాణములు
సీతోడి మొగమాట - నిలువలే"మనుచుఁ
గాతరత్వంబునఁ - గపులెల్లఁ బఱువ 6290
నాసలాసల నిల్చి - యంగదుండాడు
రోసపు మాటల - రోషముల్ వెనిచి

—: కుంభకర్ణుఁడు మైందద్వివిదాది వానరులను జయించి వీరవిహారము సేయుట :—

శరభవాయుజనల – శతబలి ఋషభ
హరియూథపులు చెట్టు – లగములుం బూని
యాకుంభకర్ణుపై – ప్రాణాశ మరులు
లేక వేలుపులు ‘ మే – లే వీర ’ లనఁగఁ
గదిసినచోఁ గుంభ – కర్ణుండు దనకు
నెదిరించు వారల – నెనిమిదివేలు
నేడునూఱుల వాన – రేంద్రులఁ జంపి
జోడించి కొండఱఁ – జుట్టకవట్టి 6300
పదియు నిర్వది నలు – వదియేఁబదియును
గుదిగ్రుచ్చి యెన్నని – క్రోఁతుల మ్రింగి
భుజములచేత మూఁ – పులఁ జంకలందు
విజవిజ దన్నుకో – విడవక పట్టి
బలవంతులను నూట – పదినూఱువేలు
కొలఁదుల బట్టి మ్రిం – గుచు మాఱులేక
దొబ్బలు నమలి నె – త్తురు లుమియుచును
గొబ్బులాడుచు కేరి – ఘొల్లున నగుచు
మెలఁగుచో నందంద – మేటివానరులు
చలపట్టి కనుచాటు – జగడముల్ చేసి 6310
తరమినఁ జిక్క్రక – దాఁటుచు నతఁడు
తిరిగిన వెంటనే – తిరుగుచుఁ బోర
తెగివచ్చి యుద్ధమై – ద్వివిదుండు వాని
నగముచే వైచిన – నగుచు నమ్మేటి
కేడించిన ప్రలంబ – గిరి దాఁటి జలధి

గూడిన మేఘంబ - కో యన కొండ
దనుజ బలంబు మీఁ - దను వచ్చి పడిన
ననిలోనఁ జదిసె నా - ద్యంతమా సేన
ద్వివిదుండు మఱియు నె - త్తిన కొండచేత
జవసత్త్వములు మీఱ - జగడంబు సేయ 6320
చావక మిగులు రా - క్షసు లెదిరించి
లావున కపుల నె - ల్లను బొలియింప
హనుమదాదులు కొండ - లా కుంభకర్ణు
ననుపమసత్త్వులై - యద్రుమలం దరుల
నొప్పింప వలుదమే - నున నెత్తురొలుకఁ
జప్పరింపుచును రా - క్షసనాయకుండు
శక్తిచే నాది గ్రాం - చనగంబుమీఁద
శక్తినైచిన యట్టి - షణ్ముఖురీతి
శూలంబు ద్రిప్పి యా - ర్చుచుఁ బవమాన
బాలకు వక్షంబు - భగ్నంగఁ బొడువ 6330
నాపోటుచేత రో - మ్మంతయుఁ బగిలి
వాపోవుచును గూలె - వాయునందనుఁడు.
అది చూచి రాక్షసు - లట్టహాసముల
బెదరు పుట్టించి క - పిశ్రేణిఁ దఱిమి
నీలుఁడు సేనల - నిల్పి తానొక్క
శైలంబు వూని రా - క్షసనాథు నెదిరి
వ్రేసిన నదిరాఁగ - విబుధకంటకుఁడు
జేసె చూర్ణంబు ము - ష్టి ప్రహారమున
గంధమాదననీల - గవయగవాక్షు
లంధకాసురుని దే - వాళియ వోలె 6340

నాఁగి శైలమహీరు - హావళి చేత
పైఁగప్పటయు వానిఁ - బరిహరింపుచును
పొదిగిటిలో బుష - భుని పట్టి బిగ్గ
నదిమినఁ దన్నుక - యస్త్రముల్ గ్రక్క
పడగొట్టి శంభుని - పటుశక్తి చేతఁ
బిడికిట బొడిచిన - పృథివిపైఁ ద్రెళ్లె.
అరచేతను గవాక్షు - నదరంట మన్నుఁ
గఱచుకో గొట్టెమోఁ - గాటిచే సీలుఁ
బ్రహరించి శౌర్య ద - ర్పముల నుప్పొంగి
విహరింప వనచర - వీరులందఱును 6350
దొరలపాటులు చూచి - దొమ్మిగా పెచ్చు
పెరిగి రాముఁడు చూడ - బీరంబుతోడఁ
బర్వతంబును దోమ - పదువునుఁబోలి
పర్వియందఱు నెదఁ - బ్రాఁకి యూర్చుచును
చెవులు ముక్కును గఱ - చియును రక్తములు
ప్రవహింప నఖశిఖా - గ్రములు సించియును

—: వానరులొక్కుమ్మడిగా కుంభకర్ణునిపైఁబడి యాతని ధాటి కోర్వలేక శ్రీరాముని శరణుఁజొచ్చుట :—

దన్నియు గ్రుద్దియుఁ - దలపట్టి యీడ్చి
వెన్నుపైఁ జఱచియు - విసరివాలములఁ
గొట్టియు నొప్పించి - కుంభకర్ణుండు
చిట్టాడుచును కను - చెదరి భీతిల్లి 6360
తనమీఁద తరువులు - తరువులమీఁద
వనచరులును గల్గ - వసుమతీధరము

పొలిచినరీతిని - భుజగుల నెల్లఁ
బొలియించు గరుడుని - పోలిక నలిగి
యందఱఁ బట్టుక - యందంద మ్రింగి
మందరాచలదరీ - మార్గంబునందు
వెడలి చీమలు వచ్చు - విధమున చెవులు
వెడలువారును వాత - వెడలు వారలును
ముకుచఱములరంధ్ర - ముల వచ్చువారు
నొకరైన నిలువకి - ట్లురుశక్తి వెడలి 6879
కన్నత్రోవలు పట్టి - కపులు శ్రీరాము
వెన్నాస గొని 'కావ - వే! తండ్రి!' యనుచు
నభయులై నిల్చిన - నంతకాలమునఁ
బ్రభవించు నత్యుగ్ర - పావకుండనఁగఁ
బ్రాణికోటులను వెం - పరలాడు శరధి
తూణీరుఁ డనఁగ జం - తుశ్రేణిమీఁదఁ
దెగివచ్చు శమనుని - తీఱున శూల
మెగుర వేయుచుఁ దన - కెదు రెందు లేక
యెదురుగావచ్చుదై - త్యేంద్రునిఁ జూచి

—: అంగదుఁడు కుంభకర్ణునితోఁబోరి మూర్ఛిల్లుట :—

కదిసి పరాక్రమ్యం - గదుఁడంగదుండు 6880
కొండఁ గైకొని కనుఁ - గొండని కపుల
మండాడి యసురేంద్రు - మహాళిపై వేయ
నా వేటు వడియు మ - హాబలశాలి
చావక నోవక - సరకుగాఁగొనక
శూలంబు చేత నా - ర్చుచు మీఁద నేయ

వాలిసూనుఁడు లాఘ - వకళా నిరూఢి
మొనఁదప్ప గేడించి - మొరయుచు దనుజు
చనుమఱ నాఁట హ - స్తంబుచే మోదఁ
బెనుగొండ కైవడి - పృథివిపై రాలి
తనమూర్ఛఁదెలిసి దై - త్యప్రవరుండు 6390
నంగదు పేరురం - బదరంట తనదు
ముంగలఁ బొడిచిన - మూర్ఛమై మఱచి
యిలమీఁద బడుటయు - నెదురెవ్వరైన
నిలుచువారలు లేక - నిర్జరారాతి
తనమీఁదరా భాను - తనయుండు క్రోధ
మున నొక్క భూధరం - బు పెకల్చి పట్టి
వచ్చునప్పుడు దైత్య - వరుఁడు వానరుల
విచ్చలవిడిఁ బట్టి - వివృతాస్యుఁడగుచుఁ
బసిఁబట్టుచును జేర - భానుసూనుండు
దెసలు ఘూర్ణిల్ల దై - తేయేంద్రుఁ బలికె. 6400

—: సుగ్రీవుఁడు కుంభకర్ణునితో యుద్ధముచేసి మూర్ఛిల్లుట :—

"ఏల మ్రింగెదవు నేఁ - డీ వానరులను
చాలు నింతట నిది - శౌర్యంబు తెఱఁగ?
నాచేతనున్న యీ - నగము నీమీఁద
వైచెదఁ దనుఁగల్గి - వారించుకొనుము
వాతప్పు లేనట్టి - వాలిసోదరుఁడ
చేతప్పు లేనట్టి శ్రీ - రామ హితుఁడఁ
గనుఁగొమ్ము నీ" వన్న - కమలాప్తసుతునిఁ

గనుఁగొని యా కుంభ - కర్ణుఁ డిట్లనియె,
" ఇంత నేమిటికి నీ - వెత్తినకొండ
యెంత నీవెంత న - న్నదిరి పల్కుటకు 6410
రానేరవే ఋక్ష - రజునకుఁ బుట్టి
దానసే బంట్రౌతు - ధర్మంబు నిలిచె
వచ్చినవాఁడ వె - వ్వరికినై మోచె
దిచ్చోట బలుగొండ - యేయు మీవనిన
సుగ్రీవుఁడపుడు వై - చుటయు విభీషణా
డాగ్రజు నురముపై - నది బలుగొండ
గుప్పున దాఁకి ను - గ్గులుగాఁగ రాలె
నప్పుడు వనచరు - లడలుచు నుండ.
ఔరౌర ! యని మెచ్చి - రసురులు మింటఁ
జేరి రాక్షసులు భూ - షించిరి చూచి 6420
శైలంబు చూర్ణమై - జగతి రాలుటయు.
శూలంబుఁ జేసను - ర్చుక దైత్యవరుఁడు
వ్రేసిన నది రుమా - విభునిపై రాఁగ
నాసమీరకుమారుఁ - డడ్డంబు దూరి
తాట బాణమురీతిఁ - దన కేలఁబట్టి
గాటంబుగాఁగ మోఁ - కాటిపైఁ జేర్చి
వట్టుక యొకవేయు - భారువులెత్తు
గట్టియుక్కుఁ గరంచి - కావించినట్టి
యాశూల మిరువాగు - లై విఱుగంగ
నాశనై ఖరి ద్రుంచి - యంజనాసుతుఁడు 6430
కడు బాఱవైచినఁ - గపులెల్లఁ జూచి
కడు మెచ్చి రతని లా - ఘవసత్త్వములకు.

శూలము వచ్చిన - చోఁ జూచి మలయ
శైలశృంగంబు రా - క్షసనాయకుండు
పెకలించి యది బిర - బిరఁద్రిప్పి వ్రేయ
సకలరాక్షసులు మ - ర్ఘా యంచు మెచ్చ
నాశిఖరంబు భ - యంకరం బగుచుఁ
గీశులు వెఱవ సు - గ్రీవుని యురముఁ
దాఁకిన వాఁత ర - క్తముఁ గ్రక్కికొనుచు
సోఁకోర్వఁ జాలక - సురిగి వ్రాలుటయుఁ 6440
గొండంతగెలుపుతోఁ - గుంభకర్ణుండు
కొండకై వడి నున్న - కోఁతుల దొరను

—: మూర్ఛమునిఁగియున్న సుగ్రీవుని కుంభకర్ణుఁడు లంకకుఁ గొనిపోవుట :—

చేరి భుజాంతర - సీమ నమర్చి
వారిదంబుఁ దెమల్చు - వాయువురీతి
నెత్తుక తాలంక - కేఁగి "తోఁబుట్టు
చిత్తంబునకుఁ బ్రీతి - సేసెద నితఁడు
తగిలిన యప్పుడే - దశరథాత్మజులు
తెగిరి కోఁతులమాట - తీఱె నమ్మునుపె"
అని యసురులు చింత - నంద మిన్నంది
చన గనుఁగొని ప్రభం - జన కుమారకుఁడు 6450
మోసమువచ్చె రా - ముని కార్యమునకు
నాసఁ దీఱెను జన - కాత్మజ కింక
ప్రాణంబు లేని క - బంధంబు రీతి
త్రాణ వాసెను కపీం - ద్రస్తోమమెల్ల

నావంటి భృత్యుఁడు - న్న ఫలంబు వీనిఁ
బోవనిచ్చి శరీర - మున నుండి యేమి ?
ఏల పోనిత్తు మి - న్నెల్లను నిండఁ
జాల పైఁ బెంచి రా - క్షసుని మర్దించి
యెఱుఁగక మునుపున - న్నేలినవానిఁ
జెఱ విడిపింతు మూ - ర్ఛలి యున్నయపుడె. 6460
ఎఱిఁగె నేనియు నితం - డింతటి చింతఁ
బొరలునో తనకిట్టి - బుద్ధి యేమిటికి ?
అరికట్ట నేర్చునే - యమరేంద్రుఁడైన
మరుఁడైనయని మొన - మార్తాండసుతుని
వాలితో సరిపోరు - వానికి యసుర
చాలునే పట్టుక - చనఁగ నెక్కడికి ?
ఏ విడిపించిన - యినకుమారునకుఁ
బోవ దపఖ్యాతి - పుడమి నెన్నటికి
నిపుడె దామేల్కని - యే తేరఁగలఁడు
కపినాయకుఁడు మూర్ఛ - గాని కాదొకటి 6470
రాక వేల్పొకటైన - రావణుతోడ
నీకుంభకర్ణుని - యెల్ల రాక్షసుల
లంకతో గూడ నే - ల నడంగ రాచి
పంకజాప్తకుమారుఁ - బచరించి తెత్తు
పదర రాద "ని మహా - ప్లవగవల్లభుల
బెదరుఁ దీఱిచి కను - పెట్టుక యుండె.
కుముదాది సుతునితోఁ - గుంభకర్ణుండు
తమరాజధాని సౌ - ధశ్రేణి నడుమఁ

గనకశృంగోజ్జ్వల - కల్యాణశైల
మన వచ్చునెడ నింతు - లారతులెత్తి 6480
పన్నీరు సల్లి దీ - పంబులమర్చి
తిన్నెల ధూమ్రంపుఁ - దిత్తులు గట్టి
పూవ్వుల చప్పరం - బులమర్చి పరిమ
ళావహగంధవా - హాకిశోరకములు
మలయు వీవనల ము - మ్మరముగావీవ
నలయికఁ దీఱి మూ - ర్ఛావాప్తిఁ దొరఁగి

—: సుగ్రీవుఁడు మూర్ఛనుండి తేఱికొని కుంభకర్ణుని ముక్కు చెవులు కొఱికి తప్పించుకొని శ్రీరామునిఁ జేరుట :—

కనువిచ్చి చూచి లం - కాపురంబగుట
తనరాక వాలిసో - దరుఁడాత్మనెఱిఁగి
" ఏరీతిఁ బోవుదు ? - నేనిట్లు దవిలి
యూరకే మఱలిపో - నొచ్చంబు గాదె ? 6490
ఒచ్చంబుచేసి దై - త్యుఁడు తనుదానె
చచ్చు గార్యముఁగ నే - చనుదు గాక" నుచుఁ
బట్టిన చేతులఁ - బదిలంబుఁగాఁగఁ
గట్టిన కుంచల - గతినున్న చెవులు
కుండలంబులతోడఁ - గొనగోళ్ళచేత
రెండును ద్రుంచి క - త్రించినయట్ల
దంతాగ్రముల మహా - దానవు ముక్కు
కొంతటికినిఁ దెగఁ - గోసినయట్లు
కబళించి మొగసిన - కడకాలువట్టి
యుబికి పోవఁగనీక - యురుసత్త్వశాలి 6500

కుంభకర్ణుఁ డదల్చి - గుప్పించి తిగిచి
కుంభినిఁ బడవైవ - గుదికాల దాని
మట్టెదసను వేళ - మర్కటస్వామి
మిట్టి యట్టిటువడి - మింటికి నెగసి
యెదురు చూచుచునున్న - యెల్లవానరులు
నదె వచ్చె సుగ్రీవుఁ - డని యార్భటింప
రాముని చరణసా - రసముల వ్రాలి
చేమోడ్చె సౌమిత్రి - చెంత నున్నంత.
కుంభకర్ణుండు సి - గ్గును రోష మొదువఁ
గుంభిని యద్రువఁ గ్ర - క్కునఁ బురివెడలి 6510
చెవులు ముక్కునుఁ బోయి - జేగురుఁగొండ
హావణికఁ దోప భ - యంకరాకృతిని
రాఁజూచి కపులెల్ల - రామునిఁ జేరఁ
గాఁజూచి సౌమిత్రి - కార్ముకంబంది
యేడుదూపులుఁ నాఁట - నేసి యవ్వెనుక
మూఁడు బాణము లుర - మ్మునఁ బాదుకొల్ప
నవి సడ్డసేయక - యమరనాయకుఁడు
చవుకగా నెంచి ల - క్ష్మణున కిట్లనియె.
"ననుఁజూచి నీవు ప్రా - ణములతో నిలిచి
యనిసేయఁ బూనిన - యపుడె మెచ్చితిని 6520
బాలకుండవు వింట - బాణంబు దొడుగఁ
జాలవు నీనేయు - శరములు నన్ను
నాఁటునె దేవదా - నవ యక్షఖచర
కోటి నాయెదుర మా - ర్కొని నిల్వలేదు
నిను జంపఁ జేయాడు - నే నాకుఁగాన

చనుము రాముని జూపి - సమరంబు మాని
కపుల నావంటి రా - క్షసులు చంపుదురు
కృపలేక యే రాముఁ - గీటడంచెదను,
అంతట నిను నెవ్వ - రైన దైతేయు
లంతకుపీటికి - ననుప నున్నారు" 6530
అన విని లక్ష్మణుఁ - డా కుంభకర్ణుఁ
గని "యోరి! రాముని - కరవేల నీకు
ననుమీఱి పోవచ్చు - నా? బంటవైన
నిను నీవు పొగడుకో - నీతంబుఁగాదు
వేల్పులు నెఱచిన - వెఱపని మిట్టి
యల్పుల ఖండించు - నది నా వ్రతంబు
చూడుము నాచేతి - చుఱుకంచు ములుకు
లాడంగ" లక్ష్మణుఁ - డస్త్రంబు లేయ
నవియును ద్రోచిపో - నమ్ములవాన
భువిదివి నిండ న - ప్పుడు ప్రయోగింపఁ 6540
గపులఁ ద్రోలుచును రా - ఘవుని మార్కొనిన
యపు డధిజ్యశరాసుఁ - డై యెదిరించి

—: శ్రీరాముఁడు కుంభకర్ణునెదుర్కొని యుద్ధముచేయుట :—

రాముఁ డుద్దాముఁడై - రౌద్రాస్త్ర మహిత
భీమంబుగాఁ బూని - పేరెద నాఁట
వేసి కొన్ని యమోఘ - విశిఖముల్ నారు
వోసినగతి నురం - బునఁ గీలు కొలుప
నవియును ద్రోచి వాఁ - డాగ్రహోదగ్ర
దవపావకుని రీతి - తనమీఁద రాఁగఁ

గాంచనపుంఖ రా - ఘవసాయకముల
మించె రాక్షసుని నె - మ్మేన గుంపులుగ 6550
నీలాచలంబుపై - నీలకంఠములు
వ్రాలి పింఛములార్చు - వైఖరిఁ జూడఁ
గదలుచు నసియాడు - గరులమొత్తంబు
లెదురఁ గన్గొనువారి - కిచ్చె నచ్చెరువు
శ్రీరాఘవుఁడు కర్త - రీముఖ దివ్య
నారాచధారల - నళికివై చుటయు
మండుచు వాని మై - మఱుఁపు మార్తాండ
మండలద్యుతిని భూ - మండలిఁ బడిన
నాజోడు క్రింద స - హస్రవానర స
మాజమేర్పడరాక - మంటిలోఁ గలసె! 6560
అంతట సురవైరి - యవుడులుఁ గఱచి
యంతకురీతి వీ - రాట్టహాసమునఁ
గపులు గుండియలు వ్ర - క్కలుగాఁగ నార్చి
కుపితుఁడై యెదిరి రాఁ - గోదండపాణి
నిర్జరుల్ వెఱగంద - నిశిత బాణముల
జర్జరితముగ వ - క్షముమీఁద నేయఁ
జేతఁబట్టిన గద - క్షితిఁ బడవైచి
భూతావహుని రీతి - బొబ్బలు వెట్టి
ముక్కు వెంటను గారు - మొదటి రక్తంబుఁ
గ్రక్కుచు నెత్తురుఁ - గాలుచేఁ జాల 6570
మిత్తాయి గొనుచు తా - మ్రవిలోచనములు
జొత్తిల్ల కపుల నె - చ్చోటఁ గన్గొనుచు
సెలవులు నాకుచుఁ - జిమ్మనగ్రోళ్లు

వెలువడుగతి శ్రవో - వివరంబులందుఁ
గురియనెత్తురు చెంపఁ - గుంకుమపంక
పరిచితి గనిపింప - బాహువుల్ చాఁచి
వీరు దైతేయులు - వీరు వానరులు
వీరు నావారలు - వీరన్యులనుచు
నెఱుఁగ నేరక పట్టి - యెవ్వారినైనఁ
బోరిఁబోరి మ్రింగుచు - బుసకొట్టుకొనుచు 6580
రొప్పుచు రాముఁ జే - రుటయుఁ గ్రొవ్వాడి
కుప్పె కోలలచేత - గుదిగ్రుచ్చి నిలువఁ
గోమలతరనీల - కువలయశ్యాము
రాముఁ గన్గొని సుమి - త్రాపుత్రుఁడనియె.
"చెవులు ముక్కును వోయి - సిబ్బితి చేత
బవరంబులో వీఁడు - పడఁ గోరినాఁడు.
ఎఱుఁగఁడు తనవారి - నెదిరివారలను
మఱచెను తనమేను - మత్తుఁడై యితఁడు
పచ్చినెత్తురు ద్రావి - పొలివట్టుటయు
రిచ్చపాటున సంచ - రింపుచున్నాఁడు. 6590
కపులెల్ల వీని యం - గములపైఁ బ్రాకి
యిపుడు భారంబుగా - నెక్కి త్రొక్కినను
పుడమిపైఁ ద్రెళ్లు ని - ప్పుడె దైత్యుఁ"డనినఁ
గడకంటి సన్న రా - ఘవుఁడు సేయుటయుఁ
బెళపెళవచ్చి క - పిశ్రేణి మూఁగి
బలుగొండ ధాతు సం - పదఁ బొల్చినట్లు
వనుచేంద్రు రక్తసి - క్తాంగంబు నెత్తు
రసలు జిర్కులు వాఱ - నాసల నెక్కి

యొడలెల్ల నిండి మ - హోద్ధతి గంతు
లిడుచు తేనియ పెర - సీఁగలపోల్కి 6600
ముసురుకొన్నను దశ - ముఖ సహోదరుఁడు
విసరినంతన దంతి - విసరు మావుతుల
కరణి నందఱు నలుఁ - గడ నూడిపడిన
సరకు సేయక రామ - చంద్రునిఁ గదియఁ
దమ్ముఁడు దాను కో - దండముల్ వాటి
యమ్ములు నేర్చి గు - ణారావ మొప్పఁ
గదియంగఁ జని కుంభ - కర్ణునిఁ జూచి
చదురు మాటల రామ - చంద్రుఁ డిట్లనియె.

—: శ్రీరామ కుంభకర్ణ సంవాదము :—

" రాక్షసాధమ ! విన - రా ! కుంభకర్ణ !
రక్షోవిఘాతినౌ - రాముఁడ నేను. 6610
ఎదిరించితిని నిన్ను - నిఁక నిట్టునట్టు
మెదల నిత్తునె పాఱి - మిన్నుఁ బ్రాకినను
పాపాత్ముఁడైనట్టి - పంక్తికంధరుఁడు
మాపయి నిను నంప - మార్కొంటిగాన
నిన్నుఁ జంపుట మాకు - నీతి పోసియ "
మన్నమాటలకు వాఁ - డట్టహాసమునఁ
బకబక నవ్వినఁ - బగిలి యాదిత్యు
లకు గుండెలెల్ల త - ల్లడమందె నపుడు.
పెద్ద యెలుంగునఁ - బిలిచి రాఘవుని
గద్దించి యాకుంభ - కర్ణుండు పలికె. 6620

" రామ ! ముందటిలోన - రణభూమిలోన
సామాన్య దనుజులఁ - జంపితి ననుచుఁ
జేకని యిపుడేది - ర్చిన నిన్ను పోరి
పోకున్న కపులెల్లఁ - బొగులుచునుండ
మునుమున్ను నా చేతి - ముద్గరాహతిని
నినుఁద్రుంచి నీ తమ్ము - ని వధించి మించి
మాయన్నకు హితంబు - మదినెంచి యలరఁ
జేయుదుఁ గను"మన్న - శ్రీరామవిభుఁడు

—: శ్రీరామ కుంభకర్ణుల యుద్ధము :—

వింటఁ బూనినయట్టి - విశిఖంబులమర
కంటకు నతివజ్ర - కాయంబు మీఁద 6630
వేసిన దానవ - వీరుని యురము
దూసి పోవక మేను - దొలుచుకయున్న
సాలభేదనకళా - చతురంబులగుచు
వాలి పేరెద నాఁటి - వ్రయ్యలుచేసె
నేయమ్ము లవి దాన - వేంద్రుపై నేయ
నాయమ్ము లతికరో - రాంగంబు నాఁటి
యలుగులు గనుపించ - వను నంతెకాని
వెలువడి వీపున - వెడలవేమియును
బరిగట్టియల రఘు - ప్రవరుఁ డేయుటయు
సరిగట్టనేరక - శల్యంబులంటె 6640
మఱియు దివ్యాస్త్రముల్ - మనువంశతిలక
మురుశక్తి దృఢముష్టి - నురువడి నేయ
డాయవచ్చుటయు ఖం - డాచేత నఱకె

నాయస్త్రములను మ - హాదానవుండు.
అంతట రఘువీరుం - డాగ్రహంబొప్ప
పంతమ్ముతో నొక్క - పారావతమ్ము
సంధించి వేయ వీ - సరవోక యా క
బంధునట్లన వాని - బాహాగ్రశంబు
వాయవ్యమంత్ర ని - వారితంబగుట
వాయువు తరుశాఖ - వ్రాల్చినయట్లు 6650
కరము వేగమున ము - ద్గరముతోఁ గూడ
నఱికిన పెక్కువా - నరులు రాక్షసులు
నాచేతిక్రిందట - నడఁగ వ్రాలుటయుఁ
జూచి రాముని సుర - స్తోమ మగ్గించె.
ఆలోన దనుజేంద్రుఁ - డలఘు సాలంబు
వేగంబె డాకేల - వేయఁ బూనుటయు
దివ్యమై తగునింద్ర - దేవతాస్త్ర
మవ్యాజలోకహి - తార్థి సంధించి
వేసిన నది మహా - విటపంబురీతి
కోసివైచినయట్లఁ - గుంభినిఁ ద్రెళ్ళ 6660
ఖండించుటయు వాని - కరముచేఁ జదిసి
కొండలు తరువులుఁ - గుంభినిఁ గూలె.
ఆవేళ నతి విపృతా - ననుండగుచు
రావణాసుర సోద - రప్రవరుండు
ప్రమింగుదు నని తన - మీఁదికిఁ గదియ
నంగదసుగ్రీవు - లబ్బురంబంద
జతఁగూర్చి రెండర్ధ - చంద్ర బాణముల
నతని కాళ్లను దుని - యలుగాఁగఁ ద్రుంప

రాజు బట్టంగఁ జేరు - రాహువురీతి
రాజీవ నేత్రుండా - రాముని బట్టి 6670
మ్రింగుదు ననుచు భూ - మిని మొండికాళ్లు
జంగలు చాఁపుచు - జగతి మోపుచును

—: శ్రీరాముఁడు తనపైకివచ్చు కుంభకర్ణుని తలఁద్రుంచి రావణునిముందఱఁ బడునట్లు చేయుట :—

"చెవులు ముక్కును బోయె - చేతులు దునిసె
నవనిఁ గూలెఁ బదద్వ - యము చిక్కె ననుచు
నెంచకు మిప్పుడే - యిరువురి మ్రింగ
నెంచితి రఘువర! - యెటువోయెదనుచుఁ
బైకొనిరా రఘు - పతి దివ్యశరము
లాకుంభకర్ణుని - యాస్యగర్తమున
దోనలోన నించిన - తూపులమాడ్కి
కనకపుంఖంబులు - గనిపించుచుండఁ 6680
గుత్తుకలో నింప - గురుపెట్టుకొనుచు
నెత్తురుల్ సెలవుల - నిండారఁ గురియ
నొడలెఱుంగక నిల్వ - నుర్వీజారమణుఁ
డడలంగ దనుజులైం - ద్రాస్త్రంబుఁ దొడిగి
వేసిన నిప్పులు - వెదజల్లికొనుచు
భాసుర యమదండ - భయదమై నిగిడి
రవికిరణప్రభా - రాశియై పవన
జవముచే నవ్యకాం - చనపుంఖ మమర
వజ్రకీలితమైన - వజ్రంబుచేత
వజ్రాయుధముఁ గేరు - వాఁడిమిఁ గలిగి 6690

శతకోటి వృత్తమ - స్తము ద్రుంచినట్లు
శతకోటి దివ్యాస్త్ర - సమితితో వచ్చి
కోఱలతో కను - గ్రుడ్ల తోడుతను
ఘోరకరాళ భ్రూ - కుటితోడ నొప్పు
కుటిలాత్ము తల కిరు - కున ద్రుంచి నపుడ
పుటముబ్బి యది మింటి - పొడవుగా నెగసి
ఘోరమై నీలాద్రి - కూటంబె పోలె
భోరున మొరయుచు - భువనంబు లదర
లంకాసువర్ణసా - లంబులు గూల్చి
వంకదారలు ద్రొబ్బి - వాకిళ్లఁ ద్రోచి 6700
మేడలు వడఁగొట్టి - మృత్యుకందకము
జాడ రావణుకొల్వు - సావడిఁ బడియె!
ఆదానవుని బొంది - యవనిచలింప
యాదోనిదాన మ - ధ్యంబునఁ బడిన
జలజంతుజాలంబు - సదమదంబగుచు
నలసిపోయెను జీవ - నంబెల్లఁ గలఁగె
నప్పుడు సురసేన - లలరులవాన
గుప్పెలుగా రఘు - కుంజరు ముంచె
జయజయ ధ్వానంబు - చదలెల్ల నిండె
భయమెల్లఁ దీఱెఁ బ్ర - పంచంబునకును 6710
సేదలు దీర్చె ద - క్షిణ గంధవహుఁడు
మేదినీచక్ర మా - మెత నాఁడెఱింగె
ప్రియసహోదరుని వి - భీషణుఁ గపుల
నయనిధి రాముఁడా - నంద మొందించి

పగఁగెల్వఁ బూనిన - పని నాఁటితోడ
సగముఁ దీఱెనటంచు - సంతోషమందె.

—: రావణుఁడు కుంభకర్ణుని మృతికై దుఃఖించుట :—

ఆవార్త హతశేషు - లైన రాక్షసుల
చేవిని దానవ - శేఖరుం డడలి
పెను మూర్ఛ మునిఁగిన - పృథివిపైఁ ద్రెళ్లి
వెనుక చింతావార్ధి - వీచులఁ దేలి 6720
"హా! కామసంచార! - హా! మహాశూర
హా! కుంభకర్ణ! నీ - లాచలవర్ణ!
పోయితివే తన - పొంత గాదనుచు
దాయలచేతి య - స్త్ర ప్రహారముల
వజ్రి వజ్రాయుధ - వ్రణము గైకొనని
వజ్రసారంబు నీ - వరశరీరంబు
రామదివ్యాస్త్ర ప - రంపరచేత
నేమాడ్కి వ్రయ్యలై - యిలమీఁదవ్రాలె
నెదురెవ్వరని యుంటి - యెప్పుడు నీకు
నిదుర లేపితి నేల - నినుదైవ గతిని? 6730
ఇట్టి సోదరుని నే - నెడవాసి మేన
నెట్టు దాల్పుదు ప్రాణ - మేల యీలంక
సీత యేమిటికి చ - చ్చిన చావుగాదె
వైదేయవిభుని సో - దరుఁ డీల్గె ననిన
నీసూడుఁ దీర్చక - యేనుంటినని
వీసంబునకు లెక్క - వెట్టరెవ్వరును
నెవ్వరిప్రాపుచే - నేలుదు లంక

యెవ్వనిభుజశక్తి - కింద్రుండు వెఱచు
నావిభీషణుఁడు పు - ణ్యాత్ముండు వానిఁ
బోవ నాడిననాఁడె - పోయె సేమములు 6740
నని కేఁగుచోట ప్ర - హస్తుండు నీవు
వినిపించు బుద్ధులు - విన నేరనైతి
తనకీడు లేదని - దలఁచి కావించు
తనకీడు సేఁతలఁ - దరియింప వలసె.
ఎవ్వరిఁ జెఱిచితి - నిన్నాళ్లువారు
నవ్వఁ బాలైతి మా - నముఁ గోలుపోయి
నీబుద్ధి విని మున - నేరక నిన్ను
నాబుద్ధిచేత మి - న్నక చంపుకొంటి
దిక్కెవ్వరింక నా - తెఱఁగద్ది?" యనుచుఁ
బొక్కుచు నిలమీఁదఁ - బొరలుచు నుండ 6750
దేవనరాంతక - త్రిశిరోతికాయు
లావలఁ బినతండ్రి - కడలుచుఁ బొరలఁ
దారు నేడ్చుచు మహో - దర మహాపార్శ్వు
లారావణుని పద - ప్రాంతంబులందుఁ
దలలూఁచఁ బొరలి యం - తటఁ ద్రిశిరుండు
తెలివి దెచ్చుకొని పై - త్యేంద్రునిఁ బలికె

—: రావణుని సమాశ్వాసించి త్రిశిరోతికాయ నరాంతక మహోదరాదులు యుద్ధమునకు బయలుదేఱుట :—

"అయ్య! ప్రాకృతురీతి - నడలంగ నేల?
కయ్యంబునకు మీఁదు - కదలి రండిపుడు

పరమేష్ఠి వరముచేఁ - బరమదివ్యాస్త్ర
శరచాపరథ కవ - చంబు లందితివి 6760
నీవు మార్కొను వేళ - నిల్చి పోరాడ
దేవేంద్రదహనాది - దిక్పాలకులును
మొనసేయలేరు రా - ముని పని యెంత !
వనచరులే నిల్చు - వారెదిరించి ?
మీ రేల ? పాముల - మీఁద ఖగేంద్రుఁ
డేరీతిఁ జొరఁబాఱు - నేనట్లఁ బోయి
నానావనాట సే - నలఁ బాఱఁ ద్రోలి
తాను తమ్ముఁడు నిల్చు - దశరథరాము
తల యుత్తరించి కో - దండపాండిత్య
కలనచే నీదు దుః - ఖము మాన్చువాఁడ 6770
నమరనాథుఁడు శంబ - రాసురు నరకుఁ
గమలాక్షుఁడును గెల్చు - గతి రఘుపతిని
ననిఁ గెల్చెద" నటన్న - నతికాయుఁ డట్టె
యోజనచే దండ్రి - యొద్దకుఁ జేరి
"రాఘవుఁ డెంత ఘో - రమనీయ శస్త్ర
లాఘవంబునకు నే - ల విచారమింత ?
తనుఁ బంపుఁ "డనుచు ముం - దఱ నంపించు
కొనునంత దేవాంత - కుఁడు నరాంతకుఁడు
సెలవిండు మా" కన్న - సెలవుల నవ్వుఁ
దులకింప దానవేం - ద్రుఁడు తెలివొంది 6780
యందఱు తనయుల - నాలింగనంబు
లందందఁ గావించి - యాదరింపుచును
కట్టువర్గములు భా - గములు నొసంగి

పట్టుఁడంచును నిజా - భరణంబు లిచ్చి
బహుమాన మొనరించి - పనిచిన వారు
దహనుండు నాలుగు - తనువులై నట్లు
నంపించుకొనిన - వెన్నాసగా వేత్ర
పంపె వెంబడి మహా - పార్శ్వుని మత్తు
యుద్ధకోవిదుని యు - ద్ధోన్మత్తు వంశ
వృద్ధ మహోదరుఁ - బేర్వేరఁ బిలిచి 6790
సెలవిచ్చుటయు వారు - సేనలఁగూడి
యెలగోలు ముందఱ - నిడుకొని నడచి
యస్తాచలము మీఁది - యర్కుఁడనంగ
శస్తమై తగు సుద ర్శననామ దంతి
తానెక్కి యలమహో - దరుఁడు తద్ఘంటి
కానాదములు దిశల్ - గంపింప నడచె
నాత్రికూటము దైత్యుఁ - డామెనోఘునఁగ
నాత్రిశిరుఁడు మ స్త - కాగ్ర కిరీట
మాణిక్యనిచిత యు - గ్మాలికల్ గగన
మాణిక్యమునకు ము - మ్మడి చాయలిడఁగ 6800
నరదంబు నెక్కి ధ్వ - జాంచల శాటి
సురవిమానములఁ బోఁ - జోఁపఁ దానడచె.
కనకరథం బతికా - యుఁ డుత్తుంగ
ధనురస్త్ర కవచముల్ - దాల్చి తానెక్కి
తన మేని చాయ కా - దంబినీ చ్ఛాయ
నినుమడింపఁగ దివ్య - లీక్షింప నడచె.
తెల్లని సామ్రాణి - తేజిపై నెక్కి
వెల్లయైన నిజైక - విభవంబుఁ దెలుపఁ

గోపంబున నరాంత - కుఁడు వచ్చె భయద
చాప మింద్రుని శరా - సనముఁ గీడ్పఱుప 6810
నొకచేత పరిఘంబు - నొకకేల శైల
మొకయంతఁ దాల్చి ది - వ్యులు చూచి బెగడ
క్రూరుఁడై దేవాంత - కుఁడు వచ్చె సమర
శూరుఁడై కాల్నడఁ - జూపఱు మెచ్చ
బటహాధ్వనులు మీఱ - బౌరుల నడుమ
పలుకార్యనిధి మహా - పార్శ్వుండు వచ్చి
దండితాహిత మహో - ద్దండకాలాస్య
దండసన్నిభగదా - దండంబుఁ దాల్చి
యుత్తుంగభుజులు యు - ద్ధోన్మత్తమత్తు
లుత్తమాశ్వములపై - నుర్వి చలింప 6820
దాఁటుచు విండ్లు న - స్త్రంబులు పూని
పోటుదారలకు నుబ్బుచు - వచ్చి రపుడు.
ఈరీతి రాక్షసు - లెనమండ్రు నొక్క
బారు దీర్చక కీశ - బలములమీఁద

—: వానరరాక్షసుల దొమ్మియుద్ధము :—

నడచిన వీరవా - నరులు బీరంబు
విడువక నగములు - వృక్షంబు లంది
యెదురెక్క నుక్కపై - యిరువాగు మూఁక
కదిసి సముద్రముల్ - కలెగొన్న యట్లు
పోరువో నాస్పలు - బొబ్బలు దిశలుఁ
బూరటిలఁగ శరం - బులఁ దోమరముల 6830

నసికుంత భిండివా - లాస్త్రనారాచ
ముసలపట్టిస కుంత - ముద్గరాదులను
జగడింప శైలవృ - క్ష నఖాదికములఁ
డేగి వానరులఁ జంపఁ - దేరులు దోలి
కరుల ఢీకొల్పి న - ల్గడతురంగములు
పరిగించి వెంట కా - ల్బల మాసయుగుచు
ముమ్మరంబున కయ్య - మున దుమ్ము లెగసి
చిమ్మ చీకటి చాయఁ - జెలఁగి వానరులు
నరదంబుతోఁ బట్టి - యరదంబుఁ గొట్టి
కరితోడఁ గరిఁ దురం - గముఁ దురంగంబు 6840
దానవు దానవు ద - ర్పించి కొట్టి
పీనుఁగు పెంటగా - పృథివి నిండింపఁ
దలచెడి పాటుదై - త్యశ్రేణి నాఁగి
'నిలుఁడు చూడుఁడు నను - నీవరాంతకుఁడు
మొగిసి మహామీన - ము పయోధిఁబోలి
నగచరవీర సై - న్యములోనఁ జొచ్చి
గుంపులపైఁ దన గు - ఱ్ఱంబుఁ ద్రోలి
చంపుచు గుదుంబు - గ్రుచ్చఁగ వానిచేత
నొక యేడునూటికి - నుగ్రవానరులు
వికలాంగులై రణో - ర్వని గ్రుగ్గుటయును 6850
చూచి నిల్వక కపి - స్తోమంబు విఱిఁగి
యాచాయ సుగ్రీవు - నాశ్రయించుటయుఁ
గుంభకర్ణునిచేతఁ - గొట్టువడ్డట్టి
కుంభినీరుహచర - కోటి నూరార్చి

—: అంగదుఁడు నరాంతకుని సంహరించుట :—

“ అంగద ! నీ వీన - రాంతకుతోడ
సంగరంబొనరించి - చంపి రమ్మ”నిన
నాయంగదుండు బా - హాశక్తి నొక్క
దోయంబుఁ జేత నం - దుక రాక యెదిరి
మార్కొని వాఁడు తో - మరమెత్తి వజ్ర
కర్కశంబైన యం - గదుని వక్షంబు 6860
వేసిన నది దాఁకి - విఱిఁగి వమ్మైన
వాసవపౌత్రుండ - వార్యశౌర్యమున
వాని వాజిశరంబు - వామహస్తమునఁ
బూని యేసిన నది - పుడమిఁ ద్రెళ్ళుటయు
నిర్వాహనుండయి - నిజధైర్యశౌర్య
నిర్వాహశక్తిచే - నిలిచి యయ్యసుర
నంగదు ముష్టిప్ర - హారంబుచేత
నంగంబు వొడిచిన - నతఁడు మూర్ఛిల్లి
తోడనే తెలిసి య - ద్భుత శక్తి “ నన్నుఁ
జూడు ” మంచును వింట - సురలు కీర్తింప 6870
వానరాంతకుఁడయి - వచ్చిన యట్టి
యానరాంతకుని బా - హాముష్టిచేతఁ
బొడిచిన నశనిచే - భూమీధరంబు
పడినట్లు పడి వాఁడు - ప్రాణముల్ విడిచె.
విచ్చి పాఱిరి దైత్య - వీరులందఱును
వచ్చి చేరిరి కపి - వరులు మేలనుచు.

## —: దేవాంతక త్రిశిరమహోదరుల యుద్ధము - దేవాంతకుని మరణము :—

ఆపాటు చూచి - దేవాంతకుం డలిగి
కోపంబుతో వాలి - కొడుకుపై నడిచె
త్రిశిరుఁడా వెంట న - ట్టిమహోదరుండు
నసురసైన్యములతో - నంచులరాఁగ 6880
మార్కొనుటయు నస - మర్థులైనట్టి
మర్కటులను తన - మఱుఁగుననుంచి
యంగదుఁ డెదిరి దే - వాంతకు మీఁదఁ
జెంగటి తరువునఁ - జేరి వ్రేయుటయు
రోసంబుతోఁ ద్రిశి - రుండా కుజంబు
చేసి వ్రయ్యలుగాఁగ - శితశరంబులను
నంగదుఁడొకఁడని - యసురులు మువ్వు
రంగంబు నాఁట సా - యకముల నేయఁ
దారాసుతుఁడు మహో - దరుఁ డెక్కినట్టి
వారణేంద్రము తల - వ్రయ్యఁజేఁ జఱచి 6890
యాకొమ్ము దీసి దే - వాంతకు వ్రేయ
పైకోక యెఱుఁగక - పడి తోన తెలిసి
దేవాంతకుండు హే - ళిని వాలిసుతుని
చావు పొమ్మని వ్రేయ - చావంత మూర్ఛ
మోకరించుక పడి - మూర్ఛఁ దేఱుటయు
సేకరించుక లేవ - శితశరమ్ములను
మూఁట నాత్రిశిరుండు - మఱువెల్లఁ జెడఁగ
నాఁటించుటయు వాలి - నందను కడకు

హనుమంతుఁడును నీలుఁ - డాసగావచ్చి
పెనుగొండ నీలుండు - పెకలించి తెచ్చి 6900
మించి యాత్రిశిరుండు - మీఁదటఁ బొలియు
మంచు నేయుటయు దే - వాంతకుం డెదిరి
యాకొండ పొడిచేసి - హనుమంతు మీఁద
యాక వారఁగఁ ద్రిశి - రునిఁ బొడుచుటయుఁ
గోపించి కేసరి - కొడు కరచేత
నాపలలాశి మ - స్త్రాగ్రంబు వ్రేయ
నక్కెల్లు కఱచుక - నలసి యాశిరము
వ్రక్కలై పడ వాఁడు - వదలె ప్రాణములు.

—: మహోదరుని చావుచూచి త్రిశిరుఁడు హనుమంతునితో యుద్ధముచేసి కూలుట :—

దేవాంతకుని చావు - త్రిశిరుండు చూచి
యావేళ నీలు నై - దమ్ములు నొంప 6910
తన వంతునకు మహో - దరుఁడును కొన్ని
సునిశితాస్త్రముల ముం - చుటయు నీలుండు
సాలమొక్కటి వట్టి - సామజేంద్రమును
నేలపాలుగఁ గొట్టి - నీలుండు మఱియు
నామహోదరు వ్రేయ - నందుచే వాఁడు
సామజేంద్రుని వెంట - శమనునిఁ జేరె.
తనకు నచ్చిన పిన - తండ్రి గావునను
కనలుచుఁ ద్రిశిరుండు - కరువలిపట్టి
చెంత నుండఁగ శర - శ్రేణి నొప్పింప
వంతకు కైవడి - హనుమంతుఁ డలిగి 6920

కరనఖంబులఁ దురం - గముల నాల్గింటిఁ
బరియలు వాఱఁజీ - వ్వఁగఁ ద్రిశిరుండు
శక్తి వైచిన కరాం - చలములఁ బట్టి
నక్తంచరుఁడు చూడ - నడిమికి విఱువ
నదిచూచి హేతిచే - నదరులువాఱఁ
గదిసి వ్రేయుటయు రా - ఘవకింకరుండు
నరచేత భుజముపై - నడచిన వాఁడు
ధరఁద్రెళ్లి మూర్ఛిల్లి - తనుదానె తెలిసి
పవమాన తనయుని - పై పక్షిరాజు
హావణిక నెగసి వాఁ - డరచేత వ్రేయ 6930
నాకొట్టువడి వాన - రాగ్రణి వాని
చేకత్తిఁ గైకొని - శిరములు నఱుకఁ
బురుహూతుఁ డల - త్వష్ట పుత్రుని తలలు
నఱికినఁ బడురీతి - నగచరుల్ మెచ్చ
మణికుండల కిరీట - మహితంబులగుచు
రణభూమి నుల్కలు - రాలినరీతిఁ

—: మహాపార్శ్వుని మరణము :—

బడిన యంతట మహా - పార్శ్వుఁ డత్తెఱఁగు
పడవాళ్ళచే విని - బలుగద వూని
నడచినయంత వా - నరు లుర్వియెల్ల
నెడమీఱ పరువెత్తు - నెడ ఋషభుండు 6940
కోపంబుతోడ మా - ర్కొనిన నిస్తైల
దీపంబు గతి వాఁడె - దిప్పి ముందుచును
గదచేత ఋషభునిఁ - గదిసి కొట్టుటయు

నది దాఁకి యిలఁ వ్రాలి - యంతనే తెలిసి
పిడికిట దానవు - పేరెదమీఁదఁ
బొడిచిన మూర్ఛిల్లి - పుడమి వ్రాలుటయు
వేగనే చెయి మెలి - వెట్టి యాదనుజు
చేగదఁ గైకొని - శిరము వ్రేయుటయు
నలినలియై తల - నరభోజనుండు
బలిముఖులార్వంగఁ - బ్రాణముల్ విడిచె. 6950
ఆమహాపార్శ్వుఁ డి - ట్లనిలోనఁ బడిన
యామాట హతశేషు - లైన దానవులు
వితెఁగి వారిధి వెల్లి - విరిసిన మాడ్కి
బరువిడి వచ్చి యే - ర్పడ విన్నవింప

## —: అతికాయుఁడు యుద్ధమునకు వెడలుట - మత్తుఁడు ధూమ్రునిచే మడియుట :—

అతికాయుఁ డధరీకృ - తాంబుదధ్వాన
నతకార్ముకజ్యాని - నాదుఁడై యడరి
రథము వేపఱప సా - రథి నెచ్చరించ
వ్యథితవానరచమూ - వర్యుఁడై నడవ
మత్తుఁ డప్పుడు మదో - న్మత్తుఁడై క్రూర
చిత్తుఁడై మున్నుగా - సింహనాదమునఁ 6960
గపుల గుండెలుప్రీల - గదఁ గేలఁబూని
కుపితకల్పాంతాంత - కుని బోలి కెరలి
దుర్వారుఁడై రాఁగ - ధూమ్రుండుచూచి
పర్వతంబొకటె త్తి - పై వేయ నాత్మ
గదమీఁది యిట్టులేఁ - గదయుంచు చేతి

గద త్రిదశేంద్రు భం - గద సవరించి
కొట్టిన నాగట్టు - గులగుల లగుచు
నట్టిట్టు చిదురుప - లై మహిం బడిన
మోటువాఱుకొని ధూ - మ్రుండు మహోవృత్తి
మాటోపగతి నైన - నదియుఁ బోనడఁచి 6970
దండపూనిక గదా - దండంబుచేతఁ
జండించి యతని వ - క్షము వ్రేయుటయును
నాధూమ్రుఁ డందుచే - నరగన్ను వెట్టి
బోధంబుతోడ న - ద్భుతశౌర్యుఁ డగుచు
గదయు నాతని కేలుఁ - గదలకయుండఁ
బదిలంబుగా వాల - పాశంబుచేతఁ
జుట్టి మింటికి నెత్తి - సురలెల్ల మెచ్చఁ
జుట్టు సురాళించి - సుంకు రాలంగ
నేలతోఁ గొట్టిన - నెత్తురుఁ గ్రక్కి
ప్రేలిపోందల వాఁడు - విడిచెఁ బ్రాణములు. 6980

—: ఉన్మత్తుఁడు దధిముఖునిచే హతుఁడగుట :—

అంత యుద్ధోన్మత్తుఁ - డంతకు రీతి
నంతకు మున్నుగా - నగచరావళిని
మక్కుమారిచి మూర - మసలినయట్లు
ప్రక్కలు డొక్కలు - పగియలువాఱ
వాలమ్ములను రెండ - వక్కశానుఁ డనఁగ
నాలమ్ములో ప్రతాపా - గ్ని కీలలును
దరికొల్పుచును జేర - దధిముఖుం డలిగి
గిరిశృంగమెత్తి యుం - కించి వ్రేయుటయు

వాఁడది యమ్ముల - వ్రయ్యలు చేసి
వాఁడిగల్గిన శర - ద్వయ మేరుపఱచి 6990
దధిముఖుపై భుజా - ద్వంద్వంబు నాఁట
రుధిరంబులుబ్బ నా - ర్చుచు నేయుటయును
నావంత సరకుసే - యక వానిశక్తి
యావంతగా నెంచి - యాదధిముఖుఁడు
సాలంబుఁ గైకొని - చదియ వ్రేయుటయు
నాలంబులో వ్రైదై - త్యుఁ డసువులఁ బాసె.

—: యుద్ధమునకు వచ్చుచున్న యతికాయునిఁ గూర్చి శ్రీరాముఁడు విభీషణుని ప్రశ్నించుట :—

ఇరువురిపాటు దా - నీక్షించి కదియ
నరదంబు దోలి యా - హవకౌతుకమునఁ
గపులు భీతిల నతి - కాయుఁ డత్యుగ్ర
తపన తేజమునఁ గో - దండంబుఁ గేరుటయు 7000
శింజిని మొరయ గ - ర్జింపుచు గాత్ర
మంజనాచల నిభం - బై మిన్ను మోవఁ
గడచన్న యాకుంభ - కర్ణుండు వేఱె
యొడలి దాలిచి వచ్చె - నోయంచు భీతి
నందఱు రఘువీరు - నాశ్రయించుటయు
నందఱు వెఱవకుం - డని వెఱఁగంది
"ఔర! వీఁడెవ్వఁడో!" - యన విభీషణుని
శ్రీరామచంద్రుఁ డీ - క్షించి యిట్లనియె.
"పర్వతాకారుఁడై - ప్రళయకాలమున
శర్వుండు భూతసం - చయముతో వచ్చు 7010

కై వడి తనుఁజూచి - కపులెల్లఁ బెదర
నీవచ్చు రాక్షసుఁ - డెవ్వఁ డేర్పఱుపు
కాలపావక జిహ్వ - కలఁ బోరుడింపఁ
జాలిన యత్యుగ్ర - శక్తులు దాల్చి
మెఱుపులతో నీల - మేఘంబురీతి
నురుముచు పైవచ్చు - చున్నాఁడు వీఁడు.
అమరాచలముఁగేరు - నపరంజితేరు
నమరేంద్రు ధనువు జో - డగు శరాసనము
ప్రాంచలోదగ్ర సా - రథి చతుష్కంబు
నంచితసింహాకే - య మహాధ్వజంబు 7020
జవతురంగమ సహ - స్రముఁ బదిజోళ్లు
ప్రవిమలాపాదక - భర్మతూణములు
నిరువది సింగాణు - లెనిమిది మూర్ల
గరమొప్పు పిడిపట్లు - గలిగి యిర్వంక
పదివారలను చూపఁ - బరిపరియలుగు
లుదిగి పరంజులు - నొప్పు దోదుములు
రెండును గలవాఁడు - రెండుభుజంబు
లండల శృంగంబు - లై మహానగము
గనుపించుగతి మస్త - కమునుఁ గిరీట
మినమండలము బోల్ప - నితని మొగముఁ 7030
జూడఁ జూడ పునర్వ - సూ మధ్యచంద్రు
జాడ వీనుల గొప్పు - చౌకళుల్ మెఱయు
కతన నందము మించు - గా వచ్చువాఁడు
యితని పేరెద్ది! - నీవెఱిఁగింపు" మనినఁ

గరములు మొగిచి రా - ఘవు మోముఁ జూచి
సరమాధిపతి విభీ - షణుఁ డిట్టులనియె

—: విభీషణుఁడు శ్రీరాముని కతికాయుని వృత్తాంతము నెఱింగించుట :—

" ఇతఁడు రావణపుత్రుఁ - డితనికి నామ
మతికాయుఁ డంద్రు వీఁ - డసమాన బలుఁడు
మాయన్నకును ధాన్య - మాలిని యందు
నీయన జనియించె - నింద్రాదులకును 7040
వీఁడ జేయుఁడు ధాత - వీనికి నిచ్చె
వేఁడినవరములు - విండ్లు నమ్ములును
కవచతూణీరముల్ - ఖడ్గముల్ రథము
నవనిజారమణ ! వీఁ - డతులవిక్రముఁడు
వరుణపాశము నింద్రు - వజ్రాయుధంబు
హరునిశూలమునుఁ - గాలాంతకు గదయు
వీనిపైఁ గొఱఁగావు - వీని యస్త్రంబు
లానిలింపులకెల్ల - నాపత్కరములు.
అందఱితోఁ బోరు - నటు గాదు వీని
ముందఱ నెదిరింప - ముకొ్కఁక యగును ! " 7050

—: అతికాయుని యుద్ధము :—

అని విన్నవింపుచోఁ - నతికాయుఁడార్చి
కనఁగన వెలుఁగు ప్ర - కాండ కాండములు
నిగుడించి కపుల మ - న్ని గొనంగఁ జూచి
మొగడప్పి నెవ్వరు - మొనసేయకున్న

ద్వివిదాది వానరుల్ - వృక్షముల్ గిరులు
సవరించి యెదురించి - జగడించునపుడు
వారేయు నవియెల్ల - వమ్ముగా నమ్ము
లాఱు నేడును - నాల్గు నైదును ద్రొగ్గి
తునియలు చేసి కో - తులనెల్ల భయద
నునిశితాస్త్రముల నే - ర్చుటయు భీతిల్లి 7060
యందఱు బఱనెత్త - నమరేంద్రసుతుఁడు
మందహాసంబుతో - మర్కటావళినిఁ
గనుఁగొని కరుణచేఁ - గాచి కోదండ
ధరుఁడైన యట్టి సీ - తాకాంతుఁ జేరి
భల్లంబుచే నేర్చి - పట్టి యెక్కిడిన
యల్లె మీటుచు నప్పు - డతికాయుఁ డనియె.
"రామ! దుర్బలుల పై - రలనుసంగ్రామ
భూమిలో గెల్చి యే - పోటరి ననుచు
నెంచి నన్నటుల జయిం - చెద ననుచు
నుంచకు మాపని - యుల్లంబులోన 7070
ఖరునిదూషణుఁ గుంభ - కర్ణు విరాధుఁ
బొరిగొన్న నీదు తూ - పులు నాదుమీఁద
నిగిడింపు మటమీఁద - నీవె చూచెదవు
జగడంబులో మద - స్త్రకళానిరూఢి.
ఏసెదవో కాక - యే నేయఁ జూచి
యేసెదవో డెంద - మెఱిఁగింపు"మనిన
నామాట యందుక - యాడితి వనుచు
సౌమిత్రి యసురేంద్ర - శాబకుఁ బలికె.

—: లక్ష్మణుఁ డతికాయునెదుర్కొని యధిక్షేపించుట - వారి సంభాషణము :—

"ఎచ్చు శౌర్యమువాఁడ - వేనుండ నీకు
వచ్చునే రఘువంశ - వర్ధనుఁజెనక 7080
నీమీఁద నిట్లుండు - వే రణరంగ
భీముఁడు రాముఁడో - పిన యట్టి కోలఁది
నన్ను మార్కొనుము ప్రా - ణములపై నాస
యున్న నవ్వలికేఁగు - నోర్చితి" ననిన
నతిశయరోష తా - మ్రాక్షుఁడై మఱలి
యతికాయుఁడల సుమి - త్రాత్మజుఁ బలికె
"బాలుఁడ నీవేమి - పలికిన నేమి
కేల చక్కఁగ విల్లుఁ - గీలింప లేవు
నీమీఁదఁ దొడుగుదు - నే నాశరంబు
రామునిపైఁ జేయి - రానిత్తుగాక. 7090
అసిలోనఁ దనకు - నింద్రాదులు వెఱతు
రని నీ వెఱుంగక - యాడితి విల్లు
తొడిగిన నాచేతి - తూపున కోర్చి
జడియక యెదురింపఁ - జాలునే యొకఁడు.
అజరభూధరమైన - నలవింధ్యమైన
రజతాద్రియైనఁ బా - ర్వతి తండ్రియైన
నోరుచునో లేదో - యొక్క వ్రేటునకు !
మీ రాము నెఱుఁగమా - మీఁదటగాక
కాచితి నిన్ను నా - కడ కేఁగు" మనినఁ
జూచి సౌమిత్రి ర - క్షోవీరుఁ బలికె. 7100

" పలుమారు నను నీవు - బాలుఁడ వనుచుఁ
బలికెద వదినీకు - పౌరుషంబవునె
పిడుగెంత ? గిరియెంత - పిన్నగా దొటు
వడుగైన బలిచేరు - వామనమూర్తి
దొడ్డుగొంచెంబు లెం - దుకు చూడుమిపుడు
గడ్డుగా నీదు ర - క్తములు గ్రోలింతు
నీలీల వందుర - నీయమ్ము చేత
లోలాత్మ ! నీదు నా - లుకఁ గత్తరింతు
తరువృంతమునఁ బోవు - తాళఫలంబు
ధరఁద్రొల్లి నటుల నీ - తలఁ ద్రెవ్వనైతు 7110
పసిబిడ్డనే నిన్నుఁ - బసివట్టి మెసవి
మసలిన యముఁడని - మదినెన్నుమిపుడు
నాచేత విల్లు బా - ణంబులు గల్గి
నీచరాక్షస ! యట్ల - నీవును దివ్య
బాణబాణాసన - పాణివై యుండి
ప్రాణంబుపై యాశ - బలవంత మగుట
వట్టి మాటల గెల్వ - వచ్చితివేమొ
యిట్టని పోనిత్తు - నే నిన్ను " ననిన

## —: లక్ష్మణాతికాయుల యుద్ధము :—

సమరకంటకుఁడైన - యతికాయుఁ డలిగి
బామముడితోడ తూ - పులు వింటఁ గూర్చి 7120
వేసిన నదిగొన్ని - విశిఖముల్ దొడిగి
యాసుమిత్రాపుత్రుఁ - డడఁచె ఖండించి
మఱియు నైదమ్ముల - మనుజాశనుండు

సరగ నేసిన నర్ధ - చంద్రబాణముల
నవియును దునిమి సా - యక మొకటేర్చి
యవనీధరంబుపై - నశని చందమున
వ్రేయుటయును ధాత - విలసించి నట్టి
యాయతికాయుఁ భా - గ్యాత్మశరావళులు
గట్టించుగతి చాయ - గావచ్చి ఫాల
పట్టి నాఁటిన దైత్య - పతితనూభవుఁడు 7130
కనుమోడ్చి గడగడ - కంపించి తెలిసి
మనసులో మెచ్చి ప - ల్మాఱు లక్ష్మణుని
వంది చందమునఁ గై - వారముల్ చేసి
కందోయిఁగఱకెంపుఁ - గదుర దానవుఁడు
చనుమఱనాఁట ని - శాత సాయకము
కనలుచు సేయ రా - ఘవవరానుజుఁడు
భుగ్నమనస్కుఁడై - పొగలు మిన్నగయ
నాగ్నేయమైన ది - వ్యాస్త్ర మేయుటయు
నతికాయుఁ డలిగి సౌరా - స్త్రంబుఁ దొడిగి
మతినేయనవిరెండు - మల్లడిఁ గొనఁగ 7140
నసురేంద్రసుతుఁ డైషి - కాస్త్ర మేయుటయు
నసముడించక బదు - లైంద్రాస్త్ర మేసి
సౌమిత్రి వారింపఁ - జలపట్టి యామ్య
నామాస్త్ర మసురేశ - నందనుండేసె
పవనాస్త్ర మూర్మిళా - పతి ప్రయోగింప
నవివోరి యన్యోన్య - మణఁగినఁ జూచి
లక్ష్మణుండతి కర - లాఘవ శౌర్య
లక్ష్ముఁడై బాణ జా - లముఁ బ్రయోగింప

నవి యతికాయమ - హాసుర వజ్ర
కవచంబుపై నగ్ని - కణములు రాల 7150
టంకార రవము నిం - డఁగ నాఁటినాల్గు
వంకల మొనచెడి - వసుధపైఁ బడిన
నేమి సేయుదు నని - యెంచి వెండియును
సౌమిత్రి వినిశితా - స్త్రంబులు గురియ
దనుజవీరుఁ డమోఘ - తరతనుత్రాణ
మను వజ్రపంజర - మంగరక్షగను
నడ్డ సేయక ప్రతి - శరములు వ్రాను
నడ్డియు లేక ని - రాశఁ జేయుటయు
వేసరి యలసి 'యె - వ్వియు వీని మేను
దూసిపోవవు నాదు - తూపులెట్లింక 7160
రేకవాలక యెచ్చ - రింపుచున్నాఁడు
కైకోక నాదివ్య - కాండముల్ వీఁడు'
అనుచుఁ జింతింపుచో - ననిలుండు వచ్చి
"మనువంశతిలక! యీ - మనుజాశనునకు
బ్రహ్మ యిచ్చిన మూల - రాజోడు గలదు
బ్రహ్మాస్త్ర మేకాని - పనికి రాదొకటి
వేయుము నీవని" - వినఁ బల్కి పోవ
వాయువు పలుకు కై - వడి లక్ష్మణుండు

—: లక్ష్మణుఁ డతికాయునిపై బ్రహ్మాస్త్రముఁ బ్రయోగించి యాతనిఁ బరిమార్చుట :—

నరవ భూతములు బ్ర - హ్మాస్త్రంబుఁ దొడిగి
పరగింప దిక్కులు పట - పటఁ బగిలెఁ 7170

గంపించె వసుమతి - కదలె శైలములు
రొంపి దేలంగఁ బొ - ర్లుచు మ్రోసె జలధి
సుడివడియె నభంబు - చుక్కలురాలె
వడఁకె దిగ్గజములు - వాపోయె ధాత
కావిరుల్ గప్పి లో - కము లస్తమించె
దేవతల్ జడిసిరి - దినరాజు మాసె
ననలార్క సన్నిభంబై - యమదండ
మన ఘోరమనుచు బ్ర - హ్మాస్త్రంబు రాఁగ
జడియక బాణవ - ర్షంబులు దైత్యుఁ
డడరింప నవియెల్లఁ - నడఁచి కాల్చుచును 7180
మీఱిరా వాఁడందు - మీఁద దివ్యాస్త్ర
వారంబుఁ గురియింప - వమ్ము సేయుచును
ఘోరమైరాఁగ శ - క్తులు ప్రయోగించి
పోరాక ముద్గరం - బులు వేసి చూచి
కదిసిన చేనున్న - గదయెత్తికొట్టి
యదియు మించిన నిశి - తాసి చేనటికి
చేకత్తిఁ బొడిచి మిం - చిన వంకి దూసి
చేకొద్ది గ్రుద్దిన - చెంగక డాసి
ధృతకుండల కిరీట - దీధితుల్ మించు
నతికాయు మస్తకం - బవని పైఁ ద్రెళ్ళె. 7190
మెచ్చిరి కపులు సౌ - మిత్రి కొంకుచును
వచ్చి రాఘవపాద - వనరుహంబులకు
మ్రొక్కిన నలరి త - మ్ముని లేవనెత్తి
యక్కునఁ గూర్చి శ్రీ - తానులాపములు

మనసు రంజిల నాడి - మఱియు సంగ్రామ
మునకెల్లవారు స - న్ముఖులైన యంత.

—: అతికాయుని మరణమును విని రావణుఁడు విలపించుట :—

చావులకును దప్పి - చనిన రాక్షసులు
వావిచ్చి యేడ్చి రా - వణుఁ జేరఁ బోయి
యతికాయముఖదైత్యు - లందఱుఁ గాల
గతిఁ బొందినట్టి సం - గతి యేర్పరింప 7200
విలపించి యిలవ్రాలి - వేగంబె తెలిసి
పలవరింపుచు ' ముద్దు - పట్టి ' యటంచు
" అతికాయ ! వోయితి - వా ! " యంచు నెన్ని
" వెతలపాల్జేసితివే - విధి ! " యనుచు
" నాబుద్ధి నిట్లాయె - నా ! " యంచు " నెందు
చేబార విడియేమి - సేయుదు ? " నంచు
" నన్ను నెవ్వరి కొప్ప - నము సేసిపోతి ?
వెన్నఁడు నెడవాయ - వెట్లోర్తు ? " ననుచు
నారటింపుచును హా - హాకార మొదవ
నూరటలేక కే - లుద్వి నార్పుచును 7210
తపియించి " నిన్ను నీ - తానిమిత్తముగ
నిపుడు గోల్పోయితి - నెఱుఁగ లేనైతి
సరులయ్యు నింద్రజి - న్నాగపాశములు
పరిహరించుక వారు - బ్రదికిన యపుడె
యారామవిభుఁడు నా - రాయణుండనుచు
వీరు కోఁతులుగారు - వేల్పులటంచు
నెఱుఁగుదు నెఱిఁగియు - నిట్లు నిన్ననిచి

యురక దాయలచేతి - కొప్పగించితిని.
ఎక్కడి బ్రతుకని" - యేడ్చుచు లేచి
యొక్కఁడు జని శయ్య - నొరిగి చింతిలుచుఁ 7220
బడవాళ్ళచే గోట - పదిలంబు సేయఁ
గడు నెచ్చరిక సీతఁ - గాచుకయుండఁ
దగినట్టి దొరలకుఁ - దాఁ దెల్పఁ బనిచి
పగఁదీర్ప నెవ్వారిఁ - బనుపుదు ననుచు
నాలోచనము సేయ - నపుడింద్రజిత్తుఁ
డాలోన వచ్చి తా - నతని కిట్లనియె.
" ఏల చింతిల్లెద - వేనున్నవాఁడ
నీ లక్ష్మణుని రాము - నెల్లవారలను
చంపక రాను నీ - చరణంబులాన !
పంపుఁడిప్పుడె యెంత - పనియిది నాకు ? 7230
హరిహయ శశిభా - స్కరానల పవన
సురగరుడోరగా - సురముఖ్యు లెదుర
బలి యాగశాలలో - పంకజాతాక్షు
గెలుపు విలోకించి - కీర్తించి నటుల
నను మెచ్చఁగలరు దా - నవనాథ ! దైవ
మనిపించినట్టులే - నాడితిఁ గాని
నాయిచ్చఁ బలుక మ - న్ననఁ బంపు"మనిన
" పోయి రమ్మ"నుచు న - ప్పుడు తండ్రి పలుక

—: ఇంద్రజిత్తు యుద్ధమునకు వెడలుట :—

కలనికి వచ్చి మూ - కల జుట్టు నునిచి
" సలుపగావలె పుర - శ్చరణ మీమెడను 7240

బ్రహ్మాస్త్ర మిప్పుడు - పాడి దప్పినది
బ్రహ్మయానతి సేయఁ - బరగు"నాకనుచు
హోమగుండ మమర్చి - హోమపదార్థ
సామగ్రి యంతయు - సవరించి యచట
నాసీనుఁడగుచు బా - ణాస్తరణంబుఁ
జేసి యయోమయాం - చిత సాధనముల
నెట్టని పువ్వులు - నెట్టి గంధంబు
నెట్టని వస్త్రంబు - లెలమి ధరించి
తాండికాష్టముల నా - థర్వణోక్తముఁగ
నేండు నూర్లాహుతు - లిచ్చి తావేల్చి 7250
లంకేశసుతుఁడు న - ల్లని మేకపోతు
నంకించి పట్టి పూ - ర్ణాహుతి యొసఁగ
హావిరన్నభాగంబు - లనలుండు ప్రోల
నవతరించి గ్రహించి - యాస్వదించుటయు
వలమాన శిఖిశిఖా - వర్త్మంబునందు
వెడలు బ్రహ్మాస్త్రంబు - విశిఖాసనంబు
నమ్ములుఁ గైకొని - యనిమొనఁ జేరి
యమ్మహామహుఁడు దై - త్యశ్రేణిఁ జూచి
" నడువుఁడు మీరు వా - నరులపై భయము
విడువుఁడు మిముఁగాచి - విశిఖపాతముల 7260
నందఱు బడనేతు" - ననఁగనా భాస్క
రైందుముఖు లనుగ్ర - హాస్పదంబులుగ
నభము చెల్లించె న - న్నర భోజనుండు
రభసంబుతో వాన - రశ్రేణిఁ దఱిమి
యమ్ములు పరగింప - నందఱుఁ గూడి

దౌమ్మిగాఁగీశ రౌా - ధులు చుట్టుముట్టి
తరులను గిరులను - ద్ధతి జగడింప
శరములచే నవి - చక్కాడి త్రోచి
రథతూణ శస్త్ర సా - రథి కేతుకవచ
పృథులాశ్వ సాధనో - పేతుఁడై యెగసి 7270

—: ఇంద్రజిత్తు రామలక్ష్మణులను మూర్ఛనొందించుట :—

మాయావియై మేఘ - మాలికాచ్ఛన్న
కాయుఁడై యమ్ములఁ - గపులపైఁ గురియ
రావణ సుతువాన - రశ్రేణి మింటి
త్రోవఁగానక నాల్గు - త్రోవల వెదకి
గిరులు ప్రాఁకులు నంది - కిలకిల ధ్వాన
భరితదిశానభో - భాగులై మూఁగి
యదెయెల్లె ప్రోఁత య - ల్లదె సింహనాద
మదె యార్పులదె యట్ట - హాసారవంబు
నిదె తన్నుఁ బేర్కొని - యె నటంచు నచటి
కెదురెక్కుచునుఁ జోకు - మోఁటు వోయెదనుచు 7280
రాఁజూచి యసుర నా - రాచముల్ వహ్ని
రాఁజ నేసి మహీంధ - రము భూరుహాములు
చేత నుండఁగఁ బొడి - చేసి పైనెత్తు
మూతులపై రక్త - ములుఁగార నేసి
కన్నుల నమ్ములు - గాడించి తిరుగ
వెన్నుల నురములు - వెడల నాఁటించి
పదువుర నేవుర - బాణమొక్కంట
గుదిగ్రుచ్చి యిలమీఁదఁ - గుప్పన వ్రేసి

కొట్టులు వేయించె - క్రోతులనంగఁ
గట్టుతొడలలపైఁ - గాడ నమ్మొనలు 7290
కపులతో మహినాఁట - కదలి రాకుండ
నపుడుంచి యర్ధచం - ద్రాస్త్ర పాతముల
పచ్చడి చేసిన - పగిదిరాఁ జెఱకు
పిచ్చల వలె పంచి - పెట్టిన యట్లు
నగచరావళు లవ - యవము లన్నియును
తెగఁగొట్టి యున్కియుఁ - దెలియరాకుండ
వాలిసూనుఁ బదింట - వాయుజు రెంట
నీలు మూటను మైందు - ని బదియాఱిటను
హరుని నాల్గింట గ - వాక్షు నేడింట
శరభుఁ బదింటఁ గే - సరిఁ బదేనింట 7300
నలగజ ద్వివిద వా - నర నాయకులను
నలువదింట సుషేణు - నాల్గింట తార
జాంబద్గవయుల - శతబలి వాఁడి
యంబకంబుల నిర్వ - దంటఁగ నేసి
కుముద సూర్యానన - గోముఖ పనసు
లమిత శౌర్యులు గాన - నరువది ఘోర
సాయకంబుల నేసి - సమరంబులోన
గాయమ్ము లందు ర - క్తంబులు గురియఁ
జచ్చిరే యనఁగ మూ - ర్ఛమునుంగ నేసి
యెచ్చట నెదిరింప - నెవ్వాఁడు లేక 7310
జలజగర్భ వరప్ర - సాదన లబ్ధి
నలఘుకాండ ప్రకాం - డముల ముంపుచును
తమమీఁద రాఁజూచి - తమ్మునిఁ జూచి

రమణీయధాముండు - రాముఁ డిట్లనియె
"బ్రహ్మయిచ్చు వరంబు - పై చాటుగాఁగ
బ్రహ్మాస్త్ర కవచ ప్ర - భావంబు వలన
మాయావియై మేను - మనలకు డాఁచి
దాయ వీఁడీ కపిం - ద్రశ్రేణిఁ గూల్చె
నంగీకృతంబుగా - దసురారి మనకు
భంగింప రాదిట్టి - పట్టున వీని 7320
సాయకంబేయ ల - క్ష్యముఁగాన మేమి
సేయువారము వీని - చేతులలోన
సమయునప్పుడు సాహ - సము చూపలేక
సమరంబులో నదృ - ష్టం బిట్టులుండ
నీవేమి సేతువే - నేమి సేయుదును?
రావణాసురుని శౌ - ర్యము వార్య మగుట"
అనుచు నాలోచించు - నంతట పిడుగు
లను మీఁదు నస్త్రజా - లంబుల చేతఁ
గడమ వానరులను - ఖండించి యొక్క
బెడిదంపు తూపుచేఁ - బేరెద నాఁట 7320
సౌమిత్రిఁ బడసేసి - జనకజారమణు
భీమసాయకముల - పెనుమూర్ఛ ముంచి
యెదురింప లేరెకా - యించుక కదల
మెదలనైనను లేక - మేదిని మీఁదఁ
బడిన రాజులఁ గీశ - బలములఁ జూచి
గడసేపు చైతన్య - కళపూని యున్న
వారుందురో యని - వానర వంశ
వీరుల కలనిలో - వెదకి లేకునికి

మదినమ్మి మఱలి స - మస్త దానవులఁ
బొదపెట్టికొని తల - వ్రూవాడనీక 7340
యింద్రజిత్తుఁడు జయో - పేతుఁడై దాన
వేంద్రుని కడకుఁ బో - యిన తరువాత

## —: విభీషణుఁడు జాంబవంతుని కర్తవ్య మడుగుట :—

ఆవిభీషణుఁ డొక్కఁ - డని కేఁగుదెంచి
చావక నోవక - సందడిఁ బడక
కనిపించుకొనక ర - క్కసుఁడందు మీఁదఁ
బినతండ్రి యగుట ద - ప్పించుక యుండి
యాయింద్ర జిత్తుచే - నాపదలేక
పోయె వాఁడని రణ - భూమికి వచ్చి
దాశరథుల నచే - తను లైనయట్టి
కీశయోధులఁ బరి - కింపుచుఁ గదిసి 7350
యందులో హనుమంతు - నతిబుద్ధిమంతు
మందరాచల ధీరు - మాయావిదూరుఁ
గనఁగొని యాతఁడొ - క్కఁడె కాని యితర
వనచరుల్ నొచ్చిన - వారని యెంచి
"నామాట వినుఁడు వా - నర యోధులార!
రామ సౌమిత్రులు - బ్రహ్మాస్త్రమునకుఁ
బ్రతి సేయ కది మౌఢం - బడి యున్నవారు
క్షితిమీఁద మీరు స - చేతనులగుచు
మీకెల్లఁ దీలు నే - మి కొఱంత దీన
పై కార్య మున్నది - పదర నేమిటికి?" 7360

అనిన దిగ్గున లేచి – హనుమంతుఁ డతనిఁ
గనుఁగొని యుచిత వా – క్యముల నిట్లనియె
" పరికింత మెవ్వరు – బ్రతికి యున్నారొ
తరుచరుల్ కలను శో – దన సేయవలయుఁ
గానఁగరాదు చీ – కటి బలవంత
మైనది యైననే – మాయె ? రమ్మ " నుచుఁ
గొఱవులు వట్టుక – కోఁతుల నెల్ల
బరికింపుచును వచ్చి – భల్లముల్ నాఁటి
తొడలు చేతులు గాళ్లు – తోఁకలుఁ జెవులు
నొడళులు దునిసి ర – ణోర్వలోఁ బడిన 7370
భానుజాంగదనల – పనసతారాది
వానరులను గాంచి – వగలతో వచ్చి
కడువాడి యలుగు లం – గములెల్ల నాఁటఁ
బుడమిపైఁ బడి మూర్ఛఁ – బొంది వో తెలిసి
కనుమోడ్చియున్న రి – క్షకులాధినాథు
వనచరహితు జాంబ – వంతు నీక్షించి
" కటకట ! నైదారు – గడియలలోన
నిటువంటివారల – నింద్రజిత్తుండు
శితశరంబుల చెక్కు – చెమరక తాను
క్షితిఁ బడవైచి వ – చ్చిన త్రోవ వట్టె 7380
కంటిమింతయు దైవ – గతి " నని కేల
నంటుచు నిర్వురా – యండఁ గూర్చుండి
యనునయ వాక్యంబు – లతనితోఁ బుణ్య
జనపుణ్యుఁడా విభీ – షణుఁ డిట్లుపలికె
" బుద్ధిమంతుఁడ వార్య – పూజనీయుఁడవు

వృద్ధుండ వఖిలార్థ - వేదివి నీవు
ఇట్టివానికి నీకు - నీదశాననుని
పట్టిచ్చె నీపాటు - బడియుండ వలసె!
బ్రదికి యున్నాఁడవే - ప్రాణంబుతోడఁ
గదల లేవను శక్తి - గలిగి యున్నదియొ? 7390
వాకొన నోపుదు - వా? యట్లైనఁ
జేకూడు మాకు న - నేక కార్యములు"
అనవిని "బ్రదికితి - మన్న! వచ్చితివె
జననుతుఁడగు విభీ - షణుఁడవా నీవు?
సవసవగా నీదు - స్వర విశేషంబు
చెవి సోఁకి యేఁదెలి - సితి నింతె కాని
వినరావు లెస్సగా - వీనులు చూచి
కనరాదు నిన్ను నా - కన్నులు దెఱచి
లెస్సగా మాటాడ - లేను దైతేయ
దుస్సహాస్త్రములచేఁ - దూలి యున్నాఁడ 7400
నను నెంచనేల వా - నర జీవరక్ష
హనుమంతు డున్నవాఁ - డా సుఖంబునను
ఆమాట వినుపింపు - మస్మదాదులను
నేమఱంబు లడుగ వ - చింప నేమిటికి?
అనిన నచ్చెరువంది - యా విభీషణుఁడు
వినయంబుతో రిక్ష - విభున కిట్లనియె
"రాముఁ డుండఁగ వా - నర ప్రభుఁడుండ
సౌమిత్రి యుండ వా - సవ పౌత్రుఁడుండ
నలనీలకుముద మైం - ద సుషేణ తార
పన? సాది వానర - ప్రభులెల్ల నుండ 7410

నెవ్వరి నడుగక - యేమిటి కయ్యొ
యివ్వేళ హనుమంతు - నీవు వేఁడితివి ?
అది దెల్పు "మన రావ - ణానుజుతోడ
మదిమెచ్చ భల్లూక - మార్తాండుఁ డనియె
" ఎవ్వరి నడుగఁ బ - నేమి ? సేమంబు
లెవ్వారు నుండి వా - రేమిటి వారు ?
అందఱు బ్రదుకుదు - రంజనాసుతుఁడు
కందక మనపాలఁ - గలిగి యుండినను !
అతని నొక్కటిమైన - నందఱు మతని
బ్రతికింపఁ జాలము - బ్రదుక రెవ్వరును ! 7420
కావునఁ బడిన రా - ఘవుల వానరుల
లేవనెత్త నొకండు - లేఁడని యెంచి
యడిగితి " నను నంత - నడుగుల మీఁదఁ
బడియున్నవాఁడ నేఁ - బవన నందనుఁడ
నేమి సేయుదు నాన - తిం" డన్నఁ దన్ను
నామేరఁ బుట్టిన - యట్టుగా నెంచి

—: జాంబవంతుఁడు హనుమంతుని సంజీవకరణినిఁ
దెచ్చుటకు నియోగించుట :—

" అన్న ! వాయుజ ! వచ్చి - తంతియే చాలు
నన్నిన్నాళ్ళుఁ జిరాయు - వగుఁగాక నీకు !
మనవారు రాముల - క్ష్మణులును మఱల
మనకుఁ గల్గఁగ నాదు - మనవి యాలింపు 7430
హిమవన్నగంబున - కేఁగి యాచెంత
నమరులుంచఁగ రిష - భాద్రి మీఁదటను

కరమొప్పు సంజీవ - కరణి విశల్య
కరణియు సౌవర్ణ - కరణి సంధాన
కరణియుఁ గొనుచు వే - గ ముహూర్తమునకు
మఱలి రమ్మిటుగాక - మనకొక్కరైన
యిందఱి ప్రాణంబు - లెత్తుకో నితరుఁ
డెందు నున్నాఁడు నీ - వింతయేకాక !"
అనుమాట చెవిసోఁకి - నప్పుడ యొగిరి
హనుమంతుఁ డరువది - యామటి పొడవు 7440
కల మలయాచలా - గ్రంబుపై నిలిచి
యిలయు నింగియు దిక్కు - లెల్ల నీక్షించి
గర్జించిన నకాండ - కాండజ భయద
గర్జానుకారి ఘు - ర్ఘుర విరావంబు
విని బ్రదుకులయాశ - విడిచి యాలంక
మనుజులందఱును గొం - దల మందిరపుడు
వ్యాళాధిపతిరీతి - వాలంబు మింట
తాలార్బుదాయుతో - త్తాలమై నిగుడ
తరుణపంకేజ బాం - ధవ సఖంబైన
యరుణాస్య మండలం - బతి వివృతముగ 7450
ధరణిజా రాఘవా - ధార దండముల
కరణిమించు భుజాయు - గంబు పై నెగయ
వంచిన తనవీపు - వనజ గర్భాండ
ముంచినఁ దెమలక - యునికి యేర్పడక
త్రొక్కిన యడుగులు - దొలిచి ధరిత్రి
నక్కొండ యణఁగించు - నపుడనిపింపఁ
జూపులు నిగుడింపు - చో విమానములు

చూపు దప్పగ నాల్గు - చోటుల కొదుగ
మోకాళ్లు ముడిచి రో - మ్ము దిటమ్ము చేసి
కాకుత్థ్సవంశ శే - ఖరు నాత్మఁ దలఁచి 7460
దివ్వనఁ దానంత - రిక్షమార్గమున
నవ్వాయుజుఁడు కన - కాద్రిపై నరిగి

—: హనుమంతుఁడు సంజీవపర్వతమును పెకలించి తెచ్చుట దానిప్రభావమువలన రామలక్ష్మణులు మూర్ఛఁదేఱుట - వానరులు సుఖులగుట :—

శౌరి వంచు ప్రయోగ - చక్రంబురీతి
మీరి సామీరి యా - మిహిరమండలము
నోరసి యుత్తరపుఁ బ - యోధిఁ గన్గొనుచు
నరిగి జాంబవదుక్తి - యాత్మ నెన్నుచును
హిమవంతమున కేఁగి - ఋష్యాశ్రమములు
కమలకైరవ దీర్ఘి - కలు గనుఁగొనుచు
రజతాలయంబును - బ్రహ్మకోశంబు
నజరేంద్ర నిలయంబు - హరశరముక్తి 7470
బ్రహ్మాననంబు సూ - ర్యనిబంధనంబు
బ్రహ్మ శిరంబు వ - జ్రని కేతనంబు
యమకింకరంబు హ - యాస్యంబు ఫాల
నయనకార్ముక మిలా - నాభిస్థలంబు
కైలాసమును నల - కయు వృషభాద్రి
ప్రాలేయనగ హేమ - పర్వతంబులును
గాంచి సర్వౌషధి - గ్రావంబు వాని
ప్రాంచలంబులఁ జూచి - పవననందనుఁడు

నానగంబెక్కి మ - హౌషధుల్ వెదకఁ
బూని రమ్యస్థలం - బులు మెట్టిచూచి 7480
యలఁత లేక యుపత్య - కాధిత్యకములఁ
గలయఁ గన్గొనుచు నే - కడఁ గాన లేక
విచ్చలవిడి పెక్కు - వేలు యోజనము
లిచ్చ యోజన పుట్ట - నేఁగి శోధింప
నాకొండఁ గల మందు - లన్నియు దాఁగి
యాకపీంద్రునికి దృ - శ్యములు గాకున్నఁ
గనలుచు మందుల - గట్టు నీక్షించి
హనుమంతుఁ డాగ్రహ - వ్యగ్రుఁడై పలికె.
"అచలేంద్ర! రామకా - ర్యార్థినై యొంటి
నిచటికి వచ్చితి - నెల్లవానరులు 7490
రావణసుతుని య - స్త్రంబులఁ జాలఁ
జావుల కెనయు మూ - ర్ఛలఁ బడియుండ
నీయందు గల్గు న - నేకౌషధములు
పోయి తెమ్మనిన ని - ప్పుడు వచ్చినాఁడ
నదయుండవగుచుఁ బ్ర - సన్నభావమున
నొదిగింపు మౌషధీ - యుతములౌ లతలు"
అనిన నేమియుఁ బల్క - కచలేంద్రుఁ డున్నఁ
గనలి "యోరోరి! నీ - కఠినభావంబు
మానుదునే మంచి - మాటల? నన్ను
వానరమాత్రుగా - వగచితుల్లమునఁ 7500
బొడిచి కాలను రాచి - పొడిపొడి సేసి
గడియలోఁ దూర్పెత్తఁ - గలను రూపఱఁగ
దుమ్ముగావింప మం - దులు వోవుననుచు

నెమ్మదిగా నెంచి - నిన్నుఁ గాచితిని!
ఇదె నిన్నుఁ బెకలించి - యెత్తుకచనుదు
నదిచూడు" మనుచు వా - లాగ్రంబు వెనిచి
యాకొండ చుట్టి చ - య్యనఁ బెకలించి
కైకొని దేవతా - గణముఁ గీర్తింప
హరి సుదర్శనము స - హస్రారములను
దారయు బల్మంటల - తోఁ దాల్చినట్లు 7510
తనచేత దివ్యౌష - ధ ప్రకాశములఁ
బెనుగట్టు వెలుఁగ నా - భీల వేగమున
సింధువుపై చేయు - సింహనాదంబు
కంధరధ్వనిఁ జేయఁ - గపులెల్లఁ బొగడ
ధరణీధరంబు యు - ద్ధమహీ స్థలమున
నరుదొందఁగా నిల్పి - సంతటిలోన
నాకొండపైన పూ - ర్వానిలాంకురము
లేకడఁ గలయంగ - నించుక వోలయు
రామలక్ష్మణులు ని - ద్రలు దేలినటుల
నామొదలింటి చ - ద్యలఁ బ్రకాశింప 7520
వానరులెల్లఁ బూ - ర్వప్రకారమున
మేనుల నొవ్వు లే - మియు లేక లేచి
యాహవోత్సాహ ర - సావేశశౌర్య
దోహలులై యుండ - దోఃశక్తిశాలి
పవమానతనయుఁ డా - పర్వతేంద్రంబు
జవమున నెత్తుక - చని తొంటియటుల
హైమభూధరరాజ - మాదల డించి
యామున్నువోలి మ - హాహవావనికిఁ

జేరి యాత్మీయుల - సేయు మన్ననల
మీాఱుచుం దొల్లిటి - మీర నున్నంత. 7530
రావణానుజ్ఞచే - రాక్షసుల్ వడిన
యావేళ సమరోర్వి - కన్యదానవులు
వచ్చినవారల - వనధిలోపలికిం
దెచ్చి వైచుటను దై - తేయులలోన
నొకండైన మఱలి - రానోపక పొలిసి
రకలంక సంజీవనౌ - షధక్రియను.

—: ఇంద్రజిత్తు రావణునితో తాను రామలక్ష్మణులను జంపితినని ప్రగల్భములు పలుకుట :—

ఇంద్రజిత్తుండు దాన - వేంద్రుని కడకుం
జంద్రప్రకాశాస్త్ర - శస్త్రముల్ వెలుంగం
బదములపై వ్రాలి - " పనిచితి వీవు
కదనంబునకుం బోయి - కాకుత్స్థకులుల 7540
సుగ్రీవముఖకపి - స్తోమంబు నెల్ల
నుగ్రాంశుకిరణజా - లోపమాస్త్రములం
జంపివచ్చితి" నన్న - సంతోషమాత్మం
బొంపిరి పోవ తాం - బుత్రునిం దిగిచి
యాలింగనము చేసి - యనిచి యింటికిని
చాలవేడుక సుఖ - శయనుండై యుండె.
తెలవాఱుటయును రా - త్రించరుల్ నేండు
కలనికి రానట్టి - కతమేమి యనుచు
వానరుల్ దలంప రా - వణుండు మానసము
లోన రాముండు కోంతు - లును జచ్చిరనుచు 7550

నూరటన్గై కొని - యుండ నాలోన
సారసబంధుఁ డ - స్తనగంబుఁ జేరె
సాయంతనారంభ - సమయంబునందు
వాయుజుఁ గాంచి ది - వాకరాత్మజుఁడు
“కుంభకర్ణాది ర - క్షో వీరులెల్ల
నంభోధిపాలైరి - హతులైనయట్టి
మనవారు బ్రతికిరి - మాటలాలించి
దనుజనాయకుఁడు యు - ద్ధముసేయ వెఱచె
జగడంబొనర్ప రా - క్షసు లింక రారు
తెగి మీరు లంక ము - ట్టిక వేయబోక 7560
లగ్గలకెక్కుఁడా - లములోన వెఱచి
నెగ్గినవానినే - నిగ్రహింపుచును
గాలిచి రండు లం - కాపురంబెల్ల
వేలంబె పైనమై - వెలివడుఁ”డన్నఁ

—: వానరులు లంకనుగాల్చుట - వానరరాక్షసుల సంకులయుద్ధము :—

గపులెల్లఁ గొఱవులుఁ - గరములఁ బట్టి
యపుడె కొండలు వైచి - యగడితల్పూడ్చి
చెట్టులు కోటతోఁ - జేరిచి యెక్కి
చుట్టు నాళ్వరుల ర - క్షోరాశిఁ జంపి
వాకిళ్ళ నున్నట్టి - వారలఁ గూల్చి
యేకడ దామెయై - యిండ్లింట్లుచేరి 7570
కాలిచి మిద్దెలం - గళులును నేలఁ
గూలిచి పురమెల్లఁ - గొల్లలువెట్టి

మొఱమంట లెగయింప - నిండ్లలో వెడలి
పఱవిడు దైత్యులఁ - బట్టిచంపుచును
యెదురించు దనుజుల - నిఱియంగఁ బట్టి
వదలక చిచ్చులో - వైచి చంపుచును
కోలాహలము సేయుఁ - గోఁతులకూఁత
లాలకింపుచు భర - తాగ్రజుఁ డపుడ
యొకయమ్ముఁ దొడిగి సా - లోపరి సౌధ
మొక యేటుచే నేల - నుఱులంగ నేసి 7580
బయలుచేసుక లంకపై - చూపులునిచి
జయమి.....................
లంకాపురంబు కా - లఁగ జలరాశి
యింకించుపాటి క - ట్టెఱమంట లెగసె
నంబుధిలోమంట - లరుణదీధితులు
బింబించు నప్పుడొ - ప్పను చూడఁ జూడ
దానవ శోణిత - ధారలు వఱచి
యానెత్తురులు నిండె - నన శోణరుచుల
నంతట రావణుఁ - డంతయుఁ దెలిసి
యంతకాకారుఁడై - యసురనాయకులఁ 7590
బనిచి దానవసేన - బయలుదేఱించి
పెనుభేరి మొరయించి - పిలువనంపించి
కుంభనికుంభుల - ఘోరరాక్షసులఁ
గుంభకర్ణుని కొడు - కులఁ గాఁగలించి
కలను సేయఁగఁ బంచి - కంపనుసట్ల
బలికి యూపాక్షు వెం - బడిగాఁగ ననిచి

యనునయింపుచు శో - ణితాక్షప్రజంఘు
లనువారు గూడి పో - మ్మని సెలవిడిన

—: శోణితాక్షప్రజంఘ కుంభనికుంభ, కంపన, యూపాక్షులు యుద్ధమునకు వెడలుట :—

నందఱు దమ చతు - రంగ బలంబు
ముందఱ నడిపించి - మొనలకుఁ జేర 7600
పండువెన్నెల తేట - పర్విన గొంత
మండెడి లంకలో - మంటలోఁ గొంత
దనుజనాయకుల నూ - త్నవిభూషణంబు
లను గొంత తిమిరమె - ల్ల నడంగుటయును
పగఁదీర్తుమని పట్టు - పగలింటిరీతి
జగిడింప వానర - సైన్య మువ్పొంగ
దానవుల్ శక్తిగ - దాకుంతముసల
నానాస్త్రశస్త్ర స - న్నాహంబుతోడ
బిరుదుటెక్కెములెత్తి - పెక్కువాద్యములు
మొరయ నార్పులు నింగి - ముట్టంగ నడచి 7610
తారసంబగుటయుఁ - దరువులు గిరులు
భోరున నిలయెల్లఁ - బొదువఁగా నేసి
వానరుల్ తమదంత - వాలనఖాగ్ర
జానుపాదకరాది - సాధనంబులను
నొప్పింప దనుజు లే - నుఁగుల ఢీకొలిపి
గొప్ప తేజీల భ - గ్గునఁ జోరనిచ్చి
యరదముల్ నడపించి - యాసురబలముఁ

బురికొల్పి యాయుధం - బులు ప్రయోగింప
సరివాలుగా రెండు - సైన్యంబులందు
తెరలెను మూఁకలా - దిత్యునగ్గింప 7620
నందిందు రణశూరు - లగ్గలికలను
సందడి కయ్యంబు - సలుపుచున్నపుడు
పొడువుండు జంపుఁడు - పోనీకుఁడనుచు
బెడిదంబుగా నార్చి - పెడబొబ్బలిడుచుఁ
బోరాడునెడ కీశ - పుంగవుల్ విఱిగి

-: అంగదుఁడ కంపనునితోఁ యుద్ధముచేసి యాతనిఁజంపుట :-

పఱవ నంగదుఁడ కం - పనునిపై నడచి
గిరిప్రేయుటయు వాఁడు - కేల నున్నట్టి
పరిఘంబుచే నది - భగ్నంబు చేసి
గద నవరించి యం - గదకుమారకుని
యెద నొవ్వనేసిన - నిట్టట్టు దలఁకి 7630
తెప్పిఱి యొక్క య - ద్రి పెకల్చి తెచ్చి
గుప్పెన నురువడి - గుప్పిన వాఁడు
తల యవియఁగఁబడి - తన్నుక పుడమిఁ
నలినలి యగుచుఁ బ్రా - ణంబులు విడిచె

—: శోణితాక్షునితోఁ బోరాటము :—

ఆపాటు గని శోణి - తాక్షుండు మిగుల
కోపంబుతో వాలి - కొడుకుపై నెదిరి
నారాచవత్స దం - తాపారశల్య
హారికర్ణిక్షుర - ప్రాది నామములఁ

గలిగిన తూపు లం - గదుని యంగమునఁ
జలపట్టి యేయ న - స్త్ర ప్రవాహములఁ 7640
దోఁగి...........శోణితాక్షు
నాఁగి దానవు చేతి - యమ్ములు విల్లు
నొడిసి రాఁదిగిచి య - త్యుద్ధతి మీఱఁ
బొడిచేసి యరదంబుఁ - బుడమిపైఁ గూల్చి
దర్పించుటయు వాఁడు - తరవారి వూని
యార్చుచు మింటి చా - యను వేడిమిడఁగ
నంగదుండును వెంట - నాకాశమునకు
రింగున నెగిరి చే - రిన దానవుండు
నటికిన యావేటు - నకు నణగించి
కరమున నున్న ఖ - డ్గంబు తా నొడిచి 7650
తీసుక వాని జం - దెపు వాటుగాఁగ
వేసిన యసుర యు - ర్విని బడి లేచి
గదచేత మఱియు నం - గదునిపై కెగసి
కదిమి కొట్టుటయు నా - గ్రహముతో నతఁడు
మనుజాశనుఁడు దాను - మల్లసంగ్రామ
మునకుఁ జేరి సమాన - ముగ నిలవ్రాలి

—: ప్రజంఘయూపాక్షు లంగదుని యడ్డగించుట :—

జగడించునవుడు ప్ర - జంఘయూపాక్షు
లగచరాగ్రణి మీఁద - నమ్ములు గురిసి
దొమ్మి సేయుడు నంగ - దుఁడు వారి నడుమఁ
గ్రమ్మి పోరుచు విశా - ఖా వృతుఁడైన 7660

నిండు చందురు మాడ్కి - నిలిచి మువ్వురను
దండింపఁ దలఁప న - త్తరిఁ దోడుగాఁగ

—: వానరవీరులు మైందద్వివిదు లంగదునకు సహాయ
మగుట - ప్రజంఘుఁడు పరలోకగతుఁడగుట :—

తొడరి మైంద ద్వివి - దులు వచ్చి వారి
యెడదూరి బలుగయ్య - మిచ్చిన యంత
వారలేసిన తను - వ్రజము యూపాక్షుఁ
డాఱమ్ములను ద్రుంచి - యార్చినఁ జూచి
శోణితాక్షుండు నా - ర్చుచు వారిమేన
శోణితధారలు - జోరునఁ గురియ
శరము లేయుటయు ప్ర - జంఘుఁ డంగదుని
కరవాలమున రొమ్ము - గాయమ్ము సేయఁ 7670
దాళి దానవు నొక్క - తరువుచేఁ గొట్టి
వాలిసూనుఁడు కేల - వృక్షంబు వోదువ
గురువజ్రసార జం - ఘుఁడు ప్రజంఘుండు
గరమెత్తి ముష్టి నం - గదు లలాటంబుఁ
బొడిచిన కళవళిం - పుచు వాలియొంటి
కొడుకు ధైర్యముఁ దెచ్చు - కొని పడియున్నఁ
బరవారిఁ గైకొని - తలఁ ద్రెవ్వ నేయఁ
దెరలె ప్రజంఘు బొం - ది ధరాతలమున

—: శోణితాక్ష యూపాక్షులు హతులగుట :—

యూపాక్షుఁడది చూచి - యుల్లంబుఁ గలఁగఁ
గోపించి వాలంబు - కోలలు గురిసి 7680

ముప్పురు వానర - ముఖ్యుల నొంచి
కొవ్వున చేతుల - గొద్ది పోరాడి
యమ్ములన్నియు సెల - వైనవో కేడి
యమ్ము కత్తియుఁ బూని - యరదమ్ము డిగ్గి
ద్వివిదునిఁ గదియ నె - త్తిన కత్తిచేయి
జవశక్తులను బట్టి - జగతిపై వైచి
యొత్తగిల్లఁగఁ ద్రోచి - యూపాక్షు మేన
నెత్తురు జొత్తిల్ల - నెఱులు వీడంగ
నీడిచి బాధించు - నెడ శోణితాక్షుఁ
డోడక ద్వివిదుని - యుత్తమాంగంబుఁ 7690
బరిఘంబుచే వ్రేయ - భాసట యగుచు
నరమి మైందుఁడు శోణి - తాక్షునిఁ బట్టి
నేలను వైచి త - న్నిగజంబు వోలి
కాలను రాచినఁ - గాలునిఁ జేరె
శోణితాక్షునిఁ జంపి - చొచ్చి యూపాక్షు
ప్రాణంబులోక యంతఁ - బైపయిఁ బోవఁ
గినిసి మైందుండు కౌఁ - గిట బిగియించి
యనిలోనఁ బడవైచి - యార్చె మిన్నగల
నావేళ దానవు లం - దఱు విఱిగి

—: కుంభుని యుద్ధము-ఆతని మరణము :—

పోవఁ దానాఁగి కుం - భుఁడు తేరుఁ ద్రోలి 7700
యపరంజి గఱుల వా - లమ్ములఁ దనకు
రపమైన గతి వాన - రశ్రేణిఁ ద్రుంచి
ద్వివిదుఁ గాంచన శర - ద్వితయంబు చేత

నవనిపైఁ ద్రెళ్లింప - ననుజుని పాటు
మైందుండు గని చేన - మర్చిన యట్టి
చందనాచల శృంగ - శకలంబు చేత
వేసిన కుంభుండు - విశిఖ పంచకము
వేసి చూర్ణము చేసి - వెంటనే యొక్క-
తూపు సంధించి మైం - దునిఁ బడనేసి
చూపఱమెచ్చి నా - ద్భుటయు నంగదుఁడు 7710
మేనమామల పాటు - మిగుల డెందంబు
లోన నాగ్రహము గీ - లు కొనంగఁ జేయఁ
దరు శిలావర్షముల్ - దానవుమీఁదఁ
దొరగింప నమ్ములు - తుమురుగా నేసి
రెండు బాణములు నా - రినిఁగూర్చి యతని
రెండు కన్బొమల దా - రికి నట్టనడుమ
వేసిన నెత్తురుల్ - వెడలి నేత్రములు
మూసుక పఱవ రా - ముని వీరభటుఁడు
కన్నులఁ దానొక్క- - కరమునఁ బొదివి
యున్న కేలను చెంత - నున్న భూరుహము 7720
కుంభీంద్రమునుఁ బోలి - కోపించి తిగిచి
కుంభినిపై నేయ - కుంభినిఁ బడఁగ
నేడు బాణంబుల - నేసె వెండియును
మూఁడు బాణంబుల - మొనచేత మేను
నొచ్చిన వాలిసూ - నునిఁ జూచి విఱిగి
వచ్చి రామునిఁ జూచి - వానరులెల్ల
విన్నవించిన రిక్ష - విభుఁ డాదిగాఁగ
నున్న వానర వీర - యోధులఁ జూచి

యంగదు చెంతకు - ననిచిన శైల
శృంగముల్ తరువులుఁ - జేతులఁ బట్టి 7730
యొక్క మొత్తంబుగా - నురువడించుటయు
రక్కసుఁ డుగ్ర నా - రాచధారలను
నందఱి నన్నింట - నదటణఁగించి
చిందర వందఱఁ - జేసి పోఁదఱుమఁ
దనయన్న కొడుకు యు - ద్ధము చేసి యలసె
ననియెంచి సుగ్రీవుఁ - డడ్డంబు వచ్చి
చెట్టుల గుట్టల - చే కొద్ది రువ్వ
దిట్టయై కుంభుఁడె - దిర్చి యన్నిటిని
జక్కసేయుచు వన - చర పట్టభద్రు
నొక్క నారసమేర్చి - యురమేయుటయును 7740
నొచ్చియు వాని ధ - నుర్దండ మొగిరి
పుచ్చుక విఱిచి తూ - పులు పొడిచేసి
కేడించి నిలిచి కి - ష్కింధా వరుండు
ప్రోడ మాటలను కుం - భుని తోడఁ బలికె
"రావణ కుంభక - ర్ణ సమానమైన
లావు శౌర్యము కర - లాఘవ క్రియలు
గలిగిన వాఁడ వా - ఖండల వరుణ
బలధనాధిప బలి - ప్రహ్లాద ముఖులఁ
జూడవత్తువు నీవు - చూడుము నేఁటి
వేడుక నాతోడ - వెఱవక నిలిచి 7750
మల్లవోరు" మటన్న - మాటలో గుండె
ఝల్లుమనంగ రా - క్షస నాయకుండు
పిడుగు దూఁటినయట్లుఁ - బేర్చి యాద్యమునఁ

గడు మండు నగ్ని నై - ఖరి నాగ్రహించి
చొచ్చి పట్టుకొని రా - జు మొగంబులందు
వెచ్చ నూర్పులు పొగల్ - వెడల నిర్వురునుఁ
బెనఁగుచు సరివోరి - పిడికిటపోట్ల
వెనుతీక జగజెట్ల - విధమునఁ బోరి
కదిసి యిర్వురు దేరు - కాశలు వట్టి
యెదురాని త్రోయుచో - నీడ్చి లాగించి 7760
వెనుకను నెగురంగ - వ్రేయ కుంభుండు
వనరాశిలోని జీ - వశ్రేణిఁ గదియఁ
జెవి ? యలికట్ట మిం - చి జలంబు లుబ్బి
చులకగా నెగసి ర - క్షో వీరవరుఁడు
గరుడవేగమున భా - స్కరకుమారకుని
యురముపైఁ బిడికిట - నుంకించి పొడువఁ
బొడిచిన నోట ను - ప్పొంగి నెత్తురులు
వడియ నురోవీథి - వ్రయ్యలై పగిలి
యెమ్ములు గనుపింప - నించుక యైన
సొమ్మసిల్లక వాలి - సోదరుం డలిగి 7770
కడియిడి యని పండ్లు - గఱచుక యెగిరి
పిడికిటఁ బొడిచిన - పేరెదఁ దాఁకి
పటపట గుండెలు - వగుల భోగీంద్ర
కటకతాడిత దివా - కరుఁడో యనంగ
దివిజులు మెచ్చ దై - తేయులు మెచ్చ
భువిమీఁద వ్రాలి కుం - భుఁడు మృతినొందె!
అతని పాటున ధాత్రి - యల్లలనాడె
జతకట్టుగతి దిగ్గ - జంబులు మ్రొగ్గ

పడిగలొయ్యన వంచె - ఫణిరాజు శిరము
ముడిచె లోపలికి న - మ్మొదటి కచ్ఛపము 7780
సంభూతభీతి రా - క్షసులెల్ల విఱిగి
కుంభుని చావు ని - కుంభునితోడఁ

—: హనుమంత నికుంభుల యుద్ధము - నికుంభుఁడీల్గుట :—

దెలిపినఁ దమయన్న - తెగియెగా యనుచుఁ
గలఁగుచు నిప్పులుఁ - గన్నుల రాల
నింట పూజలుగాంచి - యెపుడు వేలుపుల
వెంటాడి యరుల క్రొ - వ్వేడి నెత్తురులఁ
బలుమారు మక్కుడు - వట్టి వజ్రంపు
పలక చెక్కడముల - పది హారువులను
గనగన జాళువా - కట్లు వెలుంగఁ
దనరి కాలుని గదా - దండంబు మాడ్కి 7790
కనుపట్టు తనపరి - ఘము కేలఁబూని
వనచరుల్ గజగజ - వడఁక తానడచి
కపినాథుఁ జూచి చ - క్రము ద్రిప్పినటుల
నపుడాత్మ సాధనం - బనుర ద్రిప్పుటయుఁ
బరిఘంబులో విట - పావతి నామ
పురమును గంధర్వ - పురములు నింద్రు
పురము సప్తద్వీప - ములతోడ నెల్ల
ధరణియు నారసా - తలలోకములును
గ్రహములు నూర్ధ్వలో - కములు దారకలు
గ్రహరాజుతోఁ గూడ - కమలజాండంబు 780

కడిమి గులాల చ - క్రన్యాయ మొంది
గడెసేపు దిరుగ న - కాండకాలాగ్ని
దరికొన్నగతి నున్న - దానవ వీరుఁ
బరికించి చిత్తరు - ప్రతిమలున్నట్లు
తరుచరులును వీర - దానవుల్ మేను
లెఱుఁగక నిలుచున్న - యెడల నిల్చుటయు
మేను డాపక రొమ్ము - మిక్కిలిచాఁచి
తానిల్చి పవమాన - తనయుఁ డెదుర్పఁ
రూపఱు మనుచుఁ బే - ర్కొని నికుంభుండు
కోపించి యతని వ - క్షోవీధి నేయ 7810
నెద దాఁకి భగ్గున - నెఱమంట లెగయ
నది నూఱు శకలంబు - లై యిలఁ బడియె.
ఆపెట్టుచే నురం - బవిసి వాయుజుఁడు
కోపించి పిడికిటఁ - గొట్టి వ్రేయుటయుఁ
జేయి బల్ డొక్కలోఁ - జిక్కిన గుండె
కాయలు పెకలి రాఁ - గరమీడ్చుకొనిన
నానికుంభుండు దాన - నచలుఁడై వాయు
సూనునిఁ బట్టి యీ - డ్చుచు పెనంగుచును
గద్దించు మ్రోఁత లం - కాపురిలోనఁ
బెద్ద భేరులు మొర - పించి నట్లుండె 7820
నామహాధ్వనిఁ ద్రికూ - టాద్రి కందరము
నామటికిని విను - నట్లుగా మొరసె.
చెయి ద్రెంచి వానర - సింహ మాదనుజుఁ
బయిచేసి పిడికిటఁ - బ్రహరించుటయును
వాఁడును హనుమంతు - వజ్రకాయంబు

పోఁడిమిచెడ ముష్టిఁ - బొడిచి యార్చుటయు
నప్పుడ హనుమంతుఁ - డాదైత్యుమీఁదఁ
గుప్పించి బలుపిడు - గును బోలి పడిన
నిలువఁ జాలక వాఁడు - నేలను వ్రాల
బలుగొండ గతి రొమ్ము - పైఁ బడవట్టి 7830
తలవట్టి మెలివెట్ట - దైత్యుండు గొఱియ
వలె బిట్టు గూయిడ - వదనంబు ద్రొక్కి
మల్లాడ నేలని - మార్మోడ వెట్టి
పెళ్లున బొండుగ - పెకలఁ ద్రుంచుటయుఁ
జచ్చినవాని మ - స్తముఁ ద్రొక్కి లేచి
రిచ్చపాటునఁ గపి - శ్రేణి గీర్తింపఁ
జెడి రక్కసులు లంకఁ - జేరఁగఁ బువ్వు
జడులు మిన్నుల సంత - సంబుగాఁగురియ
రాముఁడు మన్నింప - రవిజాదికపులు
సామోక్తులాడ కే - సరిసుతుండలరె. 7840

—: రావణుఁడు రాక్షస వీరులయుదంతము విని, మకరాక్షుని యుద్ధమున కనుచుట :—

ఆలంబులోఁ బాఱు - నసురులు పోయి
యాలంకలోన ద - శాస్యునిఁ జూచి
యింతయు నెఱిఁగింప - నెంతయు రోష
మంతరంగము నిండి - యలుగులుఁబాఱ
భ్రుకుటి చలింప న - ప్పుడు ఖరపుత్రు
మకరాక్షుఁడనువాని - మన్ననఁ బిలిచి

" గరివించినారు రా - ఘవులు వానరులు
దురములో నెదురు దై - త్యులఁ జంపినారు.
ఆపరానట్టి శో - కాపగ దాఁట
తేపవై నాపగఁ - దీర్చి రమ్మ్మ "నిన 7850
మకరాక్షుఁడపుడు భీ - మకరాస్త్రశస్త్ర
నికరాసికోదండ - నిపుణత మెఱయ
నసురేంద్రు వలగొని - యనుమతుండగుచు
దెసలు గంపింప రా - త్రించరశ్రేణి
చతురంగ బలముల - జతనమైరాఁగ
మతియించి రథముపై - మార్తాండురీతిఁ
దేజరిల్లుడు సార - థినిజూచి " నేఁటి
కాజిలో నినుమెచ్చు - నట్లు నేయుదును
రామలక్ష్మణవాన - రశ్రేణిఁ గూల్చి
ప్రేమ పుట్టింతు మా - పెదతండ్రికేను 7860
చూడుము తేరు వా - జులు నిచ్చ వలయు
జాడ మెలంగఁగ - సమకట్టుమీవు "
అని పల్కి మకరాక్షుఁ - డాహవంబులకు
దనుజులఁ బురికొల్పి - తముకులు మొఱయ
నల్లె మీటుచు రాఁగ - నతని కేతనము
పెల్లున విఱిగి కుం - భిని మీఁదఁ బడియె.
సారథి మునికోల - జాఱఁ జేవదలె
వారువమ్ములు నేత్ర - వారి వర్షించె
గజములు మదములిం - కఁగఁ గూఁతలిడియె
రజనీచరుల మీఁద - ప్రాలెకంకములు 7870

విషమవాయువు బిట్టు - వీచె దానవులు
విషము ద్రింగిన యట్ల - వివశులై రఘుడు,
అవశకునంబుల - నా మకరాక్షుఁ
డవమతి సేసి క - య్యమునకుఁ గదలి
చనుచోట సాధన - చాకచక్యములు
దనుజసైన్యంబు ముం - దఱుగాఁగ నడచె
కపులు మహీరుహ - గ్రావముల్ పూని
తపనజాంగదనీల - తారవాయుజులు
మున్నుగా నడచి రా -ముని సముఖమున
నన్నిశాచరులతో - నాలంబుఁ జేసి 7880
మోహరించుటయును - ముక్కాఁక నేయు
నాహరివీర మ - హా హావంబునకు
వెఱచి దానవులెల్ల - వెన్నిచ్చి తనదు
మఱుఁగుఁ జేరినఁ జూచి - మకరాక్షుఁడలిగి
తేరు చక్కఁగఁ ద్రోలి - దివ్యబాణముల
నూఱు నాఱుపదారు - ను పదేను లెక్క
నెదిరించు కోఁతుల - నెల్ల నొక్కొకని
గుదులు గ్రుచ్చి ధరిత్రిఁ - గుప్పలు వేసి
మొనగాండ్ల కీశచ - మూనాయకులను
మొన చెడ దివ్యాస్త్ర - ముల నొవ్వనేసి 7890
యురువడించినయంత - నొకరైన నెదిరి
దురము గావింప స - త్తువ లేక విఱిగి
మర్కటావళి తన - మఱుఁగుఁ జొచ్చుటయు
నర్కవంశవతంసుఁ - డవనిజాప్రియుఁడు
వెఱపకుఁడని కేల - విల్లు సారించి

శరములుఁ గైకొని – సమరోర్వియందు
బెడిదంపు తూపుల – భీకరాసురులఁ
బడలు వడంగ దె – ప్పరము చూపుటయుఁ
బలచనై తనమూక – బయలైనఁ జూచి
యలఘుశౌర్యుఁడు మక – రాక్షుఁ డెదిర్చి 7900
రామునిఁ జేరంగ – రథము పోనిచ్చి
సౌమిత్రిముఖుల నెం – చక యిట్లు పలికె.

—: శ్రీరామ మకరాక్షుల సమరోక్తులు :—

“రామ! యిన్నాళ్లు నీ – రాక నెమ్మదిని
కామించి యున్నచోఁ – గడతేటెఁ గోర్కె
వెదకుచు వచ్చు తీ – వియ దైవగతిని
పదములు దవిలిన – పగిదిఁగాంచితిని.
తమ తండ్రి మును జన – స్థానంబునందు
సమయించు పగఁ దీర్పఁ – జాలుగాయనుచు
వెతనొందు తనకు నీ – విధి పట్టి తెచ్చె
సుతకర్మ మగునట్టి – సూడుద్రిప్పెదను. 7910
ఆఁకొన్నయట్టి సిం – హాము నల్పమృగము
సోఁకోర్చి పోరాడఁ – జూచిన యట్ల
నాయుధపాణివై – యని నస్మదీయ
సాయకానములో – శలభంబవైతి
నీచేతఁ జచ్చిన – నీచరాక్షసులఁ
జూచి కూడి మెలంగు – చోటి కంచెదను
అందఱు మనశక్తు – లరయుచు నెచ్చు
గుందు లేర్పఱచి క – న్గొందురుగాక

యేక త్రిసాధన - నెప్పుడు నీవు
చేకని యుందువో - సేయుము దాన 7920
మెత్తిన కైదువు - నే నిన్ను నెదిరి
పాత్రంబులకుఁ దగఁ - బొడిచి కూలెదను"
అనుమాటలకు మక - రాక్షునిఁ జూచి
జనకజారమణుఁ డెం - చక యిట్లు పలికె.
"రాక్షసాధమ! మీ ఖ - రప్రముఖోగ్ర
రాక్షసు లెదిరించి - రణభూమిలోనఁ
బడినయట్ల మదీయ - బాణజాలములఁ
బడ నేసి నీమేని - పలలజాలంబు
కాకగోమాయు కం - క వృకాదిజంతు
లేకమై భుజియింప - నిపుడె సేయుదును 7930
నాఁటి వాఁడనె యేను - నాఁటి బాణములె
నాఁటుచున్నవి నిన్ను - నాఁడు నేఁడగుచు"

—: శ్రీరామ మకరాక్షుల యుద్ధము - శ్రీరాముఁడాతనిఁ
బొలియించుట :—

అను మాట విని మక - రాక్షుఁ డత్యుగ్ర
కనకపుంఖశిలీము - ఖముల నేయుటయు
నమ్ములన్నియు తన - యమ్ములచేత
వమ్ముగా జానకీ - వరుఁడు మాసేసి
జగడింప నురుముచు - జలదముల్ రెండు
గగనవీథినిఁ బోరు - కైవడిఁ దోఁప
నీలనీరదకమ - నీయగాత్రుండు
నీలాచలోపమ - నిజశరీరుండు 7940

ధనువులు దాల్చి యు - ద్ధతశరవృష్టి
మునుగఁ జేయంగ రా - ముఁడు వానివిల్లు
దివిజులు జూచి కీ - ర్తింప ఖండించి
మివుల గోపించి యె - న్మిది సాయకముల
సారథి ఘోటక - స్యందనాద్యములు
వేఱువేఱుగఁ ద్రుంప - విరథుఁడై యతఁడు
శూలి యిచ్చిన మహా - శూలంబు కేల
గీలించి లయకాల - కీలియుఁ బోలి
వ్రేసిన నదియొక్క - విశిఖంబుచేత
చేసె రెండుగ సుర - శ్రేణి కీర్తింప 7950
మకరాక్షుఁ డంత భీ - మకరాగ్రమెత్తి
పకపక నవ్వుచుఁ - బాఱకు మనుచుఁ
బాడవఁ జేరిన రఘు - పుంగవుం డతని
యడియాస జెడఁ బావ - కాస్త్రంబు దొడిగి
వ్రేసిన నదివచ్చి - వ్రేల్మిడిలోనఁ
జేసె వేల్మిడి కపుల్ - చెలరేఁగి యార్వ
నామాట విని యమ - రారిశేఖరుఁడు
రామునిదలఁచి కో - టలు దీటుకొనుచుఁ
జెంతకు సుతు నింద్ర - జిత్తునిఁ బిలిచి

—: రావణుని ప్రేరణచే నింద్రజిత్తు
యుద్ధమునకుఁ గదలుట :—

కొంత భూషించి " నీ - కును రాముఁడెంత ! 7960
అక్షోఁతులన నెంత - యని కేఁగుఁ మనిన

"నాకు హితంబుగా - నమ్మించి పోయి
నందఱఁ జంపితి - నని వచ్చి యిచట
మందలించెద వభి - మానంబు మాని
పోయిన వారెల్లఁ - బొలియుటే కాని
నీయట్లు బొంకువా - ని నెఱుంగ నొకని
చావఁ బ్రాల్మాలి ని - చ్చట నిల్లు మఱిగి
యీవు వచ్చుటెఱింగి - యెఱుఁగంగలేక
మఱియును నిన్నుఁ బం - పఁగ నెగ్గు సిగ్గు
లెఱుఁగక నీమోఁగ - మేను జూచెదను 7970
యీమాటు కలనికి - నేఁగి మున్నట్ల
రాము గెల్చితినని - రమ్ము నీకేమి
చేకన్న కార్యంబు - సేయు మేనదియు
మేకొంటి దిక్కు లే - మిని తండ్రినగుట"
అని నంత మిట్టిమీ - నై పడి తన్ను
ననుపక మున్నుగా - నొదలవంచి
పట్టుచుఁ బట్టి యీ - పట్టున నితని
పట్టినై పుట్టిన పా - పంబుచేత
నీ మాటలాలించి - యోఁదాఁచ వలసె
నేమి సేయుదునని - యీసురెట్టింప 7980
సమరంబు సేయ న - చ్చట మున్ను బోలె
శమమూని చుట్టు రా - క్షసులఁ గాఁపునిచి
యాగభూమిని దాన - వాంగనల్ కాని
వాగలతోఁ దన - పరిచర్య సేయ
నరుణ వస్త్రంబులు - నరుణ మాల్యములు

నరుణగంధమును క్రి - యాశక్తిఁ బూని
యినుప స్రుక్స్రువంబు - నినుప పాత్రములు
తనచెంత నిడి యశి - తచ్ఛాగ మేర్చి
హవనంబు తొల్లిటి - యట్ల కావించి
హవిరన్న భోక్తయై - యనలుం డొసంగు 7990
రథశస్త్ర సాధన - రాజితో నతఁడు
పృథుశక్తి లంకాపు - రి ప్రాంచలమున
నునుచు దైత్యుల సమ - రోర్వికిఁ బనిచి
వినువీథి బ్రహ్మాస్త్ర - విశ్వరూపంబుఁ
దానయై యమరు చం - దమున వైడూర్య
మానితధ్వజము వై - మానికావళినిఁ
దొలఁగు బావయుఁ బోలి - తొలగింపఁ గృతక
జలధరమాలికా - శృంగాంగుఁ డగుచుఁ
జంపుదు రామ ల - క్ష్మణుల గోఁతులను
వెంపరలాడుదు - విశిఖ జాలముల 8000
రావణు మదికి నా - రట సేసికాని
పోవ నూరకె పురం - బునకంచుఁదలఁచి

—: ఇంద్రజిత్తు మింటినుండి తనయస్త్ర విద్యా నైపుణ్యము ప్రదర్శించుట :—

మిన్నులనుండి సౌ - మిత్రి రాఘవులఁ
గొన్ని తూపుల నేయఁ - గోపించి వారు
మింటిపై చూపులు - మెఱయించి దివిజ
కంటకుపై గొన్ని - కాండంబు లేయ
నవి యెల్ల నురక వ - మ్మైన రాఘవుఁడు

దివిఁ జూడ్కు లిడి యేయఁ - దెఱఁగేది యుండ
నసురేంద్ర సుతుఁడు బ్ర - హ్మాస్త్ర ప్రభావ
లసమాన తేజో - విలాసియై లాసి 8010
నెరయించు నొకచోట - నీలమేఘములఁ
గురియించు నొకచోట - ఘోరాస్త్రవృష్టి
మలయించు నొకచోట - మంచు పెందెరలు
పొలయించు నొకచోట - భుగభుగ బొగలు
వినుపించు నొకచోట - విలునారి మ్రోఁత
కనిపించు నొకచోట - కాంచన రథము
చెలఁగించు నొకచోట - సింహనాదములు
నెలకొల్పు నొకచోట - నేమికాధ్వనులు
నడరించు నొకచోట - హయహేషితములు 8020
జడియించు నొకచోట - శక్తులు వైచి
విసివించు నొకచోట - విలుకేలఁ బూని
నసముంచు నొకచోట - నాకృతిఁ జూచి
యీలీల నెలయించె - యింద్రజిత్తుండు !
గేలి సేయుచుఁ గిలి కీలలఁ బోలు
నారాచధారలు - నాఁటించి రక్త
పూరముల్ మేనులఁ - బొరలి పాఱంగఁ
గన్నుల మూసుక - కాకుత్స్థతిలకు
లన్నదమ్ములు నిశితాం - బకములను
నాకాశమున వ్రేయ - నటునిటు దిరుగు
కాకాది పక్షుల - గాదులే కాని 8030
వానిపై నొకలైన - వచ్చినాఁటినది
కానివారైన రా - ఘవు లాత్మ నలిగి

కనువిచ్చి వాఁడేయు - కాండముల్ నడుమఁ
దునియ దివ్యాస్త్రముల్ - దొడిగి యేయుచును
తప్పించుకొనెడు మా - త్రముగాని వాని
నెప్పు గన్గొని యేయ - నేరలేరైరి
వానల నాను ప - ర్వతములో యనఁగ
మేనుల నమ్ములు - మిక్కిలి నాఁటఁ
బూచిన కింశుకం - బులు వోలిర క్త
రోచులు వారున్న - రూపముల్ చూచి 8040
మబ్బులోపల దాఁచు - మార్తాండుఁ డనఁగ
నబ్బురంబైన మ - హాప్రతాపమున
వానరావళిని స - ర్వము నేలఁగూల్చి
యానరాశనుఁ డట్టి - హాసంబు చేసె
నది చూచి యన్నకు - నంజలి చేసి
మది నాగ్రహించి ల - క్ష్మణుఁడిట్లు వలికె

—: లక్ష్మణుఁ డింద్రజిత్తుపై బ్రహ్మాస్త్రమునుఁ బ్రయో
గించుటకు శ్రీరాము ననుజ్ఞ వేఁడుట :—

“ అయ్యో ! పిఁడన - నెంత ? యప్పటి నుండి
చెయ్యి గాచితి నుపే - క్షింప రాదిపుడు.
అసురులతోడ బ్ర - హ్మాస్త్ర మేనేసి
యసువులఁ బాపెద - నమర కంటకుని 8050
నాపదవేళకు - నడ్డంబు వచ్చి
యాపక యున్ననీ - యస్త్రంబులేల ?
ఎన్నటికిని దాతు - నిటమీఁద శక్తి
యున్న యప్పుడె కాక - యుత్తర విందు

తోడుగుదునే?" యన్న - "తోడగకు" మనుచు
నుడివి రాముఁడు లక్ష్మ - ణున కిట్టులనియె

—: శ్రీరాముఁడాతని నివారించుట :—

"వీఁడొక్కఁడే కాక - వేఱె రాక్షసుఁడు
లేఁడు నీ కేల తా - లిమి చాలదిపుడు.
ఒక్కనికొఱకు దై - త్యులనెల్లఁ జంప
నక్కట! యురక బ్ర - హ్మాస్త్ర మేయుదురె? 8060
ఓయన్న! సకలలో - కోపద్రవంబు
సేయుదురే మన - జీవనంబులకు
శరణన్న వాని నె - చ్చరకున్న వాని
మఱుఁగుఁ జొచ్చినవాని - మత్తుఁడౌవాని
తొలఁగినవాని కై - దువు లేనివాని
నెలఁతఁ గూడిన వాని - నిదురించు వాని
వెఱచినవాని నొ - ప్పి నలఁగు వానిఁ
దరమి చంపుట వీర - ధర్మంబుగాదు.
డాఁగి నీలాభ్ర మం - డలములో వెఱచి
ఝాఁగి యీపాతకుఁడ - నిలఁడు నేయుదును 8070
యెంత లేదిది గాక - ఝగాదైత్యుఁ జంపు
నంతయుండినను ది - వ్యాస్త్రముల్ గొడిగి
ధరదూరెనేని పా - తాళ బిలంబుఁ
జొరఁ బాఱినను మింట - జాఱఁగి పోయినను
పోనీక దివ్యాస్త్ర - ములఁ గట్టితెచ్చి
వీని మస్తము డొల్ల - వేయుద మిపుడె
చేయుద మిటుల"న్న - శ్రీరాముమాటఁ

ద్రోయక తననీడఁ - దొడరు వారనుచు
నాలోచనలఁ బోవు - నది యాత్మ నెఱిఁగి

—: ఇంద్రజిత్తు మాయాసీతను రథముపై నునిచి యామె తల తెగ వ్రేయుట :—

"చాలు వీరలిగిన - చావు సిద్ధంబు 8080
యింతియె చాలు నా - కీవేళ" యనుచు
నంతరంగములోని - యజ్ఞ మేమఱక
మఱలి యాత్మీయ ధా - మముఁ జేరి యచట
నొరు లెఱుంగక యందు - నుండి నాఁడెల్ల
మఱునాఁడు తాఁ బడ - మటి కోట గవని
తెరువున వెడలి దై - తేయులఁ గూడి
యని సేయఁ దలఁచి మా - యా సీతఁ దనదు
కనకమహా రథా - గ్రమునందు నునిచి
చేరిన వానర - శేఖరుల్ శైల
భూరుహమ్ములు కేలఁ - బూనుక నెదిరి 8090
నిలిచినచోఁ బావ - ని మహీధరంబు
వలకేలఁ గైకొని - వాని రథంబుఁ
గూల వ్రేయుదునని - కోపించి చూడ
నాలోనఁ గ . . ర - థాగ్రంబునందు
మైలచేల ధరి . . - మానంబుతోడ
నేలఁ గన్గొనుచు క - న్నీరు జాలెత్తి
పెన్నెఱుల్ జడకట్టి - పేరినెమ్మోన
మన్ను హేమ ప్రతి - మను జాజు వోయఁ

గ్రైవడి బెరయు నం - గముఁ గృశియింప
భావ నిర్వేదంబు - బయలు పడంగఁ 8100
జేయి చెక్కిలిఁ జేర - చింతచే చంద్ర
దాయాదమగు మోముఁ - దామర వాడ
నడలుచునున్న మి - థ్యామహీతనయ
వడువుఁ గన్గొని చింత - వాయునందనుఁడు
" కటకటా! యీ జగ - త్కల్యాణి సీతఁ
డెటుసేయ నున్నాఁడో ? - యిటకేల తెచ్చె ?
ఈసాధ్వి పడుపాటు - లెఱుఁగక చేయి
చేసుకో తగదింద్ర - జిత్తునితోడ
నేమి హేతువో వీని - హృదయంబుఁ జూచి
యామీఁదఁ దోఁచిన - యది సేతు ననుచుఁ 8110
గనుచుండ వాఁడలీ - క మహీజఁ జేరి
పెను జడవట్టి గు - ప్పించి తానీడ్చి
పడఁదీసి పట్టిన - పట్టుతో మాఱు
మొడ వెట్టుతరి నృపా - మేదినీజాత
"హా రామ! హా రామ! - హా సుమిత్రాకు
మారక! హా హను - మంత! రావయ్య!
నమ్మితి ప్రాణదా - నము చేసి కనిక
రమ్మున విడిపింప - రావె!" యటంచు
దీనయై కుయ్యిడఁ - దిట్టుచు కూట
జానకి సన్నిశా - చరవరాత్మజుఁడు 8120
తలఁ దగ వ్రేయ య - త్నము జేసి కత్తి
జళిపించు వాని మా - త్సర్యంబుఁజూచి

కలఁగుచు వలదని - కరసౌజ్ఞ చేసి
నిలునిలు మని యాంజ - నేయుఁ డిట్లనియె.

——: హనుమంతుఁ డింద్రజిత్తు నడ్డగించుట :——

"తగునె రాత్రించరా - ధమ! చూచిచూచి
తెగుదురె పరమ ప - తివ్రతామణిని
చంపితివేని నీ - చావు దప్పెడినె
చంపకపోము రా - జ్యము వోవనాడి
ప్రాణనాయకు నెడ - వాసి మాయింట
ప్రాణముల్ పిడికిటఁ - బట్టుక నవయు 8130
నీయమ్మ జంపుదు - రే స్త్రీవధంబు
సేయుదురే దీనఁ - జెడకుండఁ గలవె?
ధర్మంబె యిట్లనా - థలఁ బట్టి చంప
దుర్మానమున దీన - దోషంబు రాదె
వలదిట్టి పని బ్రహ్మ - వంశంబువాఁడ
వలుగుము నీచేత - నైన రామునకు
విడిచెదవో కాక - వేగఁ బ్రాణములు
విడిచెదవో యొక్క - విధమియ్యకొనుము"
నావుడు విని రా - వణ కుమారకుండు
చేవదలక కపి - శ్రేష్ఠునకనియె. 8140
"నాదాఁక రానిచ్చు - నా ప్రత్యసేన?
నీదు వానరులెంత - నీవెంత గలవు
యీతన్వికై కదా - యీ కలహములు
చేతిలోఁ జిక్కిన - సీతను జంపి
పడినట్టి మావారి - పగతొల్లఁ దీర్చి

కడపట ద్రుంపుదుఁ - గపుల రాఘవులఁ
గాక వచ్చిన సీత - క్రమ్మఱ మనకుఁ
జేకూడదని చింతఁ - జేసి నిజేచ్ఛ
నపుడైన వచ్చిన - యన్నిద్రోవలను
కపులు వోవుదురు రా - ఘవులఁ జేవదలి 8150
మఱి వారలుండిన - మాయందు నొక్క
కొఱమాలు దైత్యులఁ - గొని మ్రింగిపోవు
నీ యల్పభాగ్యురా - లెందఱిఁ జంపె
మాయయ్యకును వట్టి - మరులు వుట్టించి
దీని నిప్పుడె వట్టి - తెగవ్రేతు" ననుచు
వానరుల్ వొగుల రా - వణతనూభవుఁడు
రోసంబుతోడన - రువ్వనం దునియ
వ్రేసి మొండెంబు ను -ర్విని గూలఁద్రోచి
"పవనజ! జానకి - పాటు రామునకుఁ
జెప్పిపోక మీరు చూ - చిన కార్యమెల్ల 8160
నీవిధంబని పల్కుఁ - డెటేఁగి యావెనుక
రావణుతో సమ - రము సేయుగాని"
అని తనపై వచ్చు - నగచరశ్రేణిఁ
గనుఁగొని భీకర - కార్ముకంబెత్తి
యమ్ములు గురిసిన - నందఱు విఱిగి
యమ్మారుతాత్మజు - నండ నిల్చుటయుఁ
బాఱ నేమిటికని - పవమానసుతుఁడు
వారల నాఁగి దు - ర్వారుఁడై యెదిరి
కాలి మెట్టులను రా - క్షసులెల్ల నణఁగి
నేలపాలుగఁ గేల - నెలకొన్న నగము 8170

కార్చిచ్చు గతి నల్గి - గద్దించి వ్రేసి
యార్చిన సారథి యా - దైత్యు రథము
నెడఁగల్గఁ ద్రోలఁగించి - యెల్లదానవులు
మడిసి పోవఁగఁ గొండ - మహిమీఁదఁ బడియె.
కడమవానరులుఁ న - ల్గడల రాక్షసులఁ
బడలు వడంగ నో - ర్చ్యలముఁ జూపుటయు
విఱిగిన తనవారి - వెఱవకుండనుచు
నరదంబు మఱలించి - యమరేంద్రవైరి
గరి గరిఁ గరవంక - గరుడిమై గరుల
గరుల నారాచముల్ - గరుసు మీఱంగ 8180
నేసి బోరలు చించి - యెమ్ములు విఱిచి
దూసిపోవ నిగుడ్చి - తోఁకలు ద్రుంచి
తలలు ఖండించి గా - త్రమ్ములు దునిమి
సెలకట్టనీక నొం - చిన వాయుసుతుఁడు
తనవారిఁ బిలిచి " యా - దానవుచేత
మనకేల యెదురించి - మహిమీఁద వ్రాల ?
కతదీఱె వీఁడు రా - ఘవుదేవిఁ జంపె
నితని గెల్చిన మన - కేమి గల్గెడును
పోరాట మికనేల - పోయి యిత్తెఱఁగు
శ్రీరామునకుఁ దెల్పి - చెప్పినయట్లు 8190
మఱి చూతమిప్పుడు - మడిసిపోనేల ?
తిరుగుఁ" డంచును తాను - తీసిపోవుటయుఁ
బవనజు కరుణచే - బ్రతికితి మనుచుఁ
దవిలి వెంబడి శాల - దానవులేయుఁ
బరువిడి దాఁటుచుఁ - బ్లవగులంతయును

మఱలిచూచుచు హను - మంతునిఁ జేర
మఖవారి యప్పుడు - మారణహోమ
మఖిల సంగ్రామ జ - యప్రదంబనుచు
వగచి నికుంభిళా - వని కేఁగి యాగ
జగతిపై మంత్ర సం - జనితాగ్ని నునిచి 8200
శమదమస్థితి నాభి - చార మంత్రముల
నమిత మానవశోణి - తాహుతులొసఁగి
పావకు నందుచేఁ - బరితుష్టుఁ జేసి
యావహ్ని ఫలదాత - యగుచున్న యంత
కోఁతులా రావణు - కొడుకు చేకోర్చి
కూఁతలకును జొచ్చి - కొఱమాలి విఱిగి
తలచెడి వచ్చిరం - దఱు ననుఁజూడ
నెలమి రాముఁడు విని - యెంతయు నలిగి
వరశౌర్యు నలజాంబ - వంతునిఁ బిలిచి

—: జాంబవంతుఁడును, హనుమంతుఁడును శ్రీరామునికి మాయా సీత వృత్తాంతము నెఱింగించుట :—

"అరుగు మిప్పుడె నీవు - హనుమంతుఁ జేరి 8210
మనవార లిపుడ - మఱికోట గవని
ననిలోన వెనక ముం - దై రఁట నేఁడు
గొబ్బున వారితోఁ - గూడుకొమ్మనిన
నుబ్బుచు రిక్షేశుఁ - డురువడి నేఁగి
యెదురైన హనుమంతుఁ - డెఱిఁగిన యర్థ
ముది యంచుఁ బల్కు వా - రిరువురుఁ గూడి
రాము సన్నిధికిఁ జే - రఁగ నేఁగి తమ్ము

నేమని పలికింప - నిట్లని రపుడు
"అయ్య! యేమందమ - య్యసురేంద్రవైరి
కయ్యంబునకు వచ్చి - కాంచనరథము 8220
మీఁద జానకిఁ దెచ్చి - మెడ తెగఁగొట్టి
మేదినిఁ బడఁగ మా - మీఁద వ్రేయుటయుఁ
జోరాడ నీఁక నేమి - పుణ్యంబటంచు
నోరామ! తిరిగి మే - మురక వచ్చితిమి
ఏమి సేయుద"మన్న - యీమాట వినక
యామున్నగా ధాత్రి - నవశుఁడై వ్రాలి
కపు లుపచారముల్ - గావింపఁ దెలిసి
యపుడు "హాసీత! సీ - తా! యంచు నడలి
పొరలాడ తానన్నఁ - బొదువుక యేడ్చి
పరితపించి సుమిత్ర - పట్టి యిట్లనియె. 8230

—: శ్రీరాముఁడా వృత్తాంతము నిజమని దుఃఖింప లక్ష్మణుఁడాతని నోదార్చుట :—

"ధర్మమార్గ ప్రవ - ర్తనుఁడవు నీదు
ధర్మంబు నీయాప - ద హరింపదయ్యె!
స్థావరజంగమ - సమితి చందమున
నీవిధంబున ధర్మ - మెవ్వఁడు చూచె
నెఱుఁగ రేనియుఁ నిన్ను - నింతటిమూర్తిఁ
బొరలంగ నోర్చి న - ప్పుడె ధర్మమనుచు
నున్నదియే ధాత్రి - నొకటి? యధర్మ
మన్నమాటయు నస - త్యము నాకుఁ జూడ!

కాదేని యాదశ - కంఠుండు నిరయ
వేదనలకుఁ బొంది - వెతనొందుగాక 8240
యిటులుండ నేర్పునే - యిట్టిసామ్రాజ్య
పటుదురంధరతాను - భవ జయశ్రీల ?
నీకు సుఖంబు వా - నికి దుఃఖమైనఁ
గాక ధర్మాధర్మ - కర్మరూపముల
ఫలములు విపరీత - ఫలములై వచ్చి
నిలిచిన నెయ్యది - నిశ్చితార్థంబు ?
అంత యేమిటికి ప్ర - త్యక్షవిరుద్ధ
మింత ధార్మికునకు - నిట్టి యాపదలు
పౌరుషంబున ధర్మ - ఫలము చేకూడు
నేరికి నన్నట్టి - యెడ నదియేల 8250
ధర్మ మొక్కటి యని - తలఁప శౌర్యంబె ?
శర్మంబు విజయంబు - సమకూర్పఁజాలు
నుడివోదు నొచ్చిన - నోర నొక్కరుని
విడుతువో చేపట్టి - విద్వేషినైన
నాడ నేరుతువో రెం - డవమాట నీవు
చూడనేర్తువో పర - సుందరీమణుల
నెదురింప శక్తులో - యింద్రాదులైన
నెదురు మేలునకు స - హింపవో మదిని
నాచరింపవో తండ్రి - యానతి నీవు
చూచి త్రోయవో రాజ్య - సుఖవైభవములు 8260
ధర్మమంచని యాస - త్యంబని నీర
ధర్మంబుగాని సేఁ - తలకెల్లఁ జొచ్చి
చేటువ కొడఁబడి - సీమకు లేని.

యాటలాడిన నీకు - నాపదల్ రావె
లేని సత్యంబుఁ గ - ల్పించితి తండ్రి
కేనెఱుంగఁగ నీకు - నీఁడె రాజ్యంబు
వెనుకగదా కైక - వేడబంబులకు
మనసొగ్గి యడవికి - మనలఁ బొమ్మనియె
పుత్రుండవని సిగఁ - బువ్వులు చుట్టి
శత్రుత్వమునఁ బంపు - జనకుని మాట 8270
త్రోయక మేమెంత - త్రోచి చెప్పినను
సేయని ఫలమెల్ల - చేకూడె నిపుడు
రాజైనవాఁడు ధ - ర్మ సుధర్మ మనుచు
యోజింప కాత్మప్ర - యోజనంబులను
సముయోచితంబైన - జాడ వర్తిలక
సమకూడు నే రాజ్య - సౌఖ్య భోగములు
త్వష్ట పుత్రునిఁ జంపి - ధరణీధరారి
యిష్టిఁ గావించి మా - యించె పాపములు
కలిమిఁ గల్గినవాఁడు - గావించు పనులు
చులకగాఁ జేకూడి - శుభము లొసంగు 8280
నచలాగ్రమునఁ బుట్టి - యవనికి డిగ్గి
యెచట వెల్లువ చూపు - నేఱుల రీతి
వదలక మహి నర్థ - వంతుని క్రియలు
కొదవలన్నియుఁ దీఱి - కొనసాగుచుండు
తలఁపు వెంబడి నిర - ర్థకుని కార్యములు
తలకూడి రావు నై - దాఘు వేళలను
వంక సంకరములొ - పరిపాటి కాల్వ
లింకిపోయిన రీతి - నెదిరించుగాని

కలవాఁడె చుట్టముల్ - గలవాఁడు కులము
గలవాఁడు నేరుపు - గలవాఁడు బుద్ధి 8290
గలవాఁడు చెలువంబుఁ - గలవాఁడు విద్య
గలవాఁడు శౌర్యంబు - గలవాఁడు గాక
మదిమది నుండి సం - పదఁ జూఱలిచ్చి
యధముని రీతిఁ గా - రడవులు వట్టి
పేదలైనపుడె త - ప్పెను నీదు విక్ర
మాది చర్యలు భస్మ - హవ్యంబు లట్ల
నర్థంబుచేత ధ - ర్మాదిసుపూరు
షార్థముల్ చేకూడు - నదిలేని కతన
నయమెక్కుడిది "నిర్థ - నస్యమృతస్య
చ" యనవచన మ - సత్యంబు గాదు 8300
పరమార్థముగ నిహ - పర సముసౌఖ్య
కరముగా ధర్మార్థ - కామమోక్షములు.
అర్థహీనుఁడవు నీ - వగుటచే నీయ
నర్థ యోజనచేత - నన్నియుఁ జెడియె
జలదాగమమున న - క్షత్ర గ్రహాళి
కలిగియు నేరికిఁ - గనుపించ నటుల
నాబుద్ధి గాదని - నాఁడాచరించు
నీబుద్ధి నయ్యె ని - న్ని యనర్థములును
పాతకి యగు తండ్రి - పలుకాచరించి
సీతా! యటంచు నే - డ్చిన నేమి గలదు? 8310
ఇల వోయినప్పుడె - యిల్లాలు వోయె
తెలిసి యుండుదు నేఁడు - తెలిసెనే మీకు?
ఇంక నేల విచార - మేడ్చి తేఁగలమె

పంకజాక్షిని సీతఁ – బ్రాణంబుతోడ
సీతకే మనము వ – చ్చితిమింక మీఁద
సీతఁ జంపిన యింద్ర – జిత్తుఁ బోనీక
యిప్పుడే నేనేఁగి – యెందెందు డాగి
తప్పించుకొనిన పా – తకిఁ బట్టి తెచ్చి
యమ్మవారల పద – ప్రాంతంబునందు
నమ్మ దీసుక వాని – యాఁదలఁ దఱిగి 8320
బడిబగాఁ ద్రిప్పించి – బడిసిపో వైచి
కడమ దైత్యుల మస్త – కంబులు గొట్టి
యాలంక మామకా – స్త్రానలహేతి
మాలికలందు భ – స్మము చేసి కూల్చి
రావణుఁ బుత్ర పౌ – త్రయుతంబుగాఁగఁ
జేవాడి మెఱసి కౌ – శిక మానిరాజ
పాలితాస్త్రములకు – బలివెట్టి కాని
తేలి రానిక సమ్మ – తింపుఁడు మీరు
సంగరోద్యోగంబుఁ – జాలింపమీకు
సంగతిగాదె ? శరాస – నముఁ గైకొనుఁడు" 8330
అనుచు నుండఁగ నద్ద – శాననానుజుఁడు
తన మంత్రులును దాను – తగినవానరుల
నచ్చటచ్చట నుంచి – యచటికిఁ జేర
వచ్చి లక్ష్మణునిపై – వ్రాలి శోకమున
నున్న రాముని జెంత – నున్న వానరులఁ
గన్నులఁ జూచి యం – గము కంపమొంద
నది యేమి యనివేడ – నవనిజ చంద
మిదియని సౌమిత్రి – యెఱుఁగఁ బల్కుటయు

నగుమోముతో దశా - నన సోదరుండు
మొగిడించి కేలు రా - మున కిట్టులనియె 8340

—: విభీషణుఁడు శ్రీరామునికి నిజస్థితి నెఱింగించి కర్తవ్యమును బోధించుట :—

"దేవ! మీరింత చిం - తిలుదురె పరమ
పావని సీతఁ జం - పఁగ నెవ్వఁడోపు?
హనుమంతు మాట య - థార్థంబు గాదు
వనధి యింకె నటన్న - వైఖరిఁ దోఁచె
రావణు చిత్త మె - ఱంగనే యేను
దేవి నిమ్మని పల్కఁ - దెగఁ జూచె నతఁడు
చంపువాఁ డేఁటికిఁ - జంపు నొక్కకరిఁ
బంపి దైత్యులనెల్ల - బవరంబులోన
జానకి కొఱకునై - చచ్చువాఁడింతె
కాని యాయమ్మపైఁ - గలుషింపఁ డతఁడు. 8350
ఆయింద్రజిత్తు మా - యాసీతఁ దెచ్చి
యాయన ముందఱ - నటు సేయ నోపు
నది చూచి నిజమని - యాంజనేయుండు
పదరి భీతిని విన్న - పము చేసినాఁడు
వాఁడు నికుంభిలా - వని కేఁగి యచట
వేడి వేలుపుఁ గొల్వ - వెండి వంచించె
యీలక్ష్మణుని నన్ను - నెల్లవానరుల
నాలంబునకుఁ బంపుఁ - డతని హోమంబుఁ
గడతేఱనీక వి - ఘ్నము లాచరించి
కడతేర్త మతని ల - క్ష్మణుని బాణముల!" 8360

అనుచు హితంబుగా - నాడిన మాట
వినియు నమ్మకయున్న - వెండియుఁ బలికె
" అయ్య ! సీతమ్మని - నంపినఁ గాక

—: ఇంద్రజిత్తుచేయు హోమము పూర్తిగాకమునుపే లక్ష్మణుని నింద్రజిత్తుపై పంపుమని విభీషణుఁడు చెప్పుట :—

కయ్యంబులోఁ గెల్వ - గలుగడు మనకు
నదియు నిప్పుడె కాని - యాహోమమతఁడు
కొదఁ దీర్చుకొనిన మా - ర్కొన నెవ్వఁడోపు ?
వజ్రాయుధము దాన - వశ్రేణి మీఁద
వజ్రి పంపిడిన క్రై - వడి వానిఁ దునుము
సౌమిత్రి దక్కఁగఁ - జంపలేఁ డొకఁడు
తామరసాసను - తలనాఁటి వరము 8370
హోమ మీఁడేరిన - నొరులు జయింప
హోమవిఘ్నము సేయు - నొరుచేతఁ జావుఁ
గలిగియున్నది యట్లు - గావునఁ దడయ
వలదు పంపు " మటంచు - వాకొనుటయును
నినుమాఱుగాఁ బల్కు - హితుని వాక్యము
వినియు నమ్మక రఘు - వీరుఁ డిట్లనియె
" విననైతి లెస్సగా - వేసట లేక
వినుపింపు మార్తిచే - విలపించు కతన
తెలివి చాలక యుంటి - తెలియంగ మఱలఁ
బలుకు " మీవన వంశ - పావనుండనియె 8380
" అయ్య ! వరంబిచ్చె - నజుఁడింద్రజిత్తు
కయ్యంబులను గెల్వఁ - గామించి యడుగ

కామగస్యందన - కవచ కోదండ
భీమాస్త్రకోటు ల - ర్పించి యా నలువ
బ్రహ్మాస్త్ర మొసఁగి కో - పముగాఁగఁ బిలిచి
బ్రహ్మ వేఱొకమాట - పలికె వానికిని
"నీహోమ మంతయు - నెఱవేఱ నేని
యీహరిహయ ముఖ్యు - లడ్డంబుగారు.
అందున కొకవిఘ్న - మన్యుల చేత
నొందినవారిచే - నొలియుదు వీవు 8390
తలఁచు" కొమ్మని పల్కి - తనకది మొదట
తెలివిడి యగుట నొ - త్తిలి దెల్పవలసె
వేలిమి కడతేర - వేలిచి వీఁడు
కేలవిల్లంది వా - కిలి వెళ్లెనేని
యిన్నాళ్లవలెఁ బోవఁ - డిందఱఁజంపి
మున్నీటిలో నూఁచ - ముట్టుగా నీడ్చి
యినుమారు మోసపో - యిన వాఁడు గాన
తనగెల్పు నమ్మి పోఁ - దలఁపఁ డవ్వాలికి
కావున నిపుడె ల - క్ష్మణు మముఁ గూర్చి
యీవేళఁ బనిచిన - యేమెల్లఁ గూడి 8400
సమయించెద మతండు - చచ్చినఁ జాలు
సమసె రావణుఁడు - నీచరణంబులాన
సీతను మఱలంగఁ - జేకూర్చికొనఁగ
నీతలఁపున నున్కి - నిజమయ్యెనేని
యిదియె కార్యంబన - హితుని వాక్యములు
మదిమెచ్చి రవివంశ - మణి యిట్లుపలికె

"సత్యంబు నీమాట - సరిపోయెఁగపట
కృత్యంబువాఁడు లం - కేశ నందనుఁడు
మాయావియగు సీత - మాటకు నదియె
చాయమై యున్నది - చనుఁడు వేగమున" 8410

—: శ్రీరాముఁడు లక్ష్మణు నాశీర్వదించి యింద్రజిత్తుపై యుద్ధమునకుఁ బంపుట :—

అనుచుఁ దమ్మునిఁ - జూచి "యంగదముఖ్య
వనచరావళియు రా - వణ సహోదరుఁడు
పిఱుఁదఁ గొల్వఁగ నికుం - భిల కేఁగి దనుజ
వరకుమారు జయించి - వత్తువుగాక !
పొమ్ము"న్న తూణీర - ములుఁ గవచంబు
నమ్ములు విల్లు న - స్త్రాదులు దాల్చి
యన్నకు వలవచ్చి - యగచరుల్ దనకు
నెన్నాసగా హోమ - విపినంబుఁ జేరి
యాచుట్టు నున్న దైత్య - శ్రేణిఁ దేఱి
చూచి హోమ మొనర్చు - వానిఁ గాంచి 8420
యంగద జాంబవ - దాంజనేయాది
సంగర నిపుణుల - జతఁగూర్చియున్న
రామకార్య ధురం - ధర కళానిరూఢు
సౌమిత్రిఁ గని విభీ - షణుఁ డిట్లు పలికె
"కావలిఁ గాచు రా - క్షసులను మొదట
దావ నేయుఁడు వీరు - సహసింపం గాని
వాఁడు రాఁడని నేయ - వచ్చినఁగాని
నేఁడు గూలుఁడు గెల్పు - నిజము మీ"కనుచుఁ

జేయిచూపిన కపి - శ్రేణి యచ్చటికి
డాయఁగ నేఁగి కొం - డలు భూరుహములు 8430
పెకలించి వైచినఁ - బెరిగి దానవులు
చకచక ప్రభలీను - చంద్రహాసములుఁ
దోమరముసల శ - క్తులు బ్రయోగించి
చేమించి ముంచి వ - చ్చిన లక్ష్మణుండు
నారి సారించి బా - ణ ప్రహారములు
ఘోర రాక్షసకోటిఁ - గుప్పలు వ్రేయ
రావణతనయుఁ డా - గ్రహముతోఁ గట్టు
కావిధోవతులూడ్చి - కడఁ బాఱవైచి
కలని సింగారంబుఁ - గైకొని కైదు
వులు దాల్చి రథము ద - వ్వులనుండి తెచ్చి 8440
సారథిఁ బిలిచి యొ - చ్చరికించి యెక్కి
దారుణ తరరణ - ధ్వని మిన్నుముట్ట
దానవ వీరులఁ - దఱిమి వధించు
వానరముఖ్యుఁ బా - వనిఁ దేఱిచూచి
కొన్ని యమ్ములు మీఁదఁ - గోపించి వైవ
నన్నియు వారించి - హనుమంతుఁ డనియె
"కైదువుల్ మిక్కిలి - గలవు నాకనుచు
జోదవై పోరఁ జూ - చుట నీకుఁ దగదు
నాతోడ నొంటిఁ బె - నంగి నాముష్టి
ఘాతిచేఁ జావకఁ - గడతేఱితేని 8450
నినుఁ గన్నవాఁడె తం - డ్రి ధరిత్రియందు
నినుఁ గన్నదియె తల్లి - నీకు నోడితిని
రమ్ము చూత"మటన్న - రావణ తనయుఁ

దమ్మాట విని యట్ట – హాసంబు చేసి
కదియఁ జూచు తలంపుఁ – గని విభీషణుఁడు
మది భయమంది ల – క్ష్మణున కిట్లనియె.
“ సౌమిత్రి! పవనుజుఁ – జంపెను జంపె
దీమంబు మనకు నా – ధీరమానసుఁడు
వాఁడె మార్కొనుచున్న – వాఁ డింద్రజిత్తు
వాఁడి తూపులచేత – వారింపు మతని ” 8460
అనిన నెంతయు నాగ్ర – హమున వాయుజునిఁ
జెనకఁ జేరిన యింద్ర – జిత్తు నీక్షించి

—: విభీషణుఁ డింద్రజిత్తునుఁజంపం బ్రోత్సహించుట :—

“ చూడుము వీని తే – జోమూర్తి యగుచు
వీఁడు హోమము నిండ – వేలిచె నేని
నిలుతుమే యిచట యి – న్నిచుని మఱల
వని కేఁగ నిచ్చిన – వచ్చు నాపదలు
మనలను గికురించి – మఱలి హోమంబుఁ
కొనసాగఁ గావింపఁ – గోరియున్నాఁడు
పోవనీయకు ”మన్న – పోటజ్జగన్న
రావణసుతుని శ్రీ – రామానుజుండు 8470
“ వచ్చితి నీకు నా – వలసిన జగడ
మిచ్చెదఁ గనిపించి – యిఁకఁ బోవరాదు
తూపు లేయు మటన్న – దురముపై బుద్ధి
దోఁపక హోమంబు – తుదిముట్టదయ్యె
నేమి సేయుదు నని – యింద్రజిత్తుండు
సౌమిత్రి విన విభీ – షణుఁ జూచి పలికె,

—: ఇంద్రజిత్తు విభీషణుల పరస్పర సంవాదము :—

“ పినతండ్రివై యుండి – పెద్దవై యుండి
తన కిదితగు నిది – తగదని యెఱిఁగి
యక్కటా ! పరులకు – నవకాశమిచ్చి
రక్కసకుల మహా – రణము త్రుంచెదవు 8480
తనమీఁద తెగుదురె – తనయుండఁగా నె
దనుజేంద్రుఁడును నీవు – తనకొక్కరూప
యేమందఱము గల్గి – యీతఁ డీరీతి
రాముని కడకుఁ జే – రంగ సహించె
మాతండ్రి యను నభి – మానంబు హృదయ
శాతశల్యంబుగాఁ – జాల ద్రవేఁగెదను.
అట్టి యేనొక్కఁ కీ – డైన నీయెడల
నెట్టిచోఁ జేసితి – నే నాకు నలుగ
మాకు నొంటక పోయి – మా ర్తునిఁ గూడి
యాకొల్వు నీకు ము – ప్పనదు గాన 8490
నేరిచెఁ బిలిపింతు – నితని నేననుచు
మారావణునకు వే – మాఱుఁ దెల్పుదును
కడనున్నవాఁడవు – కడనుండ కిట్లు
చెడఁ జూడ నేమి చే – సితి నీకు నేను ?
ఇంటికిగాని వాఁ – డితరుల కీఁతఁ
డొంటునే యనివారు – నొచ్చమెన్నుదురు
ద్రోహ మెవ్వరు సహిం – తురు దొరల్ కార్య
దాహంబుచే నోర్చి – తారుదు రపుడు
నీకీడు కడపట – నీకనుభవము
మాకేమి” యన్న కు – మారుని జూచి 8500

కలుషించి కటములుఁ – గదల నీక్షించి
పెలుచు మాటలతో వి – భీషణుండనియె.
"ఓరి ! మూఢాత్మ ! నా – యుల్ల మెల్లపుడు
మీఁ రెజెంగియు నేల – మించ నాడెదవు
దనుజాన్వయంబునఁ – దాజనించియును
మనసులోన నధర్మ – మార్గ మెన్నుదునె ?
పరుల సొమ్ములకును – పరుల కాంతలకుఁ
గోలమాలి ప్రాల్మాలు – క్రూరాత్మకులను
నెవ్వాఁడు కాలిన – యిండ్ల నేపేంతి
దవ్వగాఁ బోలఁగు నా – తఁడు మేలుఁగాంచు 8510
దుర్జనులగు వారి – తో పొత్తుమాని
వర్జింప నీతి మా – వంటి సాధులకు
పట్టిన పామును – పాఱంగ వైచు
నట్టికై వడిని మీ – సూశ మానితిని
పరవధూగమనంబు – పాపవర్తనము
సురవిరోధము ముని – స్తోమ హింసయును
మత్తప్రచార దు – ర్మానముల్ క్రూర
చిత్తంబుఁజూచి వ – ర్జించితిఁ గాక
చెప్పిన బుద్ధులు – చెవిఁ జేర్పఁడనుచుఁ
దప్పు మోపుదునె మీ – తండ్రిపై నేను 8520
ఘనములు నిరులపైఁ – గప్పిన యటుల
దనుజవరేణ్యు ను – త్తమగుణావళులు
యీనీచగుణముల – యిఱుకునం దగిలె
గాన యేనెడవాసి – కడకుఁ జేరితిని
మీతండ్రి గడవనే – మిటి కీవు గోటిత

మాతండ్రి వలసిన - మాడ్కి దూషింపు
మంకు నేమి గొఱంత - మైనట్టులయ్యె
నందఱితో రావ - ణాసురుఁ బట్టి
పొలియింప కేనేల - పోవుదు నేఁటి
కలనిలో విలయాగ్ని - కల్పసిరంధ్ర 8530
రామదివ్యాస్త్రధా - రాపరంపరల
మోమోటమేల నీ - ముందఱఁ దనకు
బెల్లింపులను నికుం - భిళ కీవు మఱల
వెళ్ల నెంచెద వేమొ - విడువము గాని
మఱలిపోనీము ల - క్ష్మణుని దివ్యాస్త్ర
పరిధి చుట్టుక నిన్నుఁ - బడనేయు గాని
పోనీయ రీకపి - పుంగవుల్ నిన్ను
దానవులను బట్టి - దండింతు రపుడు
చిక్కితి వెక్కడ - చేరెదు మింటి
చక్కిపోరాడ భి - చారహోమంబు 8540
సేయనీయఁడు నిన్ను - శ్రీరాము తమ్ముఁ
డాయతభుజశక్తి - నరికట్టుకొనియె
పాటి దప్పెను నీకు - బ్రహ్మవరంబు
చాటి చెప్పితి" యను - సమయంబునందు
"అయ్య! నాభుజపీఠి - యందు వసించి
కయ్యంబు సేయు మీ కలుషాత్ముతోడ
యీ నేలపై నిల్వ - నేల?" యటన్న
తానుదయాద్రిపై - తరణియపోలి
పావని మ్మదములాంస - భాగంబునందు
తా వసించిన సుమి - త్రాపుత్రుఁ బలికె. 8550

—: లక్ష్మణ యింద్రజిత్తుల యుద్ధము :—

" విల్లు కేలధరించి - వీరుఁడవగుచు
ఛల్లంబు లేరిచి - పట్ట నాయెదుట
నిలిచినంతనె చెల్లె - నీదుపంతంబు
తొలఁగి పొమ్మటుఁగాక - తొడరెదవేని
కపులతో నిను లయ - కాలప్రచండ
తపనమయూఖ ప్ర - తాపాస్మదీయ
కనకపుంఖశిలి ము - ఖప్రకాండముల
ననిలోనఁ దెగటార్చి - యమపురి కనుతు
నన్నదమ్ములు మీర - లంగముల్ మఱచి
నిన్న రాతిరి నాదు - నిశితాస్త్రములను 8560
పడిన పాటులు దలం - పక యింతలోన
మడసిపోవఁగఁ గ్రొత్త - మానిసివైతె ?
తానొక్క కడనుండి - దాయాదివగుట
చేనిన్ను నొప్పగిం - చెను నాకుఁ దెచ్చి
యతని వెంబడివచ్చి - యడవులవెంట
హితమతి గాచుట - కిది ఫలంబయ్యె
దూదిలో నిదు నిప్పు - దునుకయు పోలి
నాదివ్యబాణ సం - తతి రవులొ్కనినఁ
గపులెల్ల నిరస - గహం౦బు మాడ్కి
నిపుడె కూలుదు రెప్పు - డెవ్వరుదిక్కు 8570
యెఱుఁగవో నీవు వా - రెఱుఁగరో నన్ను
యురక విభీషణుం - డుపదేశ మొసఁగఁ
దతిఁ జూచి ' విధివిహి - తంబుద్ధిరనుస
రతి ' యన్నయది యథా - ర్థంబు చేసితివి

నాబాణములకు బ్రా - ణములిచ్చి పడిన
గూబలు గృధ్రముల్ - గోమాయువులును
కండ లీడ్చుక తినఁ - గాఁ జూచి యేడ్చి
భండనంబున రఘు - పతి యీల్గఁగలఁడు
చెడక పొ"మ్మన నింద్ర - జిత్తునిఁ జూచి
కడు నాగ్రహించి ల - క్ష్మణుఁ డిట్లు పలికె 8580
"రావణతనయ! శౌ - ర్యము గలవాని
కీ వట్టి మాటల - నేమి ఫలంబు
జగడించి యంతయు - సరిచూచుకొమ్ము
తెగివచ్చి నీవు మె - దిర్చి పోరాడ
నేరక మైడాచి - నింగికి నెగసి
చోరకర్మమునకుఁ - జొచ్చి మున్నీవు
కావించు నేల ని - కర్మముల్ నీతి
కోవిదులెల్ల నె - గ్గుగఁ దలంపుదురు.
అది యెల్ల నొక్క - సా - హసకృత్యమనుచుఁ
బదర నేఁటికి సిగ్గు - వదల నాయెదుర? 8590
పోనీయ నిపుడే చం - పుదు"నని యొగిరి
యేను నారాచంబు - లేర్చి యేయుటయు
వాఁడు మూఁడమ్ముల - వైదేహి మఱఁది
గాడ సేసిన సరి - కట్టనొంచుటయుఁ
గరలాఘవంబునఁ - గమనీయదివ్య
శరలాఘవమ్ముల - సరివోరిరపుడు
గండభేరుండముల్ - గగనంబు నందు
రెండుఁ బోరెడుగతి - రెండుగ్రహములు

పోరాడు కై వడిఁ - బుడమిపై దనుజ
వీరుండు సూర్మిళా - విభుఁడు నొండొరుల
వృత్ర దేవేంద్రుల - విధమునఁ గంక
పత్రవర్గంబు ల - భ్రంబుల రీతిఁ
గురియుచో దనుజేంద్రు - కొడుకుప్టి నలిగ
శరము వూనఁగ శుభ - శకునంబులైన
నవిచూచి దానవేంద్రానుజుఁ "దేయు
మనఘగా నతని మే - లయ్యెడు నీకె
తోంచెను వానికి - దుర్నిమిత్తములు
కొంచ బాఱెడు నింక - కొఱగాడు వాఁడు"
అన నతిఘోర సా - యకముల వాని
తనువు నొప్పింప నెం - తయు మూర్ఛమునిఁగి 8610
తోడనే తెలిసి స - త్తువకొద్ది దొడిగి
యేడు బాణంబుల - నేసె లక్ష్మణుని
పది తూపులను నేసె - పవమానసుతుని
నదరక పినతండ్రి - నమ్ములముంచె
నతని నేటులకు రా - మానుజుండాత్మ
ధృతి వదలక వాని - దెసఁ జూచి పలికె.
"నీవు ప్రయోగించు - నిశిత బాణములు
పూవులవలె నాఁటి - పోవుటే కాని
యేవంత యేవంత - నైన నేనెఱుఁగ
లావింత మాత్రమె - లక్ష్మణుతోడఁ 8620
బోరి ప్రాణములతోఁ - బోయెదననుచుఁ
జేరితివే!" యని - చిఱునవ్వుతోడ
వాని మే మరువు చే - వడిఁ బడవైచి

నానాస్త్రములఁ జేత - నమ్ము ఖండించి
తనువు నొప్పించిన - ధరణీధరంబు
వనరాసి గనుపట్టు - వైఖరినుండి
కోపించి పెల్లార్చి - గుణము మ్రోయించి
తూపుల సౌమిత్రి - దొడిగిన జోడుఁ
బొడిపొడి చేసి ని - ప్పులు గన్నుఁగొనల
జడగొన నిరుపుర - స్త్రములఁ గప్పుటయు 8630
సమశక్తిఁ గుశపరి - స్తరణాగ్నులనఁగ
నమరి పూచినకింశు - కాగంబులట్ల
నన్యోన్యజయకాంక్షు - లై యప్రమాణ
మన్యువులను విక్ర - మంబుల మించి
పోరెడు వేళ నా - ప్తుఁడు గాన తనదు
వారలు దాను రా - వణసహోదరుఁడు
నెచ్చరింపుచు గొట్టుఁ - డేయుఁడటంచు
నుచ్చరింపుచుఁ గపి - వ్యూహంబుఁ దేర్చి
తనచేతనైన మా - త్రము తాను గొంత
దనుజసేనలఁ జంపి - "తారాకుమార 8640
జాంబవంతసుషేణ - శతబలిపనస !
వెంబడి రండు పో - విడవకుండితనిఁ
కుంభ ప్రహస్తని - కుంభ ధూమ్రాక్షు
కుంభకర్ణ నరాంత - కుని మహోదరుని
నతికాయ యూపాక్షు - నావహాభూమిఁ
బ్రతిన యాడినయట్లుఁ - బట్టి చంపితిరి
చేయూఁతలను మీరు - సింధువుఁ దాఁటి
యో యన్నలార ! వీఁ - డొక పిల్లకాల్వఁ

దరియింపఁ జేసి యిం - దఱు గూడి వీనిఁ
బొరిఁగొనుఁ డెక్కడఁ - బోవు మీ యెదుర ? 9650
ఒంటిగాఁ జిక్కె వీఁ - డొకఁడు త్రిలోక
కంటకునకు నేఁడు - గడయైన వాఁడు
వాఁడె చచ్చిన దశ - వదనుండు చచ్చి
నాఁడు స్వామిహితంబు - నామది నెంచి
చెప్పెదఁ గాని నా - చేఁ గాక యువికి
దప్పించుకొన లేదు - తనయుండు గానఁ
జంపఁ జేయాడదు - చంపెద ననుమఁ
దెంపు చేసుకవచ్చి - తేరి చూచినను
కన్నీరు దొరిగెడు - కడుపులో మరులు
చున్నది వీఁడు నా - యురముపైఁ బెరిగి 8660
నా పొత్తు మాని యె - న్నఁడు భుజియింపఁ
డీపట్టి యాపాప - మేమి పల్కుదును ”
అని తలవాంచుక - యవ్వలి కరుగ
వనచరులా జాంబ - వంతునిఁ గూడి
దానవులను గిట్ట - ధరణీధరముల
చేనొచ్చి తరువుల - చేత మర్దించి
యేపు చూపిన వేళ - యింద్రజిత్తుండు
చాపనిర్ముక్త దు - ర్జయ మహాస్త్రముల
సౌమిత్రి నేయ ల - క్ష్మణుఁ డాగ్రహమునఁ
జేమోచ్చుటయు దొనఁ - జేరనిచ్చుటయు 8670
శరమేర్చుటయు వింట - సంధించుటయును
గురి వ్రేయుటయు చేరు - కొని కాన రాక
ఖంగు ఖంగువఱుంగు - ఘల్లు ఘుజిల్లు

రింగుచు తదనుసా - రిధ్వనుల్ నిగుడ
దనుజుని పై నాఁట - దశరథసుతుని
దనుజుఁడు నాఁటింప - ద్వంద్వయుద్ధమున
మిన్నెల్ల నమ్ములై - మెఱయు మేఘముల
నున్నట్టి రవిచంద్రు - లో యన వారు
కాండపరిచ్ఛన్న - గాత్రులై నెత్తు
రొండొరువుల మేన - నోడికల్ గట్ట 8680
జగడింప కావిరి - చదలెల్లఁ గప్పెఁ
బొగలెల్ల దిక్కులఁ - బొదువుక వచ్చెఁ
గలఁదప్పి గ్రహతార - కానివహంబు
క్షితి చలియించె ఘో - షించె పయోధి
రావెఱచెను సమీ - ర కిశోరకములు
దేవతలకు గుండె - దిగులు రక్కొనియె
మునులు ధాత్రికి సేమ - ములు గోరి రసుర
వనితల కన్నీరు - వరదలై తొరిగె
నంత లక్ష్మణుఁడు కా - లాంతకు రీతి
సంతన కట్టిన - జవతురంగముల 5690
నల్లన మేనుల - నాల్గింటి నన్ని
భల్లంబులను గ్రుచ్చి - పడిపోవ నేసి
వేఱొక్కటి నిశిత - విశిఖంబు తొడిగి
సారథి మస్తంబు - సమరోర్విఁ గూల్చి
మేలు చేసైన సౌ - మిత్రినిఁ జూచి
శూలిరో యన రథి - సూత కృత్యములు
తానె యేమఱక యు - ద్ధము చేసి యలసి
లోనైన చందమా - లోకించి కపులు

మండుచు శరభప్ర - మాదులఁ గూడి
దండనె గంధమా - దన శరభులను 8700
నడచిపై దుమికిన - నాల్గుచోటులను
మడిసిపోయిన తన - మరణం బెఱింగి
యరదంబు డిగ్గి శ - రాసార వృష్టిఁ
బరగించి సౌమిత్రి - ప్రల్లదం బణఁచి
ముక్కాక చేసి పై - మొనసిన కపుల
యుక్కణగించి దై - త్యుల నెల్లఁ బిలిచి
"అరదంబు లేదయ్యె - నరుల జయింప
తరిగాదు తనకు నం - దఱు మీరు గూడి
యడ్డంబు నిలిచి క - య్యము చేసి వారి
కొడ్డుగా నాఁగి నా - కూరట యిండు 8710
యీసంజచీకటి - నెఱుఁగరాకుండ
మీసందడిని నాదు - మొయిడాఁచి పోయి
లంకలో రథమెక్కి - లఘుగతి వత్తు
నంకంబునకు" నంచు - నప్పుడ పోయి

—: లక్ష్మణుఁ డింద్రజిత్తుని పరలోకగతునిఁ గావించుట :—

వేఱొక్క తేరెక్కి - విజయాధికాంక్ష
నారావణ కుమార - కాగ్రణి వచ్చె.
అచ్చెరువునఁ గపు - లందఱు జూఁచి
రిచ్చలు వడి వీఁడు - రెండవ తేరు
నెక్కుక తాఁవచ్చె - నెక్కడఁ గలిగె
నిక్కడ నని ధైర్య - మేది సౌమిత్రి 8720

పొంతవారల వెడ - పుంఖానుపుంఖ
దంతన్యమాన క్రో - దండ నిర్ముక్త
వరదత్త వివిధది - వ్య శరప్రపంచ
పరివేషగతచండ - భానుఁడై నిలిచె
వానరావళి నొంప - వనజజు మఱుఁగు
దీనులై చొచ్చిన - దివిజు లోయనఁగఁ
దన వెనుకకుఁ జేర - దశరథాత్మజుఁడు
కనుగల్గి కనకపుం - ఖ శిలీముఖముల
విలు ద్రుంచుటయు వాఁడు - వేఱొక్క ధనువు
చలమునఁ బూనిన - సాయకత్రయిని 8730
ఖండించి శరపంచ - కమున దానవుని
కొండవంటి యురంబు - గ్రుచ్చి పాఱంగ
వేసిన యెదనాఁటి - పంపున వెడలి
దూసి యావల ధాత్రి - దొలుచుక పడిన
వేఱొక్క విల్లంది - విశిఖముల్ గురియ
శ్రీరాము తమ్ముఁడు - చేకొని యునికి
మఱియు సారథినొక్క - మార్గణంబేసి
శిరముఁ ద్రుంచిన యింద్ర - జిత్తుఁ డేమఱక
సారథి తానయై - చక్రంబు రీతి
తేరు వోనిచ్చి కోఁ - తి బలంబు మీఁద 8740
సౌమిత్రి మీఁద న - స్త్రంబులు గురియ
రాముని సైదోడు - రాక్షసు మీఁద
మఱియు నమ్ములు వేయ - మార్గణ దశక
ముఱుశక్తి సౌమిత్రి - యురముపై జోడు
వేసిన నడుమనె - విశిఖముల్ బదులు

వ్రేసి ద్రుంచిన దైత్య - వీరుఁడు మఱల
నమ్ములు మూఁట రా - మానుజు నొసలు
గ్రమ్మ రక్తంబులు - గాడ నేయుటయుఁ
బెక్కు దూపులు రొమ్ము - భేదించి విల్లు
చెక్కు చేసిన నిశా - చర వరాత్మజుఁడు 8750
"మర్మంబు తెఱిఁగించి - మాపిన తండ్రి
దుర్మార్గుఁడై వీఁడు - దోడుక వచ్చి
యింతేసి పనులు సే - యింపుచున్నాఁడు
పంతగించిన యట్లు - పడనేతు నతని"
అని తనమీఁద రా - నవ్విభీషణుఁడు
పెనుగద సారించి - పెట్టు కొక్కటిఁగ
నాలుగు మారుల - నాల్గు తేజులను
కూలఁగొట్టిన నన్న - కొడుకు కోపించి
పటు బాహుశక్తిచేఁ - బట్టిన శక్తిఁ
గిటకిటమన పండ్లు - గీఁటుచు వ్రేయ 8760
నదిరాఁగ లక్ష్మణుఁ - డైదు తూపులను
పది తునియలు చేసి - పడనేయుటయును
నశనికల్పములైన - యయిదు తూపులను
దశవదనుని సహో - దరుఁడు సంధించి
ధూమ్యాలు నిగుడంగఁ - దొణిఁగి నొప్పించి
యామ్యాస్త్ర మతనిపై - నతఁడు సంధించి
పేర్చి వ్రేయుటయు కౌ - బేరాస్త్రమప్పు
డేర్చి లక్ష్మణుఁడు పై - నేయ నారెండు
క్రౌంచముల్ పోరాడు - గతి మొనయుచును
మించనేరక యవి - మేదినిం బడిన 8770

నాయింద్రజిత్తు రౌ - ద్రాస్త్ర మేయుటయుఁ
జాయగా వారుణా - స్త్రముఁ బ్రయోగింప
సౌమిత్రి గనుచుండ - సరివోరె రెండు
భీమావహంబులోఁ - బేనుక వడియె
నసురేంద్రసుతుఁ డన - లాస్త్ర మేయుటయు
నసముతో మగధక - న్యాకుమారకుఁడు
సౌరాస్త్ర మేసినఁ - జదలున రెండు
పోరాడి జంటగాఁ - బొలిసినఁ జూచి
యాసురాస్త్రంబు మ - హాసురుండేయ
నాసన్న దివ్య శ - స్త్రాస్త్రమై రాఁగ 8780
యూర్మిళావిభుఁడు వా - యు మహాస్త్ర మేసి
నిర్మూలితము చేసి - నిలువక మీఱి
యేచి పైరాఁగ మ - హేశ్వరాస్త్రంబు
వైచిన నదివచ్చి - వా ంచి దాని
దివ్యాస్త్రముల వారె - దిర్చి పోరాడ
దివ్యులు మౌనులు - దేవర్షివరులు
చేరి సౌమిత్రి నా - శీర్వదింపుచును
"వీరాగ్రగణ్య! యీ - విమతు నీవేళ
నడఁగింపు మొక యమో - ఘాస్త్రంబుఁ దొడిగి
విడువకుమీ యని - వినఁ బల్కుచుండ 8790
మఖవ నిర్మితము స - మస్తాస్త్ర రాజ
మఖిల లోకారాధ్య - మరిదురాసదము
మప్రతిహతము ని - రస్తనిశాట
మప్రమేయమునైన - యైంద్రాస్త్ర మేర్చి

"మాయన్న సత్యసం - పన్నుఁడై ధర్మ
మేమెడఁ బాటించు - నేని యప్రతిమ
పౌరుష నిధియేని - పంచిన యపుడ
యీ రాక్షసుని తల - యిలఁ గూల్చుఁ గాత!"
అని ప్రయోగింప మి - న్నంది యయ్యస్త్ర
మనలార్క శతసమా - స్రాభమై యచ్చి 8800
కుండల కోటీర - గురురత్న దీప్తి
మండితం బైనట్టి - మఘవారి శిరము
తెగఁగొట్టి యిలమీఁదఁ - ద్రెళ్లించి యపుడె
మగుడి లక్ష్మణు తూణ - మధ్యంబుఁ జేరె!

—: లక్ష్మణ విజయమునకు లోకము హర్షమునొందుట :—

కురిసెను పైనుండి - కుసుమవర్షంబు
మొఱసె వైయచ్చర - మురవ దుందుభులు.
ఆడిరి రంభాదు - లైన యచ్చరలు
పాడిరి నారద - ప్రముఖ గాయనులు 8810
పొగడిరి మౌనులు - ఋచుఁ జేరవచ్చి
మగిడిరి భీతి స - మస్త దానవులు
చల్లగా వీచెను - చందనానిలము
తల్లడంబులు మానె - ధరణీసురులకుఁ
గపులెల్ల నానంద - కలితులై రపుడు
జపహోమ యోగముల్ - జగతిపై మొలచె
జాంబవంతుఁడు విభీ - షణుఁడు నాలింగ

నంబులు చేసి మ - న్నన గాంచిరపుడు.
క్రొత్తగాయంబులఁ - గురియు రక్తముల
జొత్తిల్లి యలయిక - సోలుచు మఱలి 8820
వచ్చునప్పుడు జాంబ - వద్విభీషణులు
గ్రుచ్చి పట్టుకరాఁగ - గురుబాహు యుగళి
వారి మూఁపులవైచి - వసివాడు మొగము
భూరేణు పటలంబు - వొదువుక యుండ
ధృతిపూని కన్నులు - దేలవైచుచును
హితవానరానీక - మెడమీక కొలువ
గెలిచెదమని రాని - గెలుపుతో దైవ
బలమెల్ల దనపాలఁ - బంచుకొన్నట్టి
తమ్మునిఁ జూచి సీ - తా ప్రాణవిభుఁడు
నెమ్మది పేద పె - న్నిధిఁ గన్న కరణి 8830
గ్రక్కున లేవ రా - ఘవుని పాదముల
చక్క సౌమిత్రి యం - జలిఁ గూర్చి వ్రాల
నెత్తుక తొడలపై - నిడుకొని మేన
హత్తించి యాఁదల - నూస్వదింపుచును
కన్నుఁగొనల నశ్రు - కణములు రాల
నెన్నఁడు నెట్టిచో - నెఱుఁగని యట్టి
సంతోషమునఁ గృపా - జలరాశిఁ దేలి
చెంతలఁ గూడివ - చ్చిన వారలెల్ల
"యింద్రజిత్తుని గెల్చె - నిపుడు నీతమ్ముఁ
డింద్రాదులును వాని - నెదిరింపలేరు 8840
వానితోడిదె లంక - వాఁడు రావణుఁడు
మేనుతోఁ బ్రాణమై - మించినవాఁడు

సీతమ్ముఁ డిందుచే - నీకృపా పాత్ర
భూతుఁడయ్యె" నటన్నఁ - బోయిన సీత
యప్పుడే కూడిన - ట్లతి సంతసమున
ముప్పిరి గొనఁగ రా - ముఁడు వారిఁ బలికె
"గెలుపు గైకొంటిని - కీశ పుంగవులు
తలఁచిన కార్య మం - తయుఁ గడ తేఱె
దశకంఠునకు వీఁడు - దక్షిణ భుజము
శిశువు లక్ష్మణుఁ డింద్ర - జిత్తుతో నెదిరి 8850
జయమందునే విభీ - షణుఁ డంతవాఁడు
భయము దీర్పఁగాచి - పనిగొనె గాక
సుతునితో రావణా - సురుఁడును జచ్చె
నతఁ డెంతవాఁడ సా - ధ్యం బెద్ది మనకు?"
ననుచుఁ దమ్ముని పున - రాలింగనంబు
మనసుఁ దీఱఁగఁ జేసి - "మాయన్న! నీవు
మూన్నాళ్లు బలుగయ్య - మున నింద్రజిత్తుఁ
బూని చంపితి వెంత - పుణ్యుఁడవైతి
సౌమిత్రి! యిపుడు ని - శ్శాత్రవంబయ్యె
నీమీఁద నాదు పూ - నిక యెల్లనుంచి 8870
యాపదమాన్ప ది - క్కైతివి నిన్నుఁ
జూపెను నాపూర్వ - సుకృత వాసనలు
రావణాసురుఁ డేల - రాకుండు? వచ్చి
చావకపోఁడు నా - శరములచేత!
సీతఁ గైకొంటి కాం - చితి నేనయోధ్య
మాతండ్రి! యిఁకనను - మాన మేమిటికి?"

అని సుషేణునిఁ బిల్చి - యౌషధక్రియల
మును వానరుల గాయ - ములు నొప్పి మాన్పి
"సౌమిత్రి యంగంబు - చాల నొచ్చినది
తామసింపక చికి - త్స యొనర్పు మీవు 8880
విచికిత్స మానుమీ - వేళ" యనంగ
నుచితజ్ఞత సుషేణుఁ - డోషధి దెచ్చి
సౌమిత్రికిని విభీ - షణ వానరులకు
నామందు పిడిచి న - స్యముఁ జేయుటయును
నందఱు మునుపటి - కన్న నెమ్మేను
లందుఁ జెల్వొంది గా - యమ్ములు మాని
కాయముల్ వజ్రని - కాయముల్ గాఁగ
శ్రేయోధి కారులై - శ్రీరాము చెంత
నెప్పుడు రావణుఁ - డెదిరించు ననుచు
జెప్ప వేయుక చెల - రేఁగి యున్నంత. 8870

—: ఇంద్రజిత్తు మరణమువిని రావణుఁడు దుఃఖించుట :—

చెడి విఱిగిన హత - శేషులు వఱచి
చిదుముడితో నింద్ర - జిత్తుని పాటు
నావిభీషణుఁడు తో - డై వచ్చి మర్మ
మావల నెఱిఁగించి - యదటణంచుటయు
వినుపింప విబుధారి - విభుఁడొక్క జాము
తన మేనెఱుంగక - తడవు మూర్ఛిల్లి
మిత్రులు బోధింప - మెల్లనే తెలిసి
పుత్రశోకంబునఁ - బొరలుచుఁ బలికె

"ఇంద్రుని చెఱసాల - నిడువాని రాము
చంద్రుని తమ్ముఁడే - జగడించి గెలిచె 8880
యమునకు వెఱవ నేఁ - డాదిగా నతని
బొమముడికై వీఁగి - పోవంగ వలసె
నీపాటు తనకొక్క - నికె యార్తిగాని
యాపన్న గర్భాండ - మెల్లది లంక
మూఁడులోకములు నే - మోకాని తనకుఁ
బాడయిపోయిన - భావంబు దోఁచె
మునులు దేవతలు నా - ముందఱ నేమి
యనిన నూరక తాళి - యనద గావలసె
యవ్వరాజ్యము మమ్ము - నఖిల బాంధవుల
జవ్వనులనుఁ బాసి - చననీకుఁ దగునె ? 8890
పగవారు నవ్వ నా - పయిఁ దెగలేక
తెగితివి దూషించి - తిని నిన్నెఱింగి
తనతండ్రిమాట యాఁ - దలఁ దాల్చి వచ్చి
యనుపమ జయకీర్తు - లందె రాఘవుఁడు
నీవు నీతండ్రి పూ - నికఁ దీర్తునచుఁ
జావఁ బాసైతివి - సలుపు పాపమున
హాకుమారక ! హా ! మ - హాశూరవర్య !
హాకామసంచార ! - హా యింద్రజిత్త !"
అనిచాలఁ బలవించి - "యక్కట వీఁడు
జనకజకై కదా - చచ్చె నీచావు 8900
తాను మాయాసీతఁ - దలఁ దెగవ్రేసె
నే నిజంబుగ సీత - నిపుడు ద్రుంచెదను!"

—: రావణుఁడు సీతను వధింపఁ బోవుట :—

అని బొమల్ ముడివడ - నంగముల్ గదలఁ
గనుదోయి విస్ఫులిం - గంబులు వ్రాల
తిరుగు గానుగ మ్రోఁత - తీరునఁ బండ్లు
గొఱుకుచోఁ గిటగిట - ఘోషంబు నిగుడ
తన మంత్రులను జూచి - "తన తపంబునకు
మును ధాత యిచ్చిన - మోఘకార్ముకము
నరదంబు పంచమ - హావాద్య ఘోష
కరటి సైంధవభట - కలితంబుగాఁగ 8910
తెండు రాఘవుని వ - ధింపఁగా వలయుఁ
బొండని" పనిచి య - ప్పుడ పుత్రశోక
పీడితుండగుచు నా - బిగువుతో వేల్పు
ప్రీడావతులు తన - వెంబడి రాఁగ
కాంతారమున నశో - క వనంబుఁ జేరి
సీతఁ జంపుదునని - చేపెద్దకత్తి
యొరదీసి కడవైచి - హుంకారములను
కరవేడి పొగలచేఁ - గమర మీసములు
వలదంచు నెవ్వరు - వారింప వినక
తొలఁగఁ ద్రోయుచు వచ్చు - దోషాచరేంద్రుఁ 8920
గన్నుల గనుఁగొని - కల్యాణి సీత
విన్నఁ బోవుచు నాత్మ - వివశయై తలఁచి
"చెడుగు వీఁడేల వ - చ్చెనో యాగ్రహించి ?
యడిదంబు వట్టి మ - ల్లాడుచు నిటకు
దిక్కు లేదని తన్నుఁ - దెగ వ్రేయఁ దలఁచె
నాకొక్క లేదేని ర - ణోర్విలోఁ దనదు

కొడుకు చచ్చిన విని - కోపించి పురము
వెడలి రాఘవులతో - విరసింపలేక
నాకోపమునఁ జంప - నలిగెనో తన్ను
కాక యేఁదనకు లోఁ - గాననియెంచి 8930
కామాతురతఁ దాళఁ - గా లేక యాతఁ
డేమి దలంచి తా - నిటకుఁ జేరెడినొ
కాక వీఁడసమసం - గరములో నేఁడు
కాకుత్స్థతిలకుని - ఖండించి వైచి
వానరులను జంపి - వచ్చినాఁడొక్కొ
దీనికి హేతువు - దెలియలేనైతి
హనుమంతుఁ డలనాఁడె -' యమ్మ ! నా వెంటఁ
జనుదెమ్ము మూఁపుపై - నవరించి నిన్నుఁ
గొనిపోయి నీ నాయ - కుని చెంత నిపుడె
యునిచెద ' నని వల్కె - నొప్పకపోతి 8940
పోయిన నే సుఖం - బునఁ బ్రాణవిభునిఁ
బాయక సాకేత - పట్టణంబునను
నుందుగా యటులేల - యుండంగనిచ్చు
మందరఁ గూడిన - మాకర్మఫలము
కైకేయి చెలరేఁగ - కౌసల్య పుత్ర
శోకంబుచే రాము - శుభగుణావలులు
దలఁపుచు నేరీతిఁ - దాల్చుఁ బ్రాణములు ?
కలనైన నూరటఁ - గానదో యమ్మ ?
ఎన్నిపాటులఁ బడె - నిక్ష్వాకుతిలకుఁ
డన్నియు విఫలంబు - లై పోయె నిపుడు !" 8950

అని యేడ్చునపుడు ద - శాననుజూచి
కినుక సుపార్శ్వుఁ డం - కించి యిట్లనియె.

—: సుపార్శ్వుఁడు రావణుని నివారించుట :—

"ఆజని పౌలస్త్యుఁడవు వై - త్వాన్వయాగ్రణివి
భుజశౌర్యనిధివి సం - పూర్ణకాముఁడవు
ధనదసోదరుఁడవు - ధర్మశాస్త్రముల
వినియున్నవాఁడవు - వేదవేదాంగ
పారగుండవు రామ - భార్యఁ జంపుదురె?
ఈరామపయి నేర - మేమి గాంచితివి?
ఒప్పకయున్నది - యొచ్చమె యేమి
తప్పు? పతివ్రతా - ధర్మము వినమె? 8960
నాయకుఁ డున్నట్టి - నాళ్ళకు చిత్త
మీయమ్మ నీకియ్య - దిపుడైన దేమి?
చూడుము లోకైక - సుందరి చెలువ
మీడెవ్వ రిటువంటి - యెలనాఁగఁ జూచి
చేకూడి చంపఁ జూ - చితి విట్టి కినుక
దాయలపై జూపి - తాను మున్నైన
కలబాంధవులఁ గూడి - కలనికిఁ బోయి
గెలువుము రఘువీరుఁ - గెలిచితి వేని
యాకడ నీవుగా - కన్యులు గలరె
యీ కోమలికి మన - సిచ్చు నమ్మాదఁ 8970
స్త్రీవధ మీవు చే - సిన నపకీర్తి
పోవదు పరలోక - మును దూరమగును
పరులపైఁ దెగలేక - పడఁతులఁ జంపు

దురె ? కృష్ణపక్ష చ - తుర్దశి నేఁడు
రేపె యమావాస్య - శ్రీరాముఁ జంప
నోపమె ! యీబుద్ధి - యొప్పునే నీకు ?
కాదు రమ్మని పల్కి - కరముల వ్రాలి
కై దువ దీసుక కడకుఁ - ద్రోచుటయు
యేదియు ననక తా - నింద్ర జిత్తునకు
వేమారు నేడ్చుచు - విసువుతో మఱలి 8980
యామున్నువోలె ని - జాస్థానిఁ జేరి
హైమవిచిత్ర సిం - హాసనాగ్రమున
నాసీనుఁడగుచుఁ దా - నంజలి చేసి
యాసభాసదులతో - ననురేంద్రుఁ డనియె.

—: రావణుని యాప్త పరివారముతో వానరులు యుద్ధము చేయుట :—

" మీ రెల్ల నాప్తులు - మీరుండ లాఁతి
వారలు వచ్చి ని - వారింపఁ గలరె ?
తనదైన యీ యాప - ద యనాథుఁడైన
తనమీద మీరెల్ల - దయ సేయవలదె ?
యీవేళ మీయంత - లేసి చుట్టములు
నావద్ద నుండియు - నరులు వానరులు 8990
మన యింద్రజిత్తుని - మడియించిరనఁగ
వినియు నూరకయున్న - విబుధులు నగరె !
పొండు మీ చతురంగ - ముల తోడరిపుల
ఖండించి విజయంబుఁ - గైకొని రండు
శరదముల్ వోదివిన - చాడ్పున దివ్య

శరములు వర్షించి - సమరంబుఁ జేసి
మీచేత నైనట్లు - మిహిరోదయమున
లేచి పొండ''నిన వ - ల్లెయని వారు
నరుణోదయంబైన - నరదముల్ కరులు
హరులు కైజీతంబు - నవని గ్రక్కదలఁ 9000
బెక్కు సాధనముల - భేరులు మొరయ
నుక్కుతో వనచర - వ్యూహంబు మీఁద
నడచినఁ గపులు కొం - డలు తరువులును
జడిగొన వర్షించి - సమరంబుఁ జేసి
చేతులు ముక్కులు - చెవులును మెడలు
శాతదంతనఖాది - సాధనంబులను
కఱచియు గిల్లియు - కట్టియు పొడిచి
నరభోజనులకు ము - న్నరక చేసినను
తేరులు దోలి హ - త్తీల ఢీకొలిపి
వారువమ్ములఁ జొర - వైచి శక్తులను 9010
ఘరిఘ ముద్గరకుంత - పట్టిసప్రాస
శరశూలముసలాస్త్ర - శస్త్ర కృపాణ
పరశుతోమరకుంత - భల్లనారాచ
కరవాల గదలచే - కాళ్లు చేతులును
ముక్కులుఁ జెవులును - మొగము లెమ్ములును
పక్కలు వీఁపులు - ఫాలముల్ తొడలు
నజ్జునజ్జులు గాఁగ - నరములు దునియ
విజ్జువిజ్జున కాలు - విడిదన్నుకొనఁగ
వాలముల్ దునియ రా - వణుని సమస్త
మూలబలంబు రా - ముని బలంబులును 9020

చెక్కులు సేయుచుఁ - జెరమి వ్రేయుచును
మక్కుమారుగ మారి - మసరిన యట్లు
రక్తనదీసహ - స్రములు పాఱించు
నక్తంచరులమీఁద - నగచరులెల్ల
నొకరొక్కరుని పై - నురవడిఁ బ్రాఁకి
మొక్కుచు ఫలితమ - హీరుహంబులకుఁ
బక్షులు చేరిన - పగిదిఁ గ్రీడింప
రాక్షసు లలిగి దూ - రమున విదల్చి
తరమి చంపులయు నం - దఱు నిల్వలేక
శరణు జొచ్చినఁ జూచి - జానకీ ప్రియుఁడు 9030
చొరఁబారి రావణా - సురుని కై జేత
మురుముచు మేఘంబు - లుగ్రాంశుఁ బొదవు
కై వడిఁ దనమీఁదఁ - గ్రమ్ముకరాఁగ
చేవిల్లు సజ్యంబు - చేసి మ్రోయించి
వారవేసిన యట్టి - వాలంపగములు
నారాచధారల - నఱకిపోనెచి
కోపంబుతోఁ గన్నుఁ - గొనలఁ గెంజాయ
చూపట్ట దనశక్తి - చూపువాఁడగుచుఁ
దేరులు చెక్కాడి - దీకొన్న కరులఁ
బోరు గొండలమాడ్కిఁ - బుడమిఁ ద్రెళ్లించి 9040

—: శ్రీరాముఁడు రావణుని పరివారముతో
యుద్ధము చేయుట :—

హరుల పీఁచమడంచి - యాశరకోటి
పరియలుపడ దివ్య - బాణంబు లేసి

యెందఱెందఱు దైత్యు - లెదిరించి పోరి
రందఱి కన్నుల - కందఱై తోఁచి
తానాగ్రహంబుచే - తనమేను మఱచి
మానుషంబున నతి - మానుషక్రియను
లక్ష్మణాదుల చూడ్కు - లకు భీతి వొడమ
సూక్ష్మదృష్టినిఁగాని - చూడంగరాని
పరమాత్మ మఖిల ప్ర - పంచంబులోనఁ
బరిపాటి నైజరూ - పమున నున్నట్లు 9050
పంక్తికంధరు మూల - బలములోఁ జొచ్చి
పంక్తిరథాత్మజ - ప్రవరుఁ డత్యుగ్ర
కనక పుంఖాను పుం - ఖశరప్రకాండ
జనిత ఘోరానల - జ్వాలలు నిగుడ
మండలీకృత్యస - మానకోదండ
దండుఁడై లయదండ - ధరుఁడును బోలి
యెదిరించు రఘువీరు - నెదిరించి పోరఁ
గదనంబులోన నె - క్కడఁ గానలేక
తమమూఁకలోఁ జొచ్చి - తము జంపుచునికి
తమరు గానఁగలేక - తమలోన తారు 9060
నొక్కరుఁ డొక్కని - యుద్ధతిఁ జంపి
యొక్కఁడెక్కడ రాముఁ - డిదె వచ్చెననుచు
వేయు నమ్ములు దైత్య - వీరులఁ దాకి
మాయింప మేనులు - మఱచి పోరుచును

—: శ్రీరాముఁడు తన మహాస్త్రప్రయోగముఁ జూచి యసంఖ్యాకములగు రావణుని బలములను సంహరించుట :—

సవ్యయ రఘుపుంగ - వాహావామోఘ
దివ్యగంధర్వాస్త్ర - తిమిరపుంజంబు
కన్నుల దొట్టిన - ఖరఖరకిరణ
సన్నిభంబగు తద - స్త్రప్రపంచమునఁ
జీకురై నగరి కై - జీతంపు దొరలు
పీకయు పదుగులై - పెనుచుకపడిరి ! 9070
విమతునా శ్రీరామ - విశ్వరూపమున
తమరెల్ల దవిలి ముం - దఱ నిలుచున్న
కోదండ దీక్షాది - గురు రఘువీరు
నాదండ నొక్కని - నసురులు చూచి
" కంటి మొంటిగఁ జిక్కె - కలెఁగొనఁడొక్క
వింటివానికి నేల - వెఱవ " నటంచు
తిరిగి వాటినచో న - దృశ్యుఁడై విల్లు
కొరవి ద్రిప్పినయట్లు - గోచరించుటయు
విలుకానిఁ గానము - వింటిదివ్యాస్త్ర
ములు వచ్చుచున్నవి - మూఁకలమీఁద 9080
ననుచుఁ జూడంగ మ - హాత్ర నాభి
తనువుగా సత్త్వంబు - తన జ్వాలగాఁగ
కమ్మి విల్లుగ శర - కాండ మంచులుగ
కమ్మ ఘోషము రణ - క్వణనంబుగాఁగ
కాంతి బుద్ధి గుణాధి - కంబు నిసర్గ
కాంతిగ మొనలస్త్ర - గణములుగాఁగ
చక్రసన్నిభ రామ - చక్రంబు కాల

చక్రంబుగతి దైత్య - చక్రంబుమీఁద
దిరుగుచున్నపుడు దై - తేయులు ప్రజల
తెరఁగునఁ బొలియుచుఁ - దెలియ కేమియును 9090
నదెవచ్చె రఘువీరుఁ - డదె త్రుంచెఁ గరుల
నిదె చంపె వాజుల - నెదిరించె మనలఁ
బొడిచేసెఁ దేరులఁ - బొడువుండటంచు
నొడివినవాని క - న్నుల కొక్కఁడగుచుఁ
బదువురు నూర్వురై య - పారములగుచు
మదుల భీతిల మహీ - మండలంబెల్ల
రామ మయంబయి - రాక్షసకోటి
కేమరు దానవై - యిషుపరంపరల
నరదంబు లేదుగో - ట్లామీఁద దొమ్మి
దిరువది లక్షలు - నిలఁ జూర్ణమయ్యె. 9100
పదమూఁడు గోటులు - పంౘ్రెండు లక్ష
లదిగాక ద్వాదశస - హస్ర సంఖ్యకును
మదము నేనుంగులు - మడిసె నశ్వములు
పదిగోట్లపై నిరు - వది లక్షలవల
నరువదివేలకు - హత మొందె నెదుర
పరులందు నూటన - ల్వదియైదు నైన
కోటులశీతి ర - క్షో లక్షయొక్క
మాటుగా నర్ధయా - మంబున మడిసె.
రావణ కుంభక - ర్ణసమాను లెచ్చు
లావులవారు మూ - లబలంబు దొరలు 9110
నందఱుఁ జాలిన - హతశేషులొక్క
కొందఱు చెడి లంక - కును బాఱిరపుడు.

రౌద్రమై యాహవ - రంగంబు వొలిసి
రుద్రుని యుద్యాన - రూఢిఁ జూపఱకు
మునులు దేవతలు రా - ముని సన్నుతించి
మనమున నానంద - మగ్నులై రపుడు.
తమ్మున రావణు - తమ్ముని వాలి
తమ్మునిఁ దారాసు - త ప్రముఖులను
జాంబవంతునిఁ జూచి - సంతోషభాష
ణంబుల మిగుల మ - న్నన లాచరించి 9120
"యేనొక్కఁడను లలా - టేక్షణుం డొకఁడు
గాని యీదివ్యాస్త్ర - గరిమంబుచేత
వైరులఁ దునుమ నె - వ్వారిచేనైనఁ
దీఱ దీనిమంబుఁ - దెలియఁ బల్కితిని"
అన విని వారెల్ల - నభినుతుల్ సేయ
జనకజాప్రియుఁడు ల - క్ష్మణుని చేతికిని
తన దివ్య హేమకో - దండంబొసంగి
యానసమజయ శాలి - యై యున్నయంత

—: లంకలో రాక్షస స్త్రీలు తమ పరిస్థితినిఁ దలంచుకొని రోదనము సేయుట :—

ఆలంకలోని దై - త్యాంగన లెల్ల
"నాలంబులోన రా - మాస్త్రఘాతములఁ 9130
దనయులఁ గూలిరి - తండ్రులు వడిరి
పెనిమిటుల్ బావలు - పృథివిపాలయిరి
మామలు చచ్చిరి - మఱఁదులు మడిసి
రేమి సేయుద" మని - యెలుఁగెత్తి యేడ్చి

"యీచుప్పనాతి దా - నింత కురూపి
రాచసింగము రఘు - రామునివంటి
జగదేక సౌందర్య - శాలినిఁ జూచి
వగలింపుచును తాను - వలచితి ననుచుఁ
బోనేల ? తామోస - పోయి లంకకును
రానేల ? యీచేటు - రానేల దాన ? 9140
అదె వచ్చెఁబో రావ - ణాసురుం డైన
మొదట విరాధుండు - మోహించి పట్టి
సీతకునై చెడ్డ - చేటెఱింగియునుఁ
బాతరలాడుచుఁ - బట్టె తానేల ?
ఖరదూషణాది రా - క్షసుల మర్దించి
దురములోపల కబం - ధుని నేలఁగూల్చి
వాలి నొక్కమ్మున - వధియించి యతని
పాలి రాజ్యము రవి - పతికిఁ దానిచ్చి
వారితో రఘుపతి - వచ్చిన యట్టి
వారతల్ విని నెత్తి - వాని చందమునఁ 9150
గొడుకులఁ దమ్ములఁ - గొల్చిన వారిఁ
బడఁద్రోచె రాఘవు - బాణాగ్నిలోన
మన విభీషణుఁడు ము - న్నాఱుగాఁ జాటి
తనకుఁ జెప్పిన బుద్ధి - తనవిధివచ్చి
పెడతలఁ గొట్టంగఁ - బెడచెవిఁ బెట్టి
వెడలిపొమ్మనఁ బోయె - వెతఁదీటి యతఁడు.
అజహరాదులతోడ - నమరులు వోయి
ప్రజనెల్ల బాధించి - పంక్తికంధరుఁడు

బ్రదుక నీఁడన నొక్క – పడఁతిచే వాఁడు
మొదలుగా లంక ని – ర్మూలమౌ ననిరి 9160
వారు చెప్పిన యట్టి – వనిత యీ సీత
కారణం బెఱిఁగియుఁ – గానకున్నాఁడు
మన లేఁడు పద్మజు – మఱుఁగుఁ జొచ్చినను
గన లేఁడు కామాంధ – కారంబుచేత
హరుఁడో విరించియో – యమరనాయకుఁడో
ధరణిజారమణుఁడీ – తరములో నొకఁడు
కావున దిక్కు లే – క చెడంగ నేల ?
కావవే యనుచు రా – ఘవు పదంబులకు
శరణందమా దవ – జ్వాలలఁ దగిలి
కరిణీ సమూహంబుఁ – గలఁగిన యట్లు 9170
సమయ నేల "నుచు రా – క్షసభామలెల్ల
తమలోనఁదాము సం – తాపించుచుండ

—: రావణుఁడా రోదన ధ్వని విని మహోదర మహాపార్శ్వు లతో యుద్ధమునకు బయలుదేరుట :—

ఆరావమపుడు ద – శానను చెవ్వుల
నారాచధారలై – నాఁటిన నలిగి
తన హితులను మహో – దర మహాపార్శ్వు
లను వారిఁ బిలిచి "మీ – రాహవంబునకు
నడచి రాముని లక్ష్మ – ణ విభీషణులను
హరివరుఁడాదిగా – నగచరావళినిఁ
జంపుఁడే వచ్చెద – సమరంబులోన
ముంపుదు నాశరం – బుల విరోధులను 9180

నింగియు నవని ము - న్నీరు నేఁడసమ
సంగరంబున నస్త్ర - సమితిఁ గప్పెదను
రణవార్ధిఁ బుట్టు త - రంగంబు లనఁగ
రణదురజ్వాలతా - రాహీనలోగ్ర
సాయకంబులను గీ - శశ్రేణి ముంచి
మాయింతు రాముల - క్ష్మాణుల నవ్వానుక
మూతుల నాఁటు న - మ్ములతోడ నెగురఁ
గోఁతుల తలలెల్లఁ - గొట్టి ధరిత్రిఁ
గమలిని వోనాడ - కలిత పద్మోప
మములుగాఁ జూపఱ - మది మెచ్చఁ జేతు. 9190
ఖరమహోదర కుంభ - కర్ణేంద్ర జిత్తు
లటిన ఖేదము దీర్త - వనిలోన నేఁడు
శ్రీరాము ఖండించి - సీత కన్నీరు
ధారాళముగఁ జేసి - దనుజకామినుల
కన్నీరు తజ్జలా - ఘంబులఁ దుడిచి
చన్నవారికిఁ గీర్తి - నవరింతు నేను.
హతశేషులైన దై - త్యశ్రేణిఁ గూర్చి
జతనంబుగా మీరు - చనుదెండ"టంచు

—: రావణుఁడు యుద్ధ ప్రయాణమున నపశకునములను గనుట :—

గంధవాహాత్మ ని - ర్గంధనర్గంధ
సైంధవాష్టక పటు - చక్రనిర్వక్ర 9200
రాహుధ్వజాగ్రసా - రథి చతురాహ
వాహిత జయశీల - మగు రథంబెక్కి

యూపాక్షుఁ డొకచో మ - హోదరుండొక్క
కోపున నొక్క ది - క్కు సుపార్శ్వుఁ డుండ
నొకచో మహాపార్శ్వుఁ - డురుతర హేతి
చకచకల్ నిగుడఁ గాం - చనరథంబులను
భేరీమృదంగాది - భీకరధ్వనులు
బోరు కలంగ న - ప్పురము లోపలను
చావులకును దప్పి - సందుల నీఁగి
లేవను బ్రాలుమా - లిన దానవులను 9210
వెదకి యింటింటను - వెరజి పట్టుకొని
కదనంబునకు సమ - కట్టి యాలంకఁ
జులకఁగా నుత్తర - స్థూల గోపురము
వెలువడి దానవ - విభుఁ డాగ్రహమున
నడచు నవ్వేళ - సైన్యంబులో రాలె
కడగట్టినట్లు యు - ల్కావితానంబు
కేతన కలశమె - క్కెను పంతగ్రద్ద
హేతువు లేకయే - హేతులు విఱిగె.
నింగి జల్లిచ్చెను - నెత్తురువాన
ముంగల భలుమొండె - మును వచ్చి పడియె. 9220
దనుజేంద్రు వామనే - త్రము భుజంబదరెఁ
గనుపట్టె కుత్తుక - కాకుస్వరంబు
మోములెల్ల వివర్ణ - ములు మించె సర్వ
సామాన్య నానావ - శకునంబు లెల్ల
లెక్కసేయక త్రోచి - లేఖారివరుఁడు
చక్కగా నరదంబు - చననిచ్చి యెదురు
కపుల పుంఖానుపుం - ఖములుగా నస్త్ర

విపరీతవృష్టిఁ బ - ర్వించి నొప్పించి
పొగరుతో జగడింప - భూరిబాణములు
నిగుడించి కోలకు - నేలకుం దెచ్చి 9230
పగఁదీఱ వింశతి - బాహుండు మిగుల
నొగులంగఁ గపులఁ బి - న్నుఁగు పెంట సేయ
నెదిరింపఁ దలచూప - నెవ్వాండు లేక
పదరుకొన్నట్ల ద - బ్బరవచ్చె ననుచు
వానరావళి నాల్గు - వంకలు విఱిగి
భానుజాదులు మీఱి - పఱచినఁ దఱిఁబు
పచరించి రాముని - పయిఁ దేరు దోలి
యచలుఁడై వచ్చు ద - శాననుఁ జూచి
వానరస్వామి ది - వాకర సుతుఁడు 9240
సేనల నడుమ సు - షేణుని నిల్పి
పురికొల్పి తానొక్క - భూమీరుహంబు
గురుశక్తిఁ బెకలించు - కొని కేలఁ బూని
వనదముల్ విరియించు - వాయువురీతి
దనుజులను మర్దించి - తరిమినఁ జూచి

—: విరూపాక్షుఁడు సుగ్రీవుని చే హతుఁడగుట :—

రూక్షేక్షణుండు వి - రూపాక్షుఁడనెడి
రాక్షసుఁడొక్క వా - రణముపై నెక్కి
సుగ్రీవుమీఁదటఁ - జొచ్చిన భీమ
విగ్రహుఁడై చేతి - వృక్షంబు చేత
విసరిన కరిఁదాకి - వింటిపెట్టునకు
బిసదప్పి రివ్వున - పిఱిఁదికి నెగిరి 9250

చదికిలఁ బడుటయుఁ - చంగున నెగసి
యదరు దాఁకక విరూ - పాక్షుఁ డెదిర్చి
క త్తియు కేడెంబుఁ - గై కొని చేర
హ త్తి పేరెదవ్రేయ - నర్క నందనుని
వజ్రకీలిత వారి - వర్మంబు వ్రజి
వజ్రంబుచే గిరి - వ్రయ్యలై నట్లు
పరియలై పడుటయు - భానుజుం డలిగి
గిరియె త్తి దైత్యు నం - కించి వ్రేయుటయుఁ
దప్పించుకొని చేతి - తరవారి నడమ
చప్ప వ్రేయుట యు మూ - ర్ఛ మునింగి లేచి 9260
పిడికిట గ్రుద్దిన - బిమ్మిటి నేలఁ
బడి లేచి సుగ్రీవు - ఫాలభాగంబు
కేలఁగొట్టిన పండ్లు - గిటగిటఁ గొఱికి
వాలితమ్ముఁడు దాన - వ కుమారుఁ జేరి
యరచేతఁ గొట్టిన - యాఁదల వగిలి
పరియలై యిలవ్రాలి - ప్రాణముల్ విడిచె.
ఆ విరూపాక్షుని - యరచేతఁ బఱచి
చావఁ గొట్టినయట్టి - సత్త్వవఁ జూచి
కపు నెల్ల సుగ్రీవుఁ - గని మెచ్చుచుండ
నపుడు వేలాతీత - మగు వార్ధియుగము 9270
కై వడి రాక్షసుల్ - కపులును సమర
కోవిదులై మెండు - కొని పోరునపుడు
నిందందు పోరాడి - యీల్గిన సేన
లందు నెత్తురునదు - లంబుధిఁ గలయ
మిగిలిన మూకపై - మిగుల వానరులు

జగడింపఁ జూచి రా - క్షస నాయకుండు
సుగ్రాంశుతేజు మ - హోదరుఁ బిలిచి
సుగ్రీవు మూఁక యం - చుల మించి వచ్చె
వారిపయి నీవు దు - ర్వార శౌర్యమునఁ
బోరి చంపుము వేగఁ - బొమ్మ"ని యనుప 9280

—: సుగ్రీవుఁడు మహోదరునిఁ బరిమార్చుట :—

"స్వామి ఋణంబు దీ - ర్చఁగఁ గల్గె నన్ను
సామాన్యముగ మీరు - సంతరించితిరె ?
ఇదె యని కేఁగెద - నెల్ల వానరుల
గుదురు గ్రుచ్చెద నాదు - ఘోరాస్త్రములను
చూడుఁడు నామీఁదఁ - జూపులానించి
వేడుక చెల్లించు - విమతులఁ దునిమి !"
అని తేరు వోనిచ్చి - యనలంబులోనఁ
బెనుగాల్ల మిడుత కు - ప్పించి పడ్డటుల
సింగంబు గర్జించు - చెలువున దనశౌ
తాంగంబు నలుదిక్కు - లందు రానిచ్చి 9290
యట్టహాసము చేసి - యంప వెల్లువల
గుట్టలుగాఁ గూల్చి - గోఁతులఁ దఱుము
భానునందనుఁ డోక - పర్వతంబెత్తి
తానేయుటయు మహో - దరుఁడు కోపించి
యమ్ములఁ జెక్కాడి - నతఁడొక్కసాల
మమ్మమజాళను - నదలించి వ్రేయ
నదియును ద్రుంచిన - నర్కనందనుఁడు
బదులు కైదువ లేని - పరిఘంబుఁ బూని

హారులఁ జెక్కాడిన - నరదంబు విడిచి
ధరణికిడిగి మహో - దరుఁ డాగ్రహమున 9300
గదవ్రేయుటయు పరి - ఘంబుచే వ్రేయ
బిదురుపల్లై యవి - క్షితిమీఁదఁ బడిన
వేఱొక్క గద దైత్య - వీరుండు పట్టె
చేరిన ముసలంబు - చేభానుసుతుఁడు
వ్రేటు లాడిన నవి - విఱిగి పోవుటయు
మాట మాత్రనె వారు - మల్లలు చఱచి
సరి భిత్తరికిఁ జొచ్చి - సత్తువల్ నెఱయ
బిరబిరఁ ద్రిప్పుచుఁ - బెనఁగి వ్రేయుచును
చండింపుచును భుజా - స్తంభంబు రీతి
దండపూనుక నిల్చి - తరమి గ్రుద్దుచును 9310
క్రిందుమీఁదై పడి - కేడించి నడుము
సందులు వ్రేయుచు - జగడంబు మాని
యలసి యిర్వురు నిల్వ - నమ్మహోదరుఁడు
చలముతో నొకకత్తి - ఝళిపించుకొనుచు
వ్రేసిన రవిజుండు - వేఱొకకత్తి
దీసుక దానవుల్ - దిగులుపడంగ
నఱకిన మకుటకుం - డలములతోడ
ధరమీఁద నమ్మహో - దరు తల వడియె

—: మహాపార్శ్వుఁ డంగదునితో యుద్ధమొనర్చి హతుఁడగుట :—

అపుడు రావణుఁడు మ - హా పార్శ్వుఁ బిలిచి
కపులపైఁ బనిచినఁ - గఱకుటమ్ములను 9320

గాలి పండినచెట్లుఁ - గదలించి రాల్చు
పోలికెఁ దలలెల్లఁ - బుడమిపై డొల్ల
నగచరులను జంప - నంగదుఁ డొక్క
నగముఁ గైకొని వ్రేయ - నడుమనే తునుమ
పరిఘంబుచే మహా - పార్శ్వుఁ డంగదుఁడు
తిరుగఁ గొట్టిన సార - థిని తన్నుదాఁకి
యిద్దరు మూర్ఛిలి - యిల వ్రాలునంత
వద్దనుండిన జాంబ - వంతుండు గినిసి
గిరిని యొండెడఁ బెల్ల - గించి వైచుటయు
నరదంబు దుమ్మయ్యె - హరులతోఁ గూడ 9330
నంతటఁ దెలిసి మ - హా పార్శ్వుఁ డలిగి
వంతు వెంబడి జాంబ - వద్గవాక్షులను
నంగదు క్రొవ్వాఁడి - యమ్ములచేత
నంగముల్ నొప్పింప - నంగదుఁ డలిగి
పరిఘంబుచే వాని - బాణాసనంబు
పరియలు వాపినఁ - బరశువుఁ దాల్చి
వాలిసూనుని వ్రేయ - వానిపై నలిగి
కేలెత్తి తన పిడి - కిట గ్రుద్దుటయును
తలవ్రస్సి మెదడు క్రొ - త్తమ్ములు వెడల
విలవిలఁ దన్నుక - విడిచెఁ బ్రాణములు. 9340

—: సుపార్శ్వుని మరణము :—

అసురారివరేణ్యుఁ - డది చూచి యలిగి
తా సుపార్శ్వునిఁ బిల్చి - తరమి కోఁతులను
జంపి రమ్మనిన రో - సంబున వాఁడు

నంపవానలు వాన - రావళిమీఁద
ముంచి యంగదు మేను - మూఁడు దూపులను
నొంచి యాజాంబ వం - తుని నొక్క కొన్ని
యమ్ముల వేసి గ - వాక్షుని మేను
తొమ్మిది తూపులఁ - దొడరి వేయుటయు
నాగవాక్షుఁడు వాని - యరదంబు మీఁద
వేగంబె దుమికి చే - విల్లు ఘటించి 9350
సారథిఁ జంపి య - శ్వంబులఁ దునిమి
తేరుమీఁదట వాని - దిగువకుఁ ద్రోచి
వెంటనే పైవ్రాలి - వెన్ను దన్నుటయుఁ
గంటు పూనక వాఁడు - కడకాలు వట్టి
పడి నీడిచి గవాక్షుఁ - బైకొని వాఁడు
మడిమకొద్దిని రొమ్ము - మాఱు దన్నుటయు
నాకాలు వట్టుక - యసురులు వెఱవఁ
గేకలు వేయుచుఁ - గిఱుకుఱుప్పొంగ
బిరబిర మింటఁ ద్రి - ప్పిన వాతఁ జెవుల
నురురక్త పూరంబు - లుర్విపైఁ గురియ 9360
నసువులు వోయిన - యందాక ద్రిప్పి
విసరి లంకాపురి - వీథివో వైచె.
చేఁదప్పి పాటినఁ - జిల్లర దైత్యు
లాదశాననుఁ తేరి - యండఁ జేరుటయు
వీరవానరకోటి - విని తల్లడిల్ల
సారథితోడ ద - శగ్రీవుఁ డనియె

—: రావణుఁడు స్వయముగా యుద్ధముసేయుట :—

"సీతాఫలంబు నా - శ్రిత విభీషణము
నాతత ద్విజరాజ - మగచరసైన్య
చంచరీకంబు ల - క్ష్మణ మహామూల
మంచిత జాంబవ - దంగదనీల
పవనజ నలతార - పనసోరుశాఖ
మవిత సుగ్రీవ మ - హా ప్రకాండంబు
నగుచున్న రామనా - మావనీరుహము
నగలింతు నాచంద్ర - హాసంబుచేతఁ
జూడుము చక్కఁగాఁ - జొనుపుము తేరు
సూడు దీర్చెదను ర - క్షోరాజికెల్ల!"
అని యల్లతో తామ - సాస్త్రంబుఁ దొడిగి
దనుజవరేణ్యుఁ డు - ద్ధతిఁ బ్రయోగింపఁ
బెనుదుమ్ము చీకటి - బెడిదంపు గాడ్పు
లనియెల్లఁ బొడువ న - య్యస్త్రంబు రాఁగ
చీకులై కడు కాంది - శీకులై చలిత
వీకులై వానర - వీరులు వఱవ
భానుచంద్రులకు మా - ర్పడిన స్వర్భానుఁ
డో నాఁగ దనుజేంద్రుఁ - డు ధృణీకరించి
రామలక్ష్మణులపై - రా నమోఘాస్త్ర

—: రామలక్ష్మణులు రావణుని నెదిరించి పోరాడుట :—

సామగ్రిచేత ల - క్ష్మణుఁ డెదిరించి
పైనమ్ము వేసినఁ - బవినిభాస్త్రముల
వాని ఖండించి రా - వణుఁ డేపు మిగిలి

మెన్నన్ని దూపుల - నేసె సౌమిత్రి
యన్నియు నన్నిసా - యకములఁ దునిమి 9390
యతని నమ్ముల ముంచి - యవనిజా ప్రియుని
నతిఘోర శరవృష్టి - నాక్రమించుటయు
నవియెల్ల నొక్క మ - హాస్త్రంబు చేత
నవనిపైఁ బడవేసి - యచలుఁడై నిలిచి
కుడియెడమలఁ బోయి - ఘోరాస్త్రకోటి
కుడియెడముల మార్చు - కొని చేతియలఁత
వారింపుచు నిగుడ్చి - వారిరువురును
పోరాట గఱిఁ గఱిఁ - బొదువు నమ్ములను
నాకాశమెల్ల గ - వాక్ష రంధ్రములు
జోకసేసినయట్లు - సునిశితాస్త్రముల 9400
నెడమీక చూపట్టు - నినకులోత్తమునిఁ
గడువాఁడి తూపులా - గ్రహముతో మూఁడు
పరగింప నవివచ్చి - ఫాలభాగమున
గరులు మోవఁగ నాఁటఁ - గలువల పోలె
నారామునకు జల్లి - నై యుండె గాని
యారా! కొంత చులుకు - మన నోపదయ్యె.
అరమి రాఘవుఁడు రౌ - ద్రాదిదివ్యాస్త్ర
శరపరంపరల రా - క్షసనాథు నేయ
నవి యెల్ల నతని మ - హావజ్రకవచ
మవిరళంబుగఁ దాఁకి - యవనిపై బడియె. 9410
నుదుటినూటిగఁ బట్టి - నూటి కొక్కటిగఁ
బదనైన యమ్ము లే - ర్పఱచి రాఘవుఁడు
తొడిగి వ్రేసిన నైదు - తూపులఁ దునిమె

నడుమింట సతఁడొక్క - నారాచమేసి
యాసురాస్త్రము రావ - నాసురుఁ డుగ్ర
శౌగనుఁ డగుటచే - సంధించి వేయ
నాయస్త్ర మురగసిం - హ వ్యాఘ్ర శునక
వాయసమార్జాల - వానరతురగ
గోమాయు శశవృష - గోపుచ్ఛశరభ
గోమహిషాజకు - క్కుట పుండరీక 9420
కంకగృధ్రోలూక - ఖరనజగ్రాహ
సంకురాక్షసపిశా - చముఖాగ్రకోటి
తండోపతండమై - తన వెంట నింగి
నిండుక తనచాయ - నిగిడి రాఁజూచి
శ్రీరాముఁ డాగ్నేయ - సితశరంబేర్చి
నారి సంధించి దా - నవనాథునేయ
శిఖిసింహికేయార్క - జీవేందు భౌమ
ముఖమహాగ్రహ విష - ముఖ ధూమకేతు
హాలహాల లితుచం - ద్రార్ధస్ఫులింగ
జలధరజ్యోతి ప్ర - చారాస్త్రకోటి 9430
నిలయు నింగియు నిండి - యేకమై వెంట
జలజల పిడుగులే - చాయ రాల్చుచును
నార్చుచుఁ దావచ్చి - యాసురాస్త్రంబు
దర్పమంతయు మాన్చి - తాశాంతి నొందె.
మయనిర్మితంబైన - మాయాస్త్ర మమర
భయదంబుగా దైత్య - పతిప్రయోగింప
నది కుంతశరతోమ - రాసి త్రిశూల

గదలు మున్నైన భీ - కర సాధనములఁ
దనమీఁదఁ గదియ గాం - ధర్వాస్త్రమేసి
జనకజాప్రియుఁ డది - చల్లార్చి యణఁచె. 9440
అసురవల్లభుఁడు సౌ - రాస్త్రమేయుటయు
దెసలెల్లఁ బొదువుచు - దినకర ప్రభల
నది చక్రశక్తి ప్రా - శాదులతోడఁ
గదిసిన కోసల - కన్యకాసుతుఁడు
నమ్ములు గురిసి సౌ - రాస్త్ర చక్రములు
దుమ్ములుగా నేసి - దుమ్ముతోఁ గూల్చె.
అందుకు నలిగి ని - శాటవర్యుండు
కందువల్ నాఁట భీ - కర సితాస్త్రములఁ
బది నిగుడించినఁ - బంక్తి కంధరుని
యెదనాఁటఁ బది నిశి - తేషుల నేసె. 9450
ఆలోన సౌమిత్రి - యతని టెక్కియము
చేలపై మనుజుని - శిరము వ్రాసినది
సప్తసాయకముల - జగతిపైఁ గూల్చె
సప్తాశ్వసుత విభీ - షణులు గీర్తింప.
అరిగి యెక్కమ్మున - నసురసారథినిఁ
దల తాటిపండు చం - దమునఁ ద్రెళ్ళించి
యైదుతూపులచేత - నసురేంద్రుచేతి
కోదండదండ ము - క్కనఁ జక్కజేసి
యంతన యోమయా - యతగదాహతిని
సంతనకట్టన - స్యందనాశ్వములు 9460

నా విభీషణుండు రౌ - ద్రాకృతిఁ జేరి
చావఁ గొట్టెను రామ - చంద్రు కట్టెదుర

—: రావణుఁడు తన కడ్డువచ్చిన విభీషణునిపై శక్తిఁ బ్రయోగించుట :—

నది చూచి రావణుఁ - డాగ్రహోదగ్ర
హృదయుఁడై "దైవంబు - నే కూడె వీఁడు
పగవారితోఁ గూడె - పగఁదీఱ వీని
తెగఁ జూతు నాత్మ శ - క్తి ప్రయోగమున"
అని యొక్క శక్తి యా - యతబాహుశక్తి
గనలుచు వ్రేసినఁ - గని లక్ష్మణుండు
నడుమనె మూఁడు బా - ణంబుల ద్రుంపఁ
గడల వానరులెల్లఁ - గడుమెచ్చి రతని. 9470
అంత రావణుఁడు కా - లాంతకు రీతి
దంతముల్ గిటగిట - ధ్వనులీనఁ గొఱికి
మయనిర్మితము నస - మానంబు సమర
జయకారణము కాల - శమన దుర్జయము
నతి లోహితము ఘంట - కాష్టకాన్వితము
శతపత్రసూతి ప్ర - సాదలబ్ధంబు
ననితరదుర్లభ - మనివారితంబు
దినకరకిరణ సం - దీప్తంబునైన
నొక శక్తిచేనంది - యుంకించి వ్రేయ
భ్రుకుటి యల్లార్చుతోఁ - బుట్టువుఁ జూచి 9480
యా విభీషణుఁడు ప్రా - ణాశచే భీతి
చావ నోడుటయు ల - క్ష్మణుఁ డంతలోన

—: లక్ష్మణుఁడు విభీషణుని కడ్డపడుట :—

నతని కడ్డమువచ్చి - యసురేంద్రు కేలు
నతని శక్తియు వాఁడి - యమ్ముల ముంప
లేశమేనియు నవి - లెక్కఁగాఁ గొనక
దాశరథిశ్రేష్ఠు - తమ్మునిఁ బలికె
" ఈ విభీషణు శక్తి - నేసిన నీవు
నావల నుండి మూఁ - డమ్ములఁ దునుమఁ
దప్పెనంచును దన - తమ్ముఁడు భుజము
లప్పళింపఁగఁ గపు - లందఱు మెచ్చ 9490
యెంతవాఁడ నటంచు - నీవాత్మ నుబ్బ
చెంత మీాయన్న నీ - క్షించి దీవింప
నిన్నియుఁ జూచితి - నీ శక్తిచేత
నిన్ను వధింతు దీ - నికిఁ దప్పుకొమ్ము
మెఱచు విభీషణు - వెనుకకుఁ దిగిచి
శరచాపములు పూని - సరివానికరణి
నిలిచినట్టి ఫలంబు - నీకు చేఁజేత

—: రావణుఁడు లక్ష్మణునిపై శక్తినిఁ బ్రయోగింప నాతఁడు మూర్ఛిల్లుట :—

గలుగు నంచు శక్తి - గ్రక్కున వేయ
నదిచూచి యప్రతి - హతమని యెంచి
బదులేయునట్టి యు - పాయంబు లేక 9500
చావక దీనిచే - సౌమిత్రి బ్రతుకు
గావుత మదిమదిఁ - గలఁగ దీవించి
శక్తివిహీనమై - సౌమిత్రిఁ దాఁకు

శక్తియపార్థమై - చనుఁగాక యనుచు
జనులు వేడఁగ మీఁ - ద శక్తియు వచ్చి
చనుమలు నాఁటి వ - క్షమ్ము భేదించి
వీపున వెడలి యు - ర్వీస్థలి నాఁట
వాపోవుచును కపి - వ్రాతంబు చూడ
సౌమిత్రి వడినంత - చాలశోకమున

—: శ్రీరాముఁడు రావణునితో యుద్ధము సేయుట-లక్ష్మణుని రొమ్ములో నాఁటిన శక్తిని పెకలించుటకు వానరులు ప్రయత్నించి తీయలేక పోవుట :—

రామచంద్రుఁడు చేరి - రణము సేయుటకు 9510
వేళ యంతియెకాని - విలపించు నట్టి
వేళ గాదని కీశ - విభుని వాయుజునిఁ
గనుఁగొని " సౌమిత్రిఁ - గావుఁడు మీరు
దనుజేంద్రుఁ డొక్కఁడుఁ - దగిలె నాచేత
చంపుదు" ననుచు లో - చనముల తుదలఁ
గెంపు జనింప న - గ్నికణంబులీను
సాయక ఘోర వ - ర్షము దశాననుఁడు
పోయెఁ బొమ్మనిపింప - భోరునఁ గురియ
నావేళ కపులు డా - యఁగవచ్చి కొండ
కోవలోఁ జొరఁబారు - క్రూరాహివోలె 9520
సౌమిత్రి నాఁటిన - శక్తి వారింప
లావు కొలంది నె - ల్లరుఁ దీసి చూచి
యలసె సుగ్రీవుండు - హనుమంతుఁ డీడ్చి
సొలసె నెసగుపాటి - చూచె నంగదుఁడు

తారుడు దారు మైం - దద్వివిదులును
పోరాడి రొకకొంత - ప్రొద్దు పెనంగి
నలుఁడు సత్తువచూపి - నలఁగె నీలుండు
చలపట్టి మెచెమ - ర్చఁగ నగ్గలాడె
పనసుండు విసివె జాం - బవదాదులైన
వనచర ప్రభువుల - వారివారికిని 9530
పెకలింతుమని చూచి - పెనఁగినవారి
నొకఁడైనఁ గదలింప - నోపక యున్న
రావణుఁడా వాన - రశ్రేణి మీఁద
వేవేలు తూపులు - వింట సంధించి
వేయునప్పుడు రఘు - వీరుఁ డచ్చటికి

—: శ్రీరాముఁ డాశక్తిని పెకలించి భగ్నము సేయుట :—

డాయ నేతెంచిగా - టంబుగా నురము
నాఁటిన శక్తియు - నంత దోశ్శక్తి
పాటవంబున కేలఁ - బట్టి రాఁదిగిచి
తమ్మితూఁడీడ్చు - గం - ధగజంబు పోలి
రెమ్మి చేతులఁ బట్టి - రెండుగా విఱిచి 9540
కడలఁబాఱఁగ వైచి - కపులెల్ల వినఁగఁ
గడు నాగ్రహమున రా - ఘవుఁడిట్లు పలికె

—: శ్రీరాముఁడు లక్ష్మణునిపై ప్రయోగించిన శక్తినూడఁ దీసి, రావణుని వధింతునని ప్రతిజ్ఞ సేయుట :—

"నాదు పున్నెము కార - ణంబుగా నొంటి
నీదశాననుఁడు నేఁ - డెదిరించి నిలిచె,

జానకితోడ ల - క్ష్మణునితోఁ గూడ
యేను గారడవుల - నిడుమలఁ బడుచుఁ
దోలుత విరాధునిఁ - దునిమి దూషణునిఁ
బొలియించి త్రిశిరునిఁ - బోకడవెట్టి
ఖరుని మర్దించి మృ - గంబయి వచ్చి
విరసించు మారీచు - వెంటాడి చంపి 9550
పడినపాటుల నెల్లఁ - బడిన ఖేదములు
కడతేర్చుకొందు నీ - కలుషాత్ముఁ దునిమి!
ఈ సీతఁ గోల్పోయి - యినసూనుఁ జెలిమి
చేసి యాయనకుఁ గి - ష్కింధ యొసంగ
వాలిఁ గూలఁగనేసి - వానరకోటి
చాలఁ గూర్చుకవచ్చి - జలరాసిఁ గట్టి
లంకపై విడిసి యా - లములోన నెదుర
లంకేశు బలము నె - ల్లను సమయించి
కడచి వారిధి పిల్ల - కాలువలోన
ముడిగిన గతి దశ - ముఖుచేత నేఁడు 9560
తమ్మునిఁ గోల్పోతి - తనమదిలోని
యుమ్మలిక యడంగ - నుగ్రాస్త్రములను
రావణుఁ జంపక - రానింక మఱలి
యావల బ్రహ్మాదు - లడ్డగించినను
పారిపోవక నిల్చి - బవరంబులోన
ధీరుఁడై నన్ను నె - దిర్చినఁ జాలు
రామరావణులందు - రావణుం డొకఁడు
రాముఁడొక్కఁడుగాని - రణభూమిలోన

నిరుపుర బ్రతుకు లే - దిందులో నొకని
మరణంబు సిద్ధంబు - మాటలేమిటికి ? 9570
గిరులెక్కి తరులెక్కి - కేళియపోలె
పరికింపుఁ డాత్మీయ - బాణలాఘవము
మింటి దేవతలు భూ - మిని మీరుఁజూచి
వింట నెచ్చగువాని - వీక్షింపుఁడిపుడు
నను రాముఁడనుచుఁ గి - న్నరయక్షఖచర
మునిసురచారణ - ముఖ్యులందఱును
పూని చతుర్దశ - భువనవాసులను
మానసంబున నెంచ - మర్దింతు వీని
నతని కయ్యోడు తన - కయ్యోడు నొకరి
వెతదీరు నేఁటితో - వీఁడు నాయెదుర 9580
నిలిచి ప్రాణంబులు - నిలుపుకోఁ గలఁడె ?"
కలనిలో నని గుణ - క్వణనంబు నిగుడఁ
దూపులేసిన కొండ - తో నుద్దియగుచుఁ
జాపంబు పరివేష - చక్రంబుగాఁగ
శరముల కరముల - జాడగాదాఁను
ఖరకరు రీతి రా - ఘవ శేఖరుండు
నేయు నమ్ములకు మా - రేయుచుఁ బెక్కు
సాయకంబుల రామ - చంద్రునిఁ బొదువ
నాయమ్ము లగలించి - యాయముల్ నాఁటి
గాయముల్గా సాయ - కముల నొంచుటయు 9590
నజ్జగానక మారు - తాహతిఁ బఱచు
నజ్జలదము రీతి - నని సేయ నోడి

వెన్నిచ్చి విఱిగి న - వ్వేడువారి నెఱుఁగ
కన్నిశాచరనాథుఁ - డరిగె దూరమున
ననిలోనఁ బడియున్న - యనుజన్ముఁ జేరి
తనచేతివిల్లు న - స్త్రములుర్వి నైచి

—: లక్ష్మణుఁడు మూర్ఛనుండి తెప్పిఱిల్లక పోవుట చూచి శ్రీరాముఁడు విలపించుట :—

హా లక్ష్మణా! యని - యవనిపైఁ బొరలి
చాల నేడ్చుచు రామ - చంద్రుఁడు వలికె.
"చేరి చూచితివె? సు - షేణ! సౌమిత్రి
యూరుపు లెగదొట్ట - యురగంబె పోలి 9600
యవనిపైఁ బొరలెడు - నక్కటా! యితఁడు
పవిఁ గొట్టువడి యద్రి - పడియున్నయట్లు
వీఁడు ప్రాణంబులు - విడిచినఁ దనకు
నేఁడె ప్రాణంబులు - నిలువ వీమేన
తనవెంట వచ్చె నీ - తఁడు మున్ను నేఁడు
వెనుకొని యీతని - వెంట నేఁగెదను
నగుబాటులాయెను - నా పౌరుషములు
మగువకై వచ్చి ల - క్ష్మణునిఁ గోల్పోతి
నాసమక్షమున దా - నవనాథు శక్తి
దూసిపాఱెను వీని - తోరంపురము 9610
సౌమిత్రి యీ విభీ - షణుఁ గావఁదలఁచి
తామేనొసంగి యీ - తత కీర్తిఁ గాంచె
నీ లక్ష్మణుని హాని - యేఁ జూచి చూచి
ప్రాలు మాలితి నాదు - ప్రాణంబులకును

నేనడ్డపడనైతి - నింక నేల తనకు
జానకి ? రావణుఁ - జంప నేమిటికి ?
ఎవ్వరు నాకేల ? - యేనేమి పనికి
నివ్వానరులిఁ కేల ? - యింకనా గొడవ !
నామేనిలోనఁ బ్రా - ణము లున్నవనెడి
యీమాత్రమయ కాని - యేల యీతనువు ? 9620
విల్లు దాల్పఁగఁ జాల - విశిఖంబుఁ దీసి
యల్లెతోఁ గూర్ప స - మర్థుండఁ గాను
లేవ నేనియు శక్తి - లేదు కన్నులకుఁ
గావిరి గప్పె నం - గము వడంకెడును
నదరు గుండియ వీని - యాఁగాము లెల్లఁ
దుదిఁగనఁగసువులుఁ - దొలఁగ వీమేన
యేమి సేయుదుఁ బిల్వ - నేఁటికిఁ బల్కఁ
డేమందు ! యేమందు - లిడి మఱల్చును !
బ్రతుకునే యతఁడు దాఁ - పక తెల్పు మేల
కొదిగద వపుడునా - కొదువ దీర్చెదను " 9630

—: సుషేణుఁడు శ్రీరామునోదార్చి, సంజీవకరణినిం దెమ్మని హనుమంతున కాజ్ఞాపించుట :—

అనిపల్కిన సుషేణుఁ - డా రాముఁ జూచి
యనుకంప వొడమి యి - ట్లని విన్నవించె
" ఓయయ్య ! మీ కేల - యుపతాప మింత ?
మీయాన యితనికే - మి గొఱంతగాదు
గాజుపాఱదు మేను - కాళ్లుఁ జేతులును

రాజీవ శోభాభి - రామంబులయ్యె
మోమింత వైవర్ణ్య - మున నుండ దొడలి
రోమంబు లిపుడు ని - ట్రుపడ వేమియును
కన్నులు పుండరీ - క విలాసములను
చెన్నుమీఱినవి సం - జీవ నాడికలు 9640
కుదురుపాటున నెసఁ - గుచునున్న వితని
మొదలింటి ప్రకృతి సం - పూర్తి గల్గినది
కావున యితనికే - కడమయు లేదు
దేవ ! మీకేల చిం - తింప సీతనికి ?
నిపుడె తెల్పెద నిందు - కే నున్నవాఁడఁ
దపనుజుఁ డోర్వఁ డీ - దైన్యంబుఁ జూచి
యెల్ల వానరులు మీ - రిటులుండ చాలఁ
దల్లడిల్లెద రేడ్వఁ - దగదు మీకనుచు"
నూరక నిలుచున్న - యురుసత్త్వశాలి
మారుతాత్మజు హను - మంతు వీక్షించి 9650
"అన్న ! సౌమిత్రి మూ - ర్ఛాయత్తుఁ డయ్యె
నిన్ను గాదనుచు నుం - డిన దిక్కు గలదె ?
అపరాహ్ణమయ్యె న - య్యోషధిశైల
మిపుడె శోధించి నేఁ - డీ ముహూర్తమున
మఱలి రావలయు నే - మఱక సంజీవ
కరణి మున్నగు దివ్య - కల్పితౌషధులు
నాలుగుఁ దెమ్మను - నాలుక మాట
నాలుక మీఁద నుం - డగ వాయుసుతుఁడు
జాంబవంతుఁడు దెల్పు - జాడఁ దా నెఱిఁగి
యంబరంబున నేఁగి - యాత్మ వేగమున 9660

తలఁచిన యంత మా - త్రన వృషభాద్రిఁ
జులకఁగా నిలిచి యా - క్షోణీ ధరమున
దక్షిణ శిఖర కాం - తారంబు లెల్ల
వీక్షించి కానక - వెదక లేననుచు
నాకొండతల నాఁటి - యట్ల పెకల్చి
కైకొని లక్ష్మణా - గ్రస్థలి డింప

—. హనుమంతుఁడు తెచ్చిన యౌషధముచే. సుషేణుఁడు లక్ష్మణునిఁ దప్పితెల్లఁ జేయుట :—

తెచ్చి సుషేణుఁడా - దివ్యౌషధంబు
పచ్చని పసరిలం - బడియున్న యట్టి
సౌమిత్రి నాస న - స్యము సేయ నతఁడు
రాముని యెదుర ని - ద్రఁ దొరంగి నట్లు 9670
దిగ్గన లేచిన - దీనత మాని
డగ్గరి యురము నిం - డఁగఁ గౌఁగలించి
తామప్పుడు జనించు - తలఁపులో నలరి
సౌమిత్రితో రాము - చంద్రుఁ డిట్లనియె.

—: లక్ష్మణునిఁజూచి శ్రీరాముఁడానందము నొందుట :—

" బ్రతికితి విపుడేను - బ్రతికితి మనల
బ్రతుకఁ జేసినవాఁడు - బ్రతికె రండఱును.
ఇపుడు లక్ష్మణుఁ గల్గె - యినవంశ మెల్ల
కపుల పాలింతయుఁ - గడ తేఱె నేఁడు
జనకజ పుణ్యావా - సన నుతికెక్కె-
తనకుఁ గ్రమ్మఱ నయో - ధ్యకుఁ జేరఁగలిగెఁ 9680

గాకున్న నల జన - కజ యేల యెవ్వ
రేకడఁ బోయిన - నేమి నా కేల
రావణాసురునితో - రణమేల యందు
నీవుండ నచ్చోట - నేనున్కి నిజము
యేనిన్నుఁ గనుఁగొంటి - యెంతపుణ్యుఁడనో
మానని యాపదల్ - మానె నా కిపుడు
సౌమిత్రి ! నేఁడెంత - సంతోషమయ్యె !
నామానసంబు వ - ర్ణనకెక్క నిపుడు
ననువంటి యన్న లే - నరులకుఁ గలరు
నినుఁబోలు ననుజన్ము - ని గణింపలేరు 9690
నాభాగ్య మీడేఱె - నాతపంబెల్ల
శోభన ఫలదమై - చూపట్టె నిపుడు"
అనుమాట లాలించి - యడుగుల వ్రాలి
జనకజాప్రియుఁ జూచి - సౌమిత్రి పలికె.
"ఏమెంత నామాట - లెంత సన్నింత
స్వామి ! యల్పుఁడు వల్క - జాడ నాడుదురె ?
అచ్చట మును దండ - కారణ్య మునుల
కిచ్చిన యభయంబు - నీభాను సుతుఁడు
మున్నైన వానర - ముఖ్యులతోడ
నన్న ప్రతిజ్ఞలు - నావిభీషణుఁడు 9700
నమ్మి మీశరణన్న - నాఁడు మీరిచ్చు
నమ్మికలును మీమ - నంబులో మన్చి
యిటు లాన తిత్తురే - యీదశకంఠు
నెటు బోయినను బోవ - నీయక పట్టి
వాని సంగరములో - వధియింతు ననిన

పూనిక యేమయ్యె – పోసఁగ దిట్లాడ
రావణుఁ దునిమి ధ – రాపుత్రిఁ గూడి
యీ విభీషణునకు – నిచ్చి యాలంక
సకల వానరులతో – సాకేతమునకు
నకలంకమతిఁ జేరు – నది యొప్పఁగాక 9710
ననువంటి వారి కెం – దటి కిట్టులైన
మనసులోఁ దలఁతురే – మనువంశతిలక ?
ఇనుఁ డస్త శిఖరికి – నేఁగకమును పె
దనుజేంద్రు ననిలోనఁ – దలఁద్రెవ్వ నేసి
జయలక్ష్మితోఁ గూడ – జానకిఁ గూడి
నయనంబులకు నింపొ – నర్పుఁ డెల్లరకుఁ
దడవు సేయకుఁడని – తడవ రావణుఁడు

—: రావణుఁడు శ్రీరామునిపైకి యుద్ధమునకు వచ్చుట :—

వెడవెడ నార్చుచుఁ – బిడుగుల వంటి
యమ్ము లేరిచి పట్టి – యలయక దీరి
ముమ్మరంబగు రోష – మునఁ దేరు నోలి 9720
కవచ తూణీరాది – కముల నూత్నముగ
సవరించి రామునిఁ – జంపుట యొకటి
చచ్చుటొక్కటి గాక – సారెకు లంక
చొచ్చునే తనవంటి – శూరుం డటంచు
నందఱిఁ బోకార్చి – నందఱి యాస
నుందు ప్రాణము దాఁచి – యొక్కెడ ననుచుఁ
డెగువఁ దలంచి దై – తేయ నాయకుఁడు

మగుడ రాఘవుఁ జేరి - మార్గణంబులను
ముంచినచో నట - మున్నె రాఘవుఁడు

—: శ్రీరాముఁడు యుద్ధసన్నద్ధుఁడుకాఁగా, ఇంద్రుఁడు మాతలితో తనదివ్య రథమును బంపుట :—

కాంచితి మరల నీ - కల్మషాత్మకుని 9730
పోనియ్య నింక నా - భుజశౌర్య మెల్ల
వీనిపైఁ గనుపించి - విబుధుల కైన
యాపదల్ దీరుతు - నని నిశ్చయించి
చాప మారోపించు - సమయంబునందు
మేరుశైలము చుట్టు - మిహిరుని రథము
ధారుణికీని రాఁగ - తం బేమి యనుచుఁ
గవులెల్ల వెఱఁగంద - కాంచన కేతు
నిపుణంబు మణికింకి - ణీ సమన్వితము
కల్పక మాలికా - కలిత మనల్ప
శిల్పి చమత్కార - చిత్ర చక్రంబు 9740
కమలరాగరుచి ప్ర - కాండ దోర్దండ
సముదగ్ర మాతలి - సారథికంబు
సప్త సహస్రార - సంహితామూల్య
మౌక్తిక ఝల్లరీ - మందార జనిత
పట్టాంశు కోజ్జ్వలో - పరిభాగకనక
పట్టికా కలితమ - భ్రంలిహకలశ
ఖచిత మాణిక్య ని - కాశ దినేశ
మచిర నిబద్ధ ప - యోధి సంభూత

దూరిత శ్రమనాశ – తురగసహస్ర
ధారాహితాభావ – తరణంబునైన 9750
సౌవర్ణగిరినిభ – స్యందనం బపుడు
దేవేంద్రుఁ డనుప ధా – త్రివసించునంత
మాతలి "రఘువీర! – మాస్వామి యింద్రుఁ
డీతేరిపై మిమ్ము – నెక్కింపు మనియె
నిది విల్లు తూణీర – మిది యివి దూపు
లిది గద యిది శక్తి – యిది కవచంబు
నివి యస్త్రములు హేతి – యిది యజేయంబు
లివియెల్ల సారథి – నేను నాపేరు
మాతలి రావణు – మర్దించి మఱల
సీతఁ జేకొను మని – చెప్పె మాస్వామి 9760
పనిఁ గొందు మీ" రనఁ – బరమ హర్షమున
నినుఁ డుదయాచలం – బెక్కిన కరణి
నారథంబు మనోర – థానురూపమున
శ్రీరఘుపతి ప్రద – క్షిణముగా వచ్చి
యారోహణముచేసి – హరుఁడు పురంబు
లేరుచునపుడున్న – యేపు చూపుచును

—: రామ రావణ మహాసంగ్రామము
రావణుఁడు మహాశౌర్యమున విజృంభించుట :—

వివిధాస్త్రములు దైత్య – విభునిపై ప్రేయ
నవి ద్రుంప నతఁడు న – య్యస్త్రంబు లేసి
గాంధర్వ రాక్షస – గారుడాస్త్రములు
సంధించి యిరువురు – జగడించు నపుడు 9770

దానవ విభుఁడు మా - తలి మేను నొవ్వఁ
గా నేసి హరుల మా - ర్గణముల ముంచి
యింద్ర ధ్వజంబు మ - హీస్థలి నర్ధ
చంద్ర బాణంబుచేఁ - జక్కాడి త్రోచి
రాముని దివ్యనా - రాచకోటులను
చేమొదల్పక యుండఁ - జేసి నిల్పుటయు
నూరకే వేసరి - యున్నట్టులున్న
శ్రీరాముఁ దేరి చూ - చి కపీంద్రులెల్ల
రామచంద్రుఁ నెదిర్చి - రాహువు రీతి
నీమేర దనుజేంద్రుఁ - డేచి పట్టెడును 9780
యిలకెల్ల దాను కీ - డెంచి బుధుండు
పెలుచ రోహిణిఁ బట్టి - పీడింపఁ దొడఁగె
పొగలతో సెగలతో - భుగభుగ పొంగి
నిగిడి మిన్నెల్ల ము - న్ని రాక్రమించె
తనదీప్తిఁ దఱిగి య - ద్దపు బిల్లరీతి
నినుఁడు దోఁచెను మింటి - కెగసె మొండెములు
తల లంతరిక్ష ప - థమ్మున నిల్చి
పెళపెళ నార్చుచు - పెడ బొబ్బలిడియె!
దుమ్ము చాయలఁ దోఁచె - ధూమ కేతువులు
చిమ్మ చీకటులు ముం - చె దిశాముఖముల 9790
నావేళ కోసలేం - ద్రాన్వయ తార
యావిశాఖ పురంద - రానలాత్మకము
నరికట్టుకొని యుండె - నంగారకుండు
ధరణి యంతయును గొం - దల మందె నపుడు.
ఇదివేళ తనకని - యెంచి మైవెంచి

పదితలల్ చేతులి - ర్వదిదాను దాల్ప
మధ్యందినోదగ్ర - మార్తాండ బింబ
బుధ్యు పలక్షిత - భూరికిరీట
దశకంబుతోడ మ - స్తకములు పదియు
దశదిగంతముల నా - తపదీప్తి వెనుప 9800
యిరువది చేతుల - హేతిత్రిశూల
శరచాపముసలాస్త్ర - శస్త్రముల్ మెఱయ
నవరత్నమయసము - న్నత శిఖరముల
నవముగా నిలుచు మై - నాకుం బోయనంగం
బదివిండ్లు నెక్కిడి - పది కరంబులను
ప్రదరముల్ దొడిగి దె - ప్పరముగాం గురిసె
"చిక్కె నాచేత ని - శ్చేష్టితుండయ్యె
దక్కె జానకి గెల్తు - దశరథాత్మజుని"
అని బెడిదమునం బ్ర - త్యాలీఢ చరణ
వనరుహుండగుచు రా - వణుండు మించుటయు 9810

—: శ్రీరాముండు రావణు నెదుర్కొనుట -
రావణుండు వైచిన శూలము ఖండించుట :—

విన్న బాటున నుండి - విశిఖముల్ నాంట
క్రొన్నెత్తురులు మేనం - గురియ వేలుపులు
గరుడ గంధర్వులు - ఖచరులుందన్నుం
బరికించి యింక నెచ్చోం - బని లేదనంగ
వెఱచిన తనవారి - విజయంబుం గోరి
తఱి వేచి నొప్పించు - దశకంఠుం జూచి
ధురిగి యవేలధై - ర్యసహాయుం డగుచు

సెలలఁ గట్టెఱ్ఱగన్ను - శ్రీరామ విభుఁడు
కోదండ దండంబు - గుడుసు వడంగఁ
దాదండ వట్టి మా - తలి నెచ్చరించి 9820
గన్నెరాకమ్ములా - కర్ణాంతములుగఁ
గొన్ని ప్రయోగించు - కోప వేగమున
నదరె ధరిత్రి య - ల్లలనాడె గిరులు
చెదరె నక్షత్రముల్ - సింధువుఁగలఁగె
భూతకోటి వడంకెఁ - బురుహూత ముఖుల
చేతోవికాసముల్ - చేరెఁ గ్రమ్మఱను
"గెలువు రాఘవ!" యంచుఁ - గీర్తింప సురలు
"గెలుము రావణ" యంచుఁ - గేర రాక్షసులు
నాసద్దులు నభంబు - నవనియు నిండ
రోసముల్ మిగుల వా - రును బోరుచుండ 9830
రాత్రించరేంద్రుఁ డా - గ్రహముతో మొనలు
గోత్రకూటములతోఁ - గొండాటమాడఁ
గట్టిన ఘంటల - ఘణఘణ త్కార
మట్టహాసమును బ్ర - హ్మాండంబుఁ బొగువఁ
గేలశూల మమర్చి - కినిసి వ్రేయుటయుఁ
కీలి కీలాసము - తీక్ష్ణమై నిగుడి
వచ్చు నప్పుడు రఘు - వర్యుండు మీఁద
చిచ్చఱమ్ములు గురి - సిన గ్రుంగి కొనుచు
మించిన తనతేరి - మీఁదట నింద్రుఁ
డుంచిన శక్తి య - త్యుత్సాహ శక్తిఁ 9840
దీసి ప్రయోగింప - దినకర కిరణ
భాసమాన మహా ప్ర - భావంబుతోడ

వచ్చి యాలోనె రా - వణుని శూలంబు
నచ్చెరువుగఁ ద్రుంచి - యవనిఁ ద్రెళ్లించె
దశరథాత్మజుఁడు మా - తలి చూచి మెచ్చ
నశని కల్పములైన - యమ్ములుఁ దొడిగి
హరులను నొప్పించి - యతని పేదురము
పరియలు చేసి ము - ప్పది శరంబులను
డిగ్గ ముల్కులు నుది - టికి మూఁడు గాఁగ
నగ్గలిక చెలంగ - వదలించి వ్రేయ 9850
ర క్త ధారలఁ దోఁగి - రవణంబు మాసి
న_క్తంచ రేంద్రుఁ డా - నన వివర్ణతను
మిగుల నాగ్రహముతో - మించి శ్రీరాము
మొగముపైఁ గొన్ని య - మ్ముల నాఁట నేసి
పేరెద చాల నొ - ప్పించిన సమర
ధీరులై వారలె - దిర్చి పోరుచును
శరతిమిరంబుతో - సమరోద్వేఁ దమ్ము
నొరులకుఁ గనుపింప - కురుశ_క్తులమరఁ
జలమునఁ గోపంబు - శౌర్యంబు బలము
తులదూఁగ నెచ్చు గొం - దులు గానఁబడక 9860
సమరంబు సేయు రా - ఘునాథుఁ జూచి
కమలా_ప్తకులుఁడు రా - ఘవుఁ డిట్లు పలికె.

—: రావణుఁడు చూపిన శౌర్యపరాక్రమములను శ్రీరాముఁడు మెచ్చుకొనుట :—

" రావణ ! నీపరా - క్రమము జేయంబు
దేవతావళి నిన్ను - దృష్టింప లేరు

నీవంటివాఁ డతి - నీచ కర్మములు
గావించు ఫలమెల్లఁ - గనుపింతు నిపుడు
నాఁడె యేర్పడదె జా - నకిఁ బట్టితెచ్చు
నాఁడు మేమెఱుఁగకుం - డఁగఁ దప్పెగాక
యిది యొక్క పౌరుష - మే నీదుశక్తి
సుదతులయెడ గాక - చూపరాదిచట 9870
సీతను బ్రుచ్చిలిం - చిన నాఁడె తీఱె
ధాత యిచ్చిన వర - దర్పంబు నీకు
పుణ్యంబు లన్నియుఁ - బోలివోయె నరవ
రేణ్యుల గోరు కో - రికెలు చేకూడె
పాపానుభవకాల - పక్వంబునందుఁ
జూపట్టితివి యింకఁ - జోరనీను లంక
తలలు ఖండించి ర - క్త ప్రవాహముల
బలియిత్తు భూతాది - పలలాశనులకు
గరుడుండు పాములఁ - గమిచిన యట్లు
కఱచిన ప్రేవులు - కాకఘూకములు 9880
విదరింపఁ జేయుదు - విదరించి నీదు
మెదడుచే దనియింతు - మృగ ధూర్తములను"
అని యుల్లైశో నమో - ఘాస్త్రముల్ గూర్చి
తనువెల్ల నతిశోణి - తప్రవాహములు
నుప్పతిల్లఁగ ధాతు - యుక్తాద్రిమాడ్కి
నప్పుడు నిలుచు ద - శాస్యుని యందు
బలశౌర్య ధైర్య ద - ర్పంబు లన్నియును
బోలివోయె విండ్లు మో - పునకు చేటయ్యె

నొక్కయస్త్రంబు ప్ర - యోగింప నైన
యిక్కువ మదిలో నొ - కింత లేదయ్యె 9890
రాముని ధైర్య శౌ - ర్య జ్ఞానశక్తు
లామొదటికి ద్విగు - ణాతీత మగుచుఁ
బొదిలోని దివ్యాస్త్ర - ములు తముదామె
మెదలుచు నొండొండ - మించి రాఁదొడఁగె
యుక్త మంత్ర ప్రయో - గోప సంహార
శక్తులన్నియును సా - క్షాత్కారమందె
రాముని తేజంబు - రావణాసురుఁడు

—: రాముని తేజమువలన నొకింత మైమఱచిన రావణుని రథమును సూతుండు మఱల్చుట-రావణుఁడు సూతు నదలించుట :—

చేమఱచుటయు నీ - క్షించి సూతుండు
నరదంబు మఱలించి - యగచరులెల్లఁ
దరిమి రాలను రువ్వ - దశరథాత్మజుని
యమ్ములు వెన్నుపై - నాడంగ యొక్క
యమ్ము నేర్పుటయు - దైత్యేంద్రుఁడాలోన
తెలివిడి గని సార - థి మొగంబుఁ జూచి
యలుక జనింప న - హంకృతి పలికె.
“ యీ యవివేక మి - ట్టేల చేసితివి
దాయల ముందఱఁ - దలవంపులయ్యె
మెఱుఁగవు నీవునా - హృదయ వర్తనము
మఱలింపుదురె తేరు - మనవంటి వార

లకట! నాశక్తి ధై - ర్యము ప్రతాపములు
తెకతెర చెఱిచి యీ - తీఱు చేసితివి 9910
నీవును బగవారి - నే కూడినావు
రావణుఁ డపకీర్తి - రాఁ దాళఁ గలఁడె?
లంచ మిచ్చెనో నీకు - లక్ష్మణాగ్రజుఁడు
కొంచుఁ బొమ్మని తేరు - కొదవ సేయుటకు!
నమ్మిన ద్రోహంబు - నకు నోడి కట్టి
క్రమ్మఱింతురె తేరు - కలనిలో విడిచి
అరదంబు మఱలించు - మని యాగ్రహించు
సురవైరి వదనముల్ - చూచి వాఁడనియె.

—: సూతుని ప్రత్యుత్తరము :—

" అజ్ఞుండ గాను ద్రో - హము సేయ లేదు
ప్రజ్ఞ యేమఱను నీ - పగవాని చేతఁ 9920
బరిధాన మేమియుఁ - బట్ట నన్యులకు
వెఱచి రాలేదు నిన్ - విడిచి పోలేదు
ఆడనేమిటికి ప - న్నసదుగాఁ దలఁచి
చూడు మేమరుదు నె - సూతకృత్యంబు
పగవాని బలమాత్మ - బలముఁ గాలంబుఁ
దగఁజూచి నిమ్నోన్న - తస్థలంబులను
జతనంబుతోడ య - శ్వంబుల బలిమి
మతియించి రథికు నే - మఱకతోఁ గాచి
రథము దోలుటయె సా - రథులకు నీతి
రథమిట్లు మఱలింతు - రా యనసేల? 9930

అలసె గుఱ్ఱములెల్ల - నలమట నొందఁ
దెలివిడి చాలక - దిటఁ దప్పి నీవు
గాయంబులను చేత - కార్ముకంబెత్తి
సాయకంబుల వ్రేయ - శక్తి లేకుండ
కనుఁగొని రథమేను - కడకుఁ దెచ్చితిని
దనుజనాయక ! దీన - తప్పేమి తనకు ?
హితుఁడ నింతియకాని - యితరుఁడగాను
ధృతిఘూను మఱల పైఁ - దేరుఁ ద్రిప్పెదను
జోపానమయ్యె తే - జులు నీవు పోర
నోపిక నిజముగా - నుండినఁ జాలు 9940
మఱలింతునే ?" యన్న - మదిలోన మెచ్చి

—: సూతుని మాటలకు రావణుఁడు మెచ్చి రాముని పైకి యుద్ధమునకు సన్నద్ధుఁడగుట :—

కరుణించి తనచేతి - కడియం బొసంగి
సారథి నూరార్చి - చక్కఁగా నిపుడు
తేరు వోనిమ్ము వ - ధింతు రాఘవుని
లంకకే నేఁటికి - లజ్జ పోవిడిచి
యింకఁ బోవుదుఁ బగ - యీడేర్చి కాక
రామునితో నేఁడు - రణ మాచరించి
నామీఁద నేదైన - నదిమేలు దనకు
మఱల నూరకయున్న - మాటకు సూతుఁ
డరదంబు రాము చా - యఁకఁ దోలునంత 9950
“వచ్చెను వాఁడె రా - వణుఁ డతఁడేమి
యిచ్చఁ దలంచెనో - యెఱుఁగ మెవ్వరము

విఱిగి పోయినవాఁడు - వీఁడింతలోనె
తిరిగెఁ గావున చాల - తెంపుగావించు
నెందుకు మనమెల్ల - యిప్పుడే పోయి
యందఱు రాము స - మక్షంబునందు
వానితో నెదుర న - వ్వాల దైవయత్న
మైనట్టు లయ్యెడు" - నని కపులెల్ల
నాలోచనలు సేయు - నంతలో సప్త
సాలభేదనునిపై - శరపరంపరలు 9960
ముంచిన వాఁడి య - మ్ములచేత రాముఁ

—: శ్రీరామ రావణులు సరిసమానముగా యుద్ధముచేయుట.
శ్రీరాముఁడలసి రావణుని వధించు నుపాయమును
చింతించుట :—

డంచల నవియొక - టైన రానీక
వారించి కరలాఘ - వము నెరయించి
పోరుచోఁ గపులు గుం - పులుగట్టి నిల్చి
కనుచుండి రింతియె - కాని యొక్కరుఁడు
ననికిఁ దోడై నిల్చు - నతఁడు లేఁడయ్యె.
రామాస్త్రములకును - రావణుఁ డోకఁడె
రాముండు రావణా - స్త్రములకుఁ గాని
తలచూపలేరు బృం - దారకులైన
నిలిచి యూనదుము గుం - డెల గూడువట్టె
సరిగాఁగ వారేయు - శస్త్రాస్త్రములను
శరపంజరంబయ్యె - జలజజాండంబు
దూరఁ గూడదు మారు - తుని కనుటెంత

యూరువు వుచ్చలే - కొకరైన నచట
రామరావణ సమ - రమునకు నీడు
రామరావణసమ - రంబింతె కాని
యెట్లుండె ననిపల్క - నెట్టివాఁడైన
నెట్లు నేరుచు చూడ - నెవ్వరి తరము
పెట్టిన దండలు - పిరిఁదికి వీక
పట్టిన చాపముల్ - పట్టినట్లుండ 9980
తొడిగిన యమ్ములు - తొడిగినట్లమర
వెడలు దివ్యాస్త్రముల్ - వెన్నెలఁ బొదువ
నితరేతరము చెప్ప - లిడక క్రోధములు
నతిశయరోష తా - మ్రాక్షులై నిలిచి
దినకరతేజులై - ధృతిపూని యొక్క
దినమెల్ల రామరా - త్రించరాధిపులు
సరివోరి యిరువురు - సరిగాఁగ నలసి
దురము సాలించి స - త్తువలెల్లఁ దఱిగి
వదనమండలములు - వసివాడ శ్రమముఁ
గదురంగ దొగదొట్టి - కన్నుమోడ్పుటయు 9990
సారథి రావణ - స్యందనంబొక్క
యోరగాఁ దిగిచి తా - నురకున్న యపుడు
ఏరీతిఁ దునుముదు - నీదానవేంద్రు ?
నూరట గతినైతి - నోరంతప్రొద్దు
నేమి సేయుదునని - యిచ్చఁ జింతించి
రామచంద్రుఁడు విచా - రము సేయునంత
తనయాత్మలోన నిం - తయు నాయగస్త్య
మునినాథుఁ డెఱిఁగి తా - మునిచెంత నిలిచి

—: అగస్త్యుఁడు శ్రీరామచంద్రునికి ఆదిత్య హృదయము నుపదేశించుట :—

" ఏల చింతిల్లెద – వీదానవేంద్రు
నాలంబులోఁ గూల్చు – టది యెంత నీకు ? 10000
అతి రహస్యము కామి – తార్థప్రదంబు
హితమునౌ నొక మంత్ర – మిచ్చెద నీకు !
ఆదిత్యహృదయ మే – నది సమర్థముగ
నాదేశ మొనరింతు – నమ్మహామునువు
శ్రీకర మిష్టార్థ – సిద్ధి దముహిత
భీకర మూవహా – పేతజయంబు
సకలకల్యాణ మా – శ్రయణీయ సౌఖ్య
మకలంక మలఘు దీ – ర్ఘాయుప్రదంబు
సత్యంబు దుఃఖనా – శనము గోబ్రహ్మ
హత్యాది ఘోరమ – హాపాపహరము 10010
సతతరోగప్రణా – శనము లోకైక
హితము సౌభాగ్యస – మృద్ధి కారణము
నగుచుండు గావున – నాదిత్యుఁడుదయ
మగువేళ సేవింపు – మర్చ్యాదివిధుల
నాయనఁ బూజింతు – రమరులు లోక
నాయకుఁ డతఁడ య – నంత తేజుండు
నాదిత్యులందఱు – నవయవంబులుగ
నా దేవుఁ డాత్మక – రావళిచేత
భువనంబు లెప్పుడుఁ – బోషించు పద్మ
భవుఁడు బద్మాక్షుండు – భవుఁడు నింద్రుండు 10020

వరుణుండు ధాతల - వసువులు వహ్ని
కరువలి యముఁడు య - క్షప్రవరుండు
నాశ్వినేయులు చంద్రుఁ - డమ్మరుత్తులును
విశ్వదేవతలు సా - విత్రిగాయత్రి
ఋతువులు మనువులు - ఋషులు సాధ్యులును
పితృదేవతలు క్రౌంచ - భేది సిద్ధులును
ప్రాణంబులతని రా - పంబని మొదట
త్రాణగాఁ బలికి మం - త్రముఁ దేలపఱచె.
" ఆదిత్యునకు సహ - స్రాంశున కఖిల
వేదమూర్తికిని స - వితున కర్కునకు 10030
సూర్యదేవునకుఁ బూ - షునకు శంభునకు
నర్యమునకు త్వష్ట - కంశుమంతునకు
భాస్కరునకును త - పనునకు రవిక
హాస్కరునకుఁ దిమి - రాపహంతునకు
భానుమూర్తికిని గ - భస్తిమంతునకు
దానవారికి సర్వ - తాపనునకును
నదితిపుత్రునకును - నగ్నిగర్భునకు
త్రిదశార్చితునకు మ - రీచిమంతునకుఁ
బింగళునకు నాత - పికి మండలికి ప్ల
వంగమునకును స - ర్వభవోద్భవునకు 10040
శిశిరనాశునకు దృ - ష్టికి నపాంపతికి
శిశిరున కుదయాస్త - శిఖరరూపునకు
దినకరునకును జ్యో - తిర్గణపతికి
దినపతికిని మహా - తేజోధిపతికి
కవి వికిర్పునకు న - క్షత్రాధిపతికి

రవికి రక్తునకు మా - ర్తాండమూర్తికిని
దినమణికిని గ్రహా - ధిపునకుఁ బద్మ
వనజ బంధునకు ది - వాముఖ్యునకును
హైమగర్భునకు ఋ - గ్యజుషపారగున
కామయారికి స - హస్రార్చికి సారి 10050
సప్తాశ్వునకు సర్వ - సాక్షి కీశునకు
సప్తసప్తికి వింధ్య - శైల కేసరికి
ద్వాదశాత్మునకు స - త్యంత తేజునకు
వేదాత్మునికి జయ - వీరనామునకు
జయభద్ర హరిదశ్వ - సారంగ పద్మ
శయనభోనాయక - శంఖనామునకు
నీశభావునకు బ్ర - హ్మేశున కచ్యు
తీశున కుగ్రున - కిద్ధ బోధునకు
భాస్వంతునకు సర్వ - భక్షున కలఘు
భాస్వరునకు రౌద్ర - పటువపుష్కునకు 10060
శత్రుఘ్నునకు - చామీకరాభ
గాత్రునకును మిహి - కానాశకునకు
దేవదేవునకు జ్యో - తిష్పతి కతిశి
ఖావంతునకు। విశ్వ - కర్మ నామునకుఁ
గ్రతు మూర్తికిని కృత - ఘ్నవినాశనునకు
ధృతమహారికిని మం - దేహ వైరికిని
మృత్యునకు హిరణ్య - కేతున కఖిల
కృత్య సాక్షికిని నీ - కిదె నమస్కృతులు ”

అను మంత్రమున సూర్యు - నర్థిఁ బ్రార్థింపు
మని యుపదేశించి - యయ్యగస్త్యుండు 10070
దినపతి సృష్టిస్థి - తిలయంబులకు
వెనక మహాభూత - విలయంబులకును
కర్తయై జాగరూ - కత నుండు భువన
భర్తయై యాత్మీయ - భానుమండలినిఁ
దపియింపఁ జేయుచుఁ - దానె వర్షించు
నెపుడు జగద్రక్ష - కినుఁడు బాల్పడియె
నగ్నులమను చతు - రాగమంబులకు
నగ్నిహోత్రాది క్రి - యా ఫలంబులకుఁ
గ్రతువుల కితర స - త్కర్మ కాండమున
కితఁడె నాయకుఁ - డితఁడే యిచ్చు ఫలము 10080
వనులందు గిరులందు - వాహినులందు
ననల బాధలయందు - నహితులయందు
రుజలందు వెతలందు - ముచ్చులయందు
భజియించి యీస్తోత్ర - పాఠంబొనర్చు
యినునిఁ దలంచిన - నెల్లయాపదలుఁ
జెనక నేరవు వానిఁ - జేరు సౌఖ్యములు
జపియించు మీమంత్ర - జపము మువ్మాఱు
తపనుఁ డిప్పుడె సన్ని - ధాన మందెడును
క్షణములో రావణుఁ - జంపెద వతఁడు
తృణమాత్రుఁ డనుచు నా - దేశ మొసంగి 10090
యాశీర్వదించి తా - నపుడగస్త్యుండు
దాశరథులకు నం - తర్ధాన మందె.

—: శ్రీరాముఁ డగస్త్యుని యాదేశానుసారముగ నాదిత్య మంత్రము జపించుట - సూర్యుండు ప్రత్యక్షమై జయమగునని యాశీర్వదించుట :—

అతని హితాదేశ - మాత్మలో నునిచి
హతశోకుఁడగుచు శు - ద్ధాచమనంబుఁ
జేసి చింతదొలంగి - శ్రీరాముఁడచట
నాసీనుఁడై భాస్క - రాభిముఖముగ
మంత్ర జపంబు ము - మ్మాఱు మునీంద్రు
తంత్రంబు చేత నెం - తయును జపించి
సమరంబు సేయు ను - త్సాహంబు చేతఁ
దమకించి జత్తాయ - తముగ నున్నంత 10100
నారవియు బ్రసన్నుఁ - డై " రఘువీర!
యీరావణుని గెల్వు - మిపుడ " ని పలుక
తళతళ మెఱచు ను - త్తాల ధ్వజంబు
గెలుపు మీవనుచు సం - కించి సారథియు
నీల రోచుల కసి - నికల తేజీలు
నేల ప్రక్కలుగ నా - నికె వచ్చు రథము
నెలవంకగతి సింజి - ని సెలంగు విల్లు
నలఁతి కెన్నెలఁగాయు - నెఱగు టమ్ములను
దివటీల గతి సార - దికి వెలుంగుచును
నవరత్నమయములై - న కిరీటములును 10110
గలవాని యల్లంతఁ - గని రఘూద్వహుఁడు
తలయూఁచి చూచిమా - తలికి నిట్లనియె.

—: శ్రీరాముఁ డుత్సాహముతో రావణు నెదుర్కొనుట :—

" కంటికి డావంక - గా వచ్చె నమర
కంటకుఁ డిపుడె భ్రమ - గ్గఁగ నున్నవాఁడు
కరువలి నీలమే - ఘము బోలి వీని
దురములోపల వధిం - తు నిమేషమునను
కడపుమీా వేళ నా - ఖండల రథము
తడయక త్మ మనోర - థంబు వెంబడిని
నెచ్చరించితి గాని - యేనికు నేర్ప
వచ్చితినని యెంచ - వలదు భావమున " 10120
అనుటయు మాతలి - యాఁగాక యనుచు
ననిమిషేశ్వర దత్త - మైన రథంబు
వాని తేరును తాను - వలపలఁ గాఁగ
రావించుటయుఁ జూచి - రావణాసురుఁడు

—: రామ రావణుల యుద్ధము- దేవదానవులు జయాపజయము
లను గూర్చి యాతురతతో నుండుట - రావణున కశుభ
శకునములు గానఁబడుట - వానిని లక్ష్యపెట్ట కాతఁడు
యుద్ధము సాగించుట :—

అమ్ముల ముంచిన - నవి నివారింప
నమ్మేర మఱియు ద - శాననుండలిగి
కొన్ని తూపుల నేయ - ఘోర సంగ్రామ
సన్నాహములు వారు - సరివోరునపుడు
గెలుపోటములు గోరి - కీర్తనల్ చేసి
చులకఁగ నాడుచుఁ - జూచి యిర్వురను 10130

గరుడ విద్యాధర - గంధర్వ యక్ష
సురచారణాదు లె - చ్చో గాచి యుండ
శకునంబులను కాని - శకునముల్ రాము
నకు రావణునకు నై - న ముదంబులొంది
కనుచుండ నప్పుడు - కంకగృధ్రములు
దనుజ నాయకుని ర - థంబుపై తిరిగె
నఱచుచు గోరవంక - లతనిపైఁ బడియెఁ
గరువలి దుమ్మెత్తి - కన్నుల రాల్చె
చినిఁగె టెక్కెయుపుపై - చీర గావిరులుఁ
గనుపించె కన్నులఁ - గారె నశ్రువులు 10140
హాయలోచనంబుల - నడరె నంగార
చయము జేవురు మించె - సంజకెంజాయ.
అందుచే లంక చి - చ్చందు కొన్నట్లు
చెందొవచాయ దోఁ - చె నహంబు నందె
నవి సడ్డసేయక - యసురారి విభుఁడు
రవికులోత్తముని న - స్త్రంబులఁ బొదువ
తనమేలు శకునముల్ - దశకంఠుఁ దునుము
మని యెచ్చరింపఁ గ - య్యము సేయునపుడు
రావణుఁ శ్రీరాము - రథకేతనంబు
చేవాఁడి మెఱయ నే - సియు నాఁటకున్న 10150
రాముఁడా రావణు - రథకేతనంబు
భూమిపై నొక్కటూ - పున ద్రెళ్లనేసె
దివ్యాస్త్రములను దై - తేయ నాయకుఁడు
దివ్యవాహములపై - దృఢశక్తి నేయ
తమ్మితూఁడుల మీఁద - దాఁకిన యట్లు

నెమ్మది శ్రీరాము - ని హయంబులమరె.
అదిచూచి కోపించి - యసురనాయకుఁడు
గదలును శక్తులు - గండగొడ్డండ్లు
శూలముల్ కత్తులు - సురియలు చెట్లు
రాలును గిరులు ని - ర్వది కరంబులను 10160
రివ్వురివ్వున కపి - శ్రేణిపై నలిగి
రువ్వ రాముని శిత - రోష వర్షముల
ముంచి మిన్నెల్ల న - మ్ములుగాఁగ నురువ
డించిన తాచేవ - డించక నగుచు
శతవర్షముల ముంప - సరికట్టి మింట
గరిగట్టి సాయకా - కారమై నిలిచి
పోరాడి యవియన్ని - పొడిపొడి యగుచు
ధారుణిరాలి యం - తయు బయలైన
నొండొరు హయముల - నుగ్రతరచండ
కాండధారల నొవ్వఁ - గా నేయునపుడు 10170
తన కేతనము మహీ - స్థలి వ్రాలఁ జూచి
దనుజవల్లభుఁడు క్రో - ధము మట్టుమీఱ
కాలాహి జిహ్వాకా - కల్పనారాచ
జాలంబులను మొగ - చాటు పుట్టంగ
వ్రేయుచో దొరలను - వేడుకల్ పుట్ట
నాయిరువురి తేరు - లును సారథులు
నొకచోట చాయగా - నురక పోనిచ్చి
యొకవేళ నడ్డంబు - లుద్ధతిఁ ద్రోలి
వలయాకృతుల నొక్క - వైపునఁ దరమి
ములకలుగా నొక్క - మఱి నడిపించి 10180

మూలలకొక్క యి - మ్ములు గదలించి
నాలుగంచుల ధావ - నముల నిగుడ్చి
పోయిన వీధినె - బోక మఱల్చి
చేయిచూపిన జాడ - చెంగక యాని
యరదముల్ సూతక్రి - యాచమత్కృతులఁ
బరగించి రథికుల - పను లెచ్చరించి
తానును దాను ర - థంబులు రథము
పై నొగతోనొగ - పాళి పాళియును
తురగంబు తురగంబు - దొరయఁ జేరుచును
తిరుగ దూరముల నె - దిర్చి నిల్చుచును 10190
తమనేరుపులు చూప - దశకంధరుండు
బోమముడి వెంట వం - పుగ శరాసనము
రథమయ్యలాత చ - క్రప్రకారమునఁ
బృథుగతిఁ జుట్టి తాఁ - బిరబిరఁ ద్రోలి
యిది చక్ర మిదిరథ - మిదివాజి కేతు
విది పేఁడునో సూతుఁ - డితఁడు రావణుఁడు
నన వేఱుపడక ర - థావరణంబు
విను వీధి నిన బరి - వేషంబుగీతి
నమితపాతక పుంజ - మనఁగఁ బ్రబదక్షు
ణము వచ్చు కరణి షం - డలి విభ్రమమునఁ 10200
జుట్టు పావకశిఖల్ - చుట్టుకొన్నట్లు
మట్టు మీఱఁగ సిత - మార్గణశ్రేణి
యన్ని దిక్కులరాఁగ - నట్లమాతలియు
నున్నచోటనె వాజు - లుఱుకఁ దిరుగ
రథము నిలారచ - క్ర న్యాయముగను

—: రావణుఁడు పరాక్రమించుట చూచి శ్రీరాముఁడు లోక మంతయుఁ దల్లడిల్లునట్లొకబాణము నాతనిపైఁ బ్రయోగించుట- దేవతలు శ్రీరామునికి జయమగుఁగాక యని యాశీర్వదించుట :—

రథిక శేఖరుఁడైన - రఘుపతి మెచ్చఁ
దిరిగింప నతఁడేయు - దివ్యాస్త్రకోటి
నఱికి వ్రేయుచును దా - నవనాథుమీఁదఁ
గనుబొమల్ ముడిగొన - కల్పాంతరమున
కెనగాఁగ మండలీ - కృత చాపుఁడగుచు 10210
నెనిమిది తూపుల - నెనిమిది హరుల
గినిసి వ్రేసిన నవి - కేడించి పఱచి
యరదమీఁదుచ్చకపోవ - నలిగి రావణుఁడు
పరశుతోమరకుంత - పట్టిసప్రాస
ముసలగదాప్రాస - ముద్గరాదులను
దెసలు గప్పఁగ వ్రేయఁ - దెగవ్రేయుటయును
మఱికొన్ని తూపుల - మాతలి నేసి
హరులఁ గొన్నిటి నేసి - యస్త్రజాలముల
తనమీఁద ముంప సీ - తాప్రాణవిభుఁడు
కనఁగన వెలఁగు మా - ర్గణమొక్కటేర్చి 10220
అల్లెతో సంధించు - నాగ్రహంబునకు
హల్లోహలంబులై - యదరె లోకములు
జలధులన్నియు నొక్క - సంగతిఁ గలఁగె
కులశైలములు గల - గుండుగాఁ బడియె
అవని బిట్టురువడి - నల్లలనాడె
రవి మండలంబు ని - రస్తాభమయ్యె

లోకవాసులకును నా - లోచనల్ గలిగె
చీకాకుగాఁ గల - సెను దిఙ్ముఖములు
నా వేళ గంధర్వ - లఖిల సౌఖ్యములు
దేవతలును రాము - దృష్టింప వెఱచి 10230
జయమొందుఁగాక - విశ్వప్రపంచంబు
భయముఁ దీఱెడు గాక - బ్రాహ్మణావళికి
నిలువ నీడలు మాకు - నెలకొనుగాక
చలపాది దానవే - శ్వరుఁ డీల్గుగాక
సౌమిత్రియన్నకు - జయమబ్బుగాక
భూమిజ తానాత్మ - పురిఁ జేరుఁగాక"

—: రామ బాణము రావణుని మస్తకముల ఖండింపఁగానే
వెంటనే యవి మొలచుట - రాముఁడు వానిని ఖండించుచు
రావణునిఁ జంపు నుపాయ మాలోచించుట :—

అనునంత నయ్యమో - ఘాస్త్రంబు వచ్చి
దనుజనాయకుని మ - స్తకము ఖండించె.
కుండలకోటీర - కోమలప్రభల
వెండియు నొకతల - వీరరావణుని 10240
భుజముపై మొలవ న - బ్బురముతో రాముఁ
డజరులు మెచ్చఁగ - నదియును ద్రుంచె
పుట్టలో పన్నగం - బులరీతి మఱియుఁ
గొట్టుచో నుర్వుపైఁ - గూలుమస్తకము
కనిపించుటయె కాని - గళము మొండియును
గనుపించ దేమాయఁ - గలచెనో కాక!
ఔరర! ధాత మ - హావర శక్తి

శ్రీరాముఁ డీరీతి - శిరములు ద్రుంప
నొక్కచందమ్మున - నొకట మారంత
యక్కజంబుగ నుత్త - మాంగంబు మొలిచె! 10250
గొట్టిన తల కిరి - క్కునఁ దెగి తోనె
పుట్టె వ్రేయుటలేదు - బొంకనిపించె!
రావణుఁ డున్న ధై - ర్యము చూచి యాత్మ
భావించి "యెట్లు చం - పఁగవచ్చు వీని
తలఁ ద్రెంచియును చావుఁ - దప్పినవాని
గెలుచు టెట్లొకొ? నెట్టి - క్రియ జయింపుదును
క్రౌంచాటవిని దండ - కావనిఁ ద్రొల్లి
త్రుంచితి నాకబం - ధుని నవ్విరాధు
ఖరదూషణాది రా - క్షసుల మారీచుఁ
బోరిఁ గొంటి వారి నే - పునఁ జయించితిని 10260
జలధిఁ గెల్చితిని రా - క్షసులఁ బెక్కండ్రఁ
గలనఁ జంపితి నమో - ఘములు మదీయ
దివ్యాస్త్రములు వీని - దెసఁ బాటిరాక
యవ్యవసాయ కా - ర్యంబులై పోలి
వమ్మయ్యె నేరీతి - వధియింతుఁ గడమ
యమ్ములే వీని యా - యమ్ము నాఁటెడును
ఏమిటఁ గెలుతు నిం - కెయ్యది యస్త్ర
మేమి సేయుదు" నని - యుచ్చఁ జింతింప
"స్వామి! యేమిటి చింత - చాలింపు" మనుచు
రాముని కింద్రసా - రథి యిట్లు పలికె. 10270

—: మాతలి శ్రీరామునితో బ్రహ్మాస్త్రము ప్రయోగింపుమని చెప్పుట :—

" అమరులందఱుఁ గూడి - యోడుకొన్నట్టి
సమయ మేనెఱుఁగుదుఁ - జంపుము వీని
నేఁడె వీనికి నూఱు - నిండిన దినము
వీఁడెంత మాయాస్త్ర - విలసనంబులకు
నిప్పుడె బ్రహ్మాస్త్ర - మేయుము వీని
చప్పుడు గాకుండ - జంపెద వేని "
అననట్ల కాకని - యాదిత్యుఁ దనదు
మనసులోపలను ము - మ్మాఱుగాఁ దలఁచి
మ్రొక్కి యగస్త్యుండు - మును దనకిచ్చు
చక్కని యస్త్రరా - జంబొక కేల్చి 10280

—: బ్రహ్మాస్త్ర వర్ణనము :—

సకలలోకైక ర - క్షాధురీణంబు
నకలంక శతసహ - స్రాంశు సన్నిభము
పాకాసురారి సం - ప్రార్థిత సత్య
లోకేశదత్త శు - శ్లోకీకృతంబు
ఖగపురందరగరు - త్కలితోగ్రయుగప
దగణిత ఝంపాభ - యదఝ్ఘాంకృతంబు
కలధౌత ఖచితపుం - ఖము సురవైరి
తులితమాంకాశ బం - ధుప్రకాండంబు
తపనానలోద్దీప్తి - తనిశాతశల్య
మపరిమితంబు ప్ర - త్యస్త్రాసహంబు 10290

సగవసుధా భేద - సకళాధురీణ
మగణిత మహిత సై - న్యగ్రసనంబు
సతత భూతప్రేత - సంతోషఫలద
చతురంబు కల్పాంత - శమనోపమంబు
వానరసైన్య రా - వణబల వృద్ధి
హానికరంబు వ - జ్రాయుధోపమము
నైన బ్రహ్మాస్త్ర మం - త్రాధిరాజమునఁ
దానభిమంత్రించి - తద్దివ్యశరము
దశరథ తనయుఁడు - ద్ధతిఁ బ్రయోగింప

—: శ్రీరాముఁడు బ్రహ్మాస్త్రము ప్రయోగింపగనే బ్రహ్మాండ మంతయుఁ దల్లడిల్లుట - అది రావణుని వక్షముఁ బగులఁజేయ నతఁడు విగత జీవుఁడగుట :—

శశిభాస్కరులు తప్పి - జాడలఁ జనిరి 10300
భూతహాహాకార - ములు మిన్నుముట్టె
ధాతపంకజ పీఠిఁ - దాఁ చలియించె
నతలాదిలోకంబు - లన్నియు నతల
కుతలంబులయ్యె నా - క్రోశించె నభము
తిరిగె దిర్దిర ధరి - త్రి నగంబులెగరె
నొరిగె మేరువు జగ - దుత్పాతమయ్యె
వేదమంత్రోక్త మ - హీశిఖరాజంబు
భూదేవతలు ఋషి - పుంగవుల్ సురలు
జయజయ ధ్వనుల హ - స్తంబులు మొగిచి
భయనివారణ మంత్ర - పఠనముల్ సేయ 10310

నది రవి సంకాశ - మై యదివిజిత
భిదురమై యది సురా - భీప్సితంబగుచు
నది కాలకాలకూ - టాగ్రమైయది భ
యద మూర్తియగుచు మి - న్నంతయుఁ బొదివి
యైరావతోగ్రదం - తాగ్రకిణాంక
చారుకుంకుమపంక - చర్చితంబగుచు
నీల భూమీధర - నిభమైన దనుజ
పాలకుని విశాల - భద్రవక్షంబు
భగ్నునఁ బగుల పైఁ - బడి వీపువెడలి
నెగ్గున భూమిలో - నికి డిగబారి 10320
కొంతదూరము ధాత్రి - గోరాడి యెగసి
చెంతల దానవ - శేషంబుఁ బఱవ
నాఁక యెందును లేక - యారాముఁ జేరి
తోఁకచుక్కయుఁ బోలి - తూణంబుఁ జొచ్చి
కులిశంబు దారి పోఁ - కున వ్రయ్యలగుచు
నిలమీఁద వ్రాలు మ - హీధరంబనఁగ
నావిశిఖము ముట్ట - ప్రాణముల్ వోవ
రావణుఁ డవనిపై - వ్రాలినఁ జూచి

—: రావణుని మరణమునకు లోకము హర్షించుట - వానర సైన్యము నానందముఁ జెందుట :—

ధిమధిమ మొరసెను - దేవదుందుభులు
ఘుమఘుమ జలనిధి - ఘూర్ణిల్లి పొంగి 10330
సేదలు దీర్చె ద - క్షిణ గంధవహుఁడు
పైదట్టముగ నిండెఁ - బ్రసవవర్షములు

తఱచయ్యె సురవధూ - దండ లాస్యములు
భరతుండు మదిఁగాంచె - పరమ హర్షంబు
కీర్తించి రమరవా - గ్గేయకారకులు
వర్తించె జయజయ - ధ్వనులు మిన్నెల్ల
ధారుణి భారమం - తయు నోసరిల్లె
చేరెఁ గల్యాణముల్ - సృష్టికింతటికి
మునుల మానస రోగ - ములు శాంతినొందె
దినచంద్రులు వెలింగి - రిచ్ఛానుసరణి 10340
వింటి కూరట కల్గి - వెస నెక్కుడించి
నంటువాయని లక్ష్మ - ణ కుమారుఁ బిలిచి
యిచ్చినఁ బదముల - కెఱఁగి చేనంది
ముచ్చటల్ దీర రా - ముని చెంత నుండ.
జలజాప్తసుత విభీ - షణ వాలితనయ
నలనీల కుముదాంజ - నానందనాది
హితులు చెంతల నిల్చి - యెంతయుఁ బొగడి
యతనిచే మన్నన - లందిరి ప్రీతి
నాడినట్టి ప్రతిజ్ఞ - లన్నియుఁ దీర్చి
వేడుక మదిపూని - వృతుశ్రీనిఁ దునుము 10350
నాఁటి దేవేంద్రు నా - నంద మంతయును
నాఁటికి తనదు మ - నంబునఁ జెంది
తనవారి నడుమ బృం - దారకుల్ గొలువ
ననిమిషేంద్రుఁడు గొలు - వైయున్న యట్లు
పదునాలుగేండ్ల కా - పద లెల్లఁ దీఱి
ముదితాత్ముఁడై - రఘుముఖ్యుఁడున్నంత.
తేజోవిహీనుఁడై - దినరాజు వచ్చి

యీజగతినిఁబ్రాలు - నెన్నికఁ దోఁప
రామాభిమంత్రిత - బ్రహ్మాస్త్రరాజ
భీమనిర్ఘాత ని - ర్భిన్నవిశాల 10360
వక్షుఁడై పడిన రా - వణుఁ దేరి చూచి
యక్షీణ శోక వే - గాతురుం డగుచుఁ
జాల నేడ్చుచు విభీ - షణుఁ డిలమీఁదఁ
బ్రాలి మున్నటి తన - వైరంబు మఱచి
తాను తోఁబుట్టిన - తమ్ముఁడు గాన
యానరాని విషాద - మంది యిట్లనియె.

—: విభీషణుఁడు రావణుని మరణమునుగూర్చివిలపించుట :—

"తులలేని మృదుహంస - తూలికాతల్ప
ముఁలఁ బవళించు న - మోఘ గాత్రంబు
వ్రేయు గాలును - కీలుఁ బ్రేసినట్లుండ
యీాయవస్థలఁ బొంది - యిటు లుండవలసె 10370
తలకిరీటము మహీ - స్థలి డొల్ల కేశ
ములు నేలఁ బొరల దు - మ్ము మొగంబుఁ గప్ప
అన్న! నీవిటులుండు - టయ్యోనే మొదట
నన్నమాటలు విన - వైతి వేమియును
కామాతురుండవు - గాన బ్రహస్తుఁ
డామీఁద కుంభ - కర్ణాదులు కులముఁ
జెఱపఁ బుట్టిన యింద్ర - జిత్తు నామీఁద
విరసించు నీవాడు - విధముల నాడి
రామాటలకు ఫలం - బందిరి వారు
రాముని ఘోర నా - రాచ ధారలను 10380

నాబుద్ధులే నమ్మి - యాప్తుఁడ నైన
నాబుద్ధి వినక ప్రా - ణము లొల్లవైతి
సీత నిమ్మని యెంతఁ - జెప్పిన వినక
యీతరిఁ బ్రాణంబు - లిత్తువే యకట !
ధర్మ మర్యాదలుఁ - దప్పిన కతన
నిర్మూలితంబయ్యె - నీ పరాక్రమము
నీపాటు చూడఁ గం - టికిఁ దిమిరమున
నాపంకజారాతి - యణఁగి నట్లయ్యె
కీలలు మాసిన - కీలి చందమున
నేలపై నిటులుండ - నినుఁ జూడఁగలనె 10390
ధైర్యంబు నిగురు మొ - త్తము నసమాన
శౌర్యంబు పేరును - శారీరబలము
ప్రసవ సంపదయుఁ దప - శ్శక్తి పేర
నెసఁగు చేవయుఁ గల్గి - నీవను నట్టి
సంపూర్ణ ఫలమహీ - జము రఘువీర
ఝంపాసమీర మి - చ్చటఁ గూలఁద్రోచె.
క్రోధగాత్రము కాంత - గుణతుండ మహిత
యోధనిర్మథన శౌ - ర్యోరు దంతములు
తపమును దమము మా - త్సరశత్రు నిగళ
కపటాసురలు కొలి - గడలు వారలుగ 10400
తనరు నీపేరి గం - ధగజంబుఁ గూలె.
జనకజ రమణ కే - సరి నెదిరించి
క్రోధ నిశ్వాసనం - కులధూమ నిర్మి
రోధక మతిశౌర్య - రూప హేమములు
బలమును వేఁడిమిఁ - బరగ నీపేర

విలసిల్లు దుస్సహా - వీతిహోత్రుండు
చల్లనారెను రామ - జలధర నిశిత
భల్ల దృష్టిని దైవ - బలము లేకునికి
ఘోరరాక్షసులు క - కుద్వాల శృంగ
వారంబు జపల భా - వ స్వభావంబు 10410
కన్నులు చెవులును - గజకోటి శక్తి
గన్నమాత్రము మహా - కాయంబు గాఁగ
వెలయు నీపేరిటి - వృషభంబు పెద్ద
పులివోలె రాముఁ డి - ప్పుడు వసివట్టె
అన్న ! నీవా సీత - నాసింప వేసి
నిన్ను రాముఁడెదిర్చి - నేర్చునే గెలువ
నాయమ్మ నేల వ్రా - లాచరణంబు
లాయన బాణంబు - లై కూల్చె గాక !"
అనిచాల విలపించు - నవ్విభీషణునిఁ
గనుఁగొని లక్ష్మణా - గ్రజుఁ డిట్టులనియె 10420

—: శ్రీరాముఁడు విభీషణు నూరడించుట - రావణునికి పరలోక విధులు నెఱవేర్పుమని హెచ్చరించుట :—

" ఏల విభీషణ ! - యింత శోకింప
నాలంబులోన మీా - యన్న పాటునకు ?
చనునె శక్తిత్రయ - సంపన్నుఁ డతుల
ధనురాగమాత్మ ప్ర - తాపవైభవుఁడు
ఇతనికి వగతురె - యితనిలో నెదుర
నితరుల తరమె యే - నింతియె కాక ?
ఏనైన నెదిరింతు - నే యధర్మంబు

వీనికి లేకున్న - విలుకేల నంది
చంపిన నేమి తాఁ - జచ్చిన నేమి
తెంపున నిటుగడ - తేఱంగ వలదె 10430
ఘనుఁడు క్షత్రాచార - గరిమమంతయును
తనపాల నిడుకొన్న - ధన్యుఁ డితండు
మీాయన్న బిరుదంబు - మ్రింగి తోఁ బొలిసె
నీయన సామాన్యుఁ - డే త్రిలోకములఁ
బోరఁ జేతుల కొట్టి - పోరాడి యితఁడు
చూరవట్టెడు స్వర్గ - సుఖములన్నియును
నెన్నాళ్ళు బ్రతికిన - నేమి యన్నిటికి
నున్నవాఁడితఁ డన్య - లుండియు నేల
పరలోకవిధులు దీ - ర్పక చింతఁ బొరలు
తరిగాదు నీకు క - ర్తవ్యమై యునికి." 10440
అనుమాటలకు తాల్మి - నంది రాఘవునిఁ
గని విభీషణుఁడు సం - గతముగాఁ బలికె
"అయ్య! త్రిలోక భ - యంకరుఁ డితఁడు
కయ్యంబులందు నా - ఖండలాదులను
పలుమారు దోలి వెం - పరలాడినాఁడు
బలవంతుఁ డతుల దో - ర్బల శౌర్యశాలి
వేదముల్ తా చది - వినవాఁ డధీత
వేదాంగ చతురుండు - వేదార్థవిదుఁడు
సకలయాగక్రియా - చార సంపన్నుఁ
డకలంకపుణ్యుఁ డ - త్యంత ధార్మికుఁడు 10450
నిలుకడ గలవాఁడు - నీతిసంపన్నుఁ
డిల పెక్కు గాలంబు - నేలినవాఁడు

బహుభోగభాగ్య సం - పన్నుండు సర్వ
సహుఁడు ధర్మాదిమ - సకలార్థములును
తనపాటుగా జప - తపములచేత
వనజగర్భునిచేతి - వరములుగాంచి
దానంబులను జగ - త్త్రయిఁ దనియించి
దానవాన్వయు లెల్ల - తనయంత లేసి
వారుగా నతులితై - శ్వర్యంబులొసఁగు
నీరావణుఁడు పూజ్యుఁ - డెవ్వారలకును 10460
శ్రీరామ! మీయాజ్ఞ - చే దైత్యపతికి
పారలౌకిక విధుల్ - పాటించి తీర్తు"
అన విని యారావ - ణానుజుఁ జూచి
యినవంశతిలకంబు - నిట్లనె మఱియు
"ఇతఁ డెంతయును పూజ్యుఁ - డెల్లవారలకు
నితఁడన నీకొక్క - నికె యన్నగాదు
మాయన్న యీతండు - మరణపర్యంత
మీయన్నతో వైర - మింతియొకాని
యామీఁద నిఁక నేల - యాగమోక్తముగ
నామాటుగాఁ గ్రియ - నడిపింపు" మనిన 10470
నావేళ రావణు - నంతఃపురమున

—: రావణుని మృతికి రాణివాసస్త్రీలు శోకించుట :—

దేవేరు లదివిని - దీనభావముల
వగలతో నుత్తర - ద్వారంబు వెడలి
మొగము నొఁదల లుర - మ్ములు మోదుకొనుచు
నెదలపై సన్న బ - య్యెదలడల్ జాఱఁ

గోదము పాలిండ్లపై - కుంకుమల్ చెదర
చెంగావి మోవులు - చిపిలి వాడంగఁ
గంగుల రవికల్ వి - కావికల్ గాఁగఁ
దారహారముల ము - త్యమ్ములు రాల
హీరమంజీరంబు - లెడనెడ జాఱ 10480
నుడివోక నులివేఁడి - యూరుపుల్ నిగుడ
నడచుచో లేఁదీగె - నడుములు వడఁక
నెఱిగొప్పులూడి పై - న్నెరులుర్విఁ జీర
నఱవుచు హానాథ ! - హానాథ ! యనుచుఁ
గలనిలోనను జగ - గ్రావమో యనఁగ
నిలఁ బడియున్న ప్రా - ణేశ్వరుఁ జూచి
పదములఁ గొందఱు - బాహుల గొంద
ఱెదమీఁదఁ గొందఱు - నేడ్చుచు వ్రాలి
మూలముల్ దెగఁగ్రోయ - మునుకొని పడిన
లాలితమల్లికా - లతికలో యనఁగఁ 10490
జేతుల కన్నులఁ - జేర్చి పాదములు
శీతలవక్షోజ - సీమల నుంచి
మోముపై మోము ద - మ్ములు చేర్చి యతని
భూమినులందఱు - పలవరింపుచును
మంచునఁ దడియు తా - మరయకో యనఁగఁ
జంచలాక్షుల నేత్ర - జలముల జడిసి
రావణు వదనమా - రమణులనెల్ల
నావేళ విషమశో - కాంబుధి ముంచె.
వీణెల నాహిరుల్ - వినుపించునట్ల
రాణివాసము లెల్ల - రావణుఁ జూచి 10500

తమ దిక్కు లేమిక్రై - తాలుముల్ మాని
సమశోక పారవ - శ్యముల నిట్లనిరి,
" ప్రాణేశ! యజుని వ - రంబులచేత
ప్రాణభయంబను - బలుకెందు లేక
ముల్లోకముల దేవ - ముఖ్యులఁ గెలిచి
చెల్లరే! మనుజుని - చేఁ జావవలసి
మన విభీషణుబుద్ధి - మార్గంబు వినిన
జనకనందనఁ దెచ్చి - చలపట్టి యునిచి
కొలిచిన వారలఁ - గొడుకుల హితులఁ
గులమెల్ల రామాస్త్ర - కోటి ద్రుంచితివి 10510
తపనవాయువులంటఁ - దలఁకెడు తమ్మ
గపులీడ్చుకొనిపోవఁ - గావలేవైతి
వారుల యిల్లాండ్రకు - నొడిసిన నీకుఁ
బరులచే నిట్టి యా - పదలు రాకున్నె
తము నసనాథలఁ జేయఁ - దలఁచి రాఘవుని
వనిత ననాథగా - వగచి తెచ్చితివి
దైవయత్నము నీకుఁ - దప్పింపరామి
చావఁ బాలైతివి - సమరరంగమున "
అని కురరీపక్షు - లరమిన రీతి
వనితలు వలఁగొని - వాపోవు నంత 10520

—: మండోదరీ విలాపము :—

పట్టపురాణి సౌ - భాగ్య సంపదల
కట్టు కంబము మయు - గారాబు పట్టి

దేవి మండోదరి - దిగులుచేఁ బొగిలి
రావణు హాహా వి - రావయై కదిసి
"ప్రాణేశ ! నీదివ్య - బాణాసనంబు
బాణంబులును నేలఁ - బడియున్న విపుడు.
అనిమిషేంద్రాదుల - కైన దుర్జయుఁడ
వని నిన్నుఁ ద్రుంచునె - యకట ! మానవుఁడు
అన్యుల కాంతల - నాసించు తెచ్చు
నన్యాయ పరుల కి - య్యాపదల్ రావె ' 10530
తనబుద్ధి వినకున్న - ధార్మికుఁ డగుట
మన విభీషణుఁడు నే - మమున నున్నాఁడు
మాతండ్రియుఁ బ్రహస్తు - మాల్యవంతులను
సీతోడ యీబుద్ధి - నీతి గాదనుచుఁ
జెప్పిన మాటలు - చెవిఁ జేర్పనపుడె
తప్పెను బ్రతుకు లీ - దనుజుల కెల్లఁ
గాదని మనకుంభ - కర్ణుండు నిన్ను
బోధించి వినకున్నఁ - బొలిసె రోషమున
నింద్రుఁడె తావచ్చి - యిలనిట్లు రామ
చంద్రుఁడై జనియించి - సమయింప నోపు 1054
నెక్కడి యమరేంద్రుఁ - డెదురించు నిన్ను
మొక్కపోయిన వాఁడు - మొన సేయఁగలఁడె ?
అడవుల వెంబడి - నలమటలెల్లఁ
బడి మునివృత్తిచేఁ - బడఁతిఁ గోల్పోయి
వచ్చిన రాముని - వాలంపగములఁ
జచ్చె రావణుఁ డన్న - సత్యమే యున్నఁ

గలకంటినో లేక - కళవళించితినొ!
కలనిలో యేనిట్లు - గలఁగ యొక్కంటె
దురములోపల ఖర - దూషణాదులను
నలుకి మారీచదా - నవుల నణంచి 10550
వాలిఁ గూలఁగ నేసి - వనధి బంధింపఁ
జాలునే యివి మాను - షములైన పనులె!
అతఁడు పంపినయట్టి - హనుమంతుఁ డొకఁడు
క్షితిజనుఁ జూచి కూ - ల్చి యశోక వనము
లంకఁగాలిచి రామ - లక్ష్మణాదులను
కొంకు దీరిచి తోడు - కొనితెచ్చి యిచట
డించినప్పుడె తల్ల - డించితి రాము
నెంచి చూచిన మర్త్యుఁ - డెట్లనవచ్చు
"సకల భూతహితుండు - సర్వశరణ్యుఁ
డకలంకుఁ డక్షరుఁ - డాది పూరుషుఁడు 10560
దేవదేవుఁడు సర్వ - దేవతామయుఁడు
గోవిందుఁ డజుఁడు వై - కుంఠ మందిరుఁడు
శార్ఙ్గక శంఖ చ - క్రగదాసి ధరుఁడు
నిర్మూలితా సురా - నీకుఁ డవ్యయుఁడు
గరుడధ్వజుండు భ - క్త పరాయణుండు
హరి సర్వమయుఁడు పీ - తాంబరధారి
దామోదరుండు స - త్యపరాక్రముండు
శ్రీమంతుఁడైన ల - క్ష్మీమనోహరుఁడు
నారాయణుఁడు ధాత్రి - నరుఁడయి పుట్టి
శ్రీరాముఁ డగుచు వ - చ్చెను కపులెల్ల 10570

దేవత లీధరి - శ్రీపుత్రి లక్ష్మి
రావణుఁ దునుమఁ బ్రా - రంభించినాఁడు "
అని విభీషణుఁడు ర - హస్యంబుగాఁగ
వినిపించెఁ గాన యే - విని యెఱుంగుదును
దెలియవైతి వరుంధ - తీరోహిణులకుఁ
దులవచ్చు సాధ్విఁ దె - త్తురె మహీసుతను ?
అందుచే నీకు ప్రా - ణాభిమానములు
చిందరవందరై - చెడిపోయె నిపుడు.
ఆయమ్మ కంటిని - రక్కసుటా ! కడిగెఁ
బాయకాత్మకపోల - పత్రభంగములు 10580
పల్లకి కడఁద్రోచి - పడివాగె తేజి
బల్లనకట్ట తేఁ - బని లేదటంచుఁ
జూడ నందఱు మేల్మ - సుంగును మాని
వ్రీడ యించుక లేక - వీధికి వెడలి
దోలఁగించు వారలఁ - దొలఁగించు నిపుడు
కలనిలో నిలిచి రా - ఘవ సమక్షమున
సిగ్గెఱుంగని తన్ను - శిక్షింపవేల ?
పగ్గెలాడుదు వట్టి - పలుకు లేమయ్యె ?
ప్రాణవల్లభలు నీ - పై వ్రాలి యుడుల
ప్రాణేశ ! వారి సం - భావింప వేల ? 10590
సీత రామునిఁ గూడి - చెలరేఁగునింక
నీతోడఁ గూడి మ - ణీ విమానముల
సకలలోకముల నా - శ్రమములఁ శైల
నికరంబుల మెలంగ - నేనోఁచనైతి
నీలంక నిజధామ - మింద్రాది సురలఁ

దోలిన యింద్రజి - త్తుఁడు కుమారుండు
మయుఁడు నాతండ్రి స - మస్తలోకముల
జయమందు రాక్షస - స్వామి రావణుఁడు
నాప్రాణవిభుఁ డబ్ధి - నడుమ నున్నట్టి
ద్వీప మెవ్వరికి సా - ధింప దుర్లభము 10600
ననియుంటి ప్రతికూల - మై విధి యునికి
తన గర్వమెల్ల వ్య - ర్థంబయి పోయె
దాసీసహస్రంబు - తనుగొల్వనుండి
యీ నరమకుదాసి - నై యుండవలసె
తన యిచ్చఁ గాసె నా - తపము భాస్కరుఁడు
తనువుట్ట వీచె శీ - తల మారుతంబు
నిండంగ పండువె - న్నెల లల్లుకొనియె
మండదొండంగె సో - మరి పావకుండు
యముఁడు లంకాపురి - నసియాడ దొండఁగె
శమియించె ఖేదంబు - సకలలోకులకు 10610
నింతలో నీయాజ్ఞ - యెక్కడవోయె
వింత దోఁచెను దన - విభవముల్ దనకుఁ
దలయిచ్చు పారుప - త్యములయ్యె నేఁడు
జలజజాండములోన - సకలామరులకు
నిటులేల చేసితి - విందటికన్న
కటకట ! సీతచ - క్కదనంబు నీకు
కన్నుల కితవయ్యెఁ - గాక నాచెలువ
మెన్నవైతివి నీకు - నిల్లాలనగుట
సత్యసంధుఁడవు భు - జబలాధికుండ
వత్యంత ధైర్యశౌ - ర్యవివేకనిధివి 10620

యాగము విడుఁడ వ - నాగతకార్య
భాగ్య నిర్ణయ కుల - ప్రౌఢ చిత్తుఁడవు
ననుఁ బాసి యిట్టి మా - నంబుతో ధరణి
ననువుతో నాలింగ - నంబు సేయుదురె ?
ఏదియు దన కేల - యిపుడు వైధవ్య
ఖేదంబు తనకు నం - గీకృతంబయ్యెఁ
బోవు ప్రాణంబు లి - ప్పుడు శిఖా కళికఁ
బూవు దండలు చుట్టి - పూర్ణిమా చంద్రుఁ
దలపించు నీమోముఁ - దామర వాడ
యిల ధూళిగ్రమ్మంగ యే - నెట్లోర్చు దాన ! 10630
కస్తూరి కుంకుమా - గరువిలేపప్ర
శస్తమౌ నీదు వి - శాల వక్షంబు
రామాస్త్రమున విరి - రక్తప్రవాహ
భీమమై కనుపట్ట - బెదరు పుట్టెడును
ఏదుముండ్లును బోలి - యెడమీంక నిండి
నీదు మేన నమోఘ - నిశితాస్త్రకోటి
నాఁటియున్నవి గాన - నాకు నొక్కింత
చోటెడపై వ్రాల - శోకించుటకును
నినుఁబాసి తానుండ - నీతియే ? కాన
తను దోడుకొని పొమ్ము - ధర్మంబుఁ దలఁచి 10640
యగ్నిసాక్షిగఁ బెండ్లి - యాడు నిల్లాలి
నగ్నుండవై విడ - నాడి పోఁదగునె ? ”
అని తల్లడిల్లి సా - యంతన సమయ
వనదంబుపై వచ్చి - వ్రాలిన యట్లు

దొరలుచునున్న మం - దోదరి తోడి
తెలివలు గ్రుచ్చి యె - త్తి తొలంగఁ దిగిచి

—: సఖులు మండోదరి నూరడించుట :—

"అమ్మ! తీఱదిట దై - వాజ్ఞ గాదనిన
వమ్మువోవునె విశ్వ - వర్తనంబెల్ల ?
ఎఱుఁగనేరని దాన - వే ? పుట్టినపుడ
మరణంబు ధ్రువము బ్ర - హ్మాముఖామరులకు 10650
నంత శోకించిన - యింక నేమి గలదు ?
శాంతినొందుము విభీ - షణుఁడున్నవాఁడు
మనకెల్ల దిక్కు, రా - మ సముఖమునను
వనితాలలామ ! ని - ల్వఁగరాదు మనకు"
అన నూరడిల్లి శో - కాశ్రుపూరములు
చనుఁగవమీఁదట - జాలెత్తుచుండ
సైరించు నెడ విభీ - షణుని నెమ్మోము
శ్రీరామచంద్రుఁ డీ - క్షించి పల్కెను.

—: విభీషణుఁడు రావణుని కంత్యక్రియలు చేయనని చెప్పుట. రాముఁడు విభీషణుని కట్టిపని తగదని చెప్పుట :—

"తామసమేల యీ - దశకంధరునకు
నేమంబుతోడ వ - హ్నిక్రియావిధులు 10660
సాలింపు మున్నవి - కార్యముల్ పెక్కు-
లావల నీయేడ్పు - నతివలకెల్ల
వారింపుమ"నిన రా - వణ సోదరుండు
శ్రీరాము చెంతకుఁ - జేరి తాఁ బలికె.

" ఏనేడ తమ్ముఁడ - నితఁడేల యన్న
వీనికి నుత్తర - విధులెంత దవ్వ
పాపాత్ముఁ డగు వీనిఁ - బత్నులు మృగము
లీపాటిఁ గొనిపోవ - నిమ్ము మాచెదను
జ్యేష్ఠుఁడంచును వీనిఁ - జేరి సత్క్రియలు
నిష్ఠతోఁ జేయఁ బూ - నిన పెద్దలెల్లఁ 10670
దను జూచి చాల నిం - ద యొనర్తు రితర
వనితారతుండు పా - వనుఁ డౌనె వీఁడు ?
ద్రోహి గావున వీని - దొసఁగుట మేలు
స్నేహముంచకుము మీ - చిత్తంబులోన "
అన విభీషణునితో - నవనిజాప్రియుఁడు
విన నొల్ల కామాట - వెండియు బల్కె
" సామాన్యుఁడే రాక్ష - సవిభుండు చాల
పామరత్వమునఁ బా - పములు చేసినను
కలను పేరింటి గం - గా ప్రవాహమునఁ
దొలఁగించె నాత్మ దు - ర్దోష పంకములు 10680
సతనికిఁ జేయు క్రి - యా విశేషమున
నతిశయ సత్కీర్తు - లందు టేకాని
యేకొఱంతయును లే - దేనన్న మాట
నీకుఁ ద్రోయఁగ రామి - నిజమయ్యె నేని
యాచరింపు మ "టన్న - నామాట తలను

—: విభీషణుఁడు రావణుని కంత్య క్రియలాచరించుట :—

మోచి యన్నకు నభి - ముఖముగాఁ జేరి
యచ్ఛోట చందనా - ద్యత కాష్ఠరాశిఁ

దెచ్చి యమర్చి బల్ - తీరు ఘటించి
మెత్తగా వటివేరు - మీఁద నమర్చి
మెత్త వైచి తలాడ - మీఁదట నుంచి 10690
బంగరు పటముపైఁ - బఱచి రావణుని
శృంగార విధులఁ గై - సేసి యెత్తించి
క్షితిమీఁద నునిచి ప్రా - చికి దక్షిణమున
హుత వహు వేదిపై - నునిచి యెవ్వనక
పైనిడి వృషదాజ్య - పాత్రలో స్రువము
దానవవిభుని పా - దమ్ముల మీఁదఁ
దగురీతి సోమల - తాశకలంబుఁ
దగనుంచి సోమంబు - దంచిన ఱోలు
నూరుమధ్యంబున - నుంచి శేషించి
దారు పాత్రములు ను - త్తరమహారణియు 10700
నరణియు ముసలంబు - నాగ్నేయవిధులఁ
దరమిడి సముచిత - స్థలములనుంచి
పసుపును శాస్త్రోక్త - పద్ధతి గాఁగ
విసరించి నేతఁ బ - ట్టిన పరిస్తరణి
పైవైచి లాజలా - పైపయిఁ జల్లి
గోవ జవ్వాది కుం - కుమముఁ గస్తురియుఁ
గర్పూర మహిసాక్షి - గంధరాజములు
గోర్పడంబుల మీఁదఁ - గుప్పలు వైచి
యావిభీషణుఁ డన్న - కగ్నికృత్యంబుఁ
గావించి బంధువ - ర్గము సమక్షమున 10710
స్నాతుఁడై యార్ద్రవ - స్త్రంబులు గట్టి
ప్రీతి తిలోదక - క్రియలాచరించి

దను జేంద్రునకు మ్రొక్కి - తరుణుల నెల్ల
చను డని నిజరాజ - సదనంబుఁ జేర్చి
రాముని చెంతకు - రా సభోవీథి
కామితార్థము లెల్లఁ - గడ తేఱె ననుచు
ఖచర చారణ దేవ - గంధర్వయక్ష
నిచయంబు పుష్పవ - ర్షితమైయుండ
రావణు మరణంబు - రామువిజయంబు
నావిభీషణుని స్నే - హ ప్రసంగములు 10720
సౌమిత్రి నడక కే - సరిపుత్రు బలము
తామరసాప్తసం - దనుని పూనికయు
నంగదు శౌర్యంబు - నగచరవీర
పుంగవుల్ దనుజులఁ - బోదివి చంపుటయుఁ
గతలుగాఁ బలుకుచుఁ - గనువిచ్చి మాటల
వెతఁదీఱి యాత్మని - వేశముల్ చేరె.

—— శ్రీరాముఁ డింద్రసారథిని పీడ్కొలుపుట :——

ఆతరి రఘువీరుఁ - డమరేంద్రుఁ డనుచు
మాతలిఁ దనమంచి - మాటల చేత
బహుమాన మొనరించి - పర్వతారాతి
మహనీయరథముతో - మఱలంగ ననిచి 10730

—: సుగ్రీవు నభినందించుట :——

తనకు మ్రొక్కిన సుమి - త్రాపుత్రుఁ గాంచి
యనునయింపుచు వాన - రాధిపుఁ జూచి
"చేసిన ప్రతినలు - చెల్లించుకొంటి

వీసత్య మితరుల - కెల్లఁ గల్గెదును
కపులెల్లఁ గలుగ మా - కార్యంబులెల్ల
నిపుడింతె కొఱలేక - యీడేఱె మిగుల"
అనుచు నందఱును హి - తాలాపములను
మనముల నలరించి - మఱలి తామున్న
పాళెంబుఁ జేరి య - పారకృపావి
శాలమానసుఁడు ల - క్ష్మణుఁజూచి పలికె. 10740

—: విభీషణునికి లంకారాజ్య పట్టముఁ గట్టుట :—

"సౌమిత్రి! యీ విభీ - షణుఁ డొక్కఁడుండఁ
గామితార్థములెల్లఁ - గడ తేఱె మనకు
నితని నేకొనిపోయి - యిపుడె లంకకును
ప్రతినఁ దప్పక యుండఁ - బట్టంబుఁ గట్టి
రమ్ము ప్రధానకా - ర్యంబిది నాకు
తమ్ముఁడు మీలోని - తండొక్కరుండు"
అన లక్ష్మణుఁడు వాన - రావళిచేతఁ
గనక కుంభముల సా - గరనదీ జలముఁ
దెప్పించి పురము సొ - త్తెంచి యానగరి
గొప్ప సింగపు గద్దెఁ - గూర్చుండఁ జేసి 10750
తానొక్క కలశాంబు - ధారచే మీఁద
తానంబు సేయించి - తగువారిచేత
మంత్రులచే నాగ - మప్రకారమున
మంత్రపూతంబుల - మజ్జనంబార్చి
పట్టంబుఁ గట్ట యా - తునిశాచరులనుఁ
కట్టు వర్గంబుల - కట్టడలిచ్చి

పురముకై సేయించి - భూరివాద్యములు
మొరయించి లంకయా - మున్నటియట్ల
సకలలక్ష్మీనివా - సము చేసి ప్రజల
నకలంక సంతోష - మనువొందఁ జేసి 10760
రామణీయకమైన - రాజ్యసంపదల
చేమించి మంత్రుల - సిరుల నెచ్చించి
యాలక్ష్మణుఁడు దాను - నపుడె రాఘవుని
పాళెంబునకు వచ్చి - భయభక్తులమరఁ
బురిఁ గలవారెల్లఁ - బువ్వు బోట్లములఁ
పరిమళంబులు నవాం - బరములు వివిధ
ఫలములు చతురం - తభద్రేభయాన
కలితాశ్వతతి కాను - కలు జోకచేసి
బహువిధభూషణ - ప్రకరంబుతోడ
బహుమతి శ్రీరాము - పదములచెంత 10770
నునిచి కేలు మొగిడ్చి - యొక యోర నిలువ
జనకజాప్రియుఁడు తా - సంతుష్టి నొంది
యతనిపై కరుణచే - నంగీకరించి
దితిజులు తెచ్చినది - ............
............ - గనుసన్నఁ బిలిచి
రాకేందునిభుఁడు శ్రీ - రాముఁ డిట్లనియె.

—: శ్రీరాముఁ డాంజనేయుని సీతాదేవితోఁ దమ జయ వృత్తాంతము నెఱిఁగింపుమని పంపుట :—

" చనుము నీవిప్పుడె - జానకి కడకు
మునువు విభీషణు - ముదలఁ గైకొనుము

రావణాసురుఁ జంపి - రామలక్ష్మణుల
సేవించి వానర - శ్రేణులతోడ 10780
........................ర
విగ్రహమ్ములు లేక - వేడుకఁగూడి
యందఱమున్నార - మని మేలువార్త
యందించి సీతయు - న్నట్టి చందంబు
మఱుమాటయును విని - మఱలిరమ్మనినఁ

—: ఆంజనేయుఁడశోకవనముఁ జేరుట :—

గరువలిసుతుఁ డశో - కవనంబుఁ జేరి
యచ్చట చుట్టు నై - త్యాంగనల్ గావ
........................చు
నాయమ్మఁ గని రాముఁ - డానతియిచ్చు
చాయగా మ్రొక్కి య - ంజలి చేసి నిలిచి 10790
పలికిన యాత్మలో - పల విచారంబు
తొలగించి మిగుల సం - తోషమొందుటయు
"పరమకల్యాణి ! నీ - పతి పంప వచ్చి
మఱచిపోవుచు నెట్టు - మాటలాడితినో ?
..........................ల
పటుశక్తిచే వార్ధి - బంధించి వచ్చి
యాలంబులోన ద - శాననుఁ బంధు
జాలంబుతోడ న - స్త్రంబులఁ దునిమి
పట్టి విభీషణుఁ - బట్టంబుఁ గట్టి
యొట్టి చోప... - యింతయు లేక 10800
మెఱయుచున్నారు - మీవారు నీకు

నెఱిగింపు...ని లంక - నీలతా గృహము
ముచ్చటల్ దీఱె రా - మునిఁ జేరఁగల్గె
యేనిజమరినాఁడు - నేఁడా వేఱె
మానిని ! నిను జయ - మంగళశ్రీలు
యేమందు నిపుడాన - తి" మ్మన్న సీత
యామాటలకుఁ బర - మానంద మొంది
పరవశయై మారు - పలుకకయున్న
ధరణిజతో మారు - తాత్మజుఁడపుడు 10810
పలుక వేమిటి కన్న - పరమహర్షమునఁ
దెలివి దెచ్చుకొని ధా - త్రీపుత్రి యిట్లనియె.

—: శ్రీరామవిజయమువిన్న సీత యానందము ప్రకటించుచు నాంజనేయుని ప్రశంసించుట :—

పవనజ ! యానంద - పారవశ్యమునఁ
బవిలి యేనీకు ను - త్తర మియ్య లేక
యుంటిని రావణుఁ - డోడిన మాట
వింటిని నాస్వామి - విజయంబు వింటి
సత్యసంధుండ....................
....................- క్య ప్రమాణములు
అతిలక్షణాఢ్యుండ - వప్రమత్తుఁడవు
మతిశాలి వనిలోప - మాన సత్త్వుఁడవు 10820
ధృతిశాలివి వివేక - ధీచమత్కార
హిత సత్యబోధ ప - రేంగితజ్ఞాన
నిరతుండ వష్టాంగ - నీతి మంతుఁడవు
వర శౌర్యుఁడవు - హను - మ.............

...................దూరుఁడవు
దీనబాంధవుఁడవ - తిజ్ఞాన నిధివి
మెచ్చి నే దీనికే - మి సమాన వస్తు
విచ్చెద నిందు కి - రేడు లోకములు
రత్నభండార పూ - ర్ణములు గావించి
యత్నంబుతో యిచ్చి - నప్పు డిందులకు 10830
సరిగావు దాప్రాణ - సంరక్షచె.........
............................వు"
అని పల్క వినియమ్మ - హా పతివ్రతకు
ససిల కుమారుఁ డి - ట్లని విన్నవించె.

—: ఆంజనేయుఁడు సీతను బాధపెట్టిన రాక్షస కాంతలఁ జంపెద నని చెప్పుట - సీత యాతనిని వారింపుచు శ్రీరాముని జూడఁ గోరెదనని చెప్పుట :—

"అమ్మ! నీకారుణ్య - మంతియ చాలు
సొమ్ము లేటి కొసఁగఁ - జూచిన యపుడె
త్రిభువన సామ్రాజ్య - దివ్యసౌభాగ్య
మభిముఖమై నిల్చిన - ట్లయ్యెఁ దనకు
వీడె విచారంబు - విభుఁడైన రాముఁ
గూడి యుండఁగ గనుఁ - గొను నింతెచాలు 10840
నేమి సన్మానంబు - లేటికి దనుజ
భామలు రావణు - పనుపుచే నిన్ను
బాధలఁ బెట్టిన - ఫలమెల్ల నిప్పు
డో దేవి! చేకూర్తు - నుత్తర మిమ్ము
పదనఖకరవాల - పాశదంతములఁ

జదియించి త్రుంచి పీ - చమణంగఁ గొట్టి
చుట్టి విదల్చెద - చూడుము వీరిఁ
జుట్టు కొందునె" యని - చూపు నిగుడ్వ
నాయన యభిమతం - బాత్మలో నెఱిఁగి
యాయమ్మ క్రమ్మఱ - హనుమంతుఁ బలికె. 10850
"ఏయువాఁ డుండ న - మ్మేమి తాఁ జేయు ?
ఈ యింతులను జంప - నేమి ఫలంబు ?
రావణాసురుని రా - రాపుల చేత
నీవెలందులు నన్ను - నేమన్న నేమి ?
హితముగాఁ బులితోడ - నెలుఁగుతోఁ దెలుపు
కత వినలేదె యా - క్రమ మెట్టులనిన
నలయించిరేని ద్రో - హము చేసిరేని
నలగించిరేని ప్రా - ణములకు నొకరు
తెగిరేని సామ్ముల్ల - తెక్కలి గొట్టి
నొగిలించిరేని యా - నొచ్చిన వారు 10860
ధార్మికులై కీడుఁ - దలఁచిన యట్టి
దుర్మానులను జంపి - దోషపుంజముల
చేతఁ జిక్కరని వ - చించు భల్లూక
గీతలు వినలేదె - కీడేల మనకు
లంక యంతయును నీ - లావున నలసె
నింక వీరలు నన్ను - నేమనఁ గలరు ?
వలదన్న" జానకి - వచన సంగతికిఁ
దలయూఁచి పవమాన - తనయుఁ డిట్లనియె.
"నీకుఁ జెల్లును చెల్లు - నీపతి కింతె
కాక యప్రతిమాన - కారుణ్య బుద్ధి 10870

యమ్మ ! యన్యుల కేల - యబ్బు మీచిత్త
మిమ్మేర నుండిన - నేనట్లు సేతు
నేమందు నీదు ప్రా - ణేశునిఁజూచి
యీమాటలాడె మ - హీపుత్రియనుచు
నానతిమ్మన" విని - యవనిజ పవన
సూను నెమ్మోమునుఁ - జూచి యిట్లనియె.
'సౌమిత్రి సహితుని - సంపూర్ణ చంద్ర
కోమలాననుఁ నీల - కువలయ శ్యామ
కోదండపాణి ర - ఘుశ్రేష్ఠు దశను
ఖాది దైతేయ సం - హారు సుగ్రీవ 10880
వాలిజముఖ కపి - వ్రాత సంసేవ్యుఁ
జాల నామనసు ము - చ్చటలెల్ల దీఱఁ
జూడఁ గోరితి నటం - చు వచింపు" మనిన
వ్రీడావతికిఁ గపి - వీరుఁ డిట్లనియె.
మాయమ్మ ! నీవు నె - మ్మది శచీదేవి
యాయింద్రుఁ జేరిన - యట్టి చందమునఁ
గలసి యుండెదవేను - గదలి పోయెదను
పిలువ నంపిన వచ్చి - ప్రియునితోఁ గూర్తు"

—: శ్రీరామునాజ్ఞచే హనుమంతుఁడు సీతను నలంకరించి రాముని యొద్దకుఁ గొనివచ్చుట :—

నని రఘువీరు దా - యఁగ నేఁగి " స్వామి !
జనకజఁ గాంచి యి - చ్చటికి వచ్చితిని. 10890
ఏయమ్మ దారికై - యింత చేసితివి
యాయమ్మ మిముఁ జూతు - నని కలంగెడును

మొదలింటి మెఱుకచే - మొగమిచ్చి తనకు
నిది నాతలంపని - హృదయంబుఁ దెలిపె
తోడి తెమ్మనవుఁడు - తోడ్తోనె మాట
లాడుచున్నపుడె నే - త్రాంభోరుహముల
జలజలఁ గన్నీరుఁ - జల్లుచు చింతఁ
దల వాంచి రావణు - తమ్ముని కనియె.
"దనుజేంద్ర సీతను - తల గడిగించి
యనుపమ రత్న భూ - షాంబరావలులఁ   10900
గై చేసి తగిన వై - ఖరులఁ దోతెమ్ము
మాచెంత" కనిన న - మ్మాటలో నతఁడు
నవనిజ కడ కేఁగి - "యమ్మ! రాఘవుఁడు
నవరత్నమయ భూష - ణప్రముఖములఁ
గాంతలచేత శృం - గారంపఁ జేసి
చెంతకుఁ దెమ్మని - చెప్పిన కతన
వచ్చితి" ననవుఁడు - వైదేహి యందు
కిచ్చగింపక "రాము - వీక్షించి కాని
యేనలంకారంబు - నేమియు నొల్ల
ఘూనిలుకిడ చేత - నే తెంపు" ననిన   10910
"అమ్మ! రామాజ్ఞ యే - మనవచ్చు మనకు
నమ్మతింపుము వధూ - జనముల చేతఁ
దొరవులు దెప్పింతుఁ - దోడుగుము మైల
విడచి చీనాంబర - వితతి ధరింపు
గాదనరా" దనఁ - గానిమ్మటంచు
నా దేవి సమ్మత - మందిన నతఁడు

తనకుల సతుల నం-దఱఁ బిలిపించి
"వనితలందఱు నమ్మ - వాఁటినీవేళ
కై సేయుఁడనవట్టు - కాకని వారు
నాసీతకును శిర - సంటి నీరార్చి 10920
తలతడి యొత్తి మం - దారలతాంత
ములు కీలుకొప్పున - ముడిచి మాణిక్య
మయభూషణములందు - మైభోగ తరము
లయినవి సకలావ - యవముల నుంచి
చందురుగావి మేల్ - సరిగంచు చీర
చెదరినపూఁబోల్లు - చిలుకంగఁ గట్టి
రంగైన పైఠాణి - రవికపైఁ బైఁట
కొంగు పన్నిటి కుం - కుమఁ దేలవైచి
సవరన సేసిన - సరమా ప్రియుండు
రవణంబు గలచేతు - రంత యానమున 10930
నాదిలక్ష్మికిని రెం - డవ మూర్తియైన
భూదేవి నునిచి తూ - ర్యములు ఘోషింప
దండ నూడిగపు బి - త్తగులు సేవింప
సండ వాకిట ప్ర - ల్లకి రాఁగ
తరిమి కంచుకులు సం - దడి విరియింపఁ
బురము వెల్వడి రఘు - పుంగవుఁడున్న
శిబిరంబు చెంతకుఁ - జేరి దైత్యేంద్రు
డబలలతో జన - కాత్మజ వచ్చె
చిత్తగింపు" మటన్న - శ్రీరామచంద్రుఁ
డత్తరి రోష దై - న్యములు సంతసము 10940

పెనఁగొనఁ "వేగమ - పిలుచుకరమ్ము
జనకజ" నన విభీ - షణుఁడెడ మీఁక

—: సీతనుఁ జూచుటకుఁ గపులును రాక్షసులును త్రోసికొనుచు వచ్చుచుండ విభీషణుఁడు వారి నడ్డగించుట - శ్రీరాముఁ డాతనినివారించుట :—

కప్పుక యున్నట్టి - కపుల రాక్షసులఁ
దప్పించు కొనఁగ బ - ద్దలు పాలు గాఁగ
విసరించు సందడి - విరియింపఁ జూచి
"పోసఁగునె దానవ - పుంగవ! యిట్లు?
చూచెద మన - వారిఁ జూడంగనీక
త్రోచి కట్టించి యీ - దుడుకు సేయుదురె?
ఉత్సవమ్ములు దేవ - తోత్సవమ్ములను
యుద్ధభూములు నవ - నోపాంతములను 10950
వైవాహికస్వయం - వరముల రాచ
దేవేరులను ధరి - త్రీజనంబెల్లఁ
గనఁనొప్పు నదియును - గాక నేచింత
నునికిచేఁ జూచిన - నొచ్చంబు గాదు.
అదిగాక యిదిమహా - హవభూమి యిచట
గదిసి చూచిన వారిఁ - గడలఁ ద్రోయుదురె?
అందఱు మనవార - లన్యులు వీర
లందునెవ్వారు లే - రటుగాన నీవు
నాయుత్తరపు లేక - నచ్చిన వారి
వేయింతువో నొవ్వ - వేత్ర దండముల? 10960

రాజసవృత్తిచే - రాణివాసముల
నీజాడ నడిపింతు - రింతియొకాక
యీలువుఁ గల్గిన - నెట్లున్ననేమి ?
యేల యన్యంబు లూ - హింప నెవ్వరికి ?
కోటలు గోడలు - కోణవాకిళ్లు
చాటులు పెద్దలె - చ్చరికల్ నగళ్లు
కంచుకుల్ గొల్లలె - గళ్లు నడ్డములె
చంచలాక్షుల మనో - జవనాశ్వములకు ?
బాహిరమ్ముల నేమి - ఫల మివియేల
గేహినులకు ? వివే - కింపను గాక 10970
కొమ్మకుఁ బెట్టినకోట - యీలువయె
సుమ్ము మానంబె కా - చును సతీమణుల
నావరణములు వ్య - ర్థంబులు సిగ్గు
కేవలమైన యం - కిలి కులాంగనకుఁ
గావున నందఱుఁ - గనుచుండ సీత
నీవు దోతెమ్ము" న్న - నేమియునవక
పల్లకి డించి యా - పరమ కల్యాణి
నల్లన సముఖంబు - నందుఁ జేర్చుటయు
నావిభీషణు వెంట - నవనిజ రాఁగ
భావించు శ్రీరాము - భావంబుఁ జూచి 10980
యంగదసుగ్రీవ - హనుమన్నలాదు
లింగితజ్ఞులుగాన - నేమియు ననక
సౌమిత్రిఁ జూడ ల - క్ష్మణుఁడాత్మలోన
రాముని హృదయమా - రసి యూరకున్న
నాసీత "యార్యపు - త్రా !" యంచు మిగుల

గాసిలి పెన్నిధిఁ - గనుఁ గొన్న యట్లు
చంద్రుని మించిన - చక్కని రామ
చంద్రుని నెమ్మోము - సడిసన్నఁ జూచి
జిలుఁగుఁ బయ్యెద సన్న - చెఱఁగు నెమ్మోము
వెలిదమ్మిపై వైచి - వెక్కివెక్కి యేడ్చుచును 10990
తలవాంచికొనియుండ - దయరాక చాల
చులకఁగాఁ గనుచు నిం - చుకయైన యోర్పు
మొగమాటయును మాని - మొగముపై నలుక
చిగురొత్త సీత కా - శ్రీరాముఁ డనియె.

—: శ్రీరాముఁడు రావణునింట యుండుటచే సీత నేలు
కొననని యామె శీలమును శంకించుట :—

" పౌరుషక్రియఁ బూని - పగఁదీర్పవలసి
వారిధిఁ గట్టించి - వచ్చితి నిటకుఁ
జేసిన ప్రతినలు - చెల్లించుకొంటి
నీను చూపితి దాన - నేంద్రునిమీఁద
జలరాశి దాఁటి యి - చ్చటి లంకయెల్లఁ
గలయఁ గన్గొని యశో - క వనంబులోన 11000
నినుఁ జూచి కొన్ని పూ - నిక లాడినట్టి
హనుమంతుని ప్రతిజ్ఞ - లతనికిఁ దక్కె
సాతోడ వానర - నాయకుండాడి
యేతీరున వచించె - నే దీర్చె నట్లు
తమ యన్నగాదని - తనుఁ జేరుకొక్క
సమకూర్చితిని విభీ - షణునిఁ జేపట్టి
కపుల పాటంతయుఁ - గడతేఱె నాకు

నపకీర్తి దలఁగె శౌ - ర్యము నుతికెక్క
నాలిఁ గొంపోయిన - యతని సాధింపఁ
జాలఁడంచును మహీ - జను లాడునట్టి 11010
యాడికెల్ మాని నీ - యపవాదమునకు
నోడి యింతియె కాని - యొకనిచేఁదగులు
నిన్నుఁ గ్రమ్మఱఁ గూడి - నెమ్మిఁ జేపట్టు
నెన్నికతోడ నే - నిటకు రాలేదు
వగవనేల ?" యటన్న - వసుమతీ తనయ
మిగుల శోకింప సౌ - మిత్రి మున్నైన
వారెల్ల వినఁగ న - వ్వామాక్షిఁ జాల
నీరసింపుచు రాముఁ - డిట్లని పలికె.
" ఏల యిచ్చటనిల్వ - నెందైన నీకు
మేలైన చోట కా - మిని ! వసియింపు 11020
మిన్ని పాటులు వడి - యేవచ్చు టెల్ల
నిన్నుఁ గైకొనుటకే - నీవేల తనకు
నెఱుఁగవే మనజాతి - నెవ్వారలైనఁ
బరులు పట్టుకపోవు - పడఁతి నేలుదురె ?
తోడితే రావణు - తొడలపై నుండి
కేడింప కతని కౌఁ - గిటిలోనఁ దవిలి
వానింట నిన్నాళ్లు - వసియించు నిన్ను
మానునె రాగాంధ - మతి రావణుండు
కామాతురుని చేతఁ - గాలాము గతిసి
వామ ! నీపాటి చె - ల్వము గల్గునింతి 11030
యున్న వాఁడేటికి - నూరక యుండు
నిన్నుఁ జూడఁగరాదు - నిలువకు మిచట

నేత్ర రోగంబు వా - నికి దీపకలిక
ధాత్రిపై మిగుల వే - దన సేయుకరణి
నినుఁ జూచి యేనోర్వ - నిమిష మేనియును
చనుమవ్వలికి కాక - చనకున్న నేమి
యీలక్ష్మణాంగదు - లీ విభీషణుఁడు
వాలితమ్ముఁడు నున్న - వా రిందులోన
వలసిన నొకరి క్రే - వల నుండు మేను
సెలవిచ్చితిని నీకు - చింత యేమిటికి? 11040
అన విని హాస్తిచే - నలమటఁ బడిన
వనిలోని సల్లకీ - వల్లకి రీతి
చెవులు చుఱుక్కని - చిల్లులు వోవ
నవమతిగాఁ బల్కు - ప్రాణేశు మాట
విని శోకముడిగి యా - వెలఁది కన్నీరు
తనచెఱఁగునఁ ద్రోచి - తమ్ములవంటి
కన్నుల కెంజాయఁ - గడలుకొనంగ
విన్నబాటున క్రోధ - వివశయై పలికె

—: సీత యీమాటలు విని యగ్నిహోత్ర ముఖమున తన పాతివ్రత్యము నెఱుకపఱచెదనని ప్రతిజ్ఞ చేయుట :—

"అయ్య! ప్రాకృత జను - లనురూపులైనఁ
దొయ్యలులను సిగ్గుఁ - దొఱఁగి యన్నట్ల 11050
యీమాట లాడుదు - రే నన్ను నిన్ను
నేమఱి నాశీల - మెఱిఁగి యుండియును
పెక్కుగాలంబు నీ - ప్రియనై మెలంగి
యక్కటా! పదినెల - లవ్వల నున్న

సందటిలో నన్ను - నొఁగాము లరయ
కందురే యిదినీకు - నపకీర్తి గాదె !
ఆడినట్టుల జెల్లుఁ - నన్న నీవిట్టు
లాడిన నే నదు - రాడ నేరుతునె ?
వట్టుక పోవుచో - పాపాత్ము మేను
ముట్టక తీరునె - ముందల వట్టి 11060
యీడుచు కొనిపోవ - నేదిక్కు చూచి
యేడుచు నపుడు ది - క్కెవ్వరు లేక
తగిలిన యపుడేను - దలఁచిన యట్ల
తెగిపోక యంగముల్ - తెకతేర యయ్యె.
ఇంత నీమదిఁ గల్గె - నేని నాతోడ
మంతనంబున హను - మంతుని చేత
గోరంత వినిపింపఁ - గోదవ లన్నియునుఁ
దీఱ నీతోడ బొం - దింతు ప్రాణములు.
అప్పుడట్లాడించి - యందటిలోన
నిప్పుడిట్లాడ నా - కెవ్వరు దిక్కు 11070
జనకభూపతికి వి - శ్వంభర కేను
జనియించితినటన్న - శబ్ద సూతకము
పై మోచుటయె కాని - ప్రకృతి దేహమున
స్వామి ! నేనొకటికి - జనియింపలేదు.
ఏ నయోనిజను నీ - హృదయ మేనెఱుఁగ
కీ నీచ దుర్భాష - లిటు వింటిఁ గాని
యే నెఱిఁగిన నీకు - నీ వానరులకు
మాను నాపదలు నె - మ్మది నుందు రచట

నమ్మని వాఁడవై - నను నిన్ను నేల
నమ్మి యుండుదును ప్రా - ణంబు లాసించి 11080
యిపుడైన దేమి న - న్నెఱిఁగించి మీకుఁ
గృప వుట్టఁ జేతు మీ - కిలిని మేలయ్యేఁ
జూడు మీ "వనుచు న - శ్రులురాలఁ దననుఁ
జూడని సౌమిత్రిఁ - జూచి యిట్లనియె.
" మాయన్న ! లక్ష్మణ ! - మంచి మాటాడె
మీయన్న యిది విన్న - మీకు నమ్మతమె ?
అందుల కేమి నా - యపరాధ దోష
మిందఱు చూడంగ - నివుడె శోధిచెదను.
అనలుని వెలిగింపు - మందులోఁ జొచ్చి
వనజాప్తకులము పా - వనము సేయుదును ; 11090
తెచ్చెద మీకుఁ గీ - ర్తి శిఖ ముఖములఁ
జొచ్చెద నే తెంపుఁ - జూతువు గాక !
అగ్నిసాక్షిగఁ బెండ్లి - యాడు రామునకు
నగ్నిసాక్షిగఁ దీర్తు - నపవాద భరము !
తామసించకు " మని - ధరణిజ వలుక

## —: శ్రీరాముఁ డందుల కియ్యకొనఁగా సీత యగ్ని ప్రవేశముఁ జేయుట :—

రామానుమతి సుమి - త్రాకుమారుండు
చితి పేర్చి యగ్ని రా - జించి పెన్మంట
లతిశయంబుగఁ జేసి - యది చూపుటయును
సీత రాముని ప్రద - క్షిణముగా వచ్చి
చేతులు మొగిచి యా - శ్రీరాము నెదుర 11100

"ఏను పతివ్రత - నేని శ్రీరాము
గాని యన్యుల మదిఁ - గామింప నేని
దైవముల్ సత్యంబుఁ - దప్పని వేని
పావకు కరుణ నా - పైఁ గల్గు గాక!
వసుమతి దిశలు దే - వబ్రాహ్మణులును
పశువు లాకాశంబు - వారి వాయువులు
సకల భూతములును - సాక్షులై సంధ్య
లోకసాక్షియై మింట - నున్న సూర్యుండు
ధర్మదేవతయు నం - దఱుఁ గూడి పుణ్య
కర్మంబులకుఁ దాము - కర్తలు గాన 11110
పాలు నిరును నేరు - పఱచు హంసముల
వోలికె దన దైవ - ముగ రాముఁ దలఁచి
కలకాల మేనిష్టఁ - గావించు తపము
ఫలియింపఁ జేయుఁ - డీపట్టున ననుచు
వలవచ్చి యాహవ్య - వహునిలోఁ జొచ్చి
కలఁగుచు నందఱుఁ - గన్నీరు నింపఁ
దనమేని చాయ పు - త్తడి బొమ్మ వోలి
కనుపింప దహనశి - ఖా మాలికలను
పుణ్యమంతయు దివం - బున డించి యపుడ
పుణ్యాంగనా మణి - పుడమిపైఁ బడినఁ 11120
గనిన మానుల వోలి - కపులు రాక్షసులు
కనుఁగొని మిగుల శో - కంబులఁ బొగుల
"అక్కటా! సీత నే - నరికట్టనైతి
మొక్కలంబున నేల - మోసపోయితిని
కడలేని శోకసా - గరము చేయీఁత

కడు వెడలఁగ నీఁది - కడపట యిట్లు
దురభిమానంబుచే - దోషమార్జింప
వెరలక యున్నాళ్లు - వెతలపాలగుచు
నా నిమిత్తంబుగా - నవయు జానకిని
పోనాడుకొంటి నా - పుణ్యహీనతను 11120
తుదమొదల్ గానఁగ నా - దుర్బుద్ధి చేతఁ
దుదిఁ గానవైతి చే - తో వేదనలకు ! ''

—: బ్రహ్మేంద్రాది దేవతలు ప్రత్యక్షమై సీత పాతివ్రత్యము లోకమునకుఁ దెలుపుట :—

అని చింత నొందుచో - నమరు లింద్రుఁడును
మునులు దిక్పతులును - మొదటివేలుపులు
హరుఁడును నజుఁడు చం - ద్రార్కులు ఖచర
గరుడ గంధర్వ య - క్ష ప్రముఖులును
దేవ యానముల పై - దివినుండి డిగ్గి
రావణ సమర ధ - రాస్థలి నిల్చి
తనకు సాఁగిలి మ్రొక్కు - దశరథాత్మజునిఁ
గని లేవ నెత్తి యా - ఖండలుం డనియె. 11140
సామాన్యుఁడవె నీవు ? - సర్వ లోకులకు
స్వామి వీశుఁడవు ర - క్షకుఁడవు మాకు
నిట్టిమహాసాధ్వినీ - జనకజను
నెట్లు త్రోచితి మందు - నింగలంబునను ?
ఈ మాటలాడ నో - రెట్లాడె నీకు ?

నా మానవతి యోర్పు - నదియె యిందులకు ?
దేవదేవుఁడవు సా - త్త్విక విగ్రహుండ
వీవసువులలోన - ఋతుధాముఁ డనఁగఁ
దనరువాఁడవు నీవు - ధాతలయందు
వనజగర్భుఁడవు దే - వతల నింద్రుఁడవు
సుద్రుల నెనిమిదో - రూపంబు నీది 11150
భద్రదాతవ సాధ్య - పంచమాత్ముఁడవు
నీకు శ్రోత్రము లాశ్వి - నేయులు శశిది
వాకరుల్ నీ నేత్ర - వారిజాతములు
వాయువు లూర్పులు - వనజ జాండములు
నీయందు నెప్పుడు - నిండుక యుండు
నట్టి విరాట్పూరు - షాకృతి వాఁడ
విట్టి ప్రాకృత కర్మ - మేల సేసితివి ?
నిన్ను నీ వెఱుఁగక - నిజమూర్తి మఱచి
విన్నఁ బోవుచు నేల - వెతలఁ బొందెదవు ? ”
అని పల్కినట్టి యిం - ద్రాదులఁ జూచి 11160
తను నెఱుంగుటకు నీ - తాకాంతుఁ డనియె.
“ తాను రాఘవుఁడను - దశరథ సుతుఁడ
నేనని మది నుంచు - టెంతియె కాని
యితర మే నెఱుఁగ నే - నెవ్వాఁడ బలుకుఁ
డతి కృపామతి మమ్ము - నడిగెద ” నవిన
నామాట లాలించి - యబ్జగర్భుండు
రామున కెల్లవా - రలు వినం బలికె.

## —: బ్రహ్మ శ్రీరాముని తత్త్వమును - మహాత్మ్యమును నెఱుక పఱచుట :—

" ఆదిపూరుషుఁడవు - వ్యక్త రూపకుఁడ
వాది మధ్యాంత క్రి - యా విదూరుఁడవు
క్షరుఁడ వక్షరుఁడవు - సర్వసాక్షివిని 11170
పరుఁడ వవ్యయుఁడవు - పంకజాక్షుఁడవు
కూటస్థుఁడవు జగ - ద్గురుఁడవు హరివి
హాటకాంబరుఁడ వ - ధ్యాత్మరూపుఁడవు
కాలమూర్తివి జగ - త్కర్తవు భువన
పాలకుండవు చక్ర - పాణి వీశుఁడవు
వేదవేదాంతార్థ - వీథీవిహారి
వాదిమహావరా - హావతారుఁడవు
తారకుఁడవు గదా - ధరుఁడవు శార్ఙ
ధారివి భయద నం - దక కరాగ్రుఁడవు
జయశీలుఁడవు పాంచ - జన్యహస్తుఁడవు 11180
భయనివారకుఁడ వా - పద్బాంధవుఁడవు
గరుడధ్వజుండ వా - ఖండలముఖ్య
సురవర మకుట భా - సుర చరణుఁడవు
పద్మామనః పద్మ - పద్మమిత్రుఁడవు
పద్మనాభుఁడవు కృ - పా వారినిధివి
శ్రీవత్స కౌస్తుభ - శ్రీవిరాజితమ
హావక్షుఁడవు త్రిగు - ణాత్మకాకృతివి
అచ్యుతానంత నా - రాయణ కృష్ణ
వాచ్యుఁడ వఖిల దే - వ స్వరూపుఁడవు
శతజిహ్వా శతశిర - స్కసహస్ర శృంగ 11190

శతశతపాద హ – స్త విశద్ధనుఁడవు
సవన హుంకార వ – షట్కారములను
హవిరన్న పాత్రంబు – లాహుతుల్ నీవ
నీవె సముద్రముల్ – నీవె యద్రులును
నీవె ద్వీపంబులు – నీవె లోకములు
నోషధులును నీవ – యుద్వియు నీవ
యోషధీశ్వరుఁడు సూ – ర్యుండును నీవ
నీవు గానిది లేదు – నీకు నన్యులను
నీవారు లేరు న – న్నియు నీవె కాని
నీ కేను హృదయంబు – నీజిహ్వవాణి 11200
నీకోప మనలుండు – నీతాల్మి విధుఁడు
నీనిమేషోన్మేష – నియమముల్ రాత్రు
లై నిండిన హాయంబు – లై విలసిల్లు
నీనిలుకడ భూమి – నీదు రోమంబు
లానిలింపులు తావ – కాజ్ఞ వేదములు
ఆత్రివిక్రమ మూర్తి – నాక్రమించితివి
యీత్రిలోకంబులు – నీసీత లక్ష్మి
నీవె విష్ణుండవ – నీస్థలిఁ బుట్టి
రావణహరణకా – రణ మయినావు
వచ్చిన పనియయ్యె – వైకుంఠమునకు 11210
విచ్చేయు మాత్మదే – వీ సమేతముగ
నినుఁ గొల్చునట్టి మా – నిత పుణ్యులైన
జనులకు నిహపర – సౌఖ్యముల్ గలుగు
నేనీకుఁ దెల్పిన – యీ స్తవరాజ
మేనరుల్ వ్రాసిర – యేన్వివిరేని

యాగము౦బులకు నీ - డది మదు క్తంబు
వేగుజాముల జది - విరె యేని వారు
పుణ్యులై యాదిమ - పూరుషార్థముల
గణ్యులై యతిశయ - కామితార్థములు
చేకూడి మహి౦ చిర౦ - జీవులై వీత 11220
శోకులై కలుషరా - సులఁ దొలగి౦చి
నిచ్చ కల్యాణముల్ - నిజగృహ౦బులను
పచ్చతోరణములు - పరగ నుండుదురు
తప్పదు బ్రహ్మాగీ - తలు ధాత్రియందు
నొప్పు నాచంద్రార్క - ముర్వీజారమణ!"

—: అగ్ని పరిశుద్ధయగు సీతను బ్రహ్మ శ్రీరామున కర్పించుట :—

అన విరించి యనుగ్ర - హ౦బుచే నపుడె
యానలుండు తనదు ని - జాకృతిఁ జేరి
పూసిన కుంకుమ - పుత్తడిచేల
వాసనా ప్రసవముల్ - వాడనికొప్పు
సురుచిరాంగము పొగ - ను౦అని రవిక 11230
తరళ మౌక్తికరత్న - తారహారములుఁ
గలిగిన త్రిభువన - కల్యాణి సీతఁ
దలిరాకు కెంగేలఁ - దమ్ములచేత
సన్నిధి కెత్తుక - చనుదెంచి మిగుల
మన్నన చెక్కుచె - మర్చక యుండ
మొదలింటి కై వడి - ముందఱ నుంచి
సదయాత్ముఁడై రామ - చంద్రుని కనియె

ఈసీతయెడ దోష - మేమియు లేదు
రోసంబు వుట్టించి - రోయ నాడితివి
పరమ పతివ్రతా - భరణమీసాధ్వి 11240
సురవైరి తనువట్టు - చో మేను మఱచి
శోకింపుచుండ న - శోకంబు క్రింద
నీకొమ్మ నతఁడుంచి - యింతులఁ జుట్టుఁ
గావలిగా నుండఁ - గట్టడి సేసె
రావణుఁ డొకవేళ - రాగాంధుఁ డగుచుఁ
దావచ్చి బెదరింపఁ - దలఁక కీయమ్మ
భావంబు నీకు న - ర్పణముఁ గావించి
ప్రాణాశ విడిచి దు - ర్భాషలాడుచును
"ప్రాణేశ! మాకు నా - పదవాపు" మనుచు
నుండు నింతియొకాని - యొండు లేదెఱిఁగి 11250
యుండుదు నేను ది - వ్యులు నిరీక్షింప
నీయింతిఁ జేపట్టి - హృదయంబుఁ జల్లఁ
జేయుము మిగుల నొ - చ్చిన దిన్నినాళ్లుఁ
దగవుఁ దప్పకుమన్న - దశరథాత్మజుఁడు
నగుమోముతోడ ధ - నంజయుఁ బలికె
-'సీత మనోధర్మ - శీల గౌరవము
లీ తెఱంగనుచు నే - నెఱుఁగనే యిపుడు
దనుజేంద్రు నింటిలోఁ - దడవుగానున్న
వనితను లోకోప - వాదంబు కొఱకు
మించ నాడితిని భూ - మిజ యందు చేతఁ 11260
గాంచెను సత్కీర్తి - గౌరవోన్నతులు
శిఖిశిఖాకల్ప సి - సీతను పంక్తి

ముఖుఁడేమి యన నోపు - ముట్టిన యపుడె
పొలియుఁడె నా యాజ్ఞ - భూపుత్రి వానిఁ
గలుషించి తిట్టక - కాచుట గాక
మీ యనుగ్రహముచే - మేలుతఁ గైకొంటి
నీయెడ ప్రథమాని - యిను డెట్టులుండు!
పాయునే సత్కీర్తి - పావనచరిత
నీయింతి నేనెట్టు - లెడవాసి యుందు!"

—: శ్రీరాముఁడు సీతను పరిగ్రహించుట ; శివుఁడు శ్రీరాముని పట్టాభిషిక్తుఁడవు గమ్మని చెప్పుట :—

అని వేలుపులకెల్ల - నంజలి చేసి 11270
జనకజ కరము హ - స్తమునఁ గీలించి
చెంగట నునిచిన - శ్రీరాము సర్వ
మంగళా రమణుఁడు - మదిమెచ్చి పలికె.
"అజుని మాటల కేమి - యదిమాళి దాపి
యజరులకును మాకు - నాశాస్యమైన
యట్టికార్యము సేయు - మవనిభారంబు
మట్టు కట్టితి వస - మాన శౌర్యమున
రావణుఁ దునుము కా - రణముగా మీర
లీవటకను జాల - యిడుములఁ గుంది
వైకుంఠమునకు నేఁగ - వచ్చునే? సీతఁ
జేకొని మరల మీ - రేమకుఁ బోయి
యడియాసనున్న మీ - యనుజులఁ దల్లి
యడలు వారించి ప - ట్టాభిషేకంబుఁ
జేకొని రాజ్యంబుఁ - జేసి భోగములు 11280

గైకొని బంధువ - ర్గము నాదరించి
హాయమేధముఖ్య మ - హాధ్వరక్రియలు
నియమముల్ దప్పక - నెఱవేర్చి దాన
ధరణీసురల నెల్లఁ - దనియించి ధర్మ
పరత నేకాదశా - బ్దసహస్రమవనిఁ
బాలించి తరువాత - పద్మజుమాట 11290
నాలింపు మీవు పూ - ర్ణావతారుఁడవు
వాఁడె మీతండ్రి ది - వ్యవిమానమెక్కి
నేఁడిదే మావెంట - నినుఁజూడవచ్చె
సీతయు నీవును - సేవింపుఁ"డనినఁ

—: దశరథ సందర్శనము :—

ప్రీతితోఁ దమ్ముఁడు - ప్రియయునుఁ దాను
నావిమానముఁ జేరి - సాష్టాంగ మెఱఁగి
లేవకున్నఁడఁ దానె - లేచి భూవిభుఁడు
కొడుకులఁ గోడలిఁ - గూడంగ నెత్తి
తడవు కౌఁగిటఁ జేర్చి - తన తొడలందు
నాసీనులుగఁ జేసి - యంగముల్ నిమిరి 11300
యాసుతుఁజూచి మ - హారాజు పలికె.

—: దశరథుఁడు, శ్రీరామునితో, సీతతో, లక్ష్మణునితో వేఱ్వేఱుగా మాటలాడి శ్రీరాముని పట్టాభిషేకము చేసికొమ్మని యంతర్హితుండగుట :—

శ్రీరామ ! నిన్ను బా - సి భరింపలేక
యారటింపుచును దే - హముత్యజించితిని.

ఈమునుల్ దివిజులు - నింద్రుండు నిన్ను
ప్రేమతోడ బహూక - రింపుదు రెపుడు
నమరావతీపురి - నఖిల సౌఖ్యములు
నమరికనైయుండ - వాత్మలోఁ దనకు
నిన్ను కన్నులఁ జూచి - నెమ్మదిలోన
నున్నత సౌఖ్యంబు - లొందితి నిపుడు.
ఆకైకమాటచే - నడవులకనిచి 11310
నీకిన్ని యవధులు - నేనచేసితిని
తనకు నీవంటి నం - దనుఁడు గల్గుటను
జనసుత స్వర్గాది - సౌఖ్యముల్ గలిగె
నిందాక నజుఁడాన - తీయఁగఁ జెవుల
విందుగా నీవు గో - విందుఁడ వగుట
వింటి సత్యము మన - వీటికి నరిగి
కంటు లేనట్టి మీ - కౌసల్యఁ జూచి
మాయన్న! కైకేయి - మాటలు మఱచి
నీయందు ననురక్తి - నిలిపిన భరతు
రక్షించి సకలసా - మ్రాజ్యంబు నేలి 11320
దక్షత నశ్వమే - ధంబులు చేసి
మఱిపోమ్ము వైకుంఠ - మందిరమ్మునకు
ధర నిల్పు మాచంద్ర - తారకఖ్యాతి
యనుచుఁ బల్మఱు మంగ - ళాశాసనములు
మనసారఁ జేసి ల - క్ష్మణుఁజూచి పలికె.
"మాయన్న! సౌమిత్రి! - మము నెడవాసి
మీయన్న విపినభూ - మిని జరియింపఁ
గనుఱెప్ప కైవడి - కాచి రేఁబగలు

వనమూలఫలముల - వలనఁ బోషించి
కాచిన ఫలమెల్లఁ - గని యదిమీఁద 11330
నాచంద్రతారార్క - మగు శోభనముల
నినుఁజూచి నామది - నెగులెల్లఁ దీఱెఁ
గనుఁగొంటిఁ బుణ్యలో - క సుఖంబులెల్ల
నిటమీఁద శ్రీరాము - నెప్పటియట్లఁ
బటుభక్తి గొలువుము - భద్రమయ్యెడును"
అని చాల దీవించి - యవనిజఁ గాంచి
తనమది యుప్పొంగ - దశరథుండనియె.
"పరమకళ్యాణి! నీ - పతిసేవ చేసి
యరలేని సౌఖ్యంబు - లందఁ జాలుదువు
నిన్ను మించఁగఁ బల్క - నీపతి నీకు 11340
వన్నెయు వాసియు - వన్నెయు వెట్టె
నతివ! నీకొఱకు బ్ర - హ్మాది దేవతలు
జతఁగూడి వచ్చిరి - చాలదే యింత!
పతియదైవంబని - భావించు నీదు
కతనఁ బావనమయ్యె - కమలాప్తకులము
రామునితో మన - రాజధానికిని
సేమంబుతోఁ జేరి - సిరులొంగు మీవు
నీకుఁ దెల్పెడిదేమి - నిను నెంచి వేఱ
వాకొన మతి పతి - వ్రతలున్నవారె?
అమ్మ! నెమ్మది నుండు" - మని రాముఁ బిలిచి 11350
యామానవతిని తా - నప్పుడొప్పగించి
"శ్రీరామ! నామాట - చెల్లించి మితముఁ
దీఱుచుకొంటివి - తిరుగ నా మనవిఁ

గైకొని పట్టంబుఁ - గట్టుకొ మ్మిప్పుడె
సాకేతనగరికిఁ - జనుఁడు మీర"నుచు
ముప్పూరి దీవించి - మున్నట్ల దివికిఁ
బువ్వుల తేరిపైఁ - బోయెనవ్విభుఁడు

—: శ్రీరాముఁ డింద్రుని వరముచే వానరులను
బ్రదికించుట :—

ఈరీతి దశరథుం - డేఁగిన మఱల
స్వారాజు శ్రీరామ - చంద్రునిఁ జూచి
" ఏము సన్నిధి చేసి - యేమైన మీకుఁ 11360
గామితార్థము లీకఁ - గడకుఁ బోరాదు
నడిగిన నిచ్చెద - నడుగుమీ"వనిన
కడుఁబ్రీతిఁ బొంది రా - ఘవుఁడు తాననియె.
" అయ్య ! నీవరమిచ్చు - నది నిక్కమేని
కయ్యంబులో నన్నుఁ - గాచి నాకొఱకు
నెందఱు ప్రాణంబు - లిచ్చిరి వీరి
నందఱ బ్రదికించి - యలుగులు నాఁటు
గాయముల్ మానిచి - కపులకు మొదటి
చాయల బలపుష్టి - సంపదలొసఁగి
యందఱ వారింట్ల - కనిచి భార్యలను 11370
నందనులను గూడి - నగచరులున్న
నెలవుల వనముల - నిండారఁ గాచి
ఫలియింప వీరున్న - పర్వతంబులను
జలసస్యసామగ్రి - చాలంగఁ గల్గఁ
దలఁచి కట్టడ చేసి - తము బంపుఁ"డనిన

సమరేంద్రుఁ డది మెచ్చి - యడిగిన వరము
నమరాగ సేతుమ - ధ్యావని కెల్లఁ
గలుఁగు గావుతను నా - కట్టడఁ దప్ప
దిల నెన్నటి నని - యిచ్చి పోవుటయు
బ్రహ్మాది దివిజులు - పరమహర్షమున 11380
బ్రహ్మణ్యుఁడగు రఘు - ప్రవరునిఁ జూచి
"రామ! క్రమ్మఱ వాన - రశ్రేణి వారి
సీమల కనుపుము - సీతతోఁ గూడి
వీరులు దొరలును - వెంటరాఁ బురము
చేరుము పట్టాభి - షిక్తుఁడ వగుచుఁ
బొమెద" మని వారు - పోయిన యంత

—: వానరులు సంతోషముతో తమ తమ నెలవుల కేగుట-
శ్రీరామాదులు సుఖముగనుండుట :—

నాయకచర వీరు - లమరేంద్రు కరుణ
నిదుర లేచిన రీతి - నిజ శక్తి శౌర్య
పదవులచే సేతు - బంధాది యందు
నెటులుండి రటులనే - హెచ్చి యుప్పొంగి 11390
పుటములు దాఁటుచుఁ - బొలిసిన వెనుక
నడచిన కార్యమె - న్నఁగ లేక లంక
కడఁ జూడ్కు లిడుచు సం - గ్రామ యత్నముల
నున్న వానరచమూ - యోధుల నెల్ల
మన్నించి నాఁటి కా - మర్కటోత్తములు
పాళెంబు నెప్పటి - పట్టుల డించి
తా లక్ష్మణుండు సీ - తయుఁ జేరి కొలువ

రామచంద్రుఁడు నాఁటి - రాత్రి సంపూర్ణ
సోమునిగతిఁ జాల - సుఖనిద్ర పొందె.

—: శ్రీరాముఁడు విభీషణునితో తా నయోధ్యకు వెడలుటకుఁ
బుష్పక విమానముఁ దెచ్చుట కాజ్ఞాపించుట :—

ఆమఱునాఁడు లం - కాధినాయకుఁడు 11400
రామలతోఁ గూడ - రాముని కడకు
వచ్చి " యోస్వామి ! ది - వ్య విభూషణములు
పచ్చి కస్తూరి మొదల్ - పరిమళంబులును
వలయు కడాని దు - వ్వలువలుఁ దెచ్చి
చెలువలు మీకొల్వ - సింగారమునకుఁ
గాచియున్నారదె - గైకొని లంకఁ
జూచి వత్తురు గాని - సోదరుఁ గూడి
యవధరింపుఁ డటన్న - నవనిజా ప్రియుఁడు
నవ్వు మోముతోడ దా - నవనాథుఁ బలికె.
" మాకుఁ దెచ్చిన యట్టి - మణి భూషణంబు 11410
లీ కట్టు కోకలు - నితర వస్తువులు
నీ రవితనయున - కిమ్ము సుగ్రీవుఁ
జేర నీవేమి యి - చ్చిన నవి మాకు
నిచ్చినంతటి కన్న - నిను మఱిఁ బ్రీతి
హెచ్చి యుండును మాకు - హితుఁడవు గాన "
అనినఁ దెచ్చిన సొమ్ము - లన్నియు భాను
తనయున కర్పించి - తనుఁ బ్రీతి సేయ
" ఓయి ! విభీషణ ! - యుండరాదిచట

మాయయయోధ్యకుఁ బోయి - మారాక కెదురు
చూచు మాభరతునిఁ - జూచినం గాని 11420
మా చింతలన్నియు - మదిఁ బాసిపోవు
నెన్నఁడు చేరుదు - నిదియె మార్గంబె?
ఎన్ని యామడ గల - దిచటి కయోధ్య
యంపుము పోయెద - మను రఘుపతికి
సంపూర్ణమతి విభీ - షణుఁడు తాఁబలికె.
దేవ! యిచ్చట మీరు - దేవేరితోడ
యీవేళ వసియించి - యేమెల్లఁ గొలువ
వసియింప మీకు సే - వలు సేయఁ జిత్త
మెస పోయుచున్నది - యే మిమ్ము నమ్మి
కాచిన భక్తుఁడఁ - గాన యిట్లంటి 11430
మీచిత్త మీమాట - మేకొనకున్న
మాయున్న ధనదుని - మణిపుష్పకంబు
మాయింట నున్నది - మాట మాత్రమున
నీదినంబున పగ - లింటిలో మిమ్ము
నో దేవ! మీకోస - లోర్విఁ జేర్చెదను!
అభిమతంబెయ్యది?" - యనిన రాఘవుఁడు
సభయాత్ముఁడగు విభీ - షణున కిట్లనియె.
" భరతునిఁ దల్లుల - బంధుల హితుల
దొరలను గుహుని భృ - త్యుల నమాత్యులను
నెప్పు డెప్పుడు చూతు - నేనను తమక 11440
ముప్పతిల్లుచు నున్న - దుల్లంబులోనఁ
గావలసిన యట్టి - కార్యంబులైన
యావల నిచ్చోట - నాలస్యమేల?

చిత్రకూటాద్రిపై - సీతయు నీ సు
మిత్రా తనూజుండు - మేమున్నయపుడు
భరతుఁడువచ్చి సం - భావించి మమ్ము
మఱల రమ్మనుచు స - మ్మతపడఁ జెప్పె
నాయన కిచ్చిన - యట్టి నమ్మికలు
మాయూరు చేరు నే - మమునకు మిఱియుఁ
ద్రోయరానివి గాని - త్రోచి నీమాట 11450
సేయమైతిమి పూని - చెల్లింపు మీవు
తప్పు సైరింపుము - ధనదువిమాన
మిప్పుడు దెప్పింపు - మిదినీకు మనవి!"

—: శ్రీరామునాజ్ఞ ప్రకారము విభీషణుఁడు పుష్పక విమానము శ్రీరాము నెదుటఁ బెట్టుట :—

అనిన విభీషణుఁ - డాత్మలో నితర
మననముల్ చాలించి - మయనిర్మితంబు
కామగమనమును - కల్పకప్రసవ
రామణీయకమును - రావణ కార్య
నిర్వాహకంబునౌ - నిజవిమానంబు
నుర్విజారమణుని - యొద్ద నుంచుటయు
నాపుష్పకముఁ జూచి - యఖిల వానరులఁ 11460
జూపి విభీషణుఁ - జూచి యిట్లనియె.

—: శ్రీరాముఁడు వానరులకు బహుమతుల నిప్పించి తా నయోధ్యకేఁగెదనని చెప్పుట :—

" వీరలందఱు నిందు - విడిచి నా కొఱకు
వారిధిఁ గట్టి రా - వణు సంగరమున

పనులకు వచ్చిన - బలవంతు లంద
ఱును గాన పేరుపే - రును వేఱువేఱఁ
గట్టువర్గంబులుఁ - గంఠమాలికలుఁ
గట్టురాకడియముల్ - కపురభాగములు
సోఁదులుముట్టు క - స్తురి కుంకుమముల
తోఁడ నిప్పింపు - మిందుకు తామసింప! ”
కన విభీషణుఁడు రా - మానుజ్ఞ చేత 11470
వనచర ప్రభులకు - వహులేరు పఱచి
నగరి సంప్రతి కర - ణంబుల చేత
నగలు మూఁటికి నర్థ - వణ చదువంగఁ
గపుల సుగ్రీవుని - కవిల వెంబడిని
తపనాన్వయుని సన్ని - ధానంబు నందు
బహుమానములు సేయఁ - బరికించి వారి
విహితవైఖరి రఘు - వీరశేఖరుండు
సుగ్రీవముఖ కపి - స్తోమంబు దాన
వాగ్రణిఁ బిలిపించి - నప్పుడిట్లనియె.
“ మీరలందఱు నాని - మిత్తంబుఁ గాఁగ 11480
నీరాక్షసులతోఁడ - నిన్నాళ్లు పోరి
మాకార్యమీడేర్చి - మహనీయ కీర్తిఁ
గైకొంటి రిండ్లకుఁ - గదలి పొండిపుడు.
ఏ నయోధ్యకును బో - యెద ”నన్న వారు
దీనులై రాఘవా - ధిపున కిట్లనిరి.

—: వానరులు శ్రీరామునితో తాము నయోధ్యకు వచ్చెదమని చెప్పుట :—

“ స్వామి! మమ్మెల్ల - నిచ్చట నుండి మీర
లేమిటి కనిచెద - రెక్కడ మిమ్ము

డించి యందఱ మేమి - టికిఁబోదు మనుస
రించి యయోధ్యాపు - రీలలామంబుఁ
గనుఁగొని కౌసల్యఁ - గాంచి నీతమ్ము 11490
లను జూచి హితులనె - ల్లను విలోకించి
పట్టాభిషేక వై - భవము వీక్షించి
పట్ట భద్రుండ వై - భద్రపీఠమున
నొప్పు సీతాసహా - యుని నిన్నుఁ జూచి
నప్పటి సంతోష - మాత్మల నుంచి
మఱికాని పోమ ”న్న - మాటలు మదికి

—:శ్రీరాముఁ డందుల కంగీకరించి సీతాలక్ష్మణ వానర సహితుఁడై యయోధ్యాపురి కరుగుట :—

సరిపోవుటయు విభీ - షణు వారివారి
భానుజాంగదనల - ప్రముఖ వానరులఁ
దానియ్యకొని సుమి - త్రా పుత్రుతోడ
జనకజతోడ పు - ష్పకరాజమునకు 11500
నినుమారు వలవచ్చి - యెక్కిన యంత
లంకలో దనుజులె - ల్లనుఁ దనుఁగొల్వ
లంకేశుఁ డెక్కె యు - ల్లాసిల్లె యుండ
వినసూనుఁ డగచరు - లెల్లను తన్నుఁ
గని కొలువఁగ పుష్ప - కము మీఁద నెక్కె
వానరదానవ - వ్రాతమంటికిఁ
దానుండఁ జోటిచ్చి - తపనీయ దేవ
యానంబు రివ్వున - నాకాశమునకు

భానురోచుల మించి - పాలంగ నెగసె.
అంచలఁ బూన్చిన - యాపుష్పకంబు 11510
మించె రాఘవుఁడు నే - మించు మార్గమున
నుత్తరాయణ వేళ - నుగ్రాంశు తేరి
పొత్తుగూడుక రయం - బునఁ బోవునపుడు
జానకీముఖ సార - సము విలోకించి
భానుతేజుఁడు రఘు - ప్రవరుఁ డిట్లనియె.

—: శ్రీరాముఁడు సీతకు పూర్వవృత్తాంతముల
నెఱింగించుట :—

"అలివేణి! కంటివే - యల్లదే లంక
యిలఁ బ్రాలు సురపురం - బిదియన మించి
యిది కపులను దైత్య - లెనసి పోరాడు
కదనంబు చోటిది - కనుఁగొమ్ము రమణి!
ఇచ్చోట రావణుం - డీల్గిన తావు 11520
వచ్చి మండోదరి - వాపోయె నతివ!
కూలెఁ నీరణభూమి - గుంభకర్ణుండు
తూలె నిచ్చట ప్రహ - స్తుఁడు చంచలాక్షి!
హనుమంతుచేత ధూ - మ్రాక్షుఁడిచ్చోట
యనిలోనఁ బొలిసె శీ - తాంశు బింబాస్య!
తునిసె విద్యున్మాలి - దురముఁ గావించి
మన సుషేణుని చేత - మానినీతిలక!
దురములో నింద్ర - జిత్తుని వధియించె

శరపరంపరల ల - క్ష్మణుఁ డలివేణి!
అంగన! యిచ్చోట - హతుఁడయ్యె వికటుఁ 11530
టంగద భీమబా - హాశక్తిచేత
నిచట నరాంతకుఁ - డిచట నికుంభుఁ
డిచట కుంభుఁడు మత్తుఁ - డిచట కుంభుండు
నిచ్చట నతికాయుఁ - డిచ్చట త్రిశిరుఁ
డిచ్చో మహాపార్శ్వుఁ - డిట మహోదరుఁడు
అత్రాసుఁడైన యూ - పాక్షుఁడు యజ్ఞ
శత్రు సప్తఘ్నులు - సమసి రిచ్చోట
సూర్య శత్రుండును - శోణి తాక్షుండు
ధైర్యవంతుఁడు వజ్ర - దంష్ట్రుం డిచ్చోట
నడఁగి రిచ్చట విరూ - పాక్షుండు గూలె 11540
మడిసె నిచ్చటఁ బోరి - మకరాక్షుఁ డబల!
జలరాశి దాఁటి యి - చ్చట నేము పాళె
ములు డిగి యున్న యి - మ్మ ధరాతనూజ!
సీత! వీక్షింపుము - సేతువు కపుల
చేతఁ గట్టించితి - సింధువు మీఁద
నిదియె మైనాకాద్రి - యిదిపయోరాశి
ఇది నాశరాగ్నిచే - నింకినచోటు
జలధి కట్టకమున్న - సకలవనాట
బలముతో యేమున్న - పాళె మీంచోటు
తరుణి! యీజలధి యు - త్తరపు గట్టునను 11550
స్థిరమతితో మహా - దేవుఁ డైనట్టి
జలరాశి ననువచ్చి - సంధించినట్టి

నెలవిది రావణు – నిఁక గాక వచ్చి
శరణు జొచ్చెను విభీ – షణుఁ డిందు నన్ను
గిరిచరుల్ మెలఁగు కి – ష్కింధ యీపురము
ఇది వాలిఁ జంపిన – యిరవు సుగ్రీవు
నెదనుఁ బట్టముఁ గట్టి – యిచట నిల్పితిని ”
అను నంత జానకి – ప్రాణేశుఁ జూచి

—: మార్గమధ్యమున సీతకోరికపైని సకలవానరుల
భార్యలను సుగ్రీవుఁడు తీసికొని వచ్చుట :—

“ అనఘాత్మ ! మనమయో – ధ్యకుఁ బోవునపుడు
వొంటిరియే రానేల – యుగ్రాంశు తనయు 11560
నింటిలో కులకాంత – లేనును గూడి
రావలెఁ బిలిపింప – రాదె ?” యనంగ
నావార్త విని రాముఁ – డాకాశవీథి
తన విమానము నిల్పి – తరణి నందనునిఁ
గనుఁగొని జానకీ – కాంతుఁ డిట్లనియె
“ నీవు నీవారల – నిజ గేహమునకు
నీవేళ నరిగి మీ – యింతుల నెల్ల
కై సేసి సకుటుంబ – కములుగా వచ్చి
యీసీత చెంగట – నింతుల నుంచి
మనమయోధ్యకుఁ బోవ – మనలనుఁ జూచు 11570
జనులకు సంతోష – జనకమై యుండు
జనకజ కిదియె ము – చ్చట మీరు వోయి

వనితల తోఁడి తే - వలయు నటన్న
వారువారలు నిజా - వాసముల్ చేరి
తారారుమాముఖ్య - తరుణులఁ గూడి
యందఱు నేతేర - హనుమంతుఁ డొక్క-
డందులో యిల్లని - యాలని లేక
తన బ్రహ్మచర్య వ్ర - తం బేరు పఱచె.
వనితలతోఁ గూడి - వనచరు లెల్ల
వచ్చి దివ్యవిమాన - వరముపై సీత 11580
యిచ్చిన చోటుల - నింతులు గొల్వఁ
గదిసి వానరులు రా - ఘవు నోలగింపఁ
గదలె నవ్వలఁ బుష్ప - కం బుత్తరముగ
సీత నెమ్మోము వీ - క్షించి రాఘవుఁడు
భూతలంబునను చూ - పులు నిల్పి పలికె

—: శ్రీరాముఁడు తిరిగి పూర్వవృత్తాంతములఁ దెలుపుట :—

అది ఋష్యమూకాద్రి - యచట సుగ్రీవుఁ
జెదరక చేపట్టి - చెలిమి సేసితిని
వాలిఁ జంపెదనని - వనచరేంద్రునకుఁ
జాల నమ్మికను నే - సంగితి నిచట
అల్లదె పంపా మ - హా సరోవరము 11590
పల్లవాధర! నిన్నుఁ - బాసి యేనిచట
నిదుర కంటికి లేక - నెగులుతో నిచటి
పొదలు వెంటఁ జరించి - పొక్కుడుచోటు

ఇది శబర్యాశ్రమం - బిచట కబంధుఁ
డెదిరించి పొలిసె దా - నిగురాకుబోఁడి !
నిది నీకునై దాన - వేంద్రుని తోడ
నెదిరి జటాయువు - మృతినొందుచోటు
నాతోడ ఖరదూష - ణ త్రిశీర్షాది
దైతేయు లెదిరించి - ధరఁగూలు చోటు
మానిని ! యల్లది - మనపర్ణశాల 11600
జానకి ! కనుము పం - చవటీస్థలంబు
తరుణి ! వీక్షింపు గో - దావరీ తటిని
చెఱవట్టె నిను నింద్ర - జిద్గురుం డిచట
నిది సుతీక్ష్ణాశ్రమం - బిది శరభంగ
సదనంబు ఋషుల యా - శ్రమము లన్నియును
నిది యత్రి యాశ్రమం - బిది యనసూయ
ముదముతో నీకు సొ - మ్మొసంగె నాఁడు
యిదె విరాధుఁ డెదిర్చి - నిరవగు నుమ్ము
మదిరాక్షి ! భరతుండు - మఱలి రమ్మనుచు
మనలఁ బ్రార్థించు ర - మ్య ప్రదేశంబు 11610
కొనలు మించిన చిత్ర - కూటాచలంబు
నిది భరద్వాజ ము - నీశ్వరా రామ
మిది యమునాపగ - యిదనుమ్ము యవన
మిది సరయూనది - యిది శృంగిబేర
మిది యేటి కిరువంక - యిదె సాలె తోపు
అల్లదె మన యయో - ధ్యాపురం బీవు
పల్లవాధర ! మ్రొక్కి - భావింపు మిపుడు "

—: అయోధ్యాపుర సందర్శనము :—

అనిన విభీషణుఁ - డర్క జాదులును
మనముల నానంద - మగ్నులై చూచి
యమరావతీపురం - బలకాపురంబు 11620
నమరునె యీడుజో - డని యెన్నిరేని ? ”

—: భరద్వాజు నాశ్రమంబున శ్రీరాముఁడు దిగి యాతనివలన
భరతుని వృత్తాంతము నెఱుంగుట :—

అని పొగడుచునుండ - నలభరద్వాజ
మునిచంద్రు నాశ్రమం - బునకు రాఘవుఁడు
తన విమానము డించి - తా నమ్మునీంద్రుఁ
గని భక్తితో నమ - స్కారంబు సేయఁ
గాంచి యమ్మునిరాజ - కంఠీరవుండు
మంచి దీవనలిచ్చి - మన్నించుటయును.
“ భరతుండు సాకేత - పట్టణంబునను
పరిణామమున ప్రజా - పాలనక్రియలు
మఱవక యున్నాఁడె ? - మాతల్లి ప్రొద్దు 11630
జరపుచున్నదె కవు - సల్య యానగరి ?
అందరికిని సేమ - మా ? నాప్రతిజ్ఞ
చిందు గానీక వ - చ్చితి నీదినంబు
పంచమి నేఁటితో - పదునాలుగేండ్లు
నెంచిన సరియయ్యె - నేనిల్లు వెడలి
భరతుఁ డీనెల శుక్ల - పక్ష పంచమిని
మఱచిపోవక మీరు - మఱలకయున్న

చెప్పెను దా తెంపు - సేయుదు ననుచుఁ
దప్పక యే నా మి - తంబున కతనఁ
గనుఁగొను వాఁడనై - కమనీయ పుణ్య 11640
ఘనులైన మీపాద - కమలముల్ చూచి
ఖేదముల్ మాని సా - కేతంబు చేర
వచ్చితి ననుమతీ - వలయును పోయి
వచ్చెద" నన భర - ద్వాజ సంయమియుఁ
దన మది రాము స - త్యపరాక్రమాది
వినుత చారిత్రముల్ - వేమాఱుఁ బొగడి
రాముని వదనసా - రసము నీక్షించి
యామునిచంద్రుఁ డి - ట్లని యానతిచ్చె.
"భరతుని మఱలఁగఁ - బనిచితిఁ గానఁ 11650
బురములోఁ దానుండఁ - బోవఁగఁదలఁచు
మీపాదుకలమీఁద - మేదినీభరణ
భూప చిహ్నములెల్లఁ - బూనించి యుంచి
జడలు దాలిచి చీర - శాటికల్ గట్టి
యెడవక మీరాక - కెదురులు చూచి
తెగువ నున్నాఁడు నం - దిగ్రామమునను
మగుడితి రతని నే - మంబు చెల్లించి
యతనియాజ్ఞను రాజ్య - మతిశయ శ్రీల
జతకట్టుకై వడిఁ - జాల మీఱెడును.

—: భరద్వాజుఁడు దివ్యదృష్టివలన నెఱిఁగిన వృత్తాంతముఁ దెల్పి శ్రీరామునిఁ బ్రశంసించి వరమడుగుమని కోరుట :—

దండకావని కేఁగు - తరి నవ్విరాధు 11660

ఖండించి శరభంగుఁ - గాంచి సుతీక్ష్ణ
మునిఁ జూచి కుంభసం - భూతునిఁ గొలిచి
వనులఁ గ్రుమ్మరి పంచ - వటి నిల్లు గట్టి
ఖరదూషణాదుల - ఖండించి దైత్య
వరుఁ డంప మారీచు - వచ్చినఁ దునిమి
భూమిజ మీరు గో - ల్పోయిన దుఃఖ
మేమని పల్కుదు - నెట్లు వేగితిరో ?
అన్నదమ్ములు మీరు - నాపదలొంది
మిన్నెల్ల విఱిగి మీ - మీఁదఁ బడ్డట్లు
పడరాని వెతలనుఁ - బడి జటాయువును 11670
పొడఁగని యాసీత - పోఁబడి గాంచి
చపలభావు కబంధుఁ - జంపి యాదనుజు
నుపదేశమున దక్షి - ణోన్ముఖులగుచుఁ
బోయి యాశబరిచేఁ - బూజలు గాంచి
యాయింతి ఋష్యమూ - కాద్రికిఁ బనుప
నచట పంపానది - హనుమంతుఁ గాంచి
యచలిత ప్రీతిమై - నాయన వలన
సవితృకుమారుతో - సఖ్యంబుఁ జేసి
దివిజేంద్రుసుతుని సా - ధించి కిష్కింధ
నినసూతి కర్పించి - యెల్లవానరులు 11680
జనకజ వెదకి తా - సామీరి వలన
నున్నచోటెఱిఁగి ప - యోధి బంధించి
యన్నిశాచరనాథు - ననిఁ దెగటార్చి
సీతతో మఱలి వ - చ్చిన నీతెఱంగు
చేతో విలోకన - స్థితి నెఱింగితిని.

అన్న ! నీవెంతటి - కవధికోర్చితివి !
నన్ను నేమఱక మ - నంబులో నుంచి
వచ్చితిగాన దే - వతలెల్ల మెచ్చి
యిచ్చిన వరముల - నేమైన గడవఁ
గలిగిన యేనిత్తుఁ - గైకొను మడిగి 11690
వలసినయవి "యన్న - వరతపోనిధిని
యాభరద్వాజుని - నంజలితోడ
నాభరతాగ్రజుఁ - డప్పుడిట్లనియె.

-: శ్రీరాముఁడు వానరులకు వనములోఁ గావలసిన ఫలహారములనొసగుమనుట - తానాశ్రమమున విశ్రమించుట :—

" అయ్య ! యీకపులయో - ధ్యాపురంబునకు
నెయ్యంబుతో వచ్చి - నీవారలెల్ల
చూతు మేమనుచు ని - చ్చోవచ్చినారు
నాతులతోఁ గూడి - నాదువెంబడిని
వారికిఁ దఱుగని - వనముల ఫలము
లారోగ్యకరమైన - యంబువుల్ గలుగ
మాయూరి పొలిమేర - మహినెల్లఁ గలుగఁ 11700
జేయుము నీ"వన్న - శ్రీరాముఁజూచి
" నీవన్నయట్ల మా - నెలవున నుండి
కావలసిన ఫలా - గములు తోఁపులను
నాయయోధ్యకును మూఁ - డామడచుట్టు
నాయాయి వేళల - నడిగిన యట్లు
వనచరులకుఁ గల్గ - వరమొసంగితిని
చనుము రేపటికి ని - చ్చట నేఁడు నిలిచి
యేమిచ్చు నర్చాదు - లిచ్చగింపుచును

మామాటఁ ద్రోయక - మన్నింపుమనిన
నందుకు రఘువీరుఁ - డౌఁగాక యనుచుఁ 11710
గందమూల ఫలాది - కమ్ములఁ దమ్ముఁ
దనియించు మౌనిబృం - దారక స్వామి
యనుమతిఁ గైకొని - యనుజుఁడు వినఁగ
రామచంద్రుఁడు సమీ - రకుమారుఁ బిలిచి

—: శ్రీరాముఁడు హనుమంతునితో తామువచ్చిన
వృత్తాంతము గుహభరతుల కెఱింగించి భరతుని
మన సెటులున్నదనియుఁ గనుఁగొని
రమ్మని చెప్పుట :—

"ఏము వచ్చిన రాక - యిప్పుడే పోయి
శృంగి బేరమున వ - సించిన గుహుని
యంగ ముప్పొంగఁ ద - థ్యముగాఁగఁ బలికి
యాయన చూపిన - యట్టి మార్గమున
మా యయోధ్యకుఁ బోయి - మావారిఁ జూచి
తెరువున నున్న నం - దిగ్రామ సీమ 11720
భరతునిఁ గనుఁగొని - పనిచితి మనుచు
మాపేరు నుడివి తా - మమ్ము రమ్మనుట
యాపుణ్యనిధిని పొ - మ్మని యేము వనిచి
చిత్రకూటము విడి - చిన యది మొదలు
ధాత్రిజఁ గోల్పోయి - దశకంఠుఁ దునిమి
మఱలి భారద్వాజ - మౌనీంద్రు చెంత
ధరణిజతో సుమి - త్రా పుత్రుతోడ
నేను వచ్చిన తెఱం - గింతయుఁ జెప్పి
యానన వికృతియు - నతని భావంబు
నింగితంబు నెఱింగి - యిప్పుడే రమ్ము 11730

వెంగలితన మాను - వినిపింపకున్న
తనతండ్రి యిచ్చిన ధర - యేలువాఁడు
తనకల్మి తెకతేర - దాయల కిచ్చి
యవివేకియైన తా - నన్యుఁడై యుండ
భువి నొడఁబడఁ - డేను పోరాదు పదరి
తల్లిని సకల బాం - ధవులను మనసు
చల్లఁగా జూచి తాఁ - జనుదెంచి నపుడ
యాడిన మాటలా - యనకుఁ జెల్లించి
వేడుక దీఱ మా - వీడెల్లఁ జూచి
యావల నెందేని - యరుగఁ దలంచి 11740
యవకాశమునికి ని - న్నటకుఁ బొమ్మంటి
వేళె యొక్కనిఁ బంప - విధముగా దీవు
నేరుతు వితరుల - నిలుకడల్ దెలియ
మారాక సహియించు - మాత్రంబు లేని
దారి యాభరతునిఁ - దలఁపులో నున్న
నెవ్వరు మాకేల ? - ఎప్పుడు నిన్ను
దవ్వుల జూచినం - తనె చేయిచూప
వలసినయెడకు ది - వ్య విమానమెక్కి
తొలఁగిపోదుము భర - తునికి మేలెంచి
పోయి రమ్మ”నిన యు - ప్పుడు శృంగిబేర 11750

—: హనుమంతుఁడు గుహునితో శ్రీరాముని రాక నెఱింగించుట :—

మా యంజనాసూనుఁ - డల్లనఁ జేరి
వానరత్వంబు వో - వదలి యావేళ
మానవుఁడై పవ - మానబాలకుఁడు

గుహునిఁ గన్గొని "రఘు - కుల పురందరుఁడు
మహితనూజాత ల - క్ష్మణుఁడునుఁ దాను
వచ్చి యిప్పుడు భర - ద్వాజాశ్రమమున
విచ్చేసి యున్నారు - వేఱు లేనట్టి
తెలివి నీవని - తమ దీమంబు నన్నుఁ
దెలివిడి సేయఁ బు - త్తెంచి నార"నిన
నాలింగనము చేసి - యానందవార్ధిఁ 11760
దేలి పేదకు పెన్ని - ధి యొసంగినట్లు
"అన్న! రాముని రాక - యానతిచ్చితివి
విన్నను పొంగె నా - వీనులుల్లమును
నెదురుగా నరిగెద - నిప్పుడ యనఁగ
నది విని హనుమంతుఁ - డాకాశమునకు
రయము మీఱఁగ నేఁగి - రామతీర్థంబు
పయిచార నేఁగుచు - భయదమైనట్టి
సాలవనంబును - జానపదములు
వాలుకి నదియు నా - వల గోమతియును
కని యయోధ్యకు రెండు - గడియల నేల 11770
వనరాశి తనచుట్టు - వర్ణనీయముగ
నెసఁగు నందిగ్రామ - మీక్షించి యొక్క
దెసగ్రావాలి పావని - తేటిచూచుటయు

—: నందిగ్రామమున మునివృత్తిలోనున్న భరతుని హనుమంతుఁడు సందర్శించుట :—

జడలు కృష్ణాజిన - శాటియుఁ దాల్చి
యొడలు శ్రీరాము వి - యోగంబు చేత
మిగులఁ గృశింపఁగ - మేదినిమీఁద

వగలతో "నెప్పుడు వచ్చు - మాయన్న
రాఁడాయె నేఁటికి - రాకుండు నేఁడె
రాఁడేని తనదు వా - ర్త వినంగలండు!"
అని కందమూల ప - ర్ణాశనుఁ డగుటఁ 11780
దనువు డయ్యంగ గా - త్రము మైలవాఱ
బ్రహ్మర్షి తేజుఁడై - పాదుకాయుగము
బ్రహ్మాదికృతతపః - ఫల మాగమాంత
వాదరహస్యాది - వాస మాశ్రితుల
చేదోడు యోగుల - చేయూఁతకోల
ధార్మికులకు నెల్ల - దరిదాపు విబుధ
శర్మద మమర పూ - జన నిజాగ్రంబు
మున్నిడుకొని తాను - ముద్ర వర్షించి
యన్నికార్యములుఁ ద - దర్పణంబులుగ
మెలఁగుచు దనచుట్టు - మెలఁగు నయోధ్య 11790
కులము బంధులుఁ గావి - కోకలు దాల్చి
తనయట్ల దేహ యా - త్రలు నడపింప
జనులు చింతిల వ్యాఘ్ర - చర్మంబు మీఁదఁ
గలధర్మమెల్ల సా - కారమై వచ్చి
నెలకొన్నగతి నున్న - నిర్దోషు భరతుఁ
గాంచి కేల్మోగిచి డ - గ్గఱఁ జేరి యాతఁ
డుంచిన యెడనుండి - యొకమాట వలికె

—: హనుమంతుఁడు భరతునితో రామసందేశము నివేదించుట :—

"అనఘ! యెవ్వఁడు దండ - కాటవి కేఁగ
మునివేషధారియై - మునులతోఁ గలసి
నీవెంత రమ్మన్న - నెడ రాక నీకు 11800

నీవిచారము చేసి - యేఁగె నవ్వలికి
నట్టి మాయన్న ఘో - రాటవి నిల్లు
గట్టుక యొంటిగా - ఖరుని దూషణునిఁ
ద్రిశిరుని పెక్కు - దైత్యులఁ గినిసి
యశని కల్పములైన - యస్త్ర జాలములఁ
బోరిలో వధియించి - పొంచి రావణుఁడు
చోరకృత్యమున భూ - సుతఁగొని చనిన
మారీచుఁ జంపి ల - క్ష్మణుఁడును దాను
శ్రీరాముఁ డాసీతఁ - జెఱవోవు టెఱిఁగి
వగలతో వెదకుచు - వచ్చి సుగ్రీవు 11810
పగదీఱ వాలినిఁ - బడనేసి యతని
పట్టున సుగ్రీవు - పట్టంబు గట్టి
చుట్టును గల కపి - స్తోమంబు గూర్చి
సీత పోఁబడి విని - సింధువు గట్టి
దైత్యేయ విభుమీఁద - దండెత్తి విడియ
నసురేంద్రుఁ బుత్రమి - త్రాదుల తోడ
నసమానశౌర్య స - హాయుఁడై చంపి
యారావణుని తమ్ముఁ - డగు విభీషణుని
శ్రీరాముఁ డాలంకఁ - జేపట్ట నునిచి
దివ్యపుష్పకముపై - దివ్యులు మెచ్చ 11820
నవ్వయ జయశాలియై - సీతఁ గూడి
సౌమిత్రితోడఁ గీ - శ శ్రేణితోడ
రామచంద్రుఁడు జగ - ద్రక్షావినోది
వచ్చి భరద్వాజ - వనములో నిలిచి
యిచ్చటి కావార్త - యెఱిఁగింపు మనుచు

నను బంచె గాన వి - న్నపము చేసితిని
మనముల ఖేదముల్ - మాను మీరెల్లఁ
జూడ విభీషణ - సుగ్రీవ ముఖులఁ
గూడిన శ్రీరాముఁ - గువలయశ్యాము !"

—: భరతుఁడు శ్రీరాముని వృత్తాంతము వినఁగనే యత్యా
నంద భరితుఁడై హనుమంతుని ప్రశంసించి, యాతని
వృత్తాంత మడుగుట :—

అనువార్త వీనుల - నానిన యంత 11830
తన మేను మఱచి యు - త్కట నిజానంద
పరవశతను భూమి - పై వ్రాలి తెలిసి
భరతుఁడు కౌఁగిటఁ - బావనిఁ గూర్చి
కన్నులందు ముదశ్రు - కణములు దొరఁగ
సన్నుతింపుచును ప్ర - సన్న భావమునఁ
దమ్మునిఁ జూచి "సీ - తా మనోహరునిఁ
గ్రమ్మఱఁ జూచు భా - గ్యంబు చేసితిమి
నరులెవ్వరైన ప్రా - ణములతో నున్నఁ
బొరయుచుందురు సుఖం - బులు కీడుఁ దొఱఁగి !
ఎంత పుణ్యాత్ముఁడో - యీతఁడీపాటి 11840
సంతోషవార్త ప్ర - సంగించె ?" ననుచు
" ఎవ్వఁడవన్న పే - రెయ్యది నీకు ?
నివ్వార్తఁ దెచ్చితి - వెంత పుణ్యుఁడవు !
దివిజుఁడవో ధర్మ - దేవత వేమొ
అతని పుణ్యముల ప్రో - వైన మర్త్యుఁడవో !
పలుకవే సకల లో - భన హేతు కార్య

విలసనంబగు మాట - వింటి నీచేత !
అందుల కేమిత్తు ? - నావులు లక్ష
యందుపై దురగ స - హస్రంబు నుంచి
నిండుపాయంపు క - న్నెలఁ బదార్వురిని 11850
పండు పంటల నూట - పదిగ్రామములును
తనకు రాముఁడు ప్రమో - దంబుతోఁ జేయు
ఘనమైన యుంబళి - కను సగఁ బాలు
నిచ్చెద నీకు నా - హృదయంబులోని
ముచ్చటఁ దీఱ రా - ముని వార్త దెచ్చి
బ్రదికించితివి నీకుఁ - బ్రత్యుపకార
మది లేదు నీవాఁడ - నై యుండువాఁడ !
కలఁగంటె నొక్కొ ? ని - క్కమొ ? యంచు నాదు
తలఁపు ఖేదమునఁ గొం - దలము నందెడును
నమ్ముదునే నీయు - వంత కళ్యాణ 11860
సమ్మతామృతవచో - సంగతు " లన్న
భరతు నాసన్నుఖు - భతరుని గాంచి
శరనిధి గర్వభం - జన దానుఁడనియె

—: హనుమంతుఁడు భరతునితోఁ దనయుదంతముఁ దెలిపి శ్రీరామ సమాగమగునని చెప్పుట :—

" వానరుఁడను జాతి - వాయువు తండ్రి
ఏను సుగ్రీవుని - హితుఁడ నాపేరు
హనుమంతుఁ డందు - రే నంజనాదేవి
తనయుఁడ రామదూ - తను తానె కాదె
వనధి లంఘించి యా - వసుమతీ తనయఁ

గని రామ ముద్దుటుం - గరమంది యిచ్చి
యామానవతి చేత - నాఁదల నున్న 11870
యేమఱలఁగ నంది - యిలపట్టి మనుచు
నాయశోకారామ - మంతయుఁ బెఱికి
చాయ సేసుకరాక - చలపట్టి నిలిచి
యక్షాదులగు రాక్ష - సావళి నెల్ల
శిక్షించి యల యింద్ర - జిత్తుని చాల
తగిలినట్లున పోయి - దశకంఠుఁ జూచి
తెగి పల్కఁ దనమీఁదఁ - దెగి దశాననుఁడు
తోఁకఁ గాలిచి పాఱఁ - ద్రోలుఁడటన్న
నోఁకోర్చి వాలమూ - ర్చుచు లంక యెల్లఁ
గాలిచి మరల సా - గరమేను దాఁటి 11880
యేలిన స్వామితో - నెఱిఁగించుటయును
నప్పుడే బహువాన - రావలితోడ
నప్పంక్తిముఖునిపై - నబ్ధి గట్టించి
దండెత్తి లంక కొం - దల మంద విడిసి
భండనంబున మహా - పార్శ్వ యూపాక్షుఁ
గుంభకర్ణ నరాంత - కుని నతికాయుఁ
గుంభుని దేవాంత - కుని మహోదరుని
దుర్జయు నింద్రజి - త్తుఁ బ్రహస్తుఁ ద్రిశిరు
నిర్జించి బహుదైత్య - నికరంబు గూల్చి
రావణు భువన వి - ద్రావణుఁ గూల్చి 11890
యావిభీషణు లంక - కధిపతిఁ జేసి
వచ్చిరి తేపె మీ - వారును మీరు
గ్రుచ్చి కౌఁగిళులఁ జే - ర్చుచుఁ బ్రమోదమున

నుందురు గురుపుష్య - యోగంబునందు
సందర్శనమునకు - శ స్తమైయుండు
నీమాట నిజమన్న - నెంతయు మెచ్చి
రోమహర్షమున శ - త్రుఘ్నునిఁ జూచి

—: భరతుని యానతిని శత్రుఘ్నుఁ డయోధ్య నలంకరింపఁ జేసి కౌసల్యాది రాజమాతలను దోడ్కొనివచ్చుట :—

" ఇప్పు డయోధ్యకు - నేఁగి వీథులను
చప్పరంబులు ముత్తె - పసలు జల్లులును
మేరువుల్ కురుజులు - మేలుకట్లులును 11900
తోరణంబులు బహు - ధూప ధూమములు
నవరంగవల్లికల్ - నవరత్నముఖ్య
వివిధవస్తుసమగ్ర - విపణిమార్గములు
కదళికాక్రముకేక్షు - కాండప్రకాండ
సదమల స్తంభరా - జన్మంటపములు
మాధవాయత నివి - మాన సౌవర్ణ
సౌధకింకిణికాధ్వ - జచ్ఛత్రములును
సమరింపు మైదువు - లందఱుఁ గూడి
తమకరంబుల నక్ష - తలును బువ్వులును
కలయఁజల్ల నమర్చి - గంధేభకోటి 11910
కలధౌతమణిమయా - కల్పయుక్తముగ
నిండు సంజోకవ్రా - సిన హయబృంద
మండలి రాఁగఁదూ - ర్యములు ఘోషింప
రాజులు గలధౌత - రథసహస్రములు
రాజీవనములను - రాణువదొరలు

హితబంధుజన పురో - హిత వీరభటులు
జతకట్టుగాఁగఁ గా - సల్యాదులైన
తల్లులు దాసీ వి - తానంబుఁ గొలువఁ
బల్లకీల నమర్చి - పౌఁజులు దీర్చి
యెదురేఁగవలయు నీ - విటులమరించి 11920
యుదయ వేళకు మన - యూరికిరమ్ము
జగతి నందిగ్రామ - సాకేత మధ్య
మగు మహాపథము చా - యగఁ జక్కఁజేసి
కలయంగ కస్తూరి - కలయంపి చల్లి
కొలఁది ముత్తెంపు ము - గ్గులు దీర్పఁ జేసి
యమరింపు "మని పల్క - నతఁడట్ల వోయి
తమ యన్న యాజ్ఞ యూరఁ - దలఁ దాల్చియపుడె
కై సేయఁబనిచి - బంగరు పల్లకీల
కౌసల్యను సుమిత్రఁ - గైకేయి నుంచి
నగరెల్ల నమరేంద్రు - నగరంబు రీతి 11930
మిగుల శృంగారింప - మితికట్టి మఱల
నందఱితోఁ గేక - యతనూజు సుతుని
ముందఱ నిల్చిన - ముదమంది యతఁడు
నుదయ వేళను నిజా - భ్యుదయంబుఁ గోరి

—: భరతుఁడు వారందఱితో శ్రీరాముని దర్శింపనేగుట :—

కదిసి వాయుఁజుఁడు చెం - గట రాఁగఁ గదలి
తానుఁ దమ్ముండు శ్వే - తచ్ఛత్రచామ
రానీకములతోడ - నర్చనల్ చేసి
రామపాదుకల శి - రంబుపై నుంచి

సౌమిత్రి వెంటరాఁ - జతురంగబలము
ముందఱ వెనుకరా - మొనగాఁగ నభము 11940
నందుఁ జూపులు నిల్పి - యాసాస వచ్చి
రాముని పుష్పక - రాజంబు దిశల
నేమేరఁ గానక - యిచ్చఁ జింతించి
హనుమంతు మోముఁగ - టాక్షించి పవన
తనయుని మాట త - థ్యంబని యెంచి
నమ్మినేచాల నం - దఱఁ గూర్చి భూజ
నమ్ములచే నెల్ల - నవ్వఁ బాలైతి!
" ఏమి చేసిన తీరు - నీఁక నిన్ను క్రోఁతి!
ఈమాటలాడ నే - యిది కల్లయనక
పదరి వచ్చితి నీస్వభావంబుఁ దప్ప 11950
దదియేల నేఁడెంత - యపకీర్తి వచ్చె"
అని కనరుట్టంగ - నాడిన మాట
విని వాయుజుఁడు రఘు - వీరునకనియె.
" అయ్య! నన్ను నసత్య - మాడితివనుచు
నెయ్యది చూచి నీ - విట్లు పల్కితివి?
వాణి యాగముల - పసియించినాడు
వాణియై కౌసల్య - వాశియై మించె
హనుమంతుఁడును కల్ల - లాడునే? మింట
వినివచ్చె ఘూర్ణిత - విశ్వమై రవము!
ఆమహారవము వ - నాటసముహా 11960
భీమకోలాహలా - భీలమ్ము సుమ్ము
అలభరద్వాజ మ - హాప్రసాదమున
నిలమీఁద తరువు - లేయెడ నిండఁబండి

యునికిచే వాచవి - నూరటల్ గాఁగ
వనచరుల్ మెసవుచు - వచ్చుటఁ జేసి
యిందాకఁ దడసినా - రిప్పుడీ భాను
నందన రిక్షేశ - నలతారవాలి
నందనగజ సుషే - ణగవాక్షపనస
మైందద్వివిదగంధ - మాదనకుముద
కేసరి రిషభాది - కీశులతోడఁ 11970
జేసెదు చెలిమి ని - శీధినీచార
సార్వభౌముని విభీ - షణుని సంతోష
పూర్వకంబునఁ జూచి - పొంగనున్నావు ! ”
అని పల్కి చేచాఁచి - “ యదె వచ్చెఁగనుము
వనజారినిభము ది - వ్యవిమానవరము
నది చూచి సేవింపు - మజనిర్మితంబు
కదిసి కన్గొనుము రా - ఘవుఁడల్లవాఁడె !
అది మహీసుత సుమి - త్రాత్మజుఁడతఁడు
నదె వానరస్తోమ ” - మనఁ బ్రమోదమునఁ
గనుఁగొని సాష్టాంగ - క ప్రణామంబు 11980
లొనరింప రాముని - యోగితంబగుచు
నావిమానము ధాత్రి - కల్లనవ్రాలఁ
దావచ్చి యున్న పా - దద్వయంబునకుఁ
బ్రణమిల్ల నెడవాసి - బహుదినంబులకు

—: శ్రీరామ భరత సమాగమము - భరతుఁడు శ్రీరాముని రాజ్యభారము వహింపుమని పాదుకలు తొడుగుట :—

గుణవంతుఁడగు కైక - కూరిమిపట్టిఁ
గాంచి యాసందాత్రు - కణముల మేను

ముంచి గారాబు త - మ్ముని గౌఁగలించి
తొడలపై నిడుకొని - తొఁగరుఁ గెంజాయ
జడగట్టినట్టి మ - స్తము మూరుకొనుచు
లాలింప భరతుఁ డి - లాసుతఁ గాంచి 11990
యాలేమ కెందమ్మి - యడుగుల వ్రాలి
సౌమిత్రిఁ గని " విభీ - షణ! నీవుఁ గలుగ
స్వామికి జయకీర్తి - సౌఖ్యముల్ గలిగె!
ఓయి! సుగ్రీవ! నె - య్యుఁడవైన నీవు
మాయన్నఁ జేపట్టి - మనుజాశ నేంద్రు
సమయంబు మఱల నీ - జనకజ మాకు
సమకూర్చితివి మాద - శరథ భూపతికి
నేవుర నందను - లేవురమైతి
మీవల సౌభ్రాత్రు - హితచర్యలకును
నైదుగురము మన - మన్న దమ్ములము
లేదరమర యొక్క - లేశమేనియును"
అని రామచంద్రుని - యడుగుఁ దామరలఁ
దన చేతి పాదుకా - ద్వయ మొయ్యఁ దొడిగి
"స్వామి! దేవర బొక్క - సమును భండార
మేమరకే కాచి - యిన్నాళ్లు దాఁచి
యభివృద్ధి చేసితి - నంగీకరింపు
మభిమానముంచి స - ప్తాంగరక్షణము
చేసితి ముద్రఁదా - ల్చినవాఁడఁ గానఁ
జేసితి పట్టాభి - షేకంబు నేను
పాదుకాయుగళి కా - బరు వింకఁ దీఱె! 12010

మీఁదు సొమ్మంతయు - మీకు నిచ్చితిని
యివె బీగె ముద్రలూ - హింపుఁడందఱును
రవివంశతిలక ! మీ - రాకలు గోరి
కాచి యున్నారని - కడకుఁ బోవుటయుఁ

—: శ్రీరాముఁడు వసిష్ఠునికి కౌసల్య మొదలగు రాజ మాతలకు మ్రొక్కి వారి దీవనలు గొనుట :—

జూచి రాముఁడు వ - సిష్ఠుని పాదములకు
సాగి మ్రొక్కుటయుఁ గౌ - సల్యాది జనను
లా గుణసాగరు - నండకే తేర
వారికి మ్రొక్కిన - వారు దీవించి
యోరగా శత్రుఘ్నుఁ - డుల్లంబు వొదుల
రామచంద్రునికి ధ - రాతనూజకును 12020
సౌమిత్రికిని భక్తి - సాగిలి మ్రొక్కి
యుపలాలనములొంద - యుర్వీజనాళి
యపుడు మేరువు మీఁది - యర్కునిరీతి
మానిత దివ్యవి - మానంబులోన
జానకీపతిఁ జూచి - జయజయధ్వనుల
మొగడతమ్ములవంటి - ముకుళితహస్త
యుగముతో సందఱు - నోలగింపంగ
నవరత్నమయ భూష - ణములు మాణిక్య
నివహాకిరీటముల్ - నెమ్మనులందుఁ
గుంకుమలును మెఱుం - గుఁ గడాని వ్రాళ్లు 12030
నుంకులు రాల్చు మం - జులదుకూలములు
చికిలి నఖానుదీ - ర్చిన కెంపుఁ బొడుల

యెక్కిదుమీలునుమట్టి - నెసఁగు జందెములు
కండెముల్ దిరిగిన - కమనీయబాహు
దండముల్ నిలుపుల - దండపూనికెలు
రొమ్ములు నసురవీ - రులు వైచువాఁడి
యమ్ముల జీఱలై - నట్టి గాయములు
తొడరి వేల్పులనైనఁ - ద్రోలుదమనెడి
పొడిచి గెల్చినయట్టి - పొగరులు గలిగి
రాజసంబులుమీఱు - రాజవేషముల 12040
రాజీవహితకుమా - రకుఁ గాచియున్న
యంగదముఖ్యమ - హాకపివీర
పుంగవులనుఁ జూచి - భుజములుప్పొంగ
భరతుండు జానకీ - పతిఁజూచి "స్వామి
పురికి విచ్చేయుఁ డి - ప్పుడు మంచివేళ

—: భరతుని కోరికననుసరించి భరతాశ్రమమునకు శ్రీరాముఁడు వచ్చి పుష్పకవిమానమును కుబేరున కనుచుట :—

పట్టాభిషేక సం - భ్రమము నీవొంది
కట్టిన నుదుటికం - కణముఁజూడ్పు మిపుడు"
అని విభీషణ భాను - జాదులందఱును
మనముల ననురాగ - మగ్నులౌనంత
వెంట వచ్చినవారు - వెనుకొని భరతు 12050
వెంట వచ్చినవారు - వింజమూకిడిన
కైవడి దనపుష్ప - కము మీఁద నుండ
రావణారాతి య - భ్ర పదంబునందు
తొడమీఁది భరతుని - తో మహీసుతకుఁ

బుడమి వింతలు దెలు - పుచు వచ్చివచ్చి
భరతాశ్రమంబులో - పల విమానంబు
ధరవ్రాల నియమించి - తనవారు తాను
నందఱు డిగి యాము - హా పుష్పకంబు
చందనప్రసవ పూ - జా పూర్వకముగఁ
బొమ్ము కుబేరుని - పురమున నతని 12060
యిమ్మున వసియింపు - మేవేళ ననుచు
ననిచి యింద్రుండు బృ - హస్పతితోడ
ననసిన కై వడి - నినవంశ్యులైన
జనపాలకులకు నా - చార్యుఁడా బ్రహ్మ
తనయు వసిష్ఠుఁ గుం - దనపు గద్దియను
నాసీనుఁడుగఁ జేసి - యందఱితోడ
నాసభఁ గేల్మోడ్చి - యవనిజా ప్రియుఁడు
నిలిచి యున్నడ రాము - ని మొగంబు చూచి
బలగమంతయు విన - భరతుండు పలికె

—: భరతుఁడు శ్రీరాముని రాజ్యభారము వహింపఁ ప్రార్థించుట :—

"ఓదేవ ! యతినిష్ఠ - నుగ్రతపంబు 12070
లాది నేఁ బెక్కు జ - న్మాంతరంబులను
చేసిన సుకృత వి - శేష మీతఱిఁ బండఁ
జేసె క్రమ్మఱను మీ - శ్రీపాద యుగళి
మాతల్లి మిము వేడ - మనవి చెల్లించి
యాతరి నాకు రా - జ్యం బొసంగితిరి !
ఏను గ్రమ్మఱ మీకు - నిచ్చితి వృషభ

మాను భారము వత్స - మానలేనట్టు
లీవువహించు మ - హీభారమేను
భూవరతిలక ! యో - పుదునె ధరింప ?
కట్టువ లంబువే - గంబుచేఁ బగిలి 12080
నట్టికైవడి యొక్క - పైన కార్యముల
ఛిద్రాస్పదంబైన - క్షితియేల రామ
భద్ర ? నీచేఁగాక - పరులకు నగునె ?
ఖరము నేర్చునె తురం - గముఱీతిఁ బఱవఁ ?
గఱిగాకి హంసంబు - గతి మింటఁ జనునె ?
కరిమాడ్కి నడచునే - గ్రామ సూకరము ?
హరియాన తానెంత - యైన శ్వానంబు
గతి నీవెకాక నీ - గతి మెలంగుటకు
నితరుఁడర్హుఁడె ? తాల్చు - మిలయెల్ల నీవు
చెట్టొక్కఁడుంచి పో - షింప నాతరువుఁ 12090
బట్టుగాఁ జూచియు - ఫలమంద నట్లు
అకట ! నీ నేలని - యట్టి యయోధ్య
తెకతేర పతిఁబాయు - తెఱవయై యున్న
రాజ్యంబుఁ గైకొని - రక్షింపు మమ్ము
పూజ్యుల బహుమతిఁ - బోషింపు మీవు.
అవనిజఁ గూడి సిం - హాసనాగ్రమున
రవివంశతిలక ! మీ - రలు వసియింప
నవనీజనంబు మ - ధ్యందినోదగ్ర
రవితేజు నినుఁజూచి - రంజిల్లుఁ గాక !
వైతాళికులగీత - వాద్య ఘోషముల 12100
చేత నిద్దుర లేచి - సీతయు నీవు
గ్రక్కునఁ గొల్వు సిం - గారమై వచ్చు

చక్కదనంబు లో - చన పర్వముగను
చూచెద మభిషేక - శోభనంబంది
యాచంద్రతారార్క - మవని యేలుచును
మహిమండలము శింశు - మార చక్రంబు
రహిమించు దినములు - ర్వార యేలుమీావు!"

—: శ్రీరాముఁడు భరతుని ప్రార్థన మంగీకరించి, వసిష్ఠాను
మతమునఁ బట్టాభిషేకమునకు నయోధ్యకు నలంకృతుఁడై
వెడలుట :—

అనిన నప్పుడె వసి - ష్ఠాను మతమున
ననుపమంబైన సిం - హాసనాగ్రమున
వసియింప మంగళుల్ - వచ్చి నిల్చుటయుఁ 12110
బిసరుహాప్తతనూజుఁ - బ్రియసహోదరుల
నల విభీషణుఁ బిల్చి - యాయుర్విధాన
కలన కర్మము మున్ను - గా నడిపించు
జడ లొయ్యఁగడిగించి - శార్దూల వృత్తి
సడలించి మంగళ - స్నానంబు చేసి
యున్నెడ పెద్దలు - నునిచిన హెచ్చు
మిన్నల సొమ్ములు - మేల్మి వస్త్రములు
పరిమళమ్ములతోడి - భరణులఁ దెచ్చి
భరతుఁడప్పుడు రఘు - పతి ముందల నిల్వ
లక్ష్మణ సీతాదు - లనుగూడి రాజ 12120
లక్ష్మి వివాహ వే - ళకుఁ దగినట్టి
శృంగారములచేత - నెసఁగిన వేళ
సంగడిఁ జేరి కా - సల్య పొంగుచును

తారాది వానర - తరుణుల నెల్ల
వేఱువేఱుగఁ బిల్చి - విమలాంబరములు
మణిభూషణములు ప్రే - మముతో నొసంగి
గణికామణులకెల్లఁ - గట్ట నిప్పించి
ముదమందు వేళ రా - మునకు శత్రుఘ్ను
మొదలు సుమంతుఁడు - ముంగల నిడిన
నరదంబు రఘువీరుఁ - డప్పు డెక్కుటయు 12130
భరతుండు తానొగ - పైఁ గూరుచుండి
సారథ్య మొనరింప - జానకిఁ జూచి
తారాది కాంతలు - తలఁపులఁ జొక్క -
నాదిములకు సుమం - త్రాశోక విజయు
లాదిగాఁగల మంత్రు - లందఱుఁ గూడి
శ్రీకరనియమ గ - రిష్ఠు వసిష్ఠుఁ
గాకుత్థ్స్యవంశ శే - ఖరుల పట్టముల
నడపింపు జాడలు - నడిపింపుఁ డనుచు
నుడివి శ్రీరాముఁ గ - న్నులఁ గనుఁగొనుచు
నరదంబు చెంతఁ బా - యక కొల్వఁ దనదు 12140
కరముల ధవళము - క్తాతచ్ఛత్రవరము
పూని శత్రుఘ్నుఁ డం - పున భజియింప
మానిత హేమచా - మర మొక్క కేల
వీవనఁ దాల్చి యా - వెనుక లక్ష్మణుఁడు
నావేళ తనచెంత - మైకొల్చిరాఁగ
నితర చామరము దై - త్యేంద్రుండు పూని
హితమతి నొకమేర - నే తేర నెదుర
నంగద హనుమంతు - లసమలావణ్య

శృంగారముల కేల - చెంగోలు లమర
సందడి విరియింప - శత్రుంజయాఖ్య 12150
మందర శైలోప - మానమై మించు
పట్టపు టేనుఁగు - పై భానుసుతుఁడు
చుట్టలతోఁ గూడి - సూరెల రాఁగ
తొమ్మిదివేలు దం - తులమీఁద దొరత
నమ్మల సుగ్రీవు - నకు సరియైన
వానరరాజు లి - ర్వంకల తనదు
సేనలతో ధాత్రి - జవ్వాడ నడవఁ
దమ్ముఁడు గడపు ర - థమ్ముపైఁ జనుచు
దొమ్మి చేసిన ఖర - దూషణాదులను
తునిమి వైచుట కబం - ధుని ద్రుంచుటయునుఁ 12160
వనచర ప్రభుఁడైన - వాలిఁ గూల్చుటయు
సీతకై జలధిపై - సేతువుఁ గట్టి
దైతేయులను జంపి - దశకంఠుఁ దునిమి
మఱలి వచ్చుటయు స - మస్తంబు దెలియ
ధరణిజారమణుండు - తన ప్రధానులకుఁ
బలుకుచో వారెల్ల - ప్రతిపదాశ్చర్య
కలితులై వినుచు చెం - గటఁ జేరి రాఁగ
హైమాక్షతములు లా - జాదులు దాల్చి
భూమీసురాన్వయ - పుణ్యభామినులు
నాఁగదుపులును మ - హా వృషభములు 12170
లేఁగలు మునుమున్న - లెక్కకెక్కుడుగ
నడచిరా సాకేత - నగరిలోఁ జొచ్చి
పడఁతులా మేడల - పై నుండి చూచి

పుష్పవానల ముంపఁ - బుడమియు నభము
నవ్వేళ బ్రసవ - స్తా కీర్ణమయ్యె
నతివలు నంచల - నారతులెత్త
నతిమాత్ర విభవుఁడై - యవనిజా ప్రియుఁడు
నగవైరి నగరంబు - నకుఁ జాలునట్టి
నగరిలోనికి కాంచ - న రథంబు డిగ్గి
సీతతోడం బ్రవే - శించి తల్లులకుఁ 12180
జేతోవికాసంబుఁ - జిగురెత్త మ్రొక్కి
భరతునిఁ బిలిచి య - ప్పటి తన నగరఁ
ధరణిజ నుంచి మో - దమున రమ్మనిన
నతఁడు సుగ్రీవుని - యావిడిదింట
నతిభక్తి నుంచి ప్ర - యత్నంబు మీఱ
నలుపాలు వివిధరా - జోపచారములు
వలయునట్లు లమర్చి - " వానరాధీశ !
ఉదయవేళకుఁ చతు - రుదధి నీరముల
నదుల యంబువులు వా - నరులను బనిచి
తెప్పింపు పసిఁడి బిం - దెలచేత " ననుచుఁ 12190
జెప్పిన వేదద - ర్శిని జాంబవంతు
హనుమంతు ఋషభుని - నట్ల తెప్పింపుఁ
డనిన వారలును ని - జాను జీవులను
నలగవయుల సుషే - ణ రిషభాహ్వాయుల
నలువురఁ బిలిచి కుం - దనపు బిందియలు
చేతులకిచ్చి పం - చిన వారినిధుల
నూతనాంబువుల నే - నూఱు వాహినుల
పుణ్యోదకములు న - ప్పుడె తెచ్చి కపివ

రేణ్యుని నగరి న - ర్పించిన నతఁడు
శత్రుఘ్నునకు తత్ప్ర - సంగంబుఁ దెలుప 12200
శత్రుఘ్నుఁడును దన - సచివులచెంత
నావిధం బెఱిఁగింపుఁ - డని పంప వారు
నావసిష్ఠునకు న - య్యర్థంబుఁ దెలుప

—: శ్రీరామ పట్టాభిషేకము :—

నాతపోధనుఁడు సిం - హాసనాగ్రమున
సీతాసమేతుగా - శ్రీరాము నునిచి
అత్రివసిష్ఠకా - త్యాయనకణ్వ
మైత్రేయజాబాలి - మాండవ్యసుతప
గౌతమ మౌద్గల్య - గాలవ కలశ
జాత సుయజ్ఞ కా - శ్యప వామదేవ
కుత్సవిశ్వామిత్ర - గోభిల చ్యవన 12210
వత్సభారద్వాజ - వైఖానసాది
మునులు గంధోదకం - బులు మణిఖచిత
కనకపాత్రికల రా - ఘువవంశతిలకు
నభిషేక మొనరింప - నబ్జజు వసువు
లభిషేక మొనరించి - నట్లుండె నపుడు!
సీతతో ఋత్విజ - శ్రేణితో మంత్ర
పూతోదక స్నాన - మున నున్న రాముఁ
గనుఁగొని దివిజులా - కాశ సద్యమల
కనజాంబుజాత సౌ - గంధిక గంధ
గంధిల కనక క - ర్పూరికా ముఖాగ్ర 12220

గంధతోయాభిషే - కము లొనరింప
నాసమయమున మ - న్వాదులై నట్టి
నాసూర్యవంశ మ - హామహీ భుజుల
నభిషేక వేళల - నర్పించు భాను
నిభమహా నమూల్యమ - ణీ కిరీటంబు
మంత్రపూజాది ర - మ్యము సుమంత్రాది
మంత్రులు శ్రీరాము - మస్తకాగ్రమునఁ
దెచ్చినిల్ప నరుంధ - తీ ప్రాణవిభుఁడు
వచ్చి యాగమ మంత్ర - వైఖరి చేత
శ్రీరాముఁ డానభి - షేకంబు సేయఁ 12230
బోరన సురదుందు - భులు మింట మొరసెఁ
గురిసెఁ బువ్వులవాన - కొదమతెమ్మెరలు
నెరసె రంభోర్వశీ - నృత్తముల్ బెరసె
దొరసె భూజనుల చే - తోవాంఛితములు
మెరసె నయోధ్య నా - మెత లింట నింటఁ
బొరసె రాజన్నతి - పుణ్యచిహ్నములు
విరిసె లేమలు విశ్వ - విశ్వంబునందు !
ధవళముక్తాతప - త్రంబు శత్రుఘ్నుఁ
డవధానమునఁ దాల్ప - నర్కనందనుఁడు
దనుజేంద్రుఁడును చిరం - తనరత్న ఖచిత 12240
కనకచామరములుఁ - గైకొని వీవ
నింద్రుని యనుమతి - నిచ్చెను రామ
చంద్రుని కవ్వేళ - సౌవర్ణ కమల
మాలికయును రత్న - మౌక్తికా కలిత
మాలికయును పవ - మానుండును వచ్చి

గానంబు చేసిరి - గంధర్వు లెసఁగ
నానందకరమయ్యె - నవని యంతటికి
లసమానమధుర ఫ - లంబుల నమృత
రసములు గురిసె నీ - రసభూరుహాములు
పిడుపట్టుల పంట - పెట్టక దుక్కి- 12250
కాడుమెట్టకయ ము - క్కారునుఁ బండె
దట్టమై పారిజా - తపుఁ బూవుఁ దావి
గట్టినట్లమరె సు - గంధవనాళి

—: శ్రీరాముఁడు బ్రాహ్మణులకు, సుగ్రీవ విభీషణాది హితులకు నుడుగర లిచ్చుట - సీతామహాదేవికి తారహార మొసఁగుట :—

లక్షవాజులు హేమ - లాంగల వృషభ
లక్షయు నావులు - లక్షయుఁ గోట్ల
ముప్పదికి హిరణ్య - మును దానమిచ్చె
నప్పుడు రఘువీరుఁ - డగ్రజన్ములకు !
ఖండనంబుల సుర - పతి మెచ్చి యుదయ
చండాంశు దీప్తిపి - చండిలంబైన
మాలిక దశరథ - క్ష్మాపతి కొసఁగ 12260
చాలు వేడుక బొక్క - సములోనడాఁచు
నామణిసరము దె - ప్పించి రాముఁ డనిచె
ప్రేమంబుతోడ సు - గ్రీవు కంధరను
నంగదుఁ బిలిచి నా - యకములౌ మణుల
నంగద్వయంబిచ్చె - నవనిజాప్రియుఁడు
చంద్రకోటి ప్రకాశ - చాకచక్యంబు

సాంద్రమౌ ముత్యాల - సరము రాఘవుఁడు
సీతకే తగునని - చిఱునవ్వుతోడ
నాతి పేరెదను ము - న్నమిూఱ నుంచె !
ఘనమైన సొమ్ములు - కట్టువర్గములు 12270
జనకజ వదనాంబు - జమును గన్గొనుచు
హనుమంతున కొసంగ - నాయమ్మ దనకుఁ
బెనిమిటి కరుణ న - ర్పించిన యట్టి

—: సీత యాతారహారమును హనుమంతుని కొసగుట :—

తారహారముఁ దీసి - తన కేల నంటి
శ్రీరాము వదన మిూ - క్షించిన యంత
కపి శేఖరుల నెల్లఁ - గలయంగఁ జూచి
యపుడు జానకిఁ జూచి - " యతివ ! నీయిష్ట
మెవ్వరి కిచ్చిన - నిమ్మని " పలుక
నవ్వారి జేక్షణ - హనుమంతుఁ జూచి
పౌరుషవిక్రమ - బలబుద్ధిధైర్య 12280
కారుణ్యసత్యాది - క మహాగుణములు
కలుగు వాఁడగుట ద - గ్గఱఁ బిల్చి యతఁడు
తల వాంచుటయును కం - ధరఁ దవిలింప
నాహారమున శర - దభ్రసంవళన
మౌ హేమనగమకో - యని మించె నతఁడు !
కట్టవర్గము లుడు - గర లపరంజి
తట్టల భాగముల్ - తావి కుంకుమయుఁ
గస్తూరి మేరువు - కడియముల్ నాల్గు
దుస్తులు కోకలు - దొడ్డతాళియును
కంటమాలికయు రా - క్షసరాజుఁ బిలిచి 12290

యింటికిఁ బొమ్మని - యిచ్చె రాఘవుఁడు
మరియుఁ గేసరి తార - మైంద సుషేణ
శరభ నీల గవాక్ష - శతబలి పనస
నలజాంబవన్ముఖ్య - నగచరాధిపులఁ
బిలిచి బొక్కసమింట - పెట్టెలు దెఱచి
తరమైన సొమ్ములం - దఱికిచ్చి వారి
యిరవులకును సెల - విచ్చి పొమ్మనిన
భానుజముఖ్యులౌ - ప్లవగపుంగవుల
నానావనీనది - నగపురాటవులు
తమతమ నెలవులం - దఱుఁ జేరఁ బోక 12300
రమణీయమూర్తియౌ - రామునిఁ జూచి
చాల చింతిల విభీ - షణుఁడు పాదముల

—: శ్రీరాముఁడు విభీషణునికి శ్రీరంగశాయి నొసఁగి, యాతని తనమాఱుగాఁ బూజింపుమని యాజ్ఞ యిచ్చుట - వానరాదులు విభీషణునితో తమతమ నెలవులకు వెడలిపోవుట :—

వ్రాలి "యోదేవ! నీ - వాఁడనై యిచట
నుండు నింతియెకాని - యొండెడ కేఁగ
నెందుకు? లంకనా - కేల! పో" ననిన
నెందుచే నీతనిఁ - దృప్తునిఁ జేతు
నెందుల నను బాయఁ - డితఁడని యెంచి
"తనమాఱు తనకుల - ధనము పూర్వమున
మనుపుత్రుఁ డిక్ష్వాకు - మనుజేశ్వరుండు
నిలిపిన మాపాలి - నిక్షేపమీవు 12310
గొలువుము లంకకుఁ - గొని పొమ్మటంచు
నజ్ఞతో శ్రీరంగ - శాయి నొసంగ

నజ్జసేసుక యమ్మ - హనుభావుండుఁ
గైకొని లంకకుఁ - గదలి పోవుటయు
నాకరుణావరు - ణాలయుండైన
రాముఁడు సీతిమా - ర్గమున భూజనులు
తామర తంపరై - తనియ సంపదల
నవనిఁ బాలింపుచు - ననుజన్మ నొకని

—— భరతునికి యువరాజపట్టము గట్టుట :——

యువరాజపదవికి - నునుపఁదలంచి
రమ్ము లక్ష్మణ! యీవ - రాజ్యపట్టంబు 12320
సమ్మతి నీకు నొ - సంగితి నేను
నందటి మనువుల - నరసి పాలించి
పొందికగాఁ బ్రజఁ - బోషింపుమీవు
నను జూచినట్లు లం - దఱు నినుఁజూతు
రనిన సౌమిత్రిదా - నన్న కిట్లనియె.
“ ఇటు లానతిత్తురే - యినవంశ తిలక !
యెటులఁ జూచిన పెద్ద - యీభరతుండు
శిరసుండ మోకాలఁ - జేతురే పూజ ?
భరతుండె యువరాజ్య - పదవి కర్హుండు.
అతఁడుండియును స్వామి - యనధికారులకు 12320
నితరుల కీపూన్కి - యెంతకుఁ దగునె ?
దేవ ! నీ చరణముల్ - దిక్కని కొలిచి
సేవకావృత్తి మీ - చెంతనుండుటయె
నఖిలలోకాధి ప - త్యము నాకుఁగాక
మఖునపట్టంబది - మాని యేనొల్ల
ననిన సంతసమంది - యాఁగాక యనుచు

ననుజన్ము భరతు రా - జ్యమునకు నెల్ల
చేపట్టి తానభి - షేకంబుఁ జేసి
ప్రాపుగాఁజికరాయ - పట్టంబు గట్టె

—: శ్రీరామరాజ్యమున సకల ప్రజలును సౌఖ్యమునందుట :—

హయమేధ పౌండరీ - కాది యాగములు 11840
నియతితో నూతేసి - నిండంగఁ జేసి
తగిన నానామహా - దానముల్ పెక్కు-
లుగ నాచరించి వే - ల్పులఁ దనియించి
యిలనాల్గు చెఱఁగులు - నేలి ధర్మంబుఁ
దలకొని నాల్గుపా - దంబులు మెలఁగ
సీతాసమేతుఁడై - క్షితివారికెల్లఁ
దాతయుఁ దల్లియుఁ - దండ్రి దైవంబు
నేలిక గురుఁడును - హితుఁడు నెచ్చెలియు
నై లక్ష్మణుని తన - యట్లన బ్రోచి
శత్రుఘ్ను నెడ భక్తిఁ - జాలంగఁగలిగి 12350
మాత్రాధికంబైన - మాతృసంప్రీతిఁ
గలిగి మెయ్యెడఁ మించ - కలుములు ధాత్రి
నెలమిమీఱంగఁ దా - నేలుచున్నపుడు
చోరభయంబు చి - చ్చుల యెచ్చరికలు
జారత్వ వికృతులు - జనవిరోధములు
కలుషప్రచారముల్ - కల్లలాడుటలు
నలుకలు వైరముల్ - నాస్తివాదములు
పిసినితనంబునుఁ - బేదఱికంబు
వసుధ నెయ్యెడ లేక -పరధనాపేక్షు
లితర దూషణపరు - లెచ్చోట లేక 12360

నందఱు ధార్మికు - లందఱు ధీరు
లందఱు వితరణు - లందఱు నీతి
పరు లందఱును - పుత్రపౌత్రాభివృద్ధి
నిరతులై వేయేండ్లు - నిండు నాయువులఁ
దనరఁగ చంద్రశే - ఖర భావమంది
జనకజాప్రియుఁడును - జానకీదేవి

—: కాండాంత గద్యము :—

విలసిల్లె నని వేద - వేద్యుని పేర
నలమేలు మంగాంగ - నాధీశు పేర
నంచిత కరుణాక - టాక్షుని పేరఁ 12370
గాంచనమణిమయూ - కల్పుని పేర
వేదవేదాంతార్థ - వినతుని పేర
నాదిత్యకోటిప్ర - భాంగుని పేరఁ
గంకణాంగద రత్న - కటకాఢ్యు పేర
వెంకటేశునిపేర - విశ్వాత్ము పేర
నంకితంబుగ వెంక - టాధీశ చరణ
పంకజసేవాను - భావమానసుఁడు
హరిదాసమణి కట్ట - హరిదాసరాజు
వరదరాజు నితాంత - వరదాన శాలి
రచియించు వాల్మీకి - రామాయణంబుఁ

—: ఫలశ్రుతి :— 12380

ప్రచురభక్తిని మదిఁ - బాటించి వినినఁ
జదివిన వ్రాసిన - సభలఁ బేర్కొనిన
మది దలంచిన నెట్టి - మనుజులకైన

భారుణిమీఁద సీ - తారామచంద్ర
పారిజాత దయా ప్ర - భావంబు వలన
హయమేధ రాజసూ - యాదిమ యాగ
నియత ఫలంబులు - నిరతాన్నదాన
సుకృతంబు నిత్యయ - శోవైభవములు
నకళంక తీర్థయా - త్రాది పుణ్యములు
సత్యవ్రతపదంబు - సకల సౌఖ్యములు
నిత్యమహాదాన - నిరుపమశ్రీలు 12390
కలికాలసంప్రాప్త - కలుషనాశనము
కలుములు హరిభక్తి - గౌరవోన్నతులు
శత్రుజయంబును - స్వామిహితంబు
పుత్రలాభంబును - భోగభాగ్యములు
ననుకూల దాంపత్య - మంగనాప్రియము
ధనధాన్యపశువస్తు - దాసీసమృద్ధి
మానసహితము ధ - ర్మప్రవర్తనము
నానందమును ఖేద - మందకుండుటలు
నలఘువివేకంబు - నతుల గౌరవము
వలయుకార్యములు కై - వశము లౌటయును 12400
పావనత్వము దీర్ఘ - పరమాయువులును
కైవల్య సుఖము ని - క్కముగాఁగలుగు
నెన్నాళ్లు ధారుణి - యెన్నాళ్లు జలధు
లెన్నాళ్లు రవిచంద్రు - లెన్నాళ్లు గిరులు
నెన్నాళ్లు నిగమంబు - లెన్నాళ్లు విశ్వ
మన్నాళ్లు నీకథ - యలరు నార్షంబు

నాదికావ్యంబు స - మస్తపూజ్యంబు
వేదసమానంబు - విశ్వసన్నుతము
నుపనిషత్సమముగా - యుద్ధకాండంబు
విపులార్థరచనల - విలసిల్లుఁ గాత ! 12410

ఇది



కట్టా వరదరాజకృత మగు
ద్విపద రామాయణమున
యుద్ధకాండము
సమాప్తము.



ఓం తత్సత్
శ్రీరామచంద్రాయనమః